# Sri Virupaksha-Sreerama Copper Plate Inscriptions

(1576-1644 A. D.)

**Vijayanagar Empire**

## *History of Araveeti Dynasty*

# శ్రీ విరూపాక్ష-శ్రీరామ తామ్రశాసనములు

(క్రీ. శ. 1576–1644)

విజయనగర సామ్రాజ్యం

## ఆరవీటి వంశ చరిత్ర


*పరిశోధన, విమర్శ*

*వాఙ్మయ మహాధ్యక్ష*

**డాక్టర్ పట్లమూడి గోపాలకృష్ణయ్య**

"కళా–ప్రపూర్ణ"








ప్రచురణ

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ఓరియంటల్ మాన్యుస్క్రిప్ట్స్

లైబ్రరీ అండ్ రీసర్చి ఇన్‌స్టిట్యూట్

(State Archives)

హైదరాబాదు

# విషయసూచిక

## CONTENTS

# తొలిపలుకు

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ఓరియంటల్ మాన్యుస్క్రిప్ట్స్ లైబ్రరీ అండ్ రీసర్చ్ ఇన్‌స్టిట్యూట్ ప్రచురిస్తున్న గ్రంథాలలో యీ "శ్రీవిరూపాక్ష-శ్రీరామ తామ్రశాసనము"ల గ్రంథం యేడవది.

తిరుమలరాయల కుమారుడైన శ్రీరంగరాయలు శ్రీకాళహస్తీశ్వరస్వామి నిత్యార్చనాదుల నిమిత్తం క్రీస్తుశకం 1576 నవంబరులో యిరువైనాలుగు గ్రామాలను దానంయిస్తూ వేయించిన శాసనం (శ్రీవిరూపాక్షశాసనం) ఒకటి - పినవెంకటరాయల కుమారుడైన వేరొక శ్రీరంగరాయలు శ్రీకాళహస్తీశ్వరస్వామి సంసేవార్థం, అమ్మవారి సంసేవార్థం క్రీస్తుశకం 1644 జనవరిలో ఒక గ్రామం దానంయిస్తూ వేయించిన శాసనం (శ్రీరామశాసనం) మరొకటి.

అయితే తామ్రఫలకాలపైవున్న యీ రెండు శాసనాలను కాళహస్తిలో శ్రీ పరశురామ్ గురుకుల్‌గారు 1971జనవరి ఒకటవతేదీన "స్టేట్ఆర్కివ్స్ డైరెక్టర్"కు యిచ్చారు. వాటిని తిరుపతిలో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ విద్యాశాఖ ప్రత్యేక కార్యదర్శియైన శ్రీ యస్. ఆర్. రామమూర్తి, I.A.S. గారికి 2-1-1971 న స్టేట్ ఆర్కివ్స్ డైరెక్టర్ చూపించడం జరిగింది. అత్యంత విశిష్టాలైన చరిత్రకెంతో ఉపయోగపడగల యీ శాసనాలను తీసుకొని ప్రకటించడం అవసరమని శ్రీ రామమూర్తిగారు చెప్పారు. అనంతరం వీటిని అప్పటి డైరెక్టర్ ఫోటోలు తీయించి యీ డిపార్టుమెంటులో పనిచేస్తున్న రీసర్చ్ ఆఫీసర్ శ్రీ సి. వి. యస్. యల్. శాస్త్రికిచ్చి ప్రతి వ్రాయమనగా తానువ్రాసియిచ్చినట్లు తరువాత అదియేమైనదో తనకు తెలియనట్లు శ్రీ శాస్త్రి నాకు తెలియజేశారు. అయితే అప్పటి డైరెక్టర్ యీ శాసనాల ఫోటోకాపీలను శ్రీ యన్. సి. యస్. వెంకటాచార్యులుగారికిచ్చి కాపీ వ్రాసి తెలుగులో టీకాతాత్పర్యాలు వ్రాయవలసిందిగా కోరడం జరిగింది. డైరెక్టర్ కోరికమేరకు శ్రీ వెంకటాచార్యులుగారు అత్యంత శ్రద్ధతో ప్రతి వ్రాసి శాసన శ్లోకాలకు తెలుగులో టీకాతాత్పర్యాలను రచించియిచ్చారు.

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ముఖ్యమంత్రి శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డిగారి గౌరవాభిమానాలు కారణంగా నేను "ఓరియంటల్ మాన్యుస్క్రిప్ట్స్ లైబ్రరీ అండ్ రీసర్చ్ ఇన్‌స్టిట్యూట్" జాయింట్ డైరెక్టర్‌గా అనేక గ్రంథాలను పరిశోధించి సృజనాత్మకాలైన రచనలు చేసేఅవకాశం లభించింది. దీనితోపాటు యీ శాసనాలను చదివి బహుముఖంగా పరిశోధించి చారిత్రకాది విశేషాలతో విశిష్ట పరిశోధనా గ్రంథం నేను రచించే అవకాశంకూడా యీ పరిశోధనాలయానికి ఉపలభ్యమానమైనది. ఇతర విషయాలతోపాటు చరిత్రలో ఒక ప్రత్యేకస్థానం ఆక్రమించిన యీ శాసనాలు - నా యీ పరిశోధనా రచన-వివిధ పరిశోధకుల మన్నన లందుకుంటుంధనడంలో సందేహంలేదు.

ఈ రెండు శాసనాలూ సంస్కృతభాషలో దేవనాగరి లిపిలో వున్నందువల్ల ఆంధ్రే తరులైన పరిశోధకులకు సైతం ఉపయోగపడాలన్న దృష్టితో దేవనాగరి లిపిలోకూడా వీటిని ప్రకటించడం జరుగుతున్నది. ఈ దృష్టితోనే తెలుగు పరిశోధనా రచనతోపాటు దీని ఆంగ్లానువాద రచనను సైతం వెలువరించడం జరుగుతున్నది.

ఈ శాసనాలు నేనెరిగినంతలో యింతవరకూ ప్రకటితాలైనట్లు కనపడదు. వీటిని దృష్టిలో పెట్టుకొని చరిత్రకారులుకాని - శాసన పరిశోధకులుకాని విమర్శలు వ్రాసినట్లు కూడా కనపడదు. ఆరవీటి బుక్కరాయల పూర్వాపరవంశాలతో అవిచ్ఛిన్నంగా సాగిన విజయనగర సామ్రాజ్యపరిపాలకులలో పెక్కుమందినిగురించి వారివారి సంతతులగురించి విజయనగర సామ్రాజ్యాంతంవరకూ యీ శాసనాలు ఆరవీటివంశ విషయంలో ప్రామాణికాలై నిలుస్తున్నాయి.

శ్రీవిరూపాక్ష శాసనంలోని కొన్ని శ్లోకాలు శ్రీరామ శాసనంలో యథాతథంగా పరిగృహీతాలైనాయని నా యీ పరిశోధనా గ్రంథంలో తెలియజేశాను. అయితే శ్రీవిరూపాక్ష శాసనంలోని శ్లోకాలే కొన్ని - తరువాతి ఇతర శాసనాల్లోకూడా పరిగృహీతాలైనట్లు కనిపిస్తున్నది. (చూడు. వీరవేంకటపతి విలపాకశాసనం. ఎపిగ్రాఫికా ఇండియా 4వ పుస్తకం 272 పుట.) తిరిగి తిరిగి క్రొత్త రచనలను చేయవలసినపనిలేకుండా పూర్వతరాలకు సంబంధించిన ప్రాచీన శ్లోకాలను తరువాతివారు పరిగ్రహించడంలో తప్పులేదు. పైగా ఈవిధంగా పరిగ్రహించడంవల్ల వంశపురుషుల విషయంలో నిస్సందేహంగా ఒక ఏకవాక్యతలభిస్తుంది. మూడుతరాల వ్యవధిలో 68 సంవత్సరాల తేడాతో వెలసిన యీ రెండు దానశాసనాలవల్ల ఆరవీటివంశం చాలావరకు పరిపూర్ణంగా మనకు లభించిందనే చెప్పవచ్చు. అందువల్ల చరిత్రలో వీటికి లభించే ప్రాధాన్యత గురించి నేను ప్రత్యేకించి చెప్పవలసిన పనిలేదు.

ఈ రెండు శాసన ఫలకాలలోని మూలపాఠాలు యీ గ్రంథంలో యథాతథంగా ముద్రించబడ్డాయి. శాసన ఫలకాలలో ప్రతి ఫలకంలోని పాఠమూ మొదట తెలుగు లిపిలోనూ, తరువాతి పేజీలో దేవనాగరి లిపిలోనూ - పంక్తికి పంక్తిగా - మూల ప్రతిబింబంగా ప్రకటింపబడింది. దేవనాగరి లిపిలో ముద్రితమైన పుటలకు యెదురుగా ఆయా శాసనఫలకాల ఫోటోలు ప్రకటితాలయ్యాయి.

సీతాకళ్యాణము - ఇందుమతీపరిణయము - శృంగారపదములు (తెలుగు) - శ్రీ గీతగోవిందము - గీతశంకరము - వైకృతచంద్రిక (సంస్కృతం) - రాధావంశీధర్ విలాస్ నాటక్ (హిందీ) - ఏనుగుల వీరాస్వామీస్ జర్నల్ (ఇంగ్లీషు) పుస్తకాలకు నేను తొలిపలుకులు - పీఠికలు మొదలైనవి రచించడంలో జరిపిన నా పరిశోధనా కార్యక్రమమంతా ఆఫీసులోకంటే రాత్రిపూట యింట్లోనే అత్యధికభాగం కొనసాగింది. నే నీ పరిశోధనాత్మకాలైన రచనలు చేస్తున్నప్పుడు నా అర్ధాంగి శ్రీమతి శశికళ అనేకవిధాల నాకు తోడ్పడ్డారు. అందుకు శ్రీమతి శశికళకు నా కృతజ్ఞతలు.

ఏనుగుల వీరాస్వామీస్ జర్నల్‌కు నేను వ్రాసిన పీఠికను – ఈ శాసనాలపై నేను చేసిన పరిశోధనా గ్రంథాన్ని తెలుగులో నేను డిక్టేట్ చేస్తూఉంటే అహోరాత్రాలు శ్రీ కె. విఠల్‌రెడ్డి (తెలుగు పండిట్, O. M. L. & R.I.) యెంతో ఓపికతో శ్రద్ధతో వ్రాశారు. అందుకు శ్రీ విఠల్‌రెడ్డికి నా అభినందనలు.

రాధావంశీధర్ విలాస్ నాటక్ గ్రంథానికి నేను వ్రాసిన ప్రస్తావనను హిందీలోకి అనువదించడంలో నా ప్రియ శిష్యరత్నం సాహిత్యరత్న శ్రీ గుర్రం సుబ్బారావు, M. A. నాకు తోడ్పడ్డారు. ఏనుగుల వీరాస్వామీస్ జర్నల్ పీఠికను – యీ శాసనాలపై నా పరిశోధనా రచనను ఆంగ్లభాషలోకి అనువదించడంలో మిత్రులు శ్రీ వాడ్రేవు పురుషోత్తంగారు యెంతో సహాయపడ్డారు. ఇందుకు వీరికి కృతజ్ఞతలు. ఈ శాసన పరిశోధనా రచన ఆంగ్లానువాదాన్ని తెలుగు రచనతో నేను సరిపోల్చి చూడడంలో శ్రీ సి. వి. యస్. యల్. శాస్త్రి (R. O.), శ్రీ వి. వి. చారి (L.D.C.) సహకరించారు. అందుకు వీరికి అభినందనలు. ప్రభుత్వోద్యోగిగా జాయింట్ డైరెక్టరుగా నేను పనిచేస్తున్న కాలంలో నాతో సహకరించి పనిచేసిన ఇతర వుద్యోగులందరికీ అభినందనలు.

అమూల్య ప్రాచీన గ్రంథాల ప్రచురణకై మన సంస్కృతీ సంపదల పునరుద్ధరణకై అత్యంత శ్రద్ధాసక్తులతో అవిరళాసక్తి చూపిస్తున్న విద్యాశాఖ కార్యదర్శి శ్రీ. యస్. ఆర్. రామమూర్తి, I. A. S. గారికి, సహాయ కార్యదర్శి శ్రీ ఐ. రఘునాధరావుగారికి కృతజ్ఞతలు. రిటైరయ్యేవరకూ కూడా యెంతో ఆసక్తిచూపి విశ్రాంతిగైకొన్న ఉపకార్యదర్శి శ్రీ డి. కామయ్యగారికి కృతజ్ఞతలు. విద్యాశాఖలో నూతనంగా ఉపకార్యదర్శి పదవికి వచ్చిన శ్రీ కె. కేశవరావు, B. A., B. L. గారికి హృదయపూర్వకమైన అభినందనలు.

మాన్యుస్క్రిప్ట్సు లైబ్రరీ అండ్ రీసర్చి ఇనిస్టిట్యూట్ అభివృద్ధికై అత్యంతశ్రద్ధాసక్తులు చూపిస్తున్న ప్రభుత్వ ఆర్థికశాఖ కార్యదర్శి డాక్టర్ యన్. రమేశన్, I. A. S. గారికి కృతజ్ఞతలు.

ప్రభుత్వం ప్రచురిస్తున్న యీ గ్రంథాలను ఓర్మితో శ్రద్ధతో ముద్రిస్తూ అడుగడుగునా సహకరించి తోడ్పడుతున్న ఆంధ్రప్రదేశ్ టెక్స్టుబుక్ ప్రెస్ డిప్యూటీ డైరెక్టర్లు శ్రీ జి. రామకృష్ణారావు, శ్రీ డి. వీరమణిగార్లకు కృతజ్ఞతలు. ముద్రణసమయంలో అనేక విధాల సహకరించిన అసిస్టెంట్ డైరెక్టర్లు శ్రీ పి. నారాయణన్, శ్రీ యమ్. ఆర్. సభాపతిగార్లకు, శ్రీ వి. గంగాధరం, శ్రీ కె. నరసింహారావు, శ్రీ వై. శ్రీరాములు, శ్రీ బి. జేమ్సు ప్రభృతులకు శుభాకాంక్షలు.

వాఙ్మయ మహోధ్యక్ష
వడ్లమూడి గోపాలకృష్ణయ్య
కళా-ప్రపూర్ణ
జాయింట్ డైరెక్టర్,
ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ఓరియంటల్
మాన్యుస్క్రిప్ట్సు లైబ్రరీ అండ్ రీసర్చి ఇన్‌స్టిట్యూట్

హైదరాబాదు.
18–3–1973

# అంకితం

ఆంధ్ర విశ్వకళా పరిషత్తు ఉపాధ్యాయులు

విద్యావేత్తలు - విశాలహృదయులు

ఆప్తమిత్రులు

శ్రీ లంకపల్లి బుల్లయ్యా శ్రీమతి సంయుక్త

దంపతులకు

నా యీ పరిశోధనా రచన

ప్రేమాంకితం

వడ్లమూడి గోపాలకృష్ణయ్య

# విజయనగర సామ్రాజ్యం
# ఆరవీటి వంశ చరిత్ర

పరిశోధన-విమర్శ

వాఙ్మయ మహాధ్యక్ష
డాక్టర్ వల్లమూడి గోపాలకృష్ణయ్య
"కళా-ప్రపూర్ణ"

# విజయనగర సామ్రాజ్యం

## ఆరవీటి వంశ చరిత్ర

అనంత విశ్వంలో భూగోళం ఒక చిన్న గోలీవంటిది. విశ్వదృష్టితో చూచినపుడు అణు పరమాణువులవంటి వ్యక్తిగా సంజనితుడైన మానవుడు అసాధారణమైన ప్రతిభా సంపన్నుడుగా సైతం వెలుగొందుతాడు. అతీంద్రియజ్ఞానిగా విరాజిల్లుతాడు. పిపీలకంవలె నలిగిపోయే బ్రతుకు ఉన్నవాడూ యీ మానవుడే. అనంత విశ్వాన్నేకాదు దిక్కులూ కాలమూలేని ఆ తొట్టతొలి మహాశక్తి స్వరూపం గురించి పరిశోధించగలవాడూ యీ మానవుడే !

మానవుని సృష్టి యెప్పుడుజరిగిందో ఖచ్చితంగాచెప్పడం సాధ్యం కానట్లే, మానవుని విజ్ఞానతృష్ణ యెప్పుడు మొగ్గతొడిగి పూచి ఫలించిందోకూడా చెప్పలేము. తొలుత మానవుడు పుట్టి మూడు పూవులారుకాయలుగా పెరిగి సంఘం రూపుదాల్చి జాతులుగా విడిపోయేంతగా-అంతరించేవారు అంతరిస్తూంటే-అవతరించేవారు అవతరిస్తూంటే - బహురూపు దాల్చాడు. ఒకప్పు డజ్ఞానంలో ఉన్నా, మరొకప్పుడు మహా విజ్ఞానంతో విరాజిల్లి, విజ్ఞానాలకు విజ్ఞానమైన పరతత్వజ్ఞానంతో సచ్చిదానంద స్వరూపం దాల్చినా - వేరొకప్పుడు జ్ఞాన విజ్ఞాన పదభ్రష్టత్వమే పొందినా, మానవుని జ్ఞానతృష్ణమాత్రం నశించడంలేదు.

సంతతీ విస్తరణతో జాతి భేదాలేర్పడినా - యెండమావులవంటి అజ్ఞానపు మత భేదాలడ్డు వచ్చినా- పరిశోధనా దృష్టితో అంతరాంతరాలలోకి చూచినపుడు వాస్తవజ్ఞాన ఆనంద స్వరూపాన్ని నిర్విఘ్నంగా జాతి మత భేదరహితంగా అనుభవించగలవాడుగానే ఉన్నాడు మానవుడు. జైన-బౌద్ధ, క్రీస్తు, ఇస్లామిక్ వంటి మతాలెన్నెన్ని పుట్టినా అవి హిందూమత తత్వ విచారణవలె తత్వ వివేచనతో పరాంకోటి నధిరోహించలేకపోయాయి. కాలమానాలకందలేని - ఊహలతో తప్ప ఇతమిత్థమని చారిత్రకంగా నిర్ణయించలేని - అతి ప్రాచీనకాలంలో పదపదార్థ వివేచనలోనేకాదు, పంచభూతాల పరిశోధనలోనేకాదు, సృష్టి మూలస్వరూపమైన బ్రహ్మపదార్థ స్వరూప స్వభావాలగురించి కూడా అపురూపమైన అన్వేషణలు చేయడం జరిగింది. ఈ ప్రపంచంలో యెన్నెన్నో అవతరించాయి. అంతరించాయి. కాని, భారతీయ తత్వ వివేచనంమాత్రం అజరామరంగా నిలిచిఉన్నది. కారణం అది వాస్తవికమైన వస్తుతత్వ వివేచనం కావడమే !

### మతం

మతం పేరుతో మనం పెట్టుకొన్నవి, మన అభ్యుదయానికి అడ్డుగోడలై నిలచినవి కారుమబ్బులవంటివికావు. తెలిమబ్బుల వంటివైనా కావు. వట్టి యెండమావులవంటివి. వాస్తవానికి మతం అంటే

మానవుని జీవితాన్ని పంజరంలోపెట్టి బంధించి రకరకాల బాధలు పెట్టేదికాదు. "మతం" అంటే "సిద్ధాంతం" అని అర్థం. సిద్ధాంతమంటే వట్టి సిద్ధాంతమూకాదు. వెర్రిమొర్రి సిద్ధాంతమూ కాదు. మనుష్యులను రక్షించేది "మతం". అయితే కొన్ని శతాబ్దాలుగా మన కైమనం రూపొందించుకొనకపోయినా కొందరు స్వార్థపరులు దురాశాపరులు రూపొందించిన మత నామక విమతాలు, దుర్మతాలు – మానవులను రక్షించేవిగా కావు – భక్షించేవిగా రూపొందాయి.

సిద్ధాంతపరమైన అర్థంకల "మత" శబ్దం పరమ వైజ్ఞానికమైనది. సమస్త జాతి మతవాదులకు కళ్లు తెరిపించగల సృష్టివ్యవస్థా స్వరూప స్వభావపరమై ఖగోళ ప్రతిబింబకమైనది. జినపరమైన సిద్ధాంతం జైన మతంకాగా-బుద్ధపరమైన సిద్ధాంతం బౌద్ధమైనది. ఇదేవిధంగా క్రైస్తవ, ముస్లిమ్ మొదలైన మతాలు తొట్ట తొలుత సిద్ధాంత పరాలుగానే యేర్పడ్డాయి. అనంత విశ్వంలో విభిన్న గ్రహ నక్షత్ర, ధూమకేతువులున్నట్లు- కాలాంతరాలలో వాటిలోని కొన్ని కొన్నిటి లేదా ఒకొక్కదాని ప్రాభవం హెచ్చి విస్తరించి కొంత కాలానికి అంతరించినట్లు విభిన్న మతాలు (సిద్ధాంతాలు) మానవాళిలో ఒక్కొక్క కాలంలో ఉద్భవించి- విస్తరించి – అంతమొందుతాయి. ఇది ఖగోళపరంగా సృష్టివ్యవస్థకు సంబంధించిన అగాధపరిశోధనా విషయం- ఈ విషయమై అపూర్వ ఖగోళ పరిశోధనలు సాగించి ఒక మహత్తర సృష్టి విజ్ఞానగ్రంథాన్ని నేను రచి యిస్తున్నాను.

## హిందువులు — హిందూమతం

లోతుగా పరిశీలిస్తే హిందూమతమన్నది ఒకానొక మానవ వర్గరూపమైనదిగా జాతిపరమైనదిగా కనిపించడంలేదు. సింధునదీ ప్రాంతవాసులై తరలివచ్చిన వారైనందువల్ల హిందువులుగా పేర్కొనబడ్డారని- "సింధు" శబ్దంలోని "స" కారానికి "హ"కారమూ "ధ"కారానికి "ద" కారమూ వచ్చి "హిందూ" శబ్దం యేర్పడిందని అనేకమంది లోగడ పేర్కొన్నారు. ఆర్యులైనా – అనార్యులైనా – సాంకర్యంచెందినవారైనా విచక్షణా దృష్టికొరవడినందువల్ల ఒక ప్రాంతవాసులను – ఒక వర్గం ప్రజలను ఆర్యులుగాను – హిందువులు గాను పేర్కొనడం జరుగుతున్నది. హిందువులనుసరించిన మతం హిందూమతంగా పేర్కొనబడుతున్నది. వాస్తవానికి హిందూశబ్దం సింధుశబ్దం మీదనుంచి యేర్పడినట్లు కనపడదు. "ఇందు" శబ్దంమీద – తొలి "ఇ" కారానికి "హ" కారంతోడై "హిందు" శబ్దం రూపొందినట్లు కనిపిస్తున్నది.

ఆర్ష విజ్ఞానంద్రష్ట్యా ప్రాచీన భారతీయుల అనంతతత్వ జిజ్ఞాస-తత్వ విజ్ఞానం ఖగోళశాస్త్రాన్ని కతీత మైనది. విజ్ఞానాలకు విజ్ఞానంవంటిది (Science for Sciences) అని అనిపించుకున్నది. అంతటి మహత్తర పరతత్వ రహస్యాన్వేషియైన ప్రాచీన భారతీయునికి ఖగోళశాస్త్రం ప్రథమసోపానంవంటిది. ఈ అనంత విశ్వంలో అనేక సౌరమండలాలున్నాయి, అని "దశ దిశో నానా సూర్యాః" అంటూ చెప్పగలిగినవాడు వేదర్షి. "సూర్య ఏకాకీ చరతి-చంద్రమాజాయతేపునః" అని సూర్యుడు తనకుతానై వెలుగొందుతున్నాడు. సూర్యుడే చంద్రుడై జన్మిస్తున్నాడు, అంటూ రవి స్వతంత్ర ప్రతిపత్తినీ-చంద్రుని స్వయం ప్రభారాహిత్యాన్నీ యెలుగెత్తిచాటగల వేదర్షి ఖగోళజ్ఞానం విశ్వముఖ సందర్శనంలో పరమాణువువంటిది. భూమి తనచుట్టూ

తాను తిరుగుతూ, సూర్యునిచుట్టూ తిరుగుతున్నది. చందమామ తనచుట్టూ తాను తిరుగుతూ, భూమి చుట్టూ సూర్యుని చుట్టూ కూడా తిరుగుతున్నది. అనంత విజ్ఞాన పరిశోధకులైన భారతీయులు భూమిచుట్టూ తిరుగుతున్న చందమామ వైశిష్ట్యాన్ని గుర్తించి మానవజాతి మనుగడకూ -చందమామకూ ఉన్న అవినాభావ సంబంధాన్ని గుర్తించి కాలపరిగణనలో చాంద్రమానాన్ని యేర్పరచుకున్నారు. రవిచారను గుర్తించడం కంటే - చంద్రచారను గుర్తించడం చాలా సులభం. సంవత్సరంపొడుగునా చంద్రచారను గుర్తించిన దానిని గుర్తించినట్లుగా గుర్తుపెట్టుకోవడం కూడా సులభసాధ్యమే. వేద ఖగోళ శాస్త్రజ్ఞులు "చంద్రమా మనసో జాతః"(చంద్రుడు మనస్సువంటివాడు) అని అనడంతోపాటు మనఃకారకత్వాన్ని సైతం చందమామకే యిచ్చారు. అనగా మానవుల హృదయాలమీదా - తత్ఫలితంగా బుద్ధిమీదా - ఇతర యింద్రియాలమీదా - తత్ఫలితంగా జీవితంమీదా చంద్రశక్తి ప్రభావం ఉండితీరుతుందని ప్రాచీనులు గుర్తించారు. ఆధునిక వైజ్ఞానికులుసైతం శన్యాది గ్రహాల ప్రభావం చందమామమీద ఉన్నప్పుడు చందమామ ప్రభావంతో మానవుల హృదయాలలోనూ తత్ఫలితంగా జీవితాలలోనూ మార్పులు వస్తున్నట్లు ఇటీవలనే పరిశోధించి ప్రకటించారు. ప్రాచీన భారతీయులు చంద్రకాంతి ప్రభావం (వెన్నెల) గురించి తుణ్ణంగా పరిశోధించి ఆ కిరణాలలో అమృతం ఉన్నట్లు పేర్కొన్నారు. భూమిచుట్టూ తిరగడంలోనే కాదు- ఒక్క కాలమానంలోనేకాదు - ప్రకృతి సంవర్ధనంలోనేకాదు - మానవుల మనుగడలో సయితం సంలీనమైఉన్న చందమామను దృష్టిలో పెట్టుకొని, చంద్రార్థకమైన "ఇందు" శబ్దాన్ని పరిగ్రహించడం ద్వారా సిద్ధాంతపరంగా గాని-జాతిపరంగాగాని "ఇందుమత - ఇందుజాతి" శబ్దాలు యేర్పడినట్లు కనిపిస్తున్నది. "ఇందు" శబ్దం "హిందు" శబ్దంగా మారి అనంతరం సమాసంలో దీర్ఘంవచ్చి "హిందూ" శబ్దంగా రూపొందినట్లు కనిపిస్తున్నది.

చంద్రవాచకాలైన పదాలెన్నో ఉండగా "ఇందు" శబ్దాన్నే ప్రాచీన భారతీయులు ఎందుకు పరిగ్రహించారా అన్న సందేహం కలగడం సహజం. "ఇందు" "ఇన" శబ్దం మీద యేర్పడింది. ఇనునివల్ల (సూర్యునివల్ల) ప్రకాశితుడయ్యేవాడు ఇందుడు - అంటే చంద్రుడన్న అర్థంలో "ఇందు" శబ్దం యేర్పడింది. కాగా ఇందు శబ్దంవల్ల చందమామతోపాటు చందమామ వెలుగుకు మూలమైన సౌరశక్తికూడా ద్యోతక మవుతుంది. ఎంత చంద్రమానాన్ని పరిగ్రహించినా సూర్యుణ్ణి కాదని త్రోసిపుచ్చడం శాస్త్రీయత కానే కాదుగదా! అందువల్ల వైజ్ఞానికంగా సార్థకత ఉండాలన్న దృష్టితోనే "ఇందు" శబ్దాన్ని గ్రహించినట్లు కనిపిస్తున్నది.

పరమ వైజ్ఞానికమైన "ఇందు" మత శబ్దాన్ని దృష్టిలో పెట్టుకున్నప్పుడు—ఇది చంద్రవిజ్ఞాన సిద్ధాంత పరమైన శబ్దం కాబట్టి మానవాళిలో యేదో ఒక వర్గం ప్రజలకో—జాతిపేరిట సంఘానికో దీనిని అంటగట్టే అధికారం యెవరికీలేదు. ఇది మాదే అని చెప్పుకోగల అధికారం యే ఒక వర్గానికీ—జాతికీ లేదు. ఆవిధంగా ఉన్నదనుకునేవారు ఉంటే అంతటి మూర్ఖులూ—అజ్ఞానులూ వేరొకరుండరు. చంద్రుడు మనఃకారకుడన్నారంటే యీ సృష్టిలో మనస్సు ఉన్న ప్రతివానికీ అతడు మనఃకారకుడే. వెన్నెల అందరికీ వెన్నెలే! అందువల్ల "ఇందు" మతమన్నది ప్రాచీన భారతీయుల దృష్టిలో—ఆర్షవిజ్ఞానదృష్టిలో—మానవాళి మతం. మనసున్న ప్రతి ప్రాణికీ మతం! ఈ లోకంలో పుట్టిన ప్రతివాడూ హిందువే! ఈ దృష్టితో చూచి

నపుడు హిందూ మతమన్నది ఒక జాతి ప్రజలదో – జాతి పేరిటి వర్గపు ప్రజలదో అనుకొనడం సత్య సమ్మతం కాదని నా అభిప్రాయం.

వేద విజ్ఞానాన్ని-తద్విజ్ఞానపరమైన శాస్త్రాలనూ లోతుగా పరిశోధిస్తే అవి మానవలోక సంక్షేమం కోసం మాత్రమేకాదు సమస్తలోకాల క్షేమంకోసం అవతరించినవిగా స్పష్ట పడతాయి.

అవైజ్ఞానికాలు-మూర్ఖాలు అయి తర్కసహంకాని కొన్ని ఆచారాలనూ-ఆర్షవిజ్ఞాన విదూరాలైన నేటి అధర్మ వర్ణాశ్రమ ధర్మాలనూ పరిత్యజిస్తే హిందూమతశాస్త్ర గ్రంథాలలో ప్రత్యేకించి ఆర్ష గ్రంథాలలో యే దృష్టితో చూచినా, ఆధునిక విజ్ఞాన దృష్టితో చూచినా మనం అప్రామాణికమనిగాని-అనవసరమనిగాని త్రోసి పారవేయవలసిన విషయమేదిలేదు. అన్ని శాస్త్రాలూ ఆర్షవిజ్ఞాన దృష్టిలో అఖిల ప్రాణికోటికీ అవసరమైనవే. ఖగోళశాస్త్రం హిందువులకు మాత్రమే శాస్త్రమా ? గ్రహనక్షత్రాదుల కాంతి ప్రభావం హిందువుల మీదనే ఉంటుందా ? మిగిలినవారిపై ఉండదా ? మతమన్నది యేదైనా శబ్ద శక్తి సంపూర్ణమైనది. శబ్దం (Sound) లేనిదే మంత్రం లేదు. నిశ్శబ్ద శబ్దశక్తి (Silence sound) శబ్దశక్తి కంటే యెంతో మహత్తరమైన శక్తివంతమైనదని ఆధునిక విజ్ఞానులు మాత్రమే చెప్పలేదు. ప్రాచీన భారత విజ్ఞానంలో యిది మొట్టమొదటి మెట్టు. "మంత్రాన్ని పైకి ఉచ్చరిస్తూ చదవడంకంటె, నాలుకా పెదవులూ మాత్రమే కదలిస్తూ ఉచ్చరించడంవల్ల మరింతగా ఫలితం ఉంటుంది. నాలుకా పెదవులూ అసలు కదలకుండా కేవలం మనస్సుతోనే మంత్రాన్ని జపిస్తే (Manasik Jap - Silent sound) అది అపూర్వమైన శక్తి ఉత్పత్తికి కారణభూతమవుతుంది" అని వేదర్షులెప్పుడో చెప్పారు. మంత్రాన్ని ఉచ్చరించడం ద్వారా-అంటే వివిధ శబ్ద శక్తులను సమకూర్చుకొనడం ద్వారా ఒక అపూర్వ శక్తిని సంపాదించడం యే ప్రాణికైనా సాధ్యమే! అది యేదో ఒక వర్గ లేదా జాతిమతాలకు చెందిన వారికి మాత్రమే పరిమితమైందికాదు.

పద పదార్థప్రకృతి పరిశోధనావిజ్ఞానంతో అవతరించిన ఆర్షేయాలైన ఆయుర్వేద గ్రంథాలు కేవలం నామమాత్రపు ఆర్యజాతికో హిందూవర్గ ప్రజలకో ఔషధాలు రూపొందించడాని కవతరించాయని యెంత మూర్ఖుడైనా అనగలడా ! కామశాస్త్రమేకాదు. న్యాయ, వైశేషిక, సాంఖ్య, యోగ విచార గ్రంథాలేకావు "అనంతా వై వేదాః" అన్నట్లు "అనంతావై దేవాః" అన్నట్లు అనంతంగా విరాజిల్లుతున్న ఆర్షవిజ్ఞాన గ్రంథాలేవైనా యేదో ఒక జాతికో, ఒకానొక వర్గపు ప్రజలకో చెందినవని చెప్పే అధికారం యెవరికీలేదు. అవి సర్వ మానవాళికీ-సమస్త ప్రాణికోటికీ చెందిన గ్రంథాలు.

ఆర్షదృక్కు మహావిశాలమైనది. ఆ దృష్టిలోగాని, ఆ పవిత్ర సిద్ధాంతం ముందుగాని యీలోకంలో ఉన్న అవాస్తవికాలైన జాతి-మత-వర్గ-వర్ణవిభేదాలు నిలువనేరవు.

అంధవిశ్వాసంతో ప్రారంభించబడ్డాయన్న కొందరి ఆధునికుల అభిప్రాయాల్ని గుడ్డిగా నమ్మకుండా ప్రాచీన భారతీయులు ఆర్షవిజ్ఞానంతో యేర్పరచిన ఆచారాలను, వాటి వెనుక ఉన్న కల్యాణాత్మకాలై, వైజ్ఞానికాలైన దృక్పథాలను గురించి పరిశోధించవలసివున్నది. ఆత్మ ప్రదక్షిణం దేవాలయ ప్రదక్షిణం అన్నది మూర్ఖంగా ప్రవేశపెట్టబడింది కాదు. ఈ అనంత విశ్వంలో ఉన్న భూమితో సహా సూర్యచంద్రాది

గ్రహనక్షత్రాలన్నీ తమచుట్టూ తాము ఆత్మప్రదక్షిణంచేస్తూ తమకంటే శక్తివంతమైన మరొక దానిచుట్టూ (అధిదేవతచుట్టూ) తిరుగుతున్నవే. మహాశక్తివంతాలైన గోళాలే ప్రదక్షిణా-ఆత్మప్రదక్షిణా చేస్తున్నాయి. అల్పుడైన యీ మానవ మాత్రుడెందుకు చేయరాదు ? - అని దైవప్రదక్షిణా-ఆత్మప్రదక్షిణాలూ ఆర్ష విజ్ఞానులు ప్రవేశపెట్టినట్లు అర్థమవుతున్నది. అంతేకాదు. ఇందులో మరొక రహస్యమున్నది. చందమామ భూమిచుట్టూ తిరుగుతున్నదనగా భూమిశక్తి కొంత చంద్రునికి సంక్రమిస్తుంది. ఇదేవిధంగా భూమి సూర్యుని చుట్టూ తిరగడంవల్ల సౌరశక్తి కొంత భూమికి సంక్రమిస్తుంది. ధ్రువనక్షత్రంచుట్టూ తిరుగుతున్న సూర్యాది గ్రహాలకు మహత్తరమైన దాని శక్తి కొంత లభిస్తుంది. అంటే ప్రదక్షిణం చేసినది శక్తివంతం కాగా, ప్రదక్షిణతో చుట్టబడినది కొంత శక్తిహీనమవుతుందన్నమాట. ఇదేవిధంగా తపస్సు చేస్తున్న ఒక మహర్షి చుట్టూ యెవరైనా ప్రదక్షిణాలుచేస్తే ఆ తపస్సంపన్నుని శక్తి కొంత క్షీణించి అది చుట్టివచ్చిన వానికి సంక్రమిస్తుంది. ఇదే విధంగా మంత్ర-శబ్దశక్తి సంపూర్ణాలైన యంత్రాలతో ఉన్న దేవాలయంచుట్టూ ప్రదక్షిణం-సార్థకంగా మంత్రోచ్చారణతో-శబ్దశక్తితో ప్రదక్షిణం-చేసిన వ్యక్తికి ఆ దైవీయమైన శక్తి కొంత లభిస్తుంది. తన చుట్టూ ఆవరిస్తున్న దుష్టశక్తులను, ప్రభావాలను దూరంచేయడంలో ఆత్మ ప్రదక్షిణ ఉపయోగపడుతుంది. ఇతర గోళాలనుంచి దుష్టశక్తులు భూమండల వాతావరణ పరిధిలోనికి చేరుతున్నప్పుడు భూమి తనచుట్టూ తాను తిరగడంవల్ల యేర్పడే వాయు శక్తితో అవి కొంతవరకు భూమి సమీపానికి రాకుండా దూరంచేయ బడతాయి. ఇది సృష్టిలో సహజంగా జరిగేదే. ఇదేవిధంగా మానవుడు ఆత్మ ప్రదక్షిణం చేయడంవల్ల తన దరిజేరుతున్న కలుషిత వాతావరణాన్ని దూరం చేయవచ్చు. ఈ పద్ధతిలో ప్రాచీన భారతీయులేర్పరచిన అనేక ఆచారాల వెనుక ఉన్న వైజ్ఞానిక దృక్పథాన్ని మనం పరిశోధించి గుర్తించవలసిన అవసరం ఉన్నది.†

ఇదే విధంగా ప్రాచీన భారతీయులేర్పరచిన (హిందువుల) పండుగలు-చిన్న చిన్నపండుగలైనాసరే-అన్నీ కూడా ఖగోళప్రతిబింబకాలై వైజ్ఞానిక దృక్పథంతో యేర్పరచబడినవేగాని—సరదాకోసమో-ఆట కాయి తనంగానో, మెహర్బానీకోసమో, ఆడంబరాలకోసమో ఏర్పరచబడినవి కానేకావు. అయితే యీ పండుగల పేరుమీద కొందరు చిలువలు పలువలుగా పూజాదికాల నిర్వహణ రూపంగా బ్రతుకు తెరువులు సృష్టించుకున్నారంటే అది వేరుమాట. వీటిని వైజ్ఞానికులు, తార్కికులు ఆమోదించరు. హిందువుల పండుగలు కేవలం హిందువుల పండుగలు మాత్రమే కావు. మానవులందరికీ పండుగలే. ఈ పర్వదినాల ఖగోళశాస్త్ర ప్రతిబింబకత్వం గురించి నేనొక అమూల్య ప్రామాణిక గ్రంథం రచించాను.

అసలు వేదవిజ్ఞానమే కాదు, అసలైన శాస్త్రార్థాలు-ఆర్షదృక్కుగల కావ్యార్థాలు మరుగునపడి సహస్రాబ్దాలై పోయినట్లు కనిపిస్తున్నది. గొప్ప వ్యాఖ్యాతగా పేరుగాంచిన మల్లినాథసూరికి అవసరమైన శాస్త్రజ్ఞానం లేనందువల్ల కాళిదాసు కావ్యాలు అర్థమైనట్లే కనపడదు. మేఘసందేశంలో "తస్యోత్సంగే ప్రణయిన ఇవస్రస్తగంగా దుకూలామ్" అన్నశ్లోకానికి "ప్రణయినః ప్రియతమస్యేవ, తస్యకైలాసస్య

† బొట్టు మొదలైన కొన్ని విషయాల గురించి "Enugula Veeraswami's Journal" అన్న గ్రంథానికి నేను వ్రాసిన "Preface" లో వివరించాను.

ఉత్సఙ్గే ఊర్ధ్వభాగే ఊరౌచ" అని మల్లినాథుడు అర్థం వ్రాశాడంటే ఆయన దృష్టిలో ఖగోళమూ లేదు-దిక్కులూ లేవన్నమాట. కుబేరుడు ఉత్తర దిక్కుకధిపతి. ఈశ్వరుడు ఈశాన్య దిక్కుకధిపతి. వారిద్దరూ యిరుగు పొరుగువారు, మిత్రులు. కుబేరుని రాజధాని అలకాపట్టణం. అది ఉత్తర దిక్కున ఉంటుంది. ఈశ్వరుని కైలాసం ఈశాన్యాన ఉంటుంది. శాస్త్రరీత్యా వాస్తవమిట్లాఉంటే కైలాసం మీద అలకాపట్టణమున్నదని అర్థం చెపితే కుదురుతుందా? "ప్రణయినః ఇవ" అని విభజించి 'ప్రేమ ఉన్న దాని వలె' అని అర్థం చెప్పవలసి వచ్చినపుడు అసలు ప్రేమలేదనీ ఉన్నట్లు నటిస్తున్నదనీ అర్థం చెప్పవలసివస్తుంది. "తస్యోత్సంగే ఉప్రణయిన ఇవ" అన్నది కాళిదాసు హృదయం "ఉత్సఙ్గ", మనగా ముక్తసంగం ఉత్సఙ్గం-విడిచిపెట్టబడిన సంబంధంకలది. అంటే సంబంధం లేకుండా కొద్ది దూరంలో ఉన్నది అని అర్థం. "అప్రణయినః ఇవ" అనగా ప్రేమలేని దానివలె అని అర్థం చెప్పాలి. అసలు ప్రేమ ఉన్నదిగాని లేనట్లు నటిస్తున్నదని తాత్పర్యం. ప్రేమ ఉన్న ప్రియురాలు అలిగి మూతి ముడిచి కొంచెం దూరంగా కూర్చున్నట్లు కైలాసానికి కొద్ది దూరంలో అలకాపట్టణమున్నదని అసలు భావం. ఖగోళశాస్త్ర దృష్టిలేని మల్లినాథుడు అలకాపట్టణాన్ని కైలాసగిరి ఊర్ధ్వభాగంలోనో, ఊరుభాగంలోనో ఉన్నదన్నాడు. మన విజ్ఞానం వాస్తవికతకు యెంతగా దూరమైపోయిందో, యెవరికి తోచినట్లు వారు చెడ వ్రాసిపెట్టిన అర్థాలే చెపుతాయి.

"స్వస్తి ప్రజాభ్యః పరిపాలయంతాం
న్యాయ్యేన మార్గేణ మహీం మహీశాః
గోబ్రాహ్మణేభ్యః శుభమస్తునిత్యం
లోకాస్సమస్తా స్సుఖినోభవంతు"

అన్న శ్లోకం యెంతో ప్రసిద్ధంగా ఉన్నది. "గోబ్రాహ్మణేభ్యః శుభమస్తు నిత్యం" అంటే గోవులకు, బ్రాహ్మణులకు నిత్యమూ శుభమగుగాక, అని అందరూ అర్థంచెపుతారు. "లోకాస్సమస్తా స్సుఖినోభవంతు" అంటూ సమస్త లోకాలూ సుఖంగా ఉండాలని కోరే మనిషి, ప్రజలందరికీ స్వస్తికావాలని కోరే మనిషి గోవులకూ, బ్రాహ్మణులకూ మాత్రమే శుభంకావాలి గోబ్రాహ్మణులకు భిన్నమైన ప్రాణులకు శుభం జరుగకూడదని అర్థం వచ్చేటట్లు వ్రాస్తాడా"? అని కొందరు సందేహించారు. ఈ విమర్శకు సమాధానంగా ఆ శ్లోకాన్ని సమర్థిస్తూ అర్థం చెప్పిన మహాపండితులు లేకపోలేదు. "గోవు అంటే పశువు. ఈ సృష్టిలో పశువు చాలా నీచమైనది. అటువంటి పశువు మొదలు బ్రాహ్మణునివరకూ అందరికీ శుభంకలగాలి అని దానికి అర్థం," అని సమర్థించారు. ఇది కుంటిసమర్థన-గుడ్డిసమర్థనకూడా. ఈ సృష్టిలో గోవును మాతగా భావించారుగాని, దేవతగా పూజించారుగాని, హీనమైన జంతువుగా ప్రాచీన భారతీయులు భావించలేదు. "గోబ్రాహ్మణేభ్యః" అనగా గోవులవలన, బ్రాహ్మణులవలన అని పంచమీవిభక్తి అర్థంచెప్పాలి. గోవులవల్లా బ్రాహ్మణులవల్లా శుభం జరగాలి అని దాని అర్థం. బ్రాహ్మణుడనగా బ్రహ్మజ్ఞాని యైన బ్రహ్మర్షి మాత్రమే. నేటి సంఘంలో మనం అనుకునే నామమాత్రపు బ్రాహ్మణుడుకాడు. బ్రహ్మర్షియై బ్రాహ్మణత్వం పొందిన వానివల్ల లోకానికి శుభంజరుగుతుంది. గోవు మానవాళికి మాతవంటిది. మాతకంటె గొప్పదికూడా. అణుధూళివంటి విష

పదార్థాలనుసైతం నాశనంచేసే శక్తులు ఆవుపేడలో ఉన్నాయని ఆధునిక వైజ్ఞానికులు ప్రకటించారు. రకరకాల క్రిమివిషదోషాలను హరించివేయగల గోవుశరీరసారమైన పాలను, పాలస్వరూపాలూ-వాటి సారాలూ పెరుగు, మజ్జిగ, మీగడ, వెన్న, నేతులవల్ల ప్రాణికోటికెంతో మేలుజరుగుతున్నది.ఆరోగ్యవైద్యజంతుశాస్త్రాలు యెలుగెత్తి చాటిన విషయమిది. పరిశుభ్రతకై, శుద్ధికై దైహిక ఆరోగ్యానికై అలకడం కళ్లాపికొట్టడం మొదలు విభూతి పెట్టుకొనడంవరకూ ఆవు పేడ యెంతో ఉపయోగపడుతుంది. ఇది అవైజ్ఞానికమైన మూఢ విశ్వాసానికి సంబంధించిన విషయం కాదు. గోపదార్థాలవల్ల యెవరికైనా యీ మేలు జరిగేదే. గోవులోఉన్న ఈ విశిష్టతను గుర్తించి "గోవుకు ముఖనమస్కారం కాదు పృష్ఠనమస్కారం చేయండి" అని వైజ్ఞానిక దృష్టినేర్పరచగల ఒక విశిష్ట ఆచారాన్ని ప్రవేశపెట్టారు. అంతేకాదు అసలైన బ్రాహ్మణుడు - అనగా బ్రహ్మర్షి అయినవాడు గోవును లోకక్షేమంకోసం సద్వినియోగం చేస్తాడు. ఆవుపాలతో - నేతితో - ఆవుపేడతో చేసిన పిడకలతో మరికొన్ని విశిష్టమైన సమిధలను కలిపి యజ్ఞంచేసి లోకక్షేమకరంగా వాతావరణాన్ని పరిశుభ్రపరచగలడు. అందుకే గోబ్రాహ్మణులవల్ల నిత్యమూ శుభంజరగాలి అన్న భావంతో పై వాక్యం వ్రాయబడింది. మామూలు సుప్రసిద్ధ శ్లోకాల అర్థాలే ఇంతగా మరుగునపడి దురర్థాలు వ్యాపించినపుడు అమూల్య వేద విజ్ఞానవిషయాలకు చెందిన మంత్రార్థాలు యెంతగా మరుగునపడిపోయాయో వేరే చెప్పవలసిన అవసరంలేదు.

## వర్ణ వ్యవస్థ

ఆర్షదృక్కుకు భిన్నంగా వారి లక్ష్యాలకు భిన్నంగా ఆర్షసంస్కృతినే నాశనంచేసే విధంగా దురర్థాలు చెప్పబట్టే నేటి మన సంఘంలో పాతుకొనివున్న వర్ణవ్యవస్థ రూపొందింది. ఆర్ష విజ్ఞానదృష్టిలేక - దూర దృష్టి లేక అవాస్తవిక దృష్టితో - అయదార్థపరంగా - భూనభోమండలాలకు ముడిపెట్టినట్లు మోకాలికీ బోడితలకూ ముడిపెట్టినట్లు - మధ్య సంబంధం అసంబద్ధమై - సుదూరమై - గండిపడి తెగిపోయినా - కకావికలైనా - కలగాపులగమైనా - ఆ అలౌకిక శక్తిస్వరూప భాగం మొదలుగా వంశాలు, కులాలు అవత రించినట్లు కొందరు పేర్కొన్నారు. కాగా బ్రాహ్మణులు ప్రజాపతి ముఖంనుంచీ, క్షత్రియులు బాహువుల నుంచీ, వైశ్యులు ఊరువులనుంచీ, శూద్రులు పాదాలనుంచీ పుట్టినట్లు దుర్భావాలను కొందరు స్వార్థపరులు సంఘంలో పాదుకొల్పారు.

జాతి, మత, వర్ణ వివక్షారహితమైన విధానాన్ని అనుసరిస్తున్న భారత రాజ్యాంగ విధానం అసలు వాస్తవికమైనది. ప్రకృతిసిద్ధమైనది. ఒక్క ఆర్షవిజ్ఞానం దృష్టితోనేకాదు యే విజ్ఞానం దృష్టితో చూచినా సత్యసమ్మతమైనది. అజయ్యమైనది. అభేద్యమైనది. అసలు సృష్టి యెప్పుడు ప్రారంభమైందో అప్పుడే సంఘంలో అతిచారం ప్రారంభమైనది. ఒక్క కలియుగంలోనేకాదు - ద్వాపర - త్రేత - కృత యుగాలలో సైతం అతిచారాలు జరిగినట్లు పురాణాలే వర్ణిస్తాయి. అందువల్ల అతిచారమన్నది యేదోఒక కాలానికో యుగానికో పరిమితమైందీ కాదు. బద్ధమైందీకాదు. కాగా అతిచారం యెప్పుడు ప్రారంభమైందో యెప్పుడెప్పుడు యెక్కడెక్కడ యే విధంగా జరిగిందో చెప్పడానికి వీలులేదు. యే పుట్టలో యే పామున్నదో యెవరికి తెలుసు ? మాజాతి మా మతం మా వర్ణం అనేంతవరకే మనం వెళ్లనక్కరలేదు. "యిది మా వంశం. వీరు మా తాత ముత్తాతలు" అని పేర్కొనే పద్ధతినే మనం చూడవచ్చు. విశ్వాసమాత్రంగా తాత

ముత్తాతలను పేర్కొనడంతప్ప అతిచారాన్ని దృష్టిలో పెట్టుకున్నప్పుడు తమ పూర్వులగురించి మాట్లాడే అధికారం యెవ్వరికీ వుండదు. వంశమనుకొనబడే పరంపరలో యే ఒక్కరూ తప్పుదారి పట్టలేదనీ కాలు జారలేదనీ అతిచరించలేదనీ స్త్రీ పురుషులపరంగా హామీ ఇవ్వగలవారుండరు. యెవరైనా అటువంటి హామీని యివ్వగల దృష్టితో మాట్లాడితే అంతకంటే అజ్ఞానులు వేరొకరుండరు. ఈ వర్ణవ్యవస్థ అన్నది నిరాధారంగా అశాస్త్రీయంగా పరికల్పితమైనది. వర్ణవ్యవస్థకే చోటు లేనప్పుడు తద్విశాల రూపకాలైన జాతిమత వ్యవస్థలు యేవిధంగా కాలునిలదొక్కుకోగలవు? ఈ లౌకికమైన వర్ణవ్యవస్థకు జ్యోతిశ్శాస్త్రంలోనే ఖగోళ వ్యవస్థలోనే స్థానంలేదు. ఒక వ్యక్తి బ్రహ్మర్షిగా సంజనితుడౌతాడు. ఆ బ్రహ్మర్షికి పుట్టే పుత్రుడుకూడా బ్రహ్మర్షి అవ్వాలని యెక్కడవున్నది? అగస్త్య మహర్షితో పుట్టిన అతని సోదరుడు బ్రహ్మర్షీ కాడు మహర్షీ కాడు. మామూలు పండితుడైనా కాడు. అధమాధముడుగా ఊరూపేరూ లేని అగస్త్యభ్రాతగా నిలిచాడు. మన ప్రాచీన మహర్షుల పుత్రులందరూ ఆ మహర్షులంతటివారు కాలేక పోయారేమి? ఒక బ్రహ్మర్షి పుట్టినప్పటి గ్రహ నక్షత్ర వ్యవస్థ అతని కొడుకు పుట్టేసరికి యథాతథంగా వుండనేరదు. బ్రహ్మర్షి జననకాలంలోకంటే మేల్తరంగానూ వుండవచ్చు. హీనాతిహీనంగానూ వుండవచ్చు. లేదా సర్వసామాన్యంగానూ వుండవచ్చు. కాగా గొప్పవానిసంతతి మరింత గొప్పదీ కావచ్చు. హీనమైనదీ, సామాన్యమైనదీ కావచ్చునన్నమాట. ఇదే విధంగా ఒక హీనునికి బ్రహ్మర్షి పుట్టవచ్చు. మరింత హీనుడూ పుట్టవచ్చు. కాగా ప్రస్తుత వర్ణవ్యవస్థ ఆర్షదృష్టితో కూడా నీతి బాహ్యమైనదీ శాస్త్ర విదూరమైనదీ అని స్పష్టపడుతున్నది.

నాల్గవ జాతి విష్ణు పాదోద్భవమైనదన్న భావానికి మూల భూతమైన పురుషసూక్తంలోని ఋగ్వేద మంత్రమిది.

> బ్రాహ్మణోఽస్యముఖమాసీత్, బాహూరాజన్యః కృతః,
> ఊరూతదస్య యద్వైశ్యః, పద్భ్యాగ్ం శూద్రో అజాయత॥

ఈ మంత్రం తరువాత తత్ప్రజాపతి పురుషస్వరూప వర్ణనంగానే ఈ క్రింది ఋక్కులు కూడా వున్నాయి.

> చంద్రమా మనసోజాతః, చక్షోః సూర్యో అజాయత
> ముఖాదింద్రశ్చాగ్నిశ్చ ప్రాణాద్వాయు రజాయత॥
> నాభ్యా ఆసీదంతరిక్షం శీర్ష్ణోద్యౌః సమవర్తత
> పద్భ్యాం భూమిర్దిశః శ్రోత్రాత్, తథాలోకాగ్ం అకల్పయన్॥

దూరదృష్టి లేనివారు సంపూర్ణ సమన్వయ దృక్పథంలేనివారు ఆర్ష విజ్ఞాన వైఖరుల అవగాహన లేనివారు వీటిలో తొలిఋక్కుకు "ప్రజాపతికి బ్రాహ్మణుడు ముఖం, క్షత్రియుడు బాహువులు, వైశ్యులు తొడలు, పాదములవల్ల శూద్రుడు పుట్టెను" అని లౌకికమైన వర్ణ వ్యవస్థనుదృష్టిలో పెట్టుకొని అర్థం

వ్రాశారు. కొందరు "బ్రాహ్మణాదులు ముఖంవంటివారు - బాహువులవంటి వారు - తొడలవంటివారు - పాదములవంటివారు" అని అర్థం చెప్పగా మరికొందరు "బ్రాహ్మణాదులు ముఖంనుంచి పుట్టారు - బాహువులనుంచి పుట్టారు - ఊరువులనుంచి పుట్టారు - పాదములనుంచి పుట్టారు" అని అర్థం చెప్పారు. ఈ అర్థ వైఖరులెట్లావున్నా కొందరు బ్రాహ్మణాది త్రివర్ణాలవారు ప్రజాపతికి ఆయా అవయవాలయ్యారనీ శూద్రుడు పాదంనుంచి పుట్టాడనీ ప్రత్యేకంగా వ్రాశారు.

ఆర్షదృక్కుతో గుణకర్మ పరమైన బ్రాహ్మణాది భేదాలను విస్మరించడంవల్ల వాటిని గ్రహించి తమ స్థానాన్ని నిలుపుకొనలేకపోవడంవల్ల గుర్తించలేక పోవడంవల్ల సంఘంలో పలుకుబడికోసం - పెత్తనం కోసం - ఆధిక్యంకోసం సృష్టించిన దురర్థాలే యివి. బ్రహ్మజ్ఞానియైనవాడు బ్రాహ్మణుడన్న ఆర్ష నిర్వచనం ప్రకారం నామమాత్రపు బ్రాహ్మణులైనవారు అసలు బ్రాహ్మణులుగా నిలువగలరా? ఆ మహావిష్ణువు పాదాలనుంచే శూద్రుడు పుట్టాడని వాదంకోసమైనా ఆమోదించుదాం-ఆ శూద్రుణ్ణి అపవిత్రునిగా బ్రాహ్మణుల దరి జేరరాని వానిగా ధర్మాలు చెప్పడం - వెలి వేసినట్లుచూడడం న్యాయమా? శూద్రుని దూరం చేసినట్లు - నీచ - అగౌరవ భావాలతో చూచినట్లు - విష్ణుపాదాలను తక్కినదేహంతో దూరంచేసి - నీచ - అగౌరవ భావాలతో చూడగలరా? చూడలేరు సరికదా ఆ విష్ణుపాదాలకే సాష్టాంగ దండప్రణామాలు చేయకుండా వుండడం ఈ వర్ణ వ్యవస్థారూపానుయాయులైన వారికి అసాధ్యం. పాదాలు నరికిన మహావిష్ణువును మనం ఊహించనైనా ఊహించలేము కదా! "గంగ విష్ణుపాదోద్భవి. విష్ణు పాదంనుంచే పుట్టిన ఆ గంగలో మునగడంవల్ల పవిత్రులమవుతాం - పుణ్యలోకాలు లభిస్తాయి" అని భావించి తీర్థాలాడుతున్నవారే ఆవిష్ణు పాదోద్భవులైన శూద్రులను తక్కువ వారుగా అపవిత్రులుగా చూడడం పుణ్యప్రదమని యెలా అనగలం? విష్ణు పాదాలు ఒక్క భూదేవ వంద్యాలు మాత్రమేకావు. సర్వజన - భూదేవ - దేవ-దేవదేవ వంద్యాలు కూడా కదా! మరి తత్పవిత్ర పాదోద్భవులు తక్కువ వారెలా అవుతారు? ఇదంతా వాదంకోసం వ్రాస్తున్న విషయం.

గుణ కర్మలను దృష్టిలో పెట్టుకొని "బ్రాహ్మణోఽస్య" ఇత్యాది మంత్రానికి అర్థంచెప్పాలి తప్ప తద్భిన్నంగా చెప్పరాదు. ఒకవేళ చెప్పినా వాస్తవికమై, తర్కసహమై యే పరిస్థితుల్లోనూ నిలువ నేరదు. బ్రాహ్మణుడు ముఖంవంటి వాడు అని అర్థంచెపితే బ్రహ్మజ్ఞానియైన యేబ్రాహ్మణుడైనా ముఖం వంటివాడే అవుతాడు. ఇదేవిధంగా క్షాత్రశక్తి కలవాడెవడైనా బాహువుల వంటివాడే అవుతాడు. వైశ్య శక్తి కలవాడెవడైనా తొడలవంటివాడే అవుతాడు. శూద్ర శక్తికలవాడెవడైనా పాదముల వంటివాడే అవుతాడు. ఈ దృష్టిలో యిప్పటి లౌకిక వర్ణవ్యవస్థకు స్థానంలేదు. బ్రాహ్మణుని కొడుకు శూద్రుడూ కావచ్చును మరొకడూ కావచ్చును. శూద్రుని కొడుకు బ్రాహ్మణుడైనా కావచ్చును. మరొకడైనా కావచ్చును. ఇప్పటి సంఘంలోని వర్ణవ్యవస్థను దృష్టిలో పెట్టుకొని పై మంత్రానికి అర్థం చెప్పదలిస్తే అది ఛిన్నాభిన్నమై శాస్త్రాలనూ వేదాలనూ అప్రామాణికం చేస్తుంది. ఈ మంత్రాలలో ఉన్న "ఆసీత్-అజాయత-జాతః" వంటి క్రియా రూపాలన్నింటికీ "ఆయెను" అని ఒక్కటే అర్థం తప్ప వేరర్థంచెప్పరాదు. "బహ్వర్థాహిధాతవః" గదా! కాగా "అజాయత" అన్నప్పుడు "జాతః" అన్నప్పుడు

పుట్టెను అని అర్థం చెప్పరాదు. "పుట్టెను" అన్న అర్థం చెప్పదలిస్తే ఎన్నో వ్యాఘాతాలొస్తాయి. విష్ణునాభి కమలంనుంచి బ్రహ్మ పుట్టాడుకదా! మరి బ్రహ్మ బ్రాహ్మణుడా కాడా? తద్బ్రహ్మజ్ఞాని యైనవాడే బ్రాహ్మణుడు కాగా లేనిది అసలు బ్రహ్మే బ్రాహ్మణుడు కాడా! బ్రహ్మ శివుని దక్షిణాంగ సంజనితుడని శివ పురాణం చెప్తున్నది. అనేకమంది బ్రహ్మర్షులు బ్రహ్మ సంతతిగా పుట్టారు. వారంతా యేవర్ణం వారౌతారు? చంద్రుడు క్షీరసాగర మథనంలో సంజనితుడయ్యాడని పురాణాలు ఘోషించాయే. పాక్షికమైన మంత్రార్థం ప్రకారం మరి విష్ణువు మనస్సు నుండి చంద్రుడు పుట్టాడా? పాలసముద్రం నుంచి పుట్టాడా? సూర్యుడు అదితి కశ్యపుల కుమారుడని బ్రహ్మాండపురాణం వర్ణించింది. సూర్యచంద్రగ్రహాలు రెండూ విష్ణువుకు రెండు నేత్రాలన్నమాట ఉండనే ఉన్నది. మరి విష్ణువు నేత్రాలనుంచి సూర్యుడు పుట్టాడన్న మంత్రవాక్యార్థమేమౌతుంది? వేదమంత్రాలకు పురాణగాథలకు పరస్పర విరుద్ధమైన వ్యాఘాతాలేర్పడ్డం లేదా? కాగా చంద్రుడు ప్రజాపతికి మనస్సువంటివాడు. సూర్యుడు నేత్రం వంటివాడు అనే అర్థం చెప్పితే వారెక్కడ పుట్టినా సమన్వయం అబాధకంగా తర్కసహమే అవుతుంది. ఇదే విధంగా బ్రహ్మజ్ఞానులైన బ్రాహ్మణాదులు ప్రజాపతికి ముఖం వంటివారు అన్న పద్ధతిలో అర్థం చెప్పితే పరమ వైజ్ఞానికమై శిరోధార్యమౌతుంది.

అసలీ చతుర్వర్ణాలేకావు. మామూలుగా అంగారకుడు భౌముడనుకుంటాము. కాని విష్ణువు స్వేద బిందువునుంచి ఉద్భవించినట్లు పద్మపురాణం చెప్తున్నది. శివుని స్వేద బిందువునుంచి పుట్టినట్లు చెప్పేవి కూడా లేక పోలేదు. విష్ణువు చెవులనుంచి మధుకైటభులు పుట్టారు. విష్ణువు మనస్సునుంచి మన్మథుడే కాదు విరజుడు, అపాంతరతముడు వంటివారు కూడా జన్మించారు. వాల్మీకి బ్రహ్మహృదయ సంజాతుడని చెప్పేవి కూడా ఉన్నా విష్ణుహృదయ సంజాతుడని చెప్పేవీ ఉన్నాయి.

మరొక విశేషం. విష్ణువు ముఖ-బాహూరు పాదాలనుండి పుట్టకుండా బ్రహ్మదేవుని వివిధ అవయవాలనుంచి పుట్టినవారు అనేకులున్నారు. అంగిరస-అత్రి-త్రిత-పులస్త్య-మరీచి-సంకల్ప-సనత్కుమార-సరస్వతీ-జ్యేష్ఠాదేవులు బ్రహ్మహృదయంనుంచీ-కనుబొమ్మలనుంచి రుద్రుడూ, లలాటంనుంచి ఏకాదశ రుద్రులూ, నాసారంధ్రాలనుంచి అరుణి పుట్టారు. బ్రహ్మ తుమ్మడంవల్ల అతనిగర్భంనుంచి క్షుతుడు, ఆవులింతతో జాంబవంతుడు సంజనితులయ్యారు. బ్రహ్మరసననుంచి వశిష్ఠుడు, చెవులనుంచి దిక్కన్యలు, కంఠం నుంచి లేదా తొడనుంచి నారదుడు, బొటనవ్రేలినుంచి దక్షుడూ, బ్రహ్మ తన చేతివాసన చూడడంవల్ల అప్సరసలు, నాభినుంచి పులహుడు సంభూతులయ్యారు. బ్రహ్మ అప్సరసలను చూడగా వీర్యస్ఖలనమై కొంత యిసుకలో కలవడంవల్ల వాలఖిల్యులు, మరి కొంత బురుదలో కలవడంవల్ల వాల్మీకి జనితులయ్యారు. బ్రహ్మ ఒకసారి తనదేహాన్ని విసర్జించవలసిరాగా తద్విసర్జిత శరీరంనుంచి సంధ్యాలలన సంభవించింది. బ్రహ్మ - విష్ణు మహేశ్వరులు ముగ్గురూ పరస్పరం చూచుకుంటే ఆ చూపులవల్ల "త్రికళ" సంజనిత అయ్యిందని పురాణ వాక్కు. ఇంతెందుకు? విష్ణు ముఖాద్యవయవాలనుంచి బ్రాహ్మణాదులు పుట్టారన్న వాక్కుకు భిన్నంగా బ్రహ్మ తిరోధాన శక్తివల్ల నరులు-కిన్నరులు పుట్టారన్నమాట కూడా ఉన్నది. చతుర్వర్ణాల వారేకాదు, అసలు నరులంతా బ్రహ్మ తిరోధాన శక్తివల్లనే పుట్టితే విష్ణ్వవయవ చతుర్వర్ణ సంజనితత్వ అర్థానికి భిన్నత్వం

రావడంలేదా ! అయితే బ్రాహ్మణాదులు విష్ణువు ముఖంవంటివారు - బాహువుల వంటివారు - ఊరువుల వంటివారు - పాదముల వంటివారు అని అర్థం చెప్పుకున్నప్పుడు యెవరు యెవ్వరి సంతానం అయినా ఈ అర్థానికి భిన్నత్వం రాదు.

"జన్మనా జాయతే శూద్రః - కర్మణా జాయతే ద్విజః" అన్నట్లు జన్మతో ప్రతివారూ శూద్రులే. సామాన్యంగా జ్ఞాననేత్ర పరమైన ఉపనయనంతో లభించే గాయత్రీ మంత్రాన్ని అనులోమ - విలోమాలుగా అక్షరలక్షలు జపించి సిద్ధిపొందినవారే అసలైన ద్విజులుగా - సార్థకోపనయనవంతులుగా పరిగణింపబడతారు. "ద్విజత్వ" సిద్ధికి గాయత్రీ మంత్రజపం ఒక్కటే యేకైక మార్గంకాదు. గాయత్రీతర దేవతా మంత్ర జప మార్గాలు కూడా అనేకం ఉన్నాయి. ఏవిధంగానైతేనేమి ? ద్విజత్వ సిద్ధి కలిగినవారే క్రమాభ్యుదయంతో బ్రహ్మజ్ఞానులుగా - అంటే-అసలైన బ్రాహ్మణులుగామరింత పురోగాములై - మహర్షులుగా- బ్రహ్మర్షులుగా వెలుగొందడానికి సమర్థులౌతారు - సమర్థులౌతారు. అందువల్ల శూద్ర, అశూద్ర పరాలైన - సేవా - వైశ్య - క్షాత్ర - బ్రాహ్మ్య - శక్తుల్లో యేదైనా కర్మవల్ల రూపొందిందేగాని జన్మతో లభించేది కాదని గ్రహించక తప్పదు. అసలు యేది లభించినా అది "జన్మ విశేషమే జననకాల విశేషమే" నన్నమాట వేరు. ఈ దృష్ట్యా కూడా అసలు కర్మే జన్మసిద్ధమై - మాతాపిత సంతాన సంబంధ కారణంగా నిర్ణయించబడే నేటి వర్ణ వ్యవస్థను అసందిగ్ధంగా త్రోసిపుచ్చి కర్మ పరమైన సత్యసమ్మతమైన వర్ణ వ్యవస్థకు సుదృఢమైన పునాదిగానే నిలుస్తుంది. కాగా అజ్ఞాన విలాసితాలై లోకంలో బాగా వేళ్లు పాతుకొని వున్న ఈ సంకుచిత జాతి మత వర్ణ వ్యవస్థలను పరిగణించకుండా సర్వజన సామాన్య ధర్మంగా సమాన ప్రతిపత్తితో భారత రాజ్యాంగం ఏకైక మానవతా వాదాన్ని శిరోధార్యంగా భావించడం ఆర్ష విజ్ఞానానికి ముమ్మూర్తులా ప్రతిబింబకమే అనడంలో సందేహంలేదు.

తోటి మానవుల మధ్య అడ్డుగోడలను - అపోహాలను - అసహన - అసహకార దృక్పథాలను - ఈర్ష్యా ద్వేషవైర భావాలను పెంపొందించగల అవైజ్ఞానికాలు, ఆర్ష విజ్ఞాన విరుద్ధాలు అయి తర్కాసహాలు కానటువంటి మూర్ఖపు దురాచారాలు-అప్రాకృతాలై, అసహజాలై గుణకర్మ విరుద్ధాలైన దుష్ట వర్ణవ్యవస్థలు బలిసి హిందూ సమాజాన్ని పూర్తిగా బలహీన పరచడమే కాదు, మౌలికంగా నిర్వీర్యం చేసివేశాయి. దైవభీతి లేకుండా, పాపభీతి లేకుండా. దైవంపేరుతోనే, దైవసాక్షిగానే అష్టాదశ మహా పాపాలుచేసి - అమరపురికి కాదు - అధః పాతాళంలోకైనాకాదు - ఆత్మవంచనా పరిపూరితాలైన అనూహ్యా నరక జీవితాలను బహుముఖంగా అభివృద్ధి పరచాయి. ఈ అనైక్యత కారణంగానే ఒకానొకప్పుడు చక్రవర్తులతో ఏకచ్ఛత్రాధిపత్యంతో నడచిన భూమండలం - ఛిన్నాభిన్నమై - మహారాజులు - రాజులు - సామంత రాజుల పరిపాలిత ప్రాంతాలుగా చీలిపోయి బలహీనపడింది. ఆత్మహత్యా సదృశాలైన అంతః కలహాలతో అస్తవ్యస్తమయ్యింది.

ఇంతగా పతనమైన సంఘం ఐకమత్యాన్ని కోల్పోయి బలహీనపడి అస్తవ్యస్తం కాక మరే మవుతుంది? ఐకమత్యాన్ని కోల్పోయిన రాష్ట్రం కాని - దేశంకాని - సంఘంకాని - మతంకాని - జాతికాని

భద్రంగా ఎప్పుడూ వుండలేదు. ఆర్ష విజ్ఞానానికి భిన్నమైన సంఘవ్యవస్థ ఎప్పుడు రూపొంది ప్రబలిందో అప్పుడే దానికి విరుద్ధంగా విభిన్న ఉద్యమాలు, మతాలు తలయెత్తాయి. బౌద్ధం అటువంటిదే, జైనం అటువంటిదే. విస్పష్టమైన లక్ష్యం - అనవగాహతలేని అర్థశుద్ధి - సార్థకత - సత్యం కొరవడగా అన్ని రకాల సిద్ధాంతాలపట్లా అసహ్యం పుట్టి అవతరించిందే అడ్డం తిరిగిన చార్వాక మతం. ఒక్క హిందూ సమాజంలోనే సమైక్యతకు భంగకరంగా సవాలక్ష మతనామక మతాలు పుట్టినప్పుడు - పరమతాలు మన నెత్తినెక్కి పరువు ప్రతిష్ఠలను తుడిచిపెట్టి చెరబెట్టాయంటే అందులో విడ్డూరమేముంటుంది? శైవ - వీరశైవ - వైష్ణవ - వీరవైష్ణవాది గాగల మత భేదాలతో హత్యలకు - దోపిడీలకు - గృహ దహనాలకు - అవసరమైతే యుద్ధాలకైనా తలపడగల స్థితికి దిగజారడమన్నది ఆర్షవిజ్ఞానసమ్మతంకాదు. ఏ విజ్ఞాన సమ్మతమూ కాదు. అది అజ్ఞాన సమ్మితం.

హిందూమతమన్నది "ఇందు" మతం. ఇది "రవి చంద్రాది గ్రహ నక్షత్రాల వ్యవస్థ ఆధారంగా - తచ్చలన - స్వరూప స్వభావ పరిణామ బింబ ప్రతిబింబాల ఫలితంగా యేర్పడిన వైజ్ఞానిక సిద్ధాంతమయమైన మతం" - అనే సంగతి యేనాడు మన ప్రాచీన భారతీయ సంఘం మరచిపోయిందో, ఆనాడే అసలైన విజ్ఞాన ప్రదమైన మతం గతితప్పింది. అధోగతి పాలయ్యింది.

విజ్ఞాన రహితాలై రకరకాల ప్రాబల్యాలకు - అధికారాలకు - తావలాలైన మతాలు మొహ మాటాలతో - బెల్లింపులతో - కానుకలతో - లంచాలతో - బలవంతాలతో - బెదిరింపులతో - హింసతో - యుద్ధాలతో విరాట్స్వరూపం దాల్చేంతగా వ్యాప్తిచెందుతాయి. అందుకే అజ్ఞానపరాలైన మతాలలో, అన్నివిధాలైన పాపాలూ చోటు చేసుకుంటాయి. అవి ఎంత విస్తృతి పొందినా వాటి స్థాయీ - విలువా అంతే. ఒక గజదొంగ కోటీశ్వరుడై లోకంలో పైకి దొరగా చెలామణీ కావచ్చును. కాని ఆ గజదొంగ తనకైతాను తన హృదయంవద్ద తనను దొరగా భావించుకొని గౌరవించుకోగలడా? అటువంటి అంతశ్శుద్ధి అతని కబ్బుతుందా? ఏదైనా అంతే. దేనికెక్కడ విలువ వుంటుందో అక్కడే వుంటుంది. ఒక యింటికి నిప్పంటుకుంటే ఆయిల్లుమాత్రమే తగులబడి ఊరుకుంటుందా! ఆ అగ్గి మరికొన్ని యిళ్లకో, మొత్తం గ్రామానికో వ్యాపించదా! ఒక వ్యక్తికో, ఒక కుటుంబానికో కరువువస్తే ఎవరైనా పోషించగలరు. లేదా పదిమంది కలిసి సహకరించి పోషించగలరు. అదే దేశకరువే వస్తే, అనేక దేశాల్లోనే కరువువస్తే ఎవరు పోషించ గలరు? ఆ హాహాకారాలను - ఆ ఆకలి మంటలనెవరు ఆపగలరు? ఎవరార్పగలరు? అందుకే "యిరుగూ పొరుగూ పచ్చగా వుండాలి. అందరూ హాయిగా వుండాలి" అన్నది మన ప్రాచీన భారతీయతా లక్ష్యమైంది. ఈ దివ్యదేవతా స్వరూపంవంటి లక్ష్యాన్ని విడచి, జ్ఞాన విజ్ఞాన ప్రదాలైన రాజమార్గాలను విడచి, అజ్ఞానాంధ కారమయాలైన దుర్గమారణ్యాలలో పడిపోయిన హిందూమతం యెంతటి దుర్గతికి పోయిందో చెప్పలేము. "స్వస్తి ప్రజాభ్యః.... లోకాస్సమస్తాస్సుఖినోభవంతు" అన్నదిగదా మన ప్రాచీన భారతీయుల మహత్తర లక్ష్యం. ఈ లక్ష్యాన్ని యెండమావులుగా చేసి దురాచారాలవైపు - కృత్రిమ దుష్ట వర్ణవ్యవస్థలవైపు తిరోగమించి ప్రభ్రష్టమయ్యింది మన భారతీయత.

## ఇస్లామిక్ మతం దాడి.

మహమ్మదు గొప్ప ప్రవక్త. అతను జీవించిన రోజుల్లో అతనొక గొప్ప విప్లవవాది. తన మతాన్ని స్థాపించుకొనడానికి - పరివ్యాప్తి చెందించడానికి యెన్నెన్ని విధాల అతను ప్రయత్నించలేదు? రక్తపాతాలు జరపలేదా? యుద్ధకాండలు నెరపలేదా? "లోకాస్సమస్తాస్సుఖినోభవంతు" అన్నది ఎంత గొప్ప లక్ష్యం! యెంత అపూర్వ అమూల్యలక్ష్యం! ఎంత అమేయ లక్ష్యం! ఎంత అజయ్య లక్ష్యం? పరమత సహన మన్నది యీ లక్ష్యంలో ఒక పరమాణువువంటిది. ఇంతటి పరమ వైజ్ఞానికమై, సర్వజన - కాదు - సర్వలోక- అవును - సమస్తలోక సమ్మత - సుఖ శుభాకాంక్ష -కల- మతం మరొకటి ఎక్కడుంది ? హిందూమతం సర్వ జన - సర్వప్రాణి - సర్వలోకమతమంటే తప్పేముంది? ఇంతటి ఉత్తమోత్తమ - మహోత్తమ సిద్ధాంత శుద్ధ లక్ష్యం కల మతానికి సైతం దాడులు తప్పలేదు - గోడులు తప్పలేదు. ఈ గోడులకు మూల కారణం వక్ర బుద్ధికల సమాజమే! అయినా లక్ష్యశుద్ధి-వైజ్ఞానికమైన సిద్ధాంత శుద్ధికల మతం అవ్వడంవల్ల హిందూమతం- ప్రత్యేకించి హిందూ తత్వజ్ఞానం - తత్వ పరిశోధన - అజరామర్మాలై నిలచాయి. అసమానాలై వెలశాయి. ఆర్ష విజ్ఞాన ప్రతీకాలై అలరారాయి. ఎంత పవిత్ర శాశ్వత లక్ష్యం వుంటేనేమి? ఆ విశాల లక్ష్యంతో తుల తూగలేని మతాలు - లక్ష్యాలు - దానిపై యీర్ష్యతో - ద్వేషంతో దాడి చెయ్యడం సహజం. ఎంతైనా పెద్ద చేపను చిన్న చేప మింగలేదు - కాని అది నోరు తెరవగలదు - తన శక్తికొద్దీ కొరకగలదు. ఎంత హాలాహలమైనా అమృతాన్ని విషమింపజేయలేదు. అమృతం దేవతలందరికీ అందితే హాలాహలం మహేశ్వ రుని కడుపైనా నింపలేదు. కంఠానికే చాలలేదు. "లోకాస్సమస్తాస్సుఖినోభవంతు" అన్న లక్ష్యాన్ని మించగల లక్ష్యం మరొకటేమి వున్నది ? ఎన్ని లక్ష్యాలున్నా అన్నీ అందులో అంతర్భూతాలే! అడుక్కు చేరేవే! అంతటి మహత్తర లక్ష్యం కల అమేయ మతానికి - అనురూపం కాని - ఇరుగుపొరుగు ఇస్లామిక్ మతకృత దురాక్రమణ - కాదు కాదు - చిత్రవధ తప్పలేదు

క్రైస్తవ మతం వెలుగునీడల ప్రభావంతో - మహమ్మద్ - కారణంగా క్రీస్తుశకం 610 ప్రాంతంలో అరబ్ దేశంలో ఆవిర్భవించిన ఇస్లామిక్ మతం - మక్కా తొలిమసీదై - అనేకరకాల సాధనాలతో దేశదేశాలలో వ్యాప్తిచెందింది. తొలుత టర్కీ - ఈజిప్టువంటి దేశాలలో యుద్ధం ముఖ్యసాధనంగా ఇస్లామిక్ మతం - మహమ్మద్ నాయకత్వాన ప్రస్థాపించబడింది. ఒక్క మతస్థాపనమే జరుగలేదు. మతస్థాపనతోపాటు, యితర బలాలతో రాజ్యస్థాపనకూడా పడుగూ-పేకగా జరుగుతూ వచ్చింది. ఆ తరువాత పర్షియా - ఆఫ్ఘనిస్థాన్ - సిరియా - స్పెయిన్ - గ్రీసు - మొదలైన దేశాలలో పట్ట బలవంతాన - రక్తపాతాలతో యీ మతం - రాజ్యం - పీఠాలేర్పరచుకున్నాయి.

అయితే భారతదేశానికి సమీపంగా ఉన్న ఆసియా ఖండంలోని సాటి దేశాలలో పట్ట బలవంతాన హత్యాకాండతో- రక్తపాతంతో-యుద్ధాగ్నులతో ఇస్లామిక్ మతం స్వైర విహారం చేస్తున్నప్పుడు అప్పటి భారతీయులేంచేశారు ? ఏ స్థితిలో వున్నారు ? ప్రపంచంలో జరుగుతున్న విషయాలు తెలుసుకుని అసమర్థులై చేతులు ముడుచుకుని, గోళ్ళుగిల్లుకుంటూనైనా కూర్చొనలేదు. "లోకాస్సమస్తాస్సుఖినోభవంతు" అన్న లక్ష్యాన్ని ఆచరణలో ఎప్పుడో విస్మరించిన నాటి భారతీయులు - ఆ రోజుల్లో తమసాటి దేశాల్లో ఏం

జరుగుతున్నదో - కనీసం - తెల్సుకుందామన్న ఆసక్తి - ఆలోచన కూడా లేని స్థితిలో వున్నారు. ఇరుగు పొరుగు దేశాలతో ఎటువంటి సంబంధమూలేక "గుడుగుడు గుంచం గుళ్లోరాగం" అన్నట్లు కూపస్థ మండూకాలవలె - ఇలో నారాయణమ్మలై వున్నారు. శత్రువు చాటుమాటుగా వచ్చి వెన్నుపోటు పొడవడం కాదు - ఎట్టఎదురుగా - మొహం ముందుగా వచ్చి ముక్కుమీద గుద్దేవరకూ - తన ఎదుట ఏమున్నదో - ఏం జరుగుతున్నదో తెలియని స్థితిలో ఉన్ననాటి భారతీయులు - క్రీస్తుశకం 664 ప్రాంతంలో మహమ్మదీయ సేనా నాయకుడైన "మహలబ్" కొట్టిన చెంపదెబ్బ తగిలేవరకూ - క్రీస్తుశకం 711లో "మహమ్మద్ ఖాసిం" సింధు ప్రాంతంమీద దాడిచేసి హిందూరాజైన "దాహిర్" ను చంపి, అతని రాజ్యాన్ని ఆక్రమించి - మాడు పగులగొట్టినంత దెబ్బ తగిలేవరకూ - కళ్ళు తెరవలేదు. ఆతరువాత భారతీయులు తమ చెంపలు తామే వాయించుకుని - తమవెన్ను తాము చరుచుకొని, తమ్ము తాము గుర్తించి వ్యవహరించడం మొదలు పెట్టారు. అందువల్ల కొద్దికాలంపాటు వారు తమ్ము తాము గట్టిగా నిలుపుకోగలిగారు. అయినా క్రీస్తుశకం 999 మొదలు ఘజనీ మహమ్మద్ వేలాది సైనికులతో అనేక పర్యాయాలు దాడులు చెయ్యగా భారత దేశంలో కొంతభాగం దురాక్రమణకులోనై భారతీయత కొంత విధ్వస్తమైనది. ఆ తరువాత గోరీ వంశీయులు భారతదేశ స్వాతంత్ర్యాన్ని హరించడంకోసం ఉత్తర భారతంలోని అప్పటి రాజపుత్ర రాజ్యాలను అనేక మెరుపు దాడులతో పతనంచేసి ఆక్రమించారు. రాజపుత్రులు అంతః కలహాలతో - ఒకరివెనుక ఒకరు గోతులు తవ్వుకునే మనస్తత్వంతో ఆత్మవంచనతో మెలగడంవల్ల తమతోపాటు తమ ప్రజలను, దేశాన్ని కడగండ్ల పాలు చేశారు. తుదకు స్థానేశ్వర మహాయుద్ధంతో-మనదేశం పూర్తిగా పారతంత్ర్యానికి లోబడిపోయిందనే చెప్పాలి. ఆత్మద్రోహులు - స్వామిద్రోహులు - దేశద్రోహులు - పరమ స్వార్థపరులు కారణంగా మన దేశానికి యీ దుర్గతిపట్టింది. అనంతరం మధ్యలో మొగలులు, ఖిల్జీలు ఆధిపత్యం వహించినా తురుష్కుల పరిపాలనలు భారతీయతను తమ ఉక్కు పాదాలక్రింద తొక్కిపెట్టాయనే చెప్పవచ్చు. కుతుబుద్దీన్ - షమ్సుద్దీన్ ఆల్తమష్ - సుల్తానారజియా - నాసిరుద్దీన్ మహమ్మద్ - గ్యాసుద్దీన్ బల్బన్ - కైకుబాద్ - జలాలుద్దీన్ ఖిల్జీ - అల్లావుద్దీన్ మొదలైనవారు- పిదప తుగ్లక్ ప్రభృతులు, క్రీ.శ. 1000 మొదలు దాదాపు అనేకవందల సంవత్సరాలపాటు భారతదేశాన్ని పరిపూర్ణంగా కాకపోయినా కొన్ని కొన్ని ప్రాంతాలైనా పరిపాలిస్తూ భారతీయతనూ, బహుముఖమైన హిందూ సంస్కృతినీ పరిపూర్ణంగా విధ్వంసమొనర్చాలని యెన్నెన్నో ప్రయత్నాలు చేశారు. ఖిల్జీలు ప్రత్యేకజాతివారే అయినా ఇస్లామిక్ మతాన్ని స్వీకరించి-ముందు వచ్చిన చెవులకంటే వెనుక వచ్చిన కొమ్ములు వాడి అన్నట్లు అసలు ముస్లిములకంటే అత్యధికమైన విద్వేషాన్ని హిందూ మతంపట్ల వెళ్లగ్రక్కుతూ, ప్రజానాశనానికి, హిందూసంస్కృతీవినాశనానికి కంకణం కట్టుకున్నట్లుగా వ్యవహరించారు. మహమ్మదీయమతస్థాపనకు దూరాలోచన లేకుండా, దురాలోచనలతో రాజబాటలు నిర్మించారు.

దాదాపు 300 సంవత్సరాలు ఉత్తరభారతదేశం ముస్లిముల దురాక్రమణకు గురై అష్టకష్టాలు పడింది. క్రీ.శ. 1300 తరువాత దురాశాపరుడూ, మహాదురహంకారుడూ అయిన అల్లావుద్దీన్ దృష్టి దక్షిణభారతం మీదకు మళ్లింది. క్రమక్రమంగా దక్షిణరాజ్యాలన్నింటినీ జయించి శ్రీరామేశ్వర క్షేత్రంలోసైతం మసీదు ఒకటి కట్టించి మహమ్మదీయమతాన్నీ, తురుష్కరాజ్యాన్నీ ఆసేతుశీతనగపర్యంతం వ్యాపింపజేశాడు.

చండశాసను డనిపించుకున్న అల్లావుద్దీన్ ఐశ్వర్యమదాంధుడై ప్రజాపీడనతో సాధువులను బాధిస్తూ ఉత్తరభాగతాన్నే కాక దక్షిణ భారతాన్ని సైతం తనకాలి బొటన వ్రేలిక్రిందనలిపివేశాడు. క్రీ.శ. 1296 మొదలు 1316 వరకు అనేక విజయాలతో దక్షిణభారతదేశాన్ని సైతం తురుష్కపరిపాలన క్రిందకు తీసుకుని వచ్చిన అల్లావుద్దీన్ ప్రభృతులదుష్టాధిపత్యాన్ని, మహమ్మదీయ మతప్రాబల్యాన్ని యెదిరించి విజయధ్వజమెత్తి, విజయశంఖమూది, భారతీయుల స్వాతంత్ర్యాన్ని, వైశిష్ట్యాన్ని హిందూమత వైశిష్ట్యాన్ని సురక్షితంగా యథాతథంగా నిలపడానికి అవతరించిందే విజయనగర సామ్రాజ్యం.

ఆంధ్రదేశాన్నంతటినీ ఏకచ్ఛత్రాధిపత్యంగా యేలినకాకతీయసామ్రాజ్యం తురుష్కులజైత్రయాత్రలతో పతనమైపోయింది. క్రీ.శ. 1323 తరువాత దేశంలో శాంతిభద్రతలు శూన్యమయ్యాయనే చెప్పవచ్చు. ముస్లిముల విషహస్తాలనుంచి హిందూధర్మాన్ని రక్షించడానికై ఆంధ్రదేశంలో చెదురుమదురుగా ప్రయత్నాలు జరుగుతూవచ్చాయి. అందువల్ల క్రీ.శ. 1331 నాటికి తూర్పు ప్రాంతమంతా ముస్లిముల పరిపాలనను తోసి రాజని స్వతంత్రమైంది. పశ్చిమానచాళుక్య సోమదేవుడూ, మూడవ భల్లాలదేవుడూ ఢిల్లీముస్లిం రాజుకు యెదురు తిరిగి కంపిలి ముస్లిం రాజప్రతినిధిమీద తిరుగుబాటుచేసి ఓడించారు. ఈవిజయాన్ని సాధించడంలో తోడ్పడినవారు హరిహరరాయలు, బుక్క రాయలు అనే అన్నదమ్ములు. తుంగభద్రానదికి దక్షిణంగా విజయనగర సామ్రాజ్యమూ (క్రీ.శ. 1336), పూర్వపుకాకతీయరాజ్యపు భాగములో వెలమరాజ్యమూ, కృష్ణా గోదావరీ పరిసరాలలో రెడ్డిరాజ్యమూ (క్రీ.శ. 1330) యేర్పడ్డాయి. కళింగాంధ్రంలో తూర్పుగాంగులూ, కోరుకొండలోరెడ్లూ, పిఠాపురంలో కొప్పులనాయకులూ, ఓరుగల్లు పరిసరాలలో ప్రోలయ, కాపయనాయకులూ పరిపాలిస్తున్నారు. క్రీ.శ. 1347లో విజయనగర రాజ్యాని కుత్తరంగా గుల్బర్గారాజధానిగా దక్షిణ హిందూరాజ్యాలన్నింటికీ పక్కలో బల్లెంవలె బహమనీరాజ్యం యేర్పడింది.

మహమ్మదీయ మతరాజ్య దురాక్రమణనుంచి దక్షిణభారతదేశాన్ని కాపాడినవారు సంగమ, సాళువ, తుళువ, ఆరవీటి వంశీయులనబడిన చతుర్వంశీయులు. అవిచ్ఛిన్నంగా 300 సంవత్సరాలు హిందూమత రాజ్యాలను ప్రస్థాపించి కాపాడిన ఈసామ్రాజ్యస్థాపనకు మూలపురుషులు, ఆంధ్రదేశ చరిత్రలోఅమూల్య పంచరత్న మాలికలుగా అచంచలంగా,ఆచంద్రార్కంగా నిలువ గలిగిన సోదరపంచకం హరిహర రాయలు-కంప రాయలు - బుక్కరాయలు - మారప్ప-ముత్తప్పలు. వీరిలో హరిహరరాయలు బుక్కరాయలు కాకతీయులకు కంపిలిరాజుకు మంత్రులవంటి సహాయకులుగాఉన్నారు. వీరిద్దరూ క్రీ.శ. 1327లో ఢిల్లీకి బందీలుగా తీసుకొని వెళ్లబడ్డారు. బందీలుగా తీసుకొని వెళ్లిన తుగ్లక్ వారినిబందీలుగా వుంచలేకపోవడం, కంపిలి రాజప్రతినిధియైన మాలిక్ మహమ్మదుకు సహాయకులుగా ఉండడానికి దక్షిణాదికి తిరిగి పంపించడం జరిగింది. అప్పుడువిద్యారణ్య స్వామి ప్రోద్బలంతో వీరు విద్యానగరం నిర్మించారు. అదే విజయనగర సామ్రాజ్యానికి మూలపీఠమైంది. బహుశాస్త్రవేత్తా, లౌకిక వైదిక వ్యవహారనిపుణుడూ, రాజనీతివేత్తా హిందూమత ధర్మ భక్తి విశ్వాస సంబద్ధుడూ, విరాగీ అయిన ఈ మాధవ విద్యారణ్య స్వామి విజయనగరసామ్రాజ్యనిర్మాణానికి సూత్రధారుడని పెక్కుమంది భావించారు.

ఇటీవలి కాలంలో కవిపండితులకు రాజకీయాలతో సంబంధముండరాదని చెప్పే పెద్దలు, మహాకవులుగా భావించబడేవారు కొందరున్నారు. ఇది ఆర్ష దృక్కుతోగాని, మరొక దృష్టితోకాని ఆలోచించి చెప్పే మాటకాదు. వాస్తవానికి ఆర్ష దృష్టితో పరిశీలిస్తే నేడు మనదేశంలో కవులుగా, మహాకవులుగా పేర్కొనబడుతున్నవారు నామమాత్రపుకవులుగా నైనా నిలువలేరు. 'నానృషిః కురుతేకావ్యం' అన్నది అత్యంత ప్రాచీనమైన నిత్యసత్య నిర్వచనం. ఋషియైన వ్యక్తి కవిగా కావ్యం వ్రాస్తాడు. అంతేగాని యేవోపద్యాలు వ్రాసి కవి అనిపించుకొని ఋషిగా నిలవడం జరుగదు. వాక్ శుద్ధి-వాక్‌సిద్ధి- త్రికాలజ్ఞత-జరామరణ రాహిత్యం- లేదా తన యిష్టం వచ్చినంతకాలం జీవించగలగడం. సూర్యాది మహాగ్నిగోళాలను చందమామను చూచినట్లు నేత్రాలతో చూడగలగడంవంటి శక్తులు కొన్నైనా వున్నవ్యక్తి ఋషిగానిలుస్తాడు. అతడుఅసలైన కవిగావెలుస్తాడు. "నానృషిఃకురుతేకావ్యం" అన్నవాక్యానికి అంతర్యంయిది. ఋషియైనవాడు కేవలం కళ్లూముక్కూచెవులూ మూసుకొని ఆశ్రమంలోనో-అడవులలోనో యెల్లప్పుడూ కూర్చుంటాడనుకొనడం పొరపాటు. ప్రజలుకష్టాలపాలైనప్పుడు, రాజులు నీతిబాహ్యంగా, న్యాయవిరుద్ధంగా, అధర్మ పరిపాలన కొనసాగించినపుడు మహర్షులు చూస్తూవూరుకోలేరు. న్యాయనిర్ణేతలుగా-ధర్మప్రవక్తలుగా ప్రజాక్షేమం దృష్ట్యా తగుచర్యలు తీసుకొనడంలో రాజులకు సరైనసలహాలిచ్చారు. అవసరమనుకుంటే వారిని ఆజ్ఞాపించారు. ఆజ్ఞా సంబద్ధులను చేశారు. కాదనుకుంటే రాజ్యభ్రష్టుల్ని చేసి ధర్మ పరిపాలకులకు పట్టం కట్టారు. మనప్రాచీన భారత గాథలు చదివితే యిటువంటిసంఘటనలనేకం మనకు కనిపిస్తాయి. అసలైనకవి-ఋషియైనకవి దేశాన్ని పరిపాలితులనేకాదు-పరిపాలకులను కూడా నడిపిస్తాడు. ధర్మం కోసం, నీతి న్యాయంకోసం-సత్యదృష్టితో-సత్యవాక్కుతో కలం ఝుళిపిస్తాడు. వారిని జడిపిస్తాడు. కవిని రాజకీయాలకుదూరంగావుండమనడం కవిలక్షణానికే విరుద్ధం. "విశ్వ శ్రేయః కావ్యం" అన్న మహత్తర శ్రేయస్కరలక్ష్యానికే విరుద్ధం. కాగా మహర్షి కాకపోయినా, ఆర్ష విజ్ఞాన దృష్టితో మహామనీషి కాకపోయినా మాధవ విద్యారణ్య స్వామి కవిగా-పండితుడుగా-రాజనీతిజ్ఞుడుగా-భక్తుడుగా-హిందూసమాజ మతసంస్కృతుల సంరక్షణకు బద్ధకంకణుడై తనబుద్ధిని వినియోగించి విజయనగర సామ్రాజ్య స్థాపనకు మార్గదర్శకుడుగా సురక్షితమైన పునాది వేశాడనే చెప్పవచ్చు.

క్రీ. శ. 1336 మొదలు 1675 వరకూ అవిచ్ఛిన్నంగా వెలుగొందిన హిందువుల మత-విద్యా-సంస్కృతీ జీవితాలను మృతజీవాలుగా కాపాడి పరిపోషించిన సామ్రాజ్యం విజయనగరసామ్రాజ్యం. దీని పరిపాలకులైన సంగమ- సాళువ- తులువ- ఆరవీటి వంశపువారిలో ఆరవీటివంశానికి చెందిన రెండు ప్రాచీన తామ్ర శాసనాలు లభించాయి. శాలివాహనశకం 1498లో అనగా క్రీ. శ. 1576 లో వెంగళాంబా తిరుమల రాయల పుత్రుడైన శ్రీరంగరాయలు శ్రీకాళహస్తిలో వేయించిన దానశాసనం ఒకటి. ఈ శ్రీరంగరాయలకు మూడవతరంవాడైన మరొక శ్రీరంగ రాయలు శాలివాహన శకం 1566లో అనగా క్రీ. శ. 1644లో శ్రీకాళహస్తిలో వేయించిన దానశాసనం వేరొకటి.

## శ్రీ విరూపాక్ష దాన శాసనం

క్రీ. శ. 1576 లో - ఆరవీటి బుక్కరాయల మునిమనుమడైన తిరుమల రాయలకు వెంగళాంబ యందు కలిగిన శ్రీ రంగరాయలు తనరాణి పేరుమీద శ్రీకాళహస్తీశ్వరుని నిత్య నైమిత్తికోత్సవాలకు

జీర్ణోద్ధారమునకు శ్రీకాళహస్తి పట్టణం నలుదిక్కులావున్న 24 గ్రామాలను దానం యిచ్చి వేయించిన శాసనం. ఈ శాసనం చివర "శ్రీ విరూపాక్ష" అని వుండడంవల్ల దీనిని శ్రీ విరూపాక్ష శాసనంగా పేర్కొనడంజరిగింది. అంతేకాదు. యీ శాసనం వేయించడం రూపంగా భూదానం చేసింది శ్రీ కాళహస్తీశ్వరుడైన "శ్రీ విరూపాక్షుని సంసేవార్థమే." ఆయన నిత్యార్చనలకు, ఆలయోద్ధరణలకే. వాస్తవానికి శ్రీకాళహస్తీశ్వరుడు శ్రీకాళహస్తీశ్వరుడే అవుగాక. కాని శ్రీ విరూపాక్షస్వామియే శ్రీకాళహస్తీశ్వరుడుగా వెలిశాడన్న విషయం చారిత్రకులూ, తత్త్వవేత్తలూ గుర్తించవలసి వున్నది. శ్రీకాళహస్తినాథుడు మహేశ్వరుడన్న విషయం, శ్రీ విరూపాక్షపదం త్రినేత్ర శబ్ద పర్యాయపదమన్న విషయం మనం మరచిపోరాదు. శ్రీకాళహస్తీశ్వరాలయం రూపొందడానికి పూర్వం, ఆ స్థలానికి సమీపంలోనే శ్రీ (సాలెపురుగు) - కాళ (సర్పం) - హస్తి (ఏనుగు) లకు నివాసభూతమైన పర్వతం ఒక టుండేది. ఆ పర్వతం పేరు "శ్రీకాళహస్తినగం" లేదా "శ్రీ కాళహస్తి పర్వతం." క్రీ. శ. 1576 లో వేయబడిన శ్రీరంగ రాయల శ్రీ విరూపాక్ష శాసనంలో "సర్వమాన్యంచ శ్రీకాళహస్తినగయా దాసమంతాచ్చ చతర్దిశి। చతురుత్తర బ-తి గ్రామాణి సుబహునితు। శ్రీ కాళహస్తినాథస్య" (15 పేజీ), అని శ్రీ కాళహస్తినగ శబ్దప్రయోగంతో అది తొలుత పర్వత నాయక క్షేత్రమన్న సంగతి స్పష్టపరుచబడింది.

శ్రీకాళహస్తీశ్వరాలయ స్థల పురాణానికి సంబంధించిన ప్రాచీన కథయిది. శ్రీకాళహస్తి క్షేత్రం పూర్వం వశిష్ఠుని ఆశ్రమం. ఇది ఒక అటవీప్రాంతమవడంచేత దీన్ని "గజారణ్యం" అనేవారు. వశిష్ఠుని కుమారులను విశ్వామిత్రుడు చంపగా ఆ ముని పుత్రశోకం భరించలేక అక్కడ వున్న కొండపైకెక్కి క్రిందపడి ప్రాణపరిత్యాగం చేయాలని ప్రయత్నించగా భూమాత అతనిని యెత్తిపట్టి ప్రమాదం లేకుండా కాపాడింది. "ఆత్మహత్యవల్ల దుఃఖంపోదు సరికదా మహాపాపం చుట్టుకుంటుంది. నీవంటి మహాముని ఇటువంటి పనికొడికట్టరాదు. సకలజగన్నాయకుడైన శంకరుణ్ణి సేవిస్తే జన్మ-జరా-వ్యాధి-మరణ-దుఃఖాలు దరిజేరవు." అని ఉపదేశిస్తే వశిష్ఠుడు భూదేవి మాటలను శిరసావహించి, దుఃఖోపశమనం కలిగించుకొని నిశ్చల భక్తితో తపస్సు చేశాడు. శివుడు వశిష్ఠునికి లింగాకారంలో ప్రత్యక్షమై నీ కోరిక యేమని అడుగుతాడు. అప్పుడు వశిష్ఠుడు పరమానందభరితుడై "నాకు బ్రహ్మవిద్యనుపదేశించి ఈ లింగాకారంతోనే అన్ని యుగాలలోను యిక్కడే వుండి భక్తులు చేసే పూజలు గ్రహిస్తూ వారికి ముక్తి నివ్వాలని నా కోరిక" అని ప్రార్థించగా ఆ మహేశ్వరు డంగీకరించి ఆ లింగంలోనుంచి దక్షిణామూర్తి రూపంలో వెలువడి వశిష్ఠునికి జ్ఞానోపదేశంచేసి అంతర్ధానమయ్యాడు. ఆ లింగం మాత్రం అక్కడే వుండగా దానికి వశిష్ఠుడు "అమృత లింగం" అని పేరు పెట్టాడు. మహేశ్వరుడు వశిష్ఠాశ్రమంలో వున్న సంగతి పార్వతి గ్రహించి, తాను కూడా వచ్చి గజారణ్యంలోని అమృతలింగ సన్నిధానంలో ఆవిర్భవించింది. ఈ విషయాన్ని గుర్తించిన వశిష్ఠుడు అమ్మవారికి 'జ్ఞానప్రసూనాంబ' అని పేరు పెట్టాడు. ఇది దక్షిణ కైలాసంగా ప్రసిద్ధి పొందింది. అనంతరం కైలాసమేరు పర్వతములు కలిసివచ్చి వశిష్ఠాశ్రమంలో వున్న పార్వతీపరమేశ్వరులకు క్రీడాపర్వతాలుగా వెలశాయి. కొంతకాలానికి అగస్త్య మహర్షి వచ్చి ఇక్కడ నది లేనివిషయం గుర్తించి తపస్సుచేసి శివుని అనుగ్రహంతో ఆకాశగంగను తెచ్చాడు. సువర్ణచ్ఛాయతో మిలమిలలాడే యీ నదికి "సువర్ణముఖరీ" — "సువర్ణముఖి" నామాలు యేర్పడ్డాయి. కొంతకాలం

తరువాత సమీపంలోనే వున్న నారాయణ పురాధీశ్వరుడైన యాదవరాజు అమృత లింగానికి - జ్ఞానప్రసూనాంబికకు ఆలయాలు కట్టించాడు. అనంతరం కొంతకాలానికి ఒక సాలెపురుగు, ఒక కృష్ణసర్పం, ఒక హస్తి, ఆ అమృత లింగాన్ని సేవించి తుదకు అందులో సాయుజ్యమొందాయి. ఆ మూడు ప్రాణుల సంస్కృత శబ్దాల రూపంగా శ్రీకాళహస్తి సమాసనామం యేర్పడింది. తుదికి ఆ లింగమే శ్రీకాళహస్తీశ్వరలింగమైంది.

ఈ కథను కేవలం స్థల పురాణంగా, ఒకానొక పుక్కిటి కథగా పరిగణించి మనం త్రోసిరాజనవచ్చు. వశిష్ఠుడు వున్నా లేకపోయినా, అతని ఆత్మహత్యా ప్రయత్నానికి మూలమైన ఈ కథ నిజమైనా కాకపోయినా, ఇక్కడ పర్వతంవున్నమాట వాస్తవమే! ఎన్నెన్నో శతాబ్దాల తరబడిగా శ్రీ కాళహస్తి నామం చెక్కు చెదరని, శిథిలంకాని శిలాక్షరాలవలె నిలచివున్న ఆ సువర్ణాక్షరాలకు మూలం యేమని చెప్పగలం. ఆ మూడు ప్రాణులకూ సంబంధించిన కథను యేకొంతైనా వాస్తవమని మనం ఆమోదించక తప్పదేమో. ప్రాచీన కథలో పర్వత ప్రసక్తి వుండడం, శ్రీ విరూపాక్షశాసనంలో "శ్రీకాళహస్తినగ" శబ్దాన్ని ప్రయోగించడం చూడగా శ్రీ కాళహస్తీశ్వరుడు తొలుత శ్రీ కాళహస్తీశ్వరుడుకాడని శ్రీ కాళహస్తి నగేశ్వరుడని మనకు స్పష్టపడుతున్నది. మహేశ్వరుడు శ్రీకాళహస్తులకు ప్రభువై శ్రీకాళహస్తీశ్వరుడుగా వెలుగొందడంలో తప్పులేదు. కాని ఈ మహేశ్వరుడే తొలుత నగేశ్వరుడన్న సంగతి పర్వతంపైనో సమీపంలోనో ఆవిర్భవించినాడన్న సంగతి మనం మరచిపోరాదు. శ్రీకాళహస్తీశ్వరుడుగా వెలుగొందడంకంటే ముందే శ్రీకాళహస్తులకు నిత్యసంచారస్థలమైన ఆ పర్వతానికి ఈశ్వరుడుగా ఆవిర్భవించాడన్న సంగతి మనం గుర్తించాలి. మహేశ్వరుడు త్రినేత్రుడుగా విరూపాక్షుడవ్వడంలో విడ్డూరమేమీలేదు. ఈ విరూపాక్షుని సంసేవ నిమిత్తమై వేయబడిన ఈ దానశాసనం చివర "శ్రీ విరూపాక్ష" అని వుంచడం సమంజసమే!

# శ్రీరామ దానశాసనం

క్రీ. శ. 1644 లో పినవేంకటరాయల కుమారుడైన శ్రీరంగరాయలు శ్రీరామశాసనం - శ్రీకాళహస్తీశ్వరస్వామికి మధ్యాహ్నం వేళ అభిషేక నైవేద్యాలు చేసి ఛత్రం సాగించి, శుక్రవారం అమ్మవారికి సమారాధన చేసే నిమిత్తం గ్రామదానం యిస్తూ వ్రాయించి వేయించాడు. ఈ శాసనం చివర "శ్రీరామ" అని వ్రాయబడి వున్నది. అందువల్ల యీ శాసనాన్ని శ్రీరామ శాసనంగా వ్యవహరించడం జరిగింది. అసలీ దానం శ్రీరంగరాయలు తనకై తాను చెయ్యాలని చేసిందికాదు. శ్రీరామభక్తుడైన దామెర్ల వేంకటరాయల విజ్ఞప్తినసనుసరించి హిరణ్య పయోధారాపూర్వకంగా శ్రీరంగరాయలు యీ దానంచేశాడు. శ్రీరామభక్తుడైన వ్యక్తి ప్రేరేపణతో యీ దానం చెయ్యడం జరిగింది కాబట్టి ఈ దానశాసనం చివర "శ్రీరామ" అని పేర్కొనడం జరిగింది. ఈ శ్రీరామశాసనం కూడా శ్రీ కాళహస్తీశ్వరుని సంసేవార్థమై వేయబడిందేకాని శ్రీరామ సంసేవార్థం కాదు.

అయితే శ్రీవిరూపాక్షశాసనం విషయంలో ఒక ప్రత్యేకతను మనంగుర్తించవలసి వున్నది. శ్రీరంగరాయలు తన రాణి పేరుమీద పెక్కు గ్రామాలు దానం చేసింది శ్రీ విరూపాక్ష స్వరూపుడైన

కాళహస్తీశ్వరునికే అయినా ఆదానం శ్రీ కాళహస్తీశ్వర సన్నిధిలో జరుగలేదు. పైగా ఆ దరిదాపులోనే వున్న శ్రీరామాలయంలో శ్రీరాముడు సాక్షిగా దానంచేసినట్లు స్పష్టపడుతున్నది. "సన్నిధౌరామచంద్రస్య సర్వసంపద్విధాయని" అని (చూడు 13 వ పుట 12 పంక్తి) శాసనంలో స్పష్టంగా పేర్కొనబడింది. దానం జరిగింది శ్రీరాముని సన్నిధిలోనే అయినా ఆ దానం ఉద్దిష్టమైనది మహేశ్వరరూపుడైన శ్రీవిరూపాక్షునికి కాబట్టి శాసనం చివర "శ్రీవిరూపాక్ష" అని ఉల్లేఖించడం జరిగిందని స్పష్టమవుతున్నది.

విజయనగర సామ్రాజ్యంలో వెలసిన శాసనాలచివర "శ్రీవిరూపాక్ష" అని ఉండడాన్ని గురించి కొందరు పరిశోధకులు వేరొకవిధంగా భావించారు.

— "విజయనగర సామ్రాజ్య చరిత్రను పఠించేవారు యెల్లప్పుడూ జ్ఞప్తియందుంచు కొనవలసిన విషయం ఒకటున్నది. సామ్రాజ్యానికి వాస్తవమైన అధిపతి పంపావిరూపాక్షస్వామి. అది ఆదేవుని సొమ్ము. హరిహరాదిరాయ పేరస్తులందరూ ఆ దేవుని పేర దేవాలయ భూములను పాలించు ప్రారుపత్య పొందుదేవుని కార్యాలను నిర్వహించే సేవకులు కాబట్టే రాజశాసనాలు, ధర్మశాసనాలు రాయల సంతకంతో కాక శ్రీవిరూపాక్షస్వామివారి సంతకంతో ప్రకటింపబడుతూ వచ్చాయి. రాయలు చేసిన దానధర్మాలన్నీ శ్రీవిరూపాక్షసాామి సన్నిధానంలోనే జరుగుతూవచ్చాయి. నూతన రాజధానియైన విద్యానగరం విరూపాక్ష స్వామివారి కోవెలకు సమీపంలో నిర్మించబడింది." — అని కొందరు భావిస్తారు. శాసనాల చివర "శ్రీవిరూపాక్ష" అని వున్నంతమాత్రంచేత దానిని మనం సంతకంగా భావించనక్కరలేదు. విజయనగరంలో చేసిన దానధర్మాలు శ్రీవిరూపాక్షస్వామిసన్నిధిలో జరిగితే జరిగి వుండవచ్చును గాని, శ్రీకృష్ణదేవరాయలుగాని, తదితర విజయనగర సామ్రాజ్య పరిపాలకులుగాని, తాముచేసిన దానధర్మాలన్నీ శ్రీవిరూపాక్షస్వామి సన్నిధిలోనే చేశారనడం సత్యసమ్మతం కాదు. తిరుపతి-కంచి-కాళహస్తి-కుంభకోణం-తంజావూరు-రామేశ్వరం-మధుర-గోకర్ణం-శ్రీరంగం-శ్రీశైలం-అమరావతి-శ్రీకాకుళం-బెజవాడ-రాజమహేంద్రవరం-సింహాచలం-శ్రీకూర్మం-శ్రీజగన్నాథం మొదలైన ప్రధానపుణ్యక్షేత్రాలను దర్శించి యేర్పరచిన వసతులు చేసిన దానాలు అనేకం వున్నాయి. వీటన్నింటినీ హంపీ విరూపాక్షస్వామి సన్నిధిలోనే చేశాడంటే యెంత అపహాస్యంగా వుంటుంది! రాయలపూర్వ దిగ్విజయ యాత్రను తెలిపే శాసనాలనేకం వున్నాయి. వీటిలో తిరుపతి-అమరేశ్వరం-సింహాచలం-అహోబిలం మొదలైన చోట్ల యెన్నో దానధర్మాలుచేసి ధర్మశాసనాలు వేయించాడు. ఇవన్నీ కూడా హంపీవిరూపాక్ష స్వామి సన్నిధిలో జరిగినవే అనుకోవడం పొరపాటేకాగలదు. ఇదేవిధంగా రాయలుగాని తదితరులుగాని అనేక దేవాలయాలలో మహాభక్తిప్రపత్తులతో చేసినపూజలు, తద్రూపాలైన కానుకలు, దానధర్మాలు శ్రీవిరూపాక్ష స్వామిపేరు మీదనే జరిగాయనడం సముచితంగా కనపడదు. అయితే విజయనగర రాజులు తమసామ్రాజ్యానికి అసలైన అధిపతిగా పంపా విరూపాక్ష స్వామినే భావించి ఈరాజ్యమంతా ఆదేవదేవుని సొత్తే, అనివారు భావించారన్నా, అంతటిభక్తి వారికున్నదన్నా వచ్చే చిక్కేమీలేదు. రాజులు కావించిన పూజాదికాలను, తద్రూపాలైన దానధర్మాలను, ఆ విరూపాక్షస్వామి చేసేవే అనిభావించేటంతటి అజ్ఞానులు వారుకారు. అందువల్ల శాసనం ముగింపులో "శ్రీవిరూపాక్ష" అనో "శ్రీరామ" అనోవున్నంత మాత్రం చేత మనం వాటికి విపరీతార్థాలు తీయరాదు. పూర్వం యేదివ్రాయాలని మొదలు పెట్టబోయినా "ఓం" అనిగాని

"శ్రీరాములు" అనిగాని మొట్టమొదట వ్రాసే అలవాటున్నట్లు వ్రాయవలసిందంతా వ్రాసినతరువాత చిట్ట చివర "మంగళమ్ మహత్" అనిగాని, "ఓం తత్ సత్" అనిగాని, "స్వస్తి" అనిగాని, "శ్రీ శ్రీ శ్రీ" అనిగాని వ్రాసిముగించేపద్ధతులున్నాయి. ఇదేపద్ధతిలో తమయిష్ట దైవనామాన్ని శాసనాల చివర ఉల్లేఖింప చెయ్యడం ఒక పరిపాటివంటిదని మనం భావించవచ్చు.

శ్రీరంగరాయల ఆజ్ఞవల్ల ఈ శ్రీవిరూపాక్ష శాసన కవితను సభాపతి కుమారుడు రచించినట్లు యీక్రింది శ్లోకంలో పేర్కొనబడింది.

శ్రీరంగరాయ నృపతే శ్శాసన స్తామ్ర శాసన శ్లోకాన్।
కవి శాసన స్స్వయం భూస్సరస మభాణీ త్సభాపతే స్సూనుః॥ (17 వ పుట- 73 శ్లో.)

ఈ కవి గురించి యింతకు మించి వివరాలు లేవు. శ్రీరంగరాయల ఆజ్ఞవల్ల వీరన కుమారుడైన గణప యాచార్యుడు యీ తామ్ర శాసనంవ్రాశాడు. ఈవిషయం యీ క్రింది శ్లోకంలో స్పష్టపరచబడింది.

శ్రీరంగ రాయ భూపాల శాసనా ద్వీరణాత్మజః।
శ్రీమద్గణపయాచార్యో వ్యలిఖత్తామ్ర శాసనమ్ ॥ (17 వ పుట - 74 శ్లో.)

సంస్కృత భాషలో దేవనాగరి లిపిలో వున్న యీ శాసనం మొత్తం అయిదు తామ్ర ఫలకాలలో వున్నది. వీనిలో తొలిఫలకం రెండవప్రక్క శాసనం ప్రారంభించబడింది. 5 వ ఫలకం ముందుభాగంలో శాసనం ముగించబడింది. కాగా 5 వ ఫలకం వెనుకభాగం ఖాళీగా ఉన్నది. 2-3-4 ఫలకాలకు రెండు ప్రక్కలా శాసనం చెక్కబడింది, 1-5 ఫలకాలకు ఒకవైపునే చెక్కబడిందన్నమాట. వేరొకటి అన్ని ఫలకాలనూ కలిపి కట్టడానికి వీలైన ముద్రికాసహితమైన (శీలు) కడియం ఒకటి ఉన్నది.

ఈ ఫలకాలలో చెక్కబడిన పంక్తుల వివరాలు యీ క్రింద యివ్వబడుతున్నాయి.

1 వ ఫలకం వెనుకప్రక్క — 22 పంక్తులు
2 వ ఫలకం ముందుభాగం — 23 పంక్తులు
2 వ ఫలకం వెనుకప్రక్క — 24 పంక్తులు
3 వ ఫలకం ముందుప్రక్క — 23 పంక్తులు
3 వ ఫలకం వెనుకప్రక్క — 23 పంక్తులు
4 వ ఫలకం ముందుప్రక్క — 24 పంక్తులు
4 వ ఫలకం వెనుకప్రక్క — 20 పంక్తులు
5 వ ఫలకం ముందుభాగం — 13 పంక్తులు

మొత్తం 172 పంక్తులలో యీ శాసనం చెక్కబడింది.

పినవేంకటరాయల కుమారుడైన శ్రీరంగరాయల ఆజ్ఞవల్ల శ్రీరామశాసనంలోని కవితను సభాపతి మనుమడూ, కామకోటి కుమారుడూ అయిన రామకవి రచియించాడు. ఈ విషయం యీక్రింది శ్లోకంలో ఉటంకించబడింది.

వీర శ్రీరంగ రాయోక్త్యా పాపాపౌత్రః సభాపతిః ।
కామకోటి సుతో రామకవి శాసన వాఙ్మయమ్ ॥ (61 వ పేజి - 50 వ శ్లో.)

ఈ శ్రీరామ శాసనాన్ని శ్రీరంగరాయల ఆజ్ఞవల్ల గణపయ్య మనుమడూ, కామయ్య కుమారుడూ అయిన సోమనాథయ్య తామ్ర ఫలకాలపై వ్రాశాడు.

వీర శ్రీరంగరాయ క్ష్మాపతి దేశేన సోమనాథార్యః।
శాసన మలిఖ త్కామయ తనయః శ్రీగణపార్య పౌత్రమణిః॥ (61 వ పేజి - 51 వ శ్లో.)

అన్న శ్లోకంలో యీవిషయం స్పష్టపరచబడింది. సంస్కృత భాషలో దేవనాగరి లిపిలో వున్న యీ శాసనం మొత్తం తామ్రఫలకాలలో వున్నది. వీనిలో 5 శాసన ఫలకాలు వేరొకటి అన్ని ఫలకాలనూ కలిపి కట్టడానికి వీలైన ముద్రికా సహితమైన (శీలు) కడియం ఒకటి. ఈ శాసనంలో కూడా తొలి-తుది ఫలకాలకు ఒకే వైపున మిగతావాటికి రెండువైపులా శాసనం చెక్కబడింది.

ఈ ఫలకాలలో చెక్కబడిన పంక్తుల వివరాలు యీ క్రింద యివ్వబడుతున్నాయి.

1 వ ఫలకం వెనుకప్రక్క — 19 పంక్తులు
2 వ ఫలకం ముందుప్రక్క — 19 పంక్తులు
2 వ ఫలకం వెనుకప్రక్క — 19 పంక్తులు
3 వ ఫలకం ముందుప్రక్క — 20 పంక్తులు
3 వ ఫలకం వెనుకప్రక్క — 21 పంక్తులు
4 వ ఫలకం ముందుప్రక్క — 20 పంక్తులు
4 వ ఫలకం వెనుకప్రక్క — 21 పంక్తులు
5 వ ఫలకం ముందుప్రక్క — 14 పంక్తులు

మొత్తం 153 పంక్తులలో యీశాసనం చెక్కబడింది.

శ్రీ విరూపాక్షశాసనం క్రీ.శ. 1576 లోను శ్రీరామ శాసనం క్రీ. శ. 1644 లోను వేయబడడం వల్ల, ఈ రెండు శాసనాల మధ్య 68 సంవత్సరాల వ్యవధి మాత్రమే వున్నప్పటికీ, ఈ రెండింటిలోను ఆరవీటి బుక్కరాయల వంశం పూర్వాపరాలుగా అనుస్యూతంగా - అవిచ్ఛిన్నంగా పేర్కొనబడినందువల్ల దాదాపు వంద సంవత్సరాలకు పైబడి ఒక వంశంలోని వివిధతరాలు క్రమానుగతంగా సాధికారంగా లభించాయి. ఇంతవరకు చారిత్రకులు ఆరవీటి బుక్కరాయల వంశాన్ని గురించి ద్విపద బాలభాగవతం, వసుచరిత్ర, సుదక్షిణా పరిణయం, సాంబోపాఖ్యానం, కళాపూర్ణోదయం వంటి కావ్యాలలోని చారిత్రకాంశాలపైనే ఆధారపడి అత్యధికంగా వ్రాస్తూవచ్చారు. చారిత్రకులు పేర్కొన్న అనేక వంశవృక్షాలలో రకరకాల పొరపాట్లేగాక చారిత్రకాలైన అంశాలుసైతం కొన్ని వెనుకముందులుగా తారుమారైనవి కూడా లేకపోలేదు.

ప్రస్తుతం ఉపలభ్య మానాలైన శ్రీ విరూపాక్ష-శ్రీరామ శాసనాలవల్ల మనకు లభించిన వంశవృక్షాలు విడివిడిగా ఇవ్వబడుతున్నాయి.

శాలివాహనశకం 1498 లో అనగా క్రీ.శ. 1576 లో వెంగళాంబా తిరుమలరాయల కుమారుడైన శ్రీరంగరాయలు శ్రీకాళహస్తిలో వేయించిన శాసనంలో వర్ణించబడినదాని ప్రకారం క్షీరసముద్రం మొదలు తాతపిన్నమరాజు వరకూ వున్న వంశీకులు యీ క్రింది విధంగా వున్నారు.

(శ్రీ విరూపాక్షశాసనంలో)

క్షీరసముద్రం
|
చంద్రుడు
|
బుధుడు
|
పురూరవుడు
|
ఆయువు
|
నహుషుడు
|
యయాతి
|
పూరుడు

పూరు వంశంలో భరతుడు. భరతుని సంతతిలో
శంతనుడు. శంతనుని తరువాత 4 వ వాడు
అర్జునుడు
|
అభిమన్యుడు
|
పరీక్షిత్తు

ఈ పరీక్షిత్తుకు 8వ వాడు నందుడు. నందునికి 9వ వాడు చాళుక్యరాజు.
ఈ చాళుక్యరాజుకు 7వ వాడు రాజరాజనరేంద్రుడు.
రాజరాజనరేంద్రునికి 10వ వాడు బిజ్జలుడు.
బిజ్జలునికి 3వ వాడు
వీరహంమాలిరాయడు
|
మాయాపురీశ్వరుడు
మాయాపురీశ్వరునికి 4 వ వాడు
తాత పిన్నమరాజు.

శాలివాహనశకం 1498 లో అనగా క్రీ. శ. 1576 లో వెంగళాంబా తిరుమలరాయల కుమారుడైన శ్రీరంగరాయలు శ్రీకాళహస్తిలో వేయించిన శాసనంలో వర్ణించబడినదానిప్రకారం తాతపిన్నమరాజు మొదలుగా వున్న వంశవృక్షం యీ క్రింద పేర్కొనబడుతున్నది.




వెంగళాంబా తిరుమలరాయల కుమారుడైన యీ శ్రీరంగరాయలు శాలివాహన శకం 1498లో (క్రీ. శ. 1576) శ్రీకాళహస్తిలో శ్రీవిరూపాక్ష శాసనం వేయించాడు.

---

≠ ఇతనికి పెక్కుమంది భార్యలున్నారు.

పినవెంకటరాయల కుమారుడు గోపాలరాయల దత్తపుత్రుడు అయిన శ్రీరంగరాయలు శాలివాహనశకం 1566 లో అనగా-క్రీస్తుశకం 1644 లో శ్రీకాళహస్తిలో వేయించిన శ్రీరామ శాసనంలో వర్ణించబడినదాని ప్రకారం క్షీరసముద్రమాదిగా తాతపిన్నమరాజువరకూ ఉన్న వంశవృక్షం యిది.



పిన వెంకటరాయల కుమారుడు గోపాలరాయల దత్తపుత్రుడు అయిన శ్రీ రంగరాయలు శాలివాహనశకం 1566 లో—అనగా క్రీస్తుశకం 1644 లో—శ్రీ కాళహస్తిలో వేయించిన తామ్ర శాసనంలో వర్ణించబడిన దానిప్రకారం తాత పిన్నమరాజు మొదలుగా ఉన్న వంశ వృక్షం యీ క్రింద పేర్కొనబడుతున్నది.




పిన వెంకటరాయల కుమారుడు, గోపాలరాయల దత్తపుత్రుడు అయిన శ్రీ రంగరాయలు శాలివాహనశకం 1566 లో అనగా క్రీస్తు శకం 1644 లో శ్రీ కాళహస్తిలో శ్రీ రామ శాసనం వేయించాడు.

---

* శ్రీ విరూపాక్ష శాసనం వేయించిన శ్రీ రంగరాయ లీతడే.

+ ఇతనికి అనేకమంది విద్యావంతులైన పుత్రులున్నట్లు పేర్కొనబడింది.

**S.** పిన వెంకటరాయల కుమారుడూ, (అళియ) రామరాయల మునిమనమడూ అయిన శ్రీ రంగరాయలును ఇతడు దత్తత చేసుకున్నాడు. ± (అళియ) రామరాయల చిన్నతమ్ముడైన వెంకటాద్రికి మనుమడు, శ్రీ రంగరాయల పుత్రుడు అయిన గోపాలరాయలకు యితడు దత్తపుత్రుడు. ఈతడే శ్రీ రామశాసనం వేయించినాడు. **Z.** గోపాలరాయల దత్తపుత్రుడీతడే.

పెక్కుమంది చరిత్ర పరిశోధకులు—విమర్శకులు — కొన్ని శాసనాలు ఆధారంగా — వివిధ కావ్యావతారికలాధారంగా యిచ్చిన — అరవీటి బుక్కరాయల వంశవృక్షానికి చెందిన శాఖోపశాఖలు — విభిన్నాలైన వివిధ పట్టికలుగా యిక్కడ యీయబడుతున్నాయి—

## A

దోనేరు కోనేరు కవి విరచిత ద్విపద బాలభాగవతం
అవతారిక ననుసరించి చారిత్రకులిచ్చిన వంశ వృక్షం




1. ఈ నరసింగరాజు నంద్యాల వంశానికి మూలపురుషుడు.
2. పద్య బాల భాగవతకృతిపతి.
3. ఈ తిరుమలరాజు తన తండ్రి పేర పద్య బాలభాగవతం—తమ్ముడైన చిన తిమ్మరాజు పేర ద్విపద బాలభాగవతం అంకితం యిప్పించాడు.
4. ద్విపద బాల భాగవత కృతిపతి.

## B

### తెనాలి అన్నమయ్య రచించిన సుదక్షిణాపరిణయ కావ్యావతారిక ననుసరించి చారిత్రకులిచ్చిన వంశ వృక్షం.




1. ఇతనికి పెక్కుమంది భార్యలు కలరు. ఈ భార్యల సంతాన విషయం, 'సాంబోపాఖ్యానం'లో చూడవచ్చు.

C

రామరాజభూషణుని వసుచరిత్ర అవతారిక
ననుసరించి చారిత్రకులిచ్చిన వంశ వృక్షం.



## D

అందుగుల వెంకయ్య రచియించిన
నరపతి విజయం (రామరాజీయం) ప్రకారం
(అళియ) రామరాయల వంశంగా
చిలుకూరి వీరభద్రరావుగారు
† ఈ క్రిందివిధంగా పేర్కొన్నారు.




† చూడు. అళియ రామరాయలు. 54 పుట.

# E

## అందుగుల వెంకయ్య రచియించిన

## నరపతి విజయం (రామరాజీయం) ప్రకారం అని
## హిరాసుఫాదరీ పేర్కొన్న (అళియ) రామరాయల వంశం.

(అరవీటి) బుక్కరాజు

రామరాజు
(అక్కమాంబ)




శ్రీరంగ (రాజు) పుత్రుడై సదాశివరాయలకు తోడ్పడిన రామరాజే అళియరామరాయలనబడినాడని ఇతని పూర్వవంశం పైవిధంగా ఉన్నదని హిరాసుఫాదరీ యీ క్రింది విధంగా పేర్కొన్నారు.

"According to the poem mentioned above he had five sons, Sri Ranga, Channa, Venkatapati, Timma or Tirumala(who distingvished himself in the service of Krishna Devaraya), and lastly Venkata-Pati. Of these the first, Sri Ranga became the father of Ramaraya, the regent Sadasivaraya." (The Aravidu dynasty of Vijianagara P. 19.)

## F

అందుగుల వెంకయ్య రచించిన నరపతి విజయం (రామరాజీయం) ప్రకారం—
ఆరవీటి బుక్కరాజు మనుమడైన శ్రీరంగరాజు వంశ వృక్షం యీ క్రింద యీయబడుతున్నది.

- (ఆరవీటి) బుక్కరాజు (భార్య—బల్లాదేవి)
  - రామరాజు
    - తిమ్మరాజు (అవుకు దుర్గ పరిపాలకుడు)
    - కొండరాజు (ఆదవేని దుర్గ పరిపాలకుడు)
    - శ్రీరంగరాజు (కందనోలు (కర్నూలు) పరిపాలకుడు)
      - కోనరాజు
      - తిమ్మరాజు
      - అళియ రామరాజు (కృష్ణదేవరాయల అల్లుడు)
        - శ్రీకృష్ణరాజు
        - పెదతిమ్మరాజు
        - కొండరాజు
          - రామరాజు
        - చినతిమ్మరాజు
        - శ్రీరంగరాజు
          - పెదవెంకటరాజు
          - చినవెంకటరాజు
            - తిరుమలరాజు
            - వెంకటరాజు
              - కోదండ రామరాజు (భార్య నాంచారమ్మ) (ఇతడే నరపతి విజయకృతిభర్త)
                - పెదవెంకటరాజు
                - చినవెంకటరాజు (శ్రీకృష్ణరాయ విజయకృతి ప్రేరకుడు)
                - కోదండరామరాజు
                - వెంకటరాజు
              - తిమ్మరాజు
                - శ్రీరంగరాజు
                - చినవెంకటరాజు
              - వెంకటరాజు
            - శ్రీరంగరాజు
      - తిరుమలరాయలు † (వసుచరిత్ర కృతిపతి)
      - వెంకటాద్రిరాజు

† ఇతనిని తిమ్మరాజుగా యెరతిమ్మరాజుగా కవులు వ్యవహరించారు.

G

అందుగుల వెంకయ్య రచించిన నరపతి విజయం (రామరాజీయం) ప్రకారం అళియ రామరాయల తమ్ముడైన తిరుమలరాయల వంశవృక్షం యీ విధంగా ఉన్నది.



# H

## పింగళి సూరన రచించిన కళాపూర్ణోదయావతారిక ననుసరించి చారిత్రకులిచ్చిన వంశవృక్షం



# J

F. P. Rep. 1915 Para 50 ; EP. COLL. 191 of 1914.

ఈ శాసనంలో విఠలుని వంశ వృక్షం యీ క్రింది రీతిని తెలుపబడింది.




పెద తిరుమలరాయల కుమారులూ, రామరాజు పౌత్రులూ అయిన విఠలరాజు—చిన తిమ్మరాజులు యిద్దరూ అళియ రామరాయల ఆజ్ఞపై—(తిరుచినాపల్లి—తిరు....—తిరువాన్కూరు — మధుర—తంజావూరు శాసనాల ప్రకారం) సామంతులతో యుద్ధంచేసి ఆయనకు వారిని లోబరచినట్లు స్పష్టపడుతున్నది.

# K

కె. వి. లక్ష్మణరావుగారు రచించిన హిందూదేశ కథాసంగ్రహము - ద్వితీయభాగము - మహమ్మదీయ మహాయుగములో వర్ణించబడిన దానిప్రకారం యేర్పడిన వంశవృక్షం.




† ఇతనికి నలుగురు భార్యలు.
1. తిరుమలాంబ (రాయల పుత్రిక)
2. అప్పలాంబ
3. కొండమ్మ
4. లక్ష్మమ్మ.

# L

సంగ్రహాంధ్ర విజ్ఞాన కోశము - 1వ. సంపుటిలో (472. పుట) ఆరవీటి వంశ వృక్షం యీ క్రింది విధంగా పేర్కొనబడింది.



# M

ద్విపద బాలభాగవతం ప్రకారం అని
ఆంధ్రకవులచరిత్రలో కందుకూరి వీరేశలింగంగారు పేర్కొన్న
(ఆరవీటి) బుక్కరాయల సంతతి.




ఈ వంశవృక్షంసరైనది కాదు.

# వంశ ప్రారంభం

శ్రీవిరూపాక్ష-శ్రీరామ శాసనాలు రెండింటిలోనూ ఈ యిద్దరు శ్రీరంగరాయ నామధారులు చంద్రవంశపు రాజులుగా పేర్కొనబడ్డారు. అందువల్ల వేదపురాణాది గ్రంథాల విషయాలపై విశ్వాసముంచి చంద్రోద్భవాదిగా వంశాభివర్ణనం చేయడం జరిగింది. కాగా "జయతిక్షీర జలధేర్ జాతం సవ్యేక్షణం హరేః" అని శ్రీవిరూపాక్ష శాసనంలోను (చూడు 3 పుట. 5 శ్లో) ఇదేశ్లోకాన్ని పునశ్చరణం చేయడం ద్వారా శ్రీరామ శాసనంలోను (చూడు 47 పుట. 4 శ్లో) క్షీరసముద్రం ఆదిగా చంద్రవంశం ప్రారంభించబడింది. అయితే యీ రెండు శాసనాల్లోను, ఈ శ్రీరంగరాయనామధారులు ఆత్రేయ గోత్రంలో గొప్పవారుగా పేర్కొనబడ్డారు.

ఆత్రేయ గోత్రజానామగ్రసరో భూభుజాముదార యశాః
అతిబిరుద తురగఘట్టో మతిగురు రారట్ట మగధమాన్య పదః ॥

(శ్రీవిరూపాక్ష శాసనం. 11 పుట. 43 శ్లో.)

ఆత్రేయ గోత్రజానా మగ్ర సరోభూభుజాముదార యశాః
అరిభ గండ భేరుండో హరిభక్తి సుధా నిధిః ॥

(శ్రీరామ శాసనం. 57 పుట. 41 శ్లో.)

ఆర్షవిజ్ఞానం ప్రకారం వంశాది పురుష చిహ్నంగా గోత్రాలు యేర్పడ్డాయి. వాస్తవికదృష్టితోను, పరిశీలనా దృష్టితోను లోతులలోకి చూచినపుడు భిన్నవిభిన్న గోత్రత్వాలకు శాశ్వత పీఠాలేర్పరచడం గాలి మేడలు కట్టడం వంటిదికాగలదు. ఈ మహా సృష్టిలో యెవరు ఆది? ఎవరి గోత్రం మొదటిది? అని ప్రశ్నించుకుంటే, సత్యసమ్మతమై, సంతృప్తికరమైన సమాధానం మనకు లభించనేరదు. గతంలోనేను పేర్కొన్నట్లు అవాస్తవికమై లోకంలో పాతుకొనివున్న వర్ణవ్యవస్థ పూర్తిగా నిరాధారమైనది. కృత్రిమంగా కల్పితమైనది. బ్రహ్మక్షత్రియాది లౌకిక వర్ణాలకు అసలు స్థానమేలేనప్పుడు సూర్యవంశపు క్షత్రియులు, చంద్రవంశపు క్షత్రియులు, అన్న భేదాలకు ఆస్కారమేలేదు గదా! అసలు పురమేలేనపుడు అంతఃపురానికి చోటెక్కడ? లోగడ నేను పేర్కొన్నట్లు యీమహాసృష్టి వ్యవస్థలో అతిచారం యెప్పుడు యెక్కడ యేవిధంగా జరిగిందో చెప్పలేముగదా! మనం చంద్రవంశపురాజులన్న శాఖగా అవతరించిన చంద్రాదివంశాన్నే పరిశీలించుదాం. చంద్రుని పుత్రుడు బుధుడు. ఈ బుధుడు చంద్రునికి పుత్రుడేగాని బృహస్పతి భార్యయైన తారకు అతిచారం వల్ల కలిగాడు. చంద్రుని క్షత్రియునిగా, బృహస్పతి భార్యను బ్రాహ్మణస్త్రీగా మనం భావించినపుడు బుధుడు క్షత్రియ బ్రహ్మణ సాంకర్యంవల్ల సంజనితుడయ్యాడని మనకు స్పష్టపడుతుంది. అసలు చంద్రుడు క్షత్రియుడా? ఎటువంటి క్షత్రియుడన్నది వేరుమాట. ఏమైనా సాంకర్యమన్నది సృష్టి ఆదినుంచీ వున్నట్లు చెప్పడానికి యెన్నెన్నో పురాణగాథలు ప్రామాణికాలై నిలుస్తాయి. కవిరాజశిఖామణి నన్నెచోడుడు తన కుమారసంభవ కావ్యంలో చంద్రవంశపు రాజులు సరైన రాజులు కారనీ, అది తొలుతనే సాంకర్యం చెందిందనీ హేళనా భావంతో ఉన్నట్లు కనిపిస్తున్నది.

ఈ క్రింది పద్యాలలో శ్లేషలతో

"రవిపదాహతిఁ జెందియుండు రాజువోలె" (కుమా-8 ఆశ్వా. 117 ప)

"కులజుఁడై విక్రమ బలవంతుఁడగు రాజుఁ

బడసిన దేశంబు ప్రజయుఁబోలె (కుమా-10వ ఆశ్వా. 115ప)

అని చంద్రవంశపు రాజులను చులకనగా చూచినట్లు స్పష్టపడుతున్నది. తాను సూర్యవంశపు క్షత్రియుడనన్న అహంకారంతో దూరదృష్టిలేక, తార్కిక బుద్ధిలేక నన్నెచోడుడు యీ భావాన్ని వ్యక్తీకరించాడే గాని సూర్యవంశం మాత్రం సరైనదేనని యెట్లా చెప్పగలం! సూర్యుని భార్య సంజ్ఞ. ఈ సంజ్ఞకు వైవస్వతాదిపుత్రులు కలిగినా సూర్యుని తేజస్సుకు తట్టుకొనలేక తాను తప్పుకొని, తన ఛాయా స్వరూపిణిని సూర్యునివద్ద విడిచి తాను దూరతీరాలకు వెళ్లలేదా! ఈ ఛాయా సంతానమైన శని ప్రభృతులు సూర్యవంశపు క్షత్రియులా? కారా? వశిష్ఠుడు గొప్ప మహార్షి. అగస్త్యుడు మరింత గొప్ప మహర్షి. వీరిని బ్రహ్మర్షులుగా పరిగణించి బ్రహ్మజ్ఞానులైన బ్రాహ్మణులుగా గుర్తించడంలో యెవరికీ అభ్యంతర ముండదు. అయితే ఉత్తర రామాయణం కథనం ప్రకారం వీరిజన్మ విశిష్టమైనది. ఊర్వశిని సూర్యుడు చూడగా అతనికి రేతః పతనమైందట! ఆ రేతస్సును ఊర్వశి ఒక కుండలో భద్రపరచింది. వెంటనే ఆ ఊర్వశినే వరుణుడు చూడగా అతనికికూడా రేతఃపతనమైందట! ఈ వరుణ రేతస్సును సైతం అదేకుండలో భద్రపరచింది ఊర్వశి. ఈ కుంభంలో భద్రపరుచబడిన రేతస్సులనుంచే వశిష్ఠాగస్త్యులు జన్మించారు. మరి వీరు భయులూకారు, వీరిలో యేఒక్కరైనా బ్రాహ్మణత్వానికి భిన్నంగా సూర్యవంశపు క్షత్రియులుగా నిల్చారా?

ఋక్షవిరజుడనే వాడు స్త్రీరూపంలో వుండగా ఆమెను సూర్యుడు చూచీచూడగానే మనస్సు కరిగి రేతఃపతనమైతే, అది ఆ స్త్రీ కంఠంలోపడి సుగ్రీవుడు పుట్టాడు. ఇదికూడా ఉత్తర రామాయణ ప్రోక్తమే. మరి సుగ్రీవుడు వానర జాతికి నాయకుడే అయినా సూర్యవంశపు క్షత్రియుడేనా? సూర్యాను గ్రహంతో కుంతి గర్భంనుంచి పుట్టిన కర్ణుడు సూర్యవంశపు రాజుకావలసిందేనా? వాదంకోసం, తర్కదృష్టితో యీ కథలుగాథలు త్రవ్వడం జరుగు తున్నది గాని వాస్తవానికి గుణకర్మ రహితమైన యీ వర్ణవ్యవస్థకు మన సంఘం చరిత్రలో—ఉనికిలో స్థానమే లేదు.

శ్రీవిరూపాక్ష—శ్రీరామ శాసనాలలో క్షీరసముద్రాదిగా చంద్రవంశం ప్రారంభమైనట్లు ఒక వంక పేర్కొంటూ, ఈ శాసన నిర్మాతలైన శ్రీరంగరాయ ద్వయం ఆత్రేయ గోత్రజులుగా పేర్కొనడంలో స్వవచన వ్యాఘాత మున్నట్లు అర్థమవుతుంది. ప్రాచీనకాలంనుంచీ చంద్రవంశపు రాజులుగా పేర్కొనబడు తున్న రాజరాజన రేంద్రాదుల సృష్టి వారి వంశీకులమని చాటుకున్న శ్రీరంగ రాయాదులకున్నట్లు కనపడదు. రాజరాజనరేంద్రుడు వానసనారాయణభట్టునకు దానం యిచ్చి వేయించిన నందంపూడి శాసన ప్రారంభంలో చంద్రవంశం యీ క్రింది విధంగా ప్రారంభించబడింది.

శ్రీ ధామ్నః పురుషోత్తమస్య మహతో నారాయణస్య ప్రభో

ర్నాభీ పంకరుహో ద్బభూవ జగతస్స్రష్టా స్వయంభూస్తతః ॥

జజ్ఞేయ మానససూను రత్రిరితి యస్తస్మాన్మునేరత్రిత
స్సోమోవంశకర స్సుధాంశు రుదితశ్శ్రీకంఠ చూడామణిః ॥

తస్మా దాసీ త్సుధా సూతేర్బుధో బుధనుతస్తతః
జాతః పురూరవానామ చక్రవర్తి సవిక్రమః ॥

(నందంపూడి శాసనం క్రీ. శ. 1053–11–3)

చంద్రుడికి మూలపురుషుడుగా అత్రి మహర్షి యిందులో పేర్కొనబడినా అసలు ప్రారంభం ఆ జగన్నాటక సూత్రధారియైన శ్రీమహావిష్ణువు ఆదిగా వంశవర్ణనం ప్రారంభించబడింది. విష్ణువు నాభి కమలంనుంచి బ్రహ్మ, బ్రహ్మ హృదయంనుంచి అత్రి, అత్రికి చంద్రుడు, చంద్రునికి బుధుడు పుట్టినట్లు స్పష్టంగా పేర్కొనబడింది. నందంపూడి శాసనంలో పేర్కొనబడిన రాజమార్గాన్ని విడిచి శ్రీవిరూపాక్ష-శ్రీరామశాసన కర్తలు భిన్నమార్గాన్ని అనుసరించారు. చందమామ పాలకడలినుంచి పుట్టిందా? అత్రి మహర్షికి పుట్టిందా? ఆరవీటి బుక్కరాయల వంశం ఆత్రేయ గోత్రజం అనే అనుకుందాం, కాని యీ రెండు శాసనాల్లోనూ అసలు అత్రి కనిపించనే కనిపించడు.

అత్రి మన్మథప్రేరితుడై భార్యతో కలిసివుండగా రేతఃపతన మైందట. అది గాలికి మూడు భాగాలై ఒక భాగం అత్రినేత్రం లోనికి వెళ్లడంవల్ల అందులోనుంచి చందమామ పుట్టినట్లు మార్కండేయ పురాణంలో వుంది. అత్రి తపస్సుచేస్తే ఒక తేజస్సు జనించగా, అది దశదిశలూ వ్యాపించి చివరికి (క్షీర) సముద్రంలో పడిపోయింది. దానికి బ్రహ్మ పురుష రూపం యిస్తే దేవతల ప్రార్థనతో దాంట్లోనుంచి చంద్రుడు పుట్టాడు అని మత్స్యపురాణవాక్కు. చంద్రస్వరూపం క్షీరసముద్రం నుంచి ఆవిర్భవించినా, ఆ శక్తి స్వరూపానికి మూలంగా క్షీరసముద్రంకంటే ముందుగా అత్రిమహర్షి నిలిచాడు. కాబట్టి, ఒక వంక ఆత్రేయ గోత్రంగా పేర్కొంటూనే మరొకవంక అత్రిని విడిచి క్షీరసముద్రాదిగా చంద్రవంశాన్ని పేర్కొనడంలో ఔచిత్యం లేదు. గోత్రాల మూలపురుషునిగా పేర్కొనబడుతున్న అత్రికి మూలవ్యక్తులుండగా అత్రిని గోత్ర కారకుడుగా పేర్కొనడంలో వాస్తవికతలేదు.

భారత భాగవతాది గ్రంథాలపై ఆధారపడి పాఠాంతరాలతో తికమకలుపడే పరిస్థితులున్న రాజ వంశాల యాథార్థ్యం గురించి చర్చించడానికిక్కడ స్థలంచాలదు. అయినా పాండవులవంశీకుడుగా వర్ణించ బడిన రాజరాజు పూర్వపు వంశానికే శ్రీవిరూపాక్ష-శ్రీరామ శాసనాలు వ్యాఘాతం కల్పిస్తున్నందువల్ల ఈ విషయం కొంత ప్రస్తావించవలసి వస్తున్నది.

పౌత్రస్తస్య పురూరవా బుధ సుతస్తస్యాయు రస్యాత్మజ
స్సంజ జ్ఞే నహుషోయయాతి రభవత్తస్మాచ్చ పూరుస్తతః
తద్వంశే భరతో బభూవన్నృపతిస్తత్సంతతౌ శంతను
స్తత్తుర్యో విజయాభిమన్యు రుదభూత్తస్మాత్పరీక్షిత్తతః ॥

నంద స్తస్యాష్టమో భూత్సమజని నవయస్త స్యరాజ్ఞశ్చరిక్య క్ష్మా
పస్తత్సప్తమ శ్రీపతిరుచిర భవరాజ పూర్వో నరేంద్రాః
తస్యాసీద్విజ్జ లేంద్రోదశమఇహన్నృపోర్వీరహంమాలిరాయ
స్తార్త్రీయో కోయురారేః కృతసతిరుదభూ త్తస్యమాయాపురీశః ॥

(శ్రీవిరూపాక్ష శాసనం 3 పుట. 6, 7 శ్లోకాలు)

ఈ శ్లోకాలే శ్రీరామ శాసనంలో కూడా ఉటంకించబడ్డాయి. (చూడు. శ్రీరామ శాసనం- 47. పుట - 5,6 శ్లోకాలు) "పరీక్షిత్తు తరువాత ఎనిమిదవవాడు నందుడు. నందునికి తొమ్మిదవవాడు చాళుక్యరాజు. చాళుక్యరాజుకు యేడవవాడు రాజరాజనరేంద్రుడు." అని శ్రీ విరూపాక్ష— శ్రీరామ శాసనాలలో పేర్కొనబడింది. పరీక్షిత్తు తరువాత యెనిమిదవవాడు నందుడగునో కాదో రూఢిగా చెప్పలేము కాని శ్రీవిరూపాక్ష—శ్రీరామ శాసనాలలో పరీక్షిత్తూ చాళుక్యరాజులమధ్య అనేక మంది రాజులూ—వంశపురుషులూ పరిగణనకు రాకుండా మరుగునపడి పోయినట్లు స్పష్టపడుతున్నది.

శాసనం వ్రాసేటప్పుడు మొదట కవి తాళపత్రాలపై వ్రాసేవాడు. అనంతరం దానిని చూచి రాగిరేకులపైనో శిలలపైనో శాసననిర్మాతల ఆజ్ఞప్రకారం వ్రాయసగాడు చెక్కేవాడు. మనం చూచి వ్రాతవ్రాస్తున్నప్పుడు భ్రమ ప్రమాదాలకులోనై పొరపాట్లు రాయడం సహజం. ఇటువంటి పొరపాట్లు ముద్రణ నిమిత్తం జరిగే "కంపోజింగు"లో సైతం వస్తాయి. కాగా చూచివ్రాతవలెనే ఒక దానిని చూచి శాసనాలు చెక్కేటప్పుడు పొరపాట్లు వ్రాయడం భ్రమప్రమాదాలకులోనై కప్పదాటు వేసినట్లు కొన్నింటిని విడిచి పెట్టడం జరుగుతుంది. కాగా శ్రీవిరూపాక్ష శాసనంలో పరీక్షిత్తూ రాజ రాజుల మధ్య వంశక్రమాన్ని పేర్కొనడంలో పొరపాటు జరిగివుంటుంది. ఇదేవిధంగా శ్రీరామ శాసనంలో సైతం ఒక దాని కొకటి అనుకృతిగా పొరపాటు జరిగి వుంటుంది.

రాజరాజ నరేంద్రుడు వేయించిన నందంపూడి శాసనంలో పరీక్షిత్తుకు అయిదవవాడు ఉదయనుడు గాను, ఉదయనుని తరువాత 59 మంది పురుషులు రాజ్యపరిపాలన నెరపినట్లు పేర్కొనబడింది. ఈ విషయాన్ని స్పష్ట పరుస్తున్న శాసన వాక్యాలివి.

"తతోఽర్జునా దభిమన్యుః అభిమన్యో పరీక్షిత్
పరీక్షితో జనమేజయః జనమేజయాత్ క్షేముకః
క్షేముకాన్నరవాహనః నరవాహనాచ్ఛతానీకః
శతానీకా దుదయనః తతః పరం తత్ప్రభృతి
ష్వవచ్ఛిన్న సంతానే ష్వయోధ్యా సింహాస
నాసీనే ష్వేకోనషష్టి చక్రవర్తిషు గతేషు

తద్వంశ్యో విజయాదిత్యోనామ రాజా
విజిగీషయా, దక్షిణాపథంగత్వా త్రిలోచన
పల్లవ మధిక్షిప్య దైవదురీహయా
లోకాంతర మగమత్."

(నందంపూడి శాసనం)

శ్రీవిరూపాక్ష-శ్రీరామ శాసనాల ప్రకారం పరిశీలిస్తుకూ, రాజరాజ నరేంద్రునికీ మధ్య నంద చాళుక్య రాజులతోసహా మొత్తం ఇరవై నలుగురు రాజులున్నట్లు పేర్కొనబడింది. నందునికీ రాజరాజ నరేంద్రునికీ మధ్య పదహారుగురు రాజులున్నారు. అన్నదమ్ములను విడిచి లెక్కపెట్టినట్లైతే చాళుక్య వంశానికి తొలివ్యక్తిగా భావించబడుతున్న విజయాదిత్యుడు మొదలు ఆంధ్ర మహాభారత నిర్మాణకారకుడైన రాజరాజ నరేంద్రుని వరకూ శాసనాధారాలతో 21 మంది రాజులున్నారు. రాజరాజునకు పూర్వం తూర్పు చాళుక్య వంశకర్తయైన కుబ్జవిష్ణువర్ధనునికి (క్రీ. శ. 616-633) తరువాత పధ్నాలుగుమంది వున్నారు. అనగా కుబ్జవిష్ణువర్ధనుని తరువాత రాజరాజు పదహారవ వాడన్నమాట. శ్రీవిరూపాక్ష-శ్రీరామ శాసనాలలో నందునికి తొమ్మిదవవాడు చాళుక్యరాజని, చాళుక్యునికి యేడవవాడు రాజరాజని పేర్కొన బడిందిగదా. నందుని మాట దేవుడెరుగునుగాని రాజరాజునకు పూర్వం ఆరుతరాలకు ముందు చాళుక్య రాజనబడిన వాడులేడు. పోనీ మొదటి చాళుక్యభీముని ఉద్దేశించి చాళుక్యరాజని పేర్కొనబడిందని భావించుదామా! అంటే తొలిచాళుక్య భీముని నుంచి పరిగణిస్తే రాజరాజ నరేంద్రుడు ఆరవవాడవుతాడు గాని యేడవవాడు కాడు. ఏడవవాడు కావాలంటే చాళుక్య భీముని తండ్రి విక్రమాదిత్యుని సైతం మనం పరిగణించవలసి వుంటుంది. యుద్ధమల్లునికి అన్న, గుణగవిజయాదిత్యునికి తమ్ముడు అయిన యీ విక్రమా దిత్యుడు అసలు యేఒక్కరోజైనా రాజ్యపరిపాలన సాగించినట్లు కనపడదు. శ్రీవిరూపాక్ష-శ్రీరామ శాసనాలలో నందునికి తరువాత తొమ్మిదవవాడు చాళుక్య రాజని పేర్కొన్నది తూర్పు చాళుక్య వంశ కర్తయైన కుబ్జవిష్ణువర్ధనుని ఉద్దేశించి కావచ్చును. కుబ్జవిష్ణు వర్ధనునికి తరువాత యేడవ వానిగా నాల్గవ విష్ణువర్ధనుని (క్రీ. శ. 768-803) పేర్కొని అతనినుండి పదవవానిగా రాజరాజ నరేంద్రుని పేర్కొనివుంటే విజయాదిత్యుడు మొదలుగావున్న చాళుక్యవంశానికి ఒకసమన్వయం, యేకవాక్యత యేర్పడివుండేవి. శ్రీవిరూ పాక్ష-శ్రీరామ శాసన కావ్యకర్తలు రాజరాజునకూ నందునికీ మధ్యవున్న తరాల విషయంలో— పరిపాలకు లైన వంశీకుల విషయంలో భ్రమప్రమాదాలకు గురైనట్లు కనిపిస్తున్నది. కాగాచరిత్ర కందకుండా నూటికినూరు పాళ్లు వాస్తవమని ఆమోదించడానికి అవకాశాలు తక్కువగావున్న భారతాది గ్రంథాలపై ఆధారపడి రూపొందిన చంద్రవంశపు రాజుల వంశంతో పాటు రాజరాజ నరేంద్రుని వరకూ పేర్కొన బడిన రాజ వంశీకుల విషయంలో శ్రీవిరూపాక్ష-శ్రీరామశాసనాలు ప్రామాణికాలుగా నిలువనేరవు.

బుధుడాదిగా సాంకర్యంతో సంజనితమైన వంశాన్ని దృష్టిలో పెట్టుకొని పురాణగాథలను నమ్మి వంశపవిత్రతను త్రోసిపుచ్చుతామా? అని యెవరైనా సందేహించవచ్చును. సాంకర్యమన్నది సృష్టిప్రారంభం నుంచే వున్నది. లేదని చెప్పే అధికారం యెవరికీ లేదు. ఏ పుట్టలో యే పాముందో తెలియదు. అయినప్పుడు

వర్ణ వ్యవస్థాపరమైన కులవ్యవస్థను నియమబద్ధమైందిగా ఆమోదించలేము. ఇంతెందుకు ? చరిత్రలో మనకు తెలిసినంతవరకూ రాజరాజనరేంద్రునికి పూర్వమే సూర్య చంద్ర వంశాలు సాంకర్యం చెందాయి. రాజరాజు తండ్రియైన విమలాదిత్యునికి సూర్యవంశపురాజైన చోళరాజు తన కుమార్తెనిచ్చి వివాహం చేశాడు. ఈ దంపతుల కుమారుడే ఆంధ్రమహాభారత రచనా ప్రోత్సాహకుడైన రాజరాజనరేంద్రుడు. కాగా చంద్రవంశీకుడుగా భావించబడుతున్న యీ రాజరాజు సరైన చంద్రవంశీయుడు కాడని స్పష్టపడటం లేదా! విమలాదిత్యుని వంశాంతర వివాహ విషయం మనకు చారిత్రకంగా లభ్యమైనది కాబట్టి యీ విషయం నిరూపితమగుతున్నది కాని, అప్రకటితాలుగా — అలభ్యాలుగా యిటువంటి వంశాంతర వివాహాలే కావు వర్ణాంతర వివాహాలు సైతం అంతకుపూర్వం యెన్నెన్ని యెప్పుడెప్పుడు జరిగాయో చెప్పలేముకదా!

మరొక విషయం కూడా యీ సందర్భంలో గుర్తించవలసి వున్నది. విజయాదిత్య — విష్ణువర్ధనులాదిగా యేర్పడిన చంద్రవంశం అసలు క్షత్రియ జాతికి చెందిందే కానే కాదు. ఏదో ఒకానొక శూద్రజాతికి చెందిన వీరు తాము పరిపాలకులై గౌరవం కోసం క్షత్రియులమని చెప్పుకున్నారని అనేకమంది చరిత్రకారులు అభిప్రాయపడ్డారు. ఒక్క చంద్రవంశరాజుల విషయంలోనే కాదు, యే కులం విషయంలోనైనా మనం యీ సూత్రాన్నే గీటురాయిగా గ్రహింపవలసి వుంటుంది. చెట్టుపేరు చెప్పుకొని కాయలమ్ముకున్నట్లు ఆధిక్యతకోసం సంఘంలో యీ కులాలు తలెత్తాయేకాని అసలు వాస్తవికతను దృష్టిలోపెట్టుకొని తలెత్తలేదు.

ఆరవీటి వంశానికి మూలం రాజరాజనరేంద్రుని వంశమేనని శ్రీ విరూపాక్ష - శ్రీరామశాసనాల్లో పేర్కొనబడినా వీరహంమాలి రాయని పూర్వపు వంశ విషయంలో - రాజరాజనరేంద్ర - బిజ్జల -వీరహంమాలి రాయల మధ్యవున్న అనుస్యూతమై, అవినాభావ సంబంధంకల పురుషాంతరాల విషయంలో ప్రామాణికత గోచరించటం లేదు.

ఆరవీటి వంశవిషయంలో అత్యధికమైన శాసనాలు లభ్యం కానందువల్ల చారిత్రకులు ప్రాచీన కావ్యాలైన "ద్విపద బాలభాగవతం - వసుచరిత్ర - సుదక్షిణా పరిణయం - సాంబోపాఖ్యానం - కళాపూర్ణోదయం - రామరాజీయం అనబడిన నరపతి విజయం" వంటి కావ్యాలలోని చారిత్రకాంశాలపై ఆధారపడి చరిత్ర రచన చేశారు. ఈ గ్రంథాలలో ద్విపద బాలభాగవతం ప్రాచీనమైనది. దీనికంటే మూడు నాలుగు సంవత్సరాలకు పూర్వమే తొలుత పద్య బాలభాగవతం కోనేరుకవి రచించాడు. తిరుమలరాజు తన తండ్రియైన తిమ్మరాజుకు పుణ్యార్థం పద్య బాలభాగవతాన్ని అంకితం చేయించాడు. ఈ తిరుమలరాజే కోనేరు కవిచేత ద్విపదలో బాలభాగవతాన్ని రచింపచేసి తన రెండవతమ్ముడైన చినతిమ్మరాజుకు అంకితమిప్పించాడు. ద్విపద బాలభాగవతాన్ని కోనేరుకవి శాలివాహనశకం 1468లో (క్రీ. శ. 1546) రచియించినట్లు తాను స్వయంగా యీ క్రింది పద్యంలో పేర్కొన్నాడు.

చ. అరుదుగ శాలివాహన శకాబ్దము లెన్ననిధాన తర్క సా
గర శశిసంఖ్యచే వెలయఁగల్లు ప్లవంగ మనంగమించు వ
త్సరమునఁ బల్కెఁ దిమ్మ వసుధాపతికిన్ గవిసార్వభౌముఁడీ
హరిహిత బాలభాగవత హారిపద ద్విపద ప్రబంధమున్.

ప్రస్తుతం ప్రకటితాలవుతున్న శ్రీ విరూపాక్ష - శ్రీరామ శాసనాలు దాదాపు వంద సంవత్సరాల పురుషాంతరాలను ప్రామాణికంగా తెలుపుతున్నవి. కావ్యాల ప్రామాణికతకంటే శాసనాల ప్రామాణికత అత్యధికమైనది. కావ్యాలలో ప్రక్షిప్తాలుండవచ్చును. మాతృకలను చూచి పుత్రికలను - పుత్రికలను చూచి పౌత్రికలను చూచి వ్రాయడంలో పొరపాట్లు పెక్కు జరుగవచ్చును. ఏమైనా శబ్దాలు శిథిలమైనప్పుడు చూచి పూరకుండలేని కవినాయకులు తమకు తోచినట్లు పూరించవచ్చు. అందువల్ల కావ్యగతాలైన చారిత్రకాంశాలను పరమ ప్రామాణికాలని చెప్పలేము. క్రీ. శ. 1644 లో శ్రీరామ శాసనం వేయించిన పిన వెంకటరాయల పుత్రుడైన శ్రీరంగరాయలు మొదలు, క్రీ. శ. 1576 లో శ్రీ విరూపాక్ష శాసనం వేయించిన వెంగళాంబా తిరుమలరాయల కుమారుడైన శ్రీరంగరాయలవరకు శ్రీరామశాసనం ప్రామాణికమై నిలువగా; విరూపాక్షశాసన ప్రదాతయైన (క్రీ. శ. 1576) శ్రీరంగరాయల దగ్గరనుంచి అతనికి పూర్వం తాత పిన్నమ రాజు వరకు ఉన్న ఎనిమిది పురుషాంతరాలవరకూ శ్రీ విరూపాక్షశాసనం ప్రామాణికమై నిలుస్తున్నది. 68 సంవత్సరాలతేడాతో క్రీ. శ. 1576-1644 సంవత్సరాలలో అవతరించిన శ్రీవిరూపాక్ష-శ్రీరామ శాసనాలు రెండూవున్నంతవరకూ - తమకు సంబంధించిన పురుషాంతరాలవరకు చారిత్రకాంశాలతో పరవు ప్రామాణి కాలుగా నిలుస్తాయి.

## బిజ్జలుడు

రాజరాజనరేంద్రునికి తరువాత ఫదవ వ్యక్తిగా బిజ్జలుడు శ్రీవిరూపాక్ష-శ్రీరామశాసనాలు రెండింటా పేర్కొనబడ్డాడు. రాజరాజనరేంద్రుని తరువాత బిజ్జలుడు పదవవాడనడానికి రాజరాజనరేంద్రుని వంశీకులుగానీ తదితరులుగానీ వేసిన శాసనాధారాలు ప్రత్యేకించి వేరే లభ్యం కాలేదు. బిజ్జలనామకులు ఒకే కాలంలో అనేకమందివున్నట్లు చరిత్రకారులు భావిస్తున్నారు. అయితే కళ్యాణపురాన్ని పాలించిన పశ్చిమ చాళుక్యుడైన బిజ్జలుడు ఆరవీటివంశ పూర్వీకుడని అందుగుల వెంకయ్య(క్రీ. శ. 1630 ప్రాంతంలో)రచించిన 'నరపతి విజయం' (రామరాజీయం)లో పేర్కొనబడింది. నందవరమును బ్రాహ్మణులకు దానమిచ్చి యోగ పాదుకా మహిమం పొందిన నందభూపాలుడు కూడా యీ ఆరవీటి వంశంలో వాడని వెంకయ్యకవి పేర్కొన్నాడు. అయితే రాజరాజనరేంద్రునికి అత్యంత పూర్వులైన వ్యక్తులలో పేర్కొనబడిన నందుడు యీ నందుడేనేమో. ఏమైతేనేమి ఇతనెప్పటివాడో యితమిద్ధంగా చెప్పలేము. బిజ్జల నామకులు అనేకులున్నట్లు తోస్తున్నది. కళ్యాణపురాన్ని పాలించిన బిజ్జలుడు వేరనీ, బసవన్న చంపించిన బిజ్జలుడు వేరనీ కొందరు భావించారు. ఈ బిజ్జలుడు జైనమతావలంబి యని భావించినవారుకూడా లేకపోలేరు. గుల్బర్గాప్రాంతంలోని కళ్యాణపట్టణం చాలాకాలంగా పశ్చిమ చాళుక్యుల రాజధానిగా వుంటూవచ్చింది. బిజ్జలుడు మొదట పశ్చిమ చాళుక్య చక్రవర్తి' త్రైలోక్యమల్ల బిరుదాంకితుడూ అయిన మూడవతైలపదేవునికి సామంతుడుగా వుండి, అతని ప్రతినిధిగా క్రీ. శ. 1145-1162 ప్రాంతంవరకు తర్థవాడి మొదలైన సీమలను అక్కడి మంగళవేఢ (మంగళవాడ) ప్రధాన పట్టణంగా చేసుకొని, చివరికి స్వతంత్రుడై కాకతిప్రోలరాజు సహాయంతో తైలపదేవు నోడించి కళ్యాణపట్టణం కైవసం చేసుకొని పశ్చిమ చాళుక్య రాజ్యంలో కొంతభాగాన్ని ఆక్రమించినట్లు కనిపిస్తున్నది. అప్పుడు తైలపుడు కళ్యాణ పట్టణాన్ని విడిచి "యన్నిగేరి, బనవసి" మొదలైన ప్రాంతాలలో

వుండి, పోగా మిగిలిన రాజ్యభాగాలను పరిపాలించాడు. బిజ్జలుడు క్రీ. శ. 1168 ప్రాంతంలో మరణించగా అతని పుత్రులు రాయమురారి, సోమిదేవుడు మొదలైనవారు క్రీ. శ. 1182 వరకు కళ్యాణ పట్టణంలోవుండే రాజ్య పరిపాలన సాగించారు. తైలపుని కుమారుడు నాల్గవ సోమేశ్వరుడు క్రీ. శ. 1182లో బిజ్జలుని పుత్రులనోడించి తండ్రి కోల్పోయిన రాజ్యభాగాలను పరిగ్రహించి కొన్ని సంవత్సరాలు పాలించాడు. బిజ్జలుడు చంద్రవంశ క్షత్రియుడనీ, హైహయాన్వయుడనీ, కాలచుర్య వంశ్యుడనీ, సువర్ణ వృషభధ్వజాది లాంఛనాలు కలవాడనీ కొన్ని శాసనాలవల్ల స్పష్టపడుతున్నది. బిజ్జలుడు అతనిపుత్రులు కళ్యాణపురంలో వుండే చాళుక్య రాజ్యాన్ని పరిపాలించినట్లు కనిపిస్తున్నది. ఈ బిజ్జలునకూ, బసవన్నకూ సంబంధమున్నదనీ, యితడే బసవని ఆగ్రహానికి గురైనాడనీ ముఖ్యులైన కొందరు చారిత్రకులు పేర్కొన్నారు. సహోదరీ వివాహంలో బిజ్జల-బసవన్నలకు బంధుత్వమున్నదన్న అభిప్రాయంకూడా పరిశోధకులలో ఉన్నది. పాల్కురికి సోమన బిజ్జలుని పుత్రులను అనామకులుగా భావించి బ్రతికివున్నా చచ్చిన వారిలో జమకట్టినట్లు కనిపిస్తున్నది. మంగళవాడ కళ్యాణపట్టణానికి దాదాపు 100 మైళదూరంలో పండరపుర సమీపంలో వున్నది. బసవన్న జన్మస్థలమైన "బాగెవాడి"కి అదికొంత దగ్గరగావున్నదే. బిజ్జలుడు మంగళవాడలోవున్నప్పుడే అతనికి మంత్రిగా బసవన్న కుదిరివుంటాడు. శివగణదరగళె అన్న కన్నడ కావ్యంలో హరీశ్వరుడు బిజ్జలుని మంత్రిగా బసవడు మంగళవాడలోనే కుదిరినట్లు పేర్కొన్నాడు. ఏదియేమైనా బిజ్జలులెందరున్నా, వారిలో యెవరైనా రాజరాజనరేంద్రుని వంశంలోని వారనడానికి సరైన ఆధారాలులేవు. ఈ బిజ్జలునికి తరువాత మూడవవాడు వీరహంమాలిరాయడు. బిజ్జలుని పుత్రులు అనామకులైనందువల్లనో, అత్యధికకాలం రాజ్యపరిపాలన కొనసాగించ నందువల్లనో వారి విషయం శాసనకర్తలు ప్రస్తావించలేదు. బిజ్జలుని అనంతరం అతని మనుమడైన వీరహంమాలిరాయలు పేర్కొనబడ్డాడు.

## వీరహంమాలి రాయలు

పశ్చిమచాళుక్య రాజ్యం అంతరించేనాటికి ఒక చిన్న మాండలిక సామంత రాజుగానో, సైన్యాధ్యక్షుడుగానో యీ వీరహంమాలిరాయలు వుండివుండవచ్చును. 12వ శతాబ్ది చివర హోయిసల రాజైన వీర బల్లాలుడు గాంగవాడి, నోలంబవాడి, బనవసి రాజ్యాలనాక్రమించి, కళ్యాణపురం మీద దండెత్తి, చాళుక్య రాజైన నాల్గవ సోమేశ్వరుని వద్ద సైన్యాధ్యక్షుడుగావున్న బొమ్మరాజును యెదుర్కొని, ఓడించి బిజ్జల రాజ్యాన్ని తిరిగి స్వాధీన పరచుకున్నాడు. కన్నడ భాషలో "ప—బ" అనే అక్షరాలు "హ" కారంవలె వుచ్చరించబడుతాయి. అందువల్ల "బొమ్మ" "హొమ్మ"గా మారడంలో విచిత్రంలేదు. వీరబొమ్మరాజు (వీర బొమ్మరాయలు) వీరహొమ్మాలిరాయలుగా పేర్కొనబడివుంటాడు. ఈ బొమ్మరాజు సంతతిలోవాడో, మరొకడో 13వ శతాబ్దాంతంలో కళ్యాణ నగరంనుంచి హోయిసల యాదవులను పారద్రోలి స్వతంత్రుడై పరిపాలన చేసివుంటాడు. ఈతడే యీ వీరహంమాలి రాయలై వుంటాడు. 'నరపతి విజయం' లో వెంకయ్య వర్ణించిన దానినిబట్టి యితడు వైష్ణవమత సంప్రదాయాచారాలు కలవాడు. దేవబ్రాహ్మణ భక్తికలవాడు. మాయాపురం అనేనామాంతరంవున్న గంగాపురంలో చెన్న కేశవస్వామిని ప్రతిష్ఠాపించాడు. "వీరనారాయణదేవ చరణాంభోరుహారాధనానుసంప్రాపిత సకల సామ్రాజ్య విశేష భోగాలు, పరమ

భాగవత సఖిత్వాలు కలిగి చాలాకాలం రాజ్యపరిపాలన చేసినట్లు కూడా అందుగుల వెంకయ్యా వర్ణించాడు. అయితే శ్రీవిరూపాక్షశాసనంలో వీరహంమాలిరాయని కుమారుడైన మాయాపురీశ్వరుడు విష్ణుభక్తుడని వర్ణించబడింది. (చూడు 3 పుట. 7 శ్లోకం) ఈ మాయాపురీశ్వరుని గూర్చిన విశేషాలు యింతకు మించి తెలియవు. శ్రీవిరూపాక్ష–శ్రీరామ శాసనాల ప్రకారం తాతపిన్నమరాజు మాయాపురీశ్వరుని కుమారుడు. వీరహంమాలిరాయని మనుమడు. కాని చిలుకూరి భద్రరావువంటి చారిత్రకుల దృష్టిలో వీరహంమాలిరాయని కుమారుడు తాతపిన్నమరాజు. 'నరపతివిజయం'లో సైతం తాత పిన్నమరాజు వీరహంమాలి రాయని పుత్రుడని పేర్కొన్నట్లు కూడా శ్రీచిలుకూరి వారు వ్రాశారు. ఏమైనా ప్రస్తుతశాసనాల ప్రకారం వీరహంమాలిరాయనికి తరువాత అయిదవవాడుగా తాత పిన్నమరాజు ప్రత్యక్షమవుతున్నాడు. వీరహంమాలి రాయని కుమారుడు మాయాపురీశ్వరుడు కాగా, మాయాపురీశ్వరుని మునిమనుమడుగా తాత పిన్నమ రాజు పరిగణనకు వస్తున్నాడు. ఈ దృష్ట్యా మాయాపురీశ్వరునికి నాలుగవ వ్యక్తిగా తాత పిన్నమరాజు శాసనాలలో పేర్కొనబడ్డాడు. బహుశా వీరహంమాలి రాయలు చెన్నకేశవస్వామిని నెలకొల్పిన గంగాపుర మైన మాయాపురంలోనే అతనికుమారుడు వుండి, మాయాపురీశ్వరు డనిపించుకొని, యేకొద్దిపాటి రాజ్యాన్నో పరిపాలించివుంటాడు. ఇంతకుమించి మాయాపురీశ్వరుని గురించి విశేషాలు మనకు తెలియవు.

## తాత పిన్నమరాజు

విష్ణుభక్తుడూ, వీర హంమాలిరాయని కుమారుడూ అయిన మాయాపురీశునికి తరువాత నాల్గవ వాడితడు. ఇతడు కన్నెత్తిచూస్తేనే శత్రువులు భయపడి పారిపోయేవారట! దోనూరి కోనేరుకవి క్రీ.శ. 1546లో రచించిన ద్విపద బాల భాగవతంలో ఆరవీటి వంశాన్ని వర్ణిస్తూ, ఈ తాత పిన్నమరాజును గురించి యీ క్రింది విధంగా వర్ణించాడు.

> "సమితిలోఁ జెఱకు రాజనరేంద్రు గెలిచి
> అలవుగా సప్తాంగ హరణం బొనర్చి
> పొలుపొందె భువి మన్నెపులియను పేర
> బిరుదాంచితుఁడు తాత పిన్న భూవరుఁడు"

తాతపిన్నమరాజు జయించిన యీ చెఱకురాజనరేంద్రుడెవరో యింతవరకూ చరిత్రకందలేదు. నరపతి విజయకావ్యంలో సైతం తాతపిన్నమరాజుకుపయోగించిన బిరుదు గద్యలో "సమస్త దురాచార చెఱకు రాచనాయక రాజ్య సప్తాంగ హరణ" అని వున్నది. ద్విపద బాలభాగవతంలో తాత పిన్నమరాజుకు సూరమ్మ, కొంకలదేవి అనే యిద్దరు భార్యలున్నట్లు, ప్రథమ భార్యాపుత్రుడైన కొటిగంటి రాఘవరాజు మహావీరుడైనట్లు వర్ణించబడింది.

"హరికాంతఁబోలు సూరాంబికయందు
ఘనశౌర్యుఁడౌ కొటిగంటి రాఘవుని
గనియె నతండు సంగ్రామంబు నందు
రాజిల్లు కంపిలిరాయ సైన్యములఁ
దేజంబు మెరయంగఁ దెగువమై గెలిచి
గరిమ గైకొనియె నగ్గండర గూళి
బిరుదంబు సరిన్నృపుల్ పేర్కొని పొగడ"

అని రాఘవరాజు వీరకృత్యాలను వర్ణించాడు. ఈ రాఘవరాజు విషయం ఈ శ్రీ విరూపాక్ష - శ్రీరామ శాసనాలలో ప్రస్తావించబడలేదు. అసలు తాతపిన్నమరాజుకు యిరువురు భార్యలున్న విషయం కూడా ఈ శాసనాలలో ఉటంకించలేదు.

## సోమదేవరాజు

తాత. పిన్నమరాజు కుమారుడైన సోమదేవరాజు ఒకేఒక్కరోజులో శత్రువులనోడించి యేడు కోటలను పట్టుకున్నాడట ! ఈ విషయం శ్రీ విరూపాక్ష - శ్రీరామ శాసనాలలో స్పష్టంగా పేర్కొనబడింది.

తతో జనిహారం దుర్గాణి సప్తాహితాత్
అహ్నైకేన స సోమిదేవ నృపతిః॥

(శ్రీ విరూపాక్ష శాసనం పుట. 3. శ్లోకం. 8.
శ్రీరామ శాసనం పుట. 47. శ్లోకం. 7.)

ఈ సోమదేవరాజు తల్లి కొంకలదేవి అని ద్విపద బాలభాగవతం వల్ల తెలుస్తున్నది. ఈ సోమదేవరాజు సల్పిన వీరకృత్యాలు అత్యద్భుతాలుగా కనిపిస్తున్నాయి.

"మరియు నతండాజి మహామదు మలక
గరకరి యలిగి యగ్గరికఁ బుట్టించి
బెలుకురి యాతండు బిడ్డపేరిడిన
దలకెల్లఁ దొలగించి దయచేసి కాఁచె
తెలివి నర్వదినూరు తేజీల నచట
గలుగు నర్థులకు దానంబుగా నొసఁగ"

అని ద్విపద బాలభాగవతం లోనూ

సీ. కదనరంగంబునఁ గరితురంగమ వీర
వితతితోఁ బలుమాఱు విఱుగఁదోలి
యమితోగ్ర శౌర్యు మహమ్మదుఁ బట్టి నీ
పేరుపెట్టెదన గుమారున కది
గాక భవత్పాద కమలంబు నుదురంట
దండంబుఁ బెట్టెదఁ దన్నుఁ గాచి
విడువుమన్నను గాచి విడిచి యర్థులకును
షష్టి శతంబుల నశ్వములవాని
తే. చేత నిప్పించి శరణన్నఁ బ్రీతిగాచు
బిరుదు తగు నీతనికె యని ధరణి పతులు
సన్నుతింపఁగ నాది రాజన్య చర్యఁ
దేజరిలె సోమదేవ ధాత్రీవరుండు.

అని నరపతి విజయంలోనూ వర్ణించబడింది. తనకు శత్రువూ మహాపరాక్రమవంతుడూ అయిన మహమ్మదు మలకనును అనేకసార్లు యుద్ధాలలో ఓడించడమేగాక, ఒకసారి అతనిని బందీగా పట్టుకొనగా "రాజా! నీ కాళ్లు పట్టుకొని నమస్కరిస్తాను. నా కొడుకుకు నీ పేరు పెట్టుకుంటాను. నన్ను కాపాడి రక్షించు." అని వేడుకుంటే దయదలచి అతనిని విడిచిపెట్టి అడిగినవారికి ఆరువేల గుఱ్ఱాలను అతనిచేత దానంగా ఇప్పించాడట. ఈ సందర్భంలో పేర్కొనబడిన మహమ్మదు మలక్ క్రీ. శ. 1358 మొదలు 17 సంవత్సరాలు అనగా 1375 వరకూ కలుబరిగి పట్టణం రాజధానిగా పరిపాలన చేసిన బహమనీ సుల్తానైన మొదటి మహమ్మదు షాహా అని రంగస్వామిసరస్వతి మొదలైనవారు పేర్కొన్నారు. ఈ సోమదేవరాజు తొలి విజయనగర రాజులవద్ద సేనాని అని కొందరభిప్రాయపడ్డారు గాని, అందులో వాస్తవం లేదు. ద్విపద బాలభాగవతంలో కోనేరు నాథకవి

"నయ విశారదుఁడు పిన్నమ సోమ విభుఁడు
జయశాలి భూపాల సార్వభౌముండు."

అని విస్పష్టంగా సోమదేవుని భూపాల సార్వభౌముడుగా పేర్కొన్నాడు. అందువల్ల సోమదేవ రాజును ఒక సేనానిగా కాక ఒక స్వతంత్ర సామ్రాజ్యనిర్మాణం చేయదలచి సార్వభౌమ బిరుదం వహించి, కృషిచేసిన స్వతంత్ర ప్రభువనే మనం ఊహించవలసి వుంటుంది. ఇతనికి "మాళవరాజేంద్ర మస్తకచూళ—హాొస బిరుదురగండ" అని రెండు బిరుదులున్నట్లు నరపతి విజయంలోనే కాక బాలభాగవతంలో కూడా పేర్కొనబడింది. ఈ బిరుదులను పరిశీలిస్తే నాటి కర్ణాట సామ్రాజ్యాధీశ్వరులైన హరిహర బుక్కరాయాదులకు లోబడి సామంతుడుగా సైతం వున్నాడని చెప్పే అవకాశాలు బొత్తిగా కనిపించడంలేదు. మాళవరాజు ఢిల్లీ సుల్తానైన

మహమ్మద్ బీన్ తుగ్లక్‌కు కప్పం కట్టే సామంతుడే కాని బహమనీ సుల్తానైన మహమ్మద్‌షాహాకు సామంతుడు కాడు. ఈ బిరుదులవల్ల ఈ సోమదేవరాజు క్రీ. శ. 1310—1347 సంవత్సరాల మధ్య వుండి వుంటాడని చరిత్రకారులూహించారు. సరిగ్గా యీ కాలంలోనే ఢిల్లీచక్రవర్తులైన మహమ్మదు మతస్థులు విజృంభించి హిందూ స్వతంత్ర సామ్రాజ్యాలను మూడింటిని నాశనంచేసి దక్షిణ భారతదేశాన్ని కల్లోలంలో ముంచివేశారు. దేవగిరి రాజధానిగావున్న మహారాష్ట్ర సామ్రాజ్యం క్రీ. శ. 1318లో అంతరించింది. ఓరుగల్లు రాజధానిగావున్న ఆంధ్ర సామ్రాజ్యం క్రీ. శ. 1324 లో కూలిపోయింది. హాళేబీడు (ద్వారసముద్రం) రాజధానిగావున్న ప్రాచీన కర్ణాటసామ్రాజ్యం క్రీ. శ. 1327 లో పతనమైనది. ఇంతమాత్రంచేత ఆంధ్ర, కర్ణాటమహారాష్ట్రవీరులు బెంబేలుపడి చేతులు ముడుచుకొని కూర్చొనలేదు. తమ శక్తికొద్దీ హిందూమతసంఘ సంరక్షణమే ముఖ్యలక్ష్యంగా పెట్టుకొని తమశత్రువులైన ముస్లిమ్‌లను దక్షిణ భారతంలో స్థావరాలేర్పరచుకోకుండా నిరోధించి పోరాడిన మహానుభావులెందరో వున్నారు. ఇటువంటి మహానుభావులలో మన సోమ దేవరాజొకడు.

ఈ కాలంలో దక్షిణ భారతదేశంపై అత్యధికంగా దండయాత్రలు సాగించినవారు 'అల్లావుద్దీన్ ఖిల్జీ' అనే ఢిల్లీచక్రవర్తి బానిసయైన "మలిక్ కాపుర్"—ఢిల్లీ చక్రవర్తిగా ''మహమ్మద్ బీన్ తుగ్లక్'' అని ప్రఖ్యాతి వహించిన "మలిక్ ఫకీరుద్దీన్ జూనా''లు. ఈ తుగ్లక్ క్రీ. శ. 1325 లో ఢిల్లీ సింహాసనాన్ని అధిరోహించడానికి పూర్వం "అలూప్ ఖాన్" అని పిలువబడేవాడు. ద్విపద బాల భాగవతంలో కోనేరుకవి తుగ్లక్‌నుద్దేశించి "మహమ్మదు మలక" శబ్దాన్ని ఉపయోగించాడని శ్రీ చిలుకూరి వీరభద్రరావుగారభిప్రాయపడ్డారు. తన శత్రువైన బహావుద్దీనుకు రక్షణ యిచ్చాడన్న కారణంతో జంబుకేశ్వర రాయలపై తుగ్లక్ దండెత్తి అతనిని సంహరించగా కళ్యాణపురాధీశ్వరుడైన సోమదేవరాజు తుగ్లక్ సైన్యాలతో హోరాహోరి పోరాడి, ఓడించి వారిని అవమానపరచినట్లు కనిపిస్తున్నది. ఈ విషయంలో మహమ్మదీయ చరిత్రకారుల అభిప్రాయాలు కొంత భిన్నంగా వున్నాయి. వీరి అభిప్రాయాలు వాస్తవానికి దూరంగా కూడా వున్నాయి. ఈ సోమదేవరాజు "ఆకులపాటి వీరక్షేత్ర భారతమల్ల, ముదిగంటి వీరక్షేత్ర భారతమల్ల, ఆనెగొంది వీరక్షేత్ర భారతమల్ల, కుంతి వీరక్షేత్ర భారతమల్ల, ఆకులపాటి ముదుగంట్యానెగొంది కుంతిసరవిజయలక్ష్మీ సమక్షీకరణ లక్షిత; వీరక్షేత్ర భారతమల్ల బిరుద శరితాను బావ" అన్న బిరుదాలున్నాయి. వీటిని పరిశీలిస్తే ఆనెగొంది సమీప దేశమంతటిలోను తుగ్లక్‌కు సోమదేవరాజుకు జరిగిన మహాపోరాటాన్నిగుర్తించి, ఆ ప్రాంతం వీరక్షేత్రమైన యుద్ధరంగంగా మారిన విషయాన్ని గ్రహించగలం. సోమదేవరాజుకు "హొసబిరుదరగండ, రాయరణరంగ బీభత్సరాయరాహుత్తగండ" బిరుదాలుండడంవల్ల ఇతడు కర్ణాట సామ్రాజ్యాలకు లోబడినవాడుకాడని స్పష్టపడుతున్నది. హొసపట్టణవాసులైన వీరులకో, తత్పరిపాలకులకో "హొసబిరుదరగండ" అన్న బిరుదు వర్తిస్తుంది. "సకల నరదేవ చూడామణి" అన్న బిరుదు కూడా సోమదేవరాజును స్వతంత్ర రాజుగా మరింత స్పష్టపరుస్తుంది. క్రీ. శ. 1336 ప్రాంతంలో విద్యానగరాన్ని రాజధానిగా చేసుకొని మొదటి హరిహరరాయలు పరిపాలన చేసినట్లు, మొదటి హరిహర బుక్కరాజులు వేయించిన కాపలూరు, ఎరగుడిపాడు శాసనాలవల్ల తెలుస్తున్నది. అందువల్ల తుంగభద్రానదికి ఉత్తరభాగదేశాన్ని సోమదేవరాజు, దక్షిణ భాగ దేశాన్ని తొలి హరిహరరాయలు ఏకకాలంలో పరిపాలించారని కొందరు చరిత్రకారులు భావించారు.

ఈ సోమదేవరాజు ఒకే ఒక రోజులో ఏడుకోటలు పట్టుకున్నట్లు శ్రీ విరూపాక్ష-శ్రీరామ శాసనాల్లో ఉటంకించబడిన విషయం గతంలో పేర్కొనబడింది. శ్రీ విరూపాక్ష శాసనం కంటే 30 సంతవ్సరాల పూర్వం అనగా క్రీ. శ. 1546 లో రచించబడిన ద్విపద బాలభాగవతంలో సైతం ఒక్కరోజులోనే ఏడుకోటలు స్వాధీనపరచుకున్నట్లు ఈ క్రింది ద్విపదలలో స్పష్టపరచడం జరిగింది.

“ నరుల కసాధ్యమైన మొసలిమడుగు
ధర నెన్నఁదగిన సాతాని కోటయును
కడునుతింపఁగఁజాలు కందనవోలు
కడిమి విశేషంబుగల కల్వకొలను
అరుదైన రాచూరు నలయాతగిరియు
నిరుపమంబగు గంగినేని కొండయును
ననఁగ నొప్పారు నేడైన దుర్గముల
వినుత ధాటీ మహోవేశంబు నెఱపి
సురపతియోగి యాత్రాంశువంశ
కరుఁడొక్కనాఁడు లగ్గలుగొన్నవాఁడు ”

ఈ ద్విపదల్లో “మొసలిమడుగు, సాతానికోట, కందనవోలు, కలువకొలను, రాచూరు, యాతగిరి, గంగినేని కొండ” అన్న యేడు దుర్గాల పేర్లను సయితం కవి స్పష్టపరచాడు. ఈ విషయమే నరపతి విజయంలో యీ క్రింది సీసంలో వర్ణించబడింది.

సీ. దండెత్తి చనిమహోద్దండ వృత్తిని
గంగినేని కొండవలీలగాను గట్టి
కందన వోలును గలువకోటను గోట
రాచూరు నెటువంటి రాజుకైన
సాధింపరాని మొసలిమడుగు మరి యా
తగిరి నగరము సాతానికోట
వరుసతో సాధించి పరమహర్షంబునఁ
దత్తన్మహా జనతతులఁ బ్రోచి

తే. గీ. ధరకుఁ దొడవని వినుతింపఁదగినయట్టి
యారవీటి పురాధ్యక్షుఁడగుచుఁదాత
పిన్ననృప సోమదేవుండె యెన్నదగియె
నఖిలసత్కవిసురభూజ యనుచు నెపుడు.

నరపతి విజయంలో సోమదేవరాజు బిరుదు గద్య ఈ క్రిందివిధంగా ఉటంకించబడింది.

"జయజయ, నిఖిల మహాభాగవత ముఖ్య విఖ్యాత కీర్తి, ఏకదివస ఘటికైక ధాటీ హఠావృత కోట రాచూరు సాతానికోట కందనవోలు యాతగిరి, కలువకొల్లు మొసలిమడుగు గంగినేనికొండాభిధాన సప్త దుర్గవర్తి, స్థలదుర్గ గిరిదుర్గ జలదుర్గ వనదుర్గ చౌరాశి దుర్గవిపాల, సముద్ఘుష్యమాన బిరుదాపదాన హాళహాళికా కర్ణన పులకిత కపోల, నాకులపాటి ముదుగంట్యాన గొంది కుంతి సర విజయలక్ష్మీ సమక్షీకరణ లక్షిత, ఆకులపాటి వీరక్షేత్ర భారతమల్ల, ముదుగంటి వీరక్షేత్ర భారతమల్ల, ఆనెగొంది వీరక్షేత్ర భారత మల్ల, కుంతి వీరక్షేత్ర భారతమల్ల, వీరక్షేత్ర భారతమల్ల బిరుదాభరితానుభావ, స్వభావ గంభీరాంభోనిధి, సత్వగుణవాసుదేవ, సకల నరదేవ చూడామణి, అసిభరణ పటిమ సహదేవ, ఆదిదేవ, సుపర్వమణీ మణిస్తుత, వరద, భయద, హాస బిరుదరగండ, వీరప్రతాప బిరుద, బిరుద మున్నెరగండ, పురిగోల సురత్రాణ, శరణాగత త్రాణ బిరుద, రాయ రణరంగ బీభత్స, రాయ రాహుత్తర గండ, భైరవగండ, గండరగండ, తాత పిన్నమరాజు తనూజ, సోమ దేవరాజ, విజయీభవ, దిగ్విజయీభవ."

ఈ బిరుదు గద్యలో "ఏకదివస ఘటికైకధాటీ హఠావృత కోట రాచూరు సాతానికోట కందనవోలు యాతగిరి కలువకొల్లు మొసలి మడుగు గంగినేని కొండాభిదాన సప్తదుర్గవర్తి" అని సప్త దుర్గాలు పేర్కొనబడడమేగాక ఒక్క ధాటితో హటాత్తుగా. అన్నింటినీ స్వాధీనపరచుకొన్నట్లు పేర్కొన బడింది. నరపతి విజయంలో వరుసతో సాధించాడని పేర్కొన్న అతి ప్రాచీనమైన ద్విపద బాలభాగవతంలో "ఒక్కనాడు లగ్గలు గొన్నవాడు" అని ఒకేరోజున స్వాధీనపరచుకున్నట్లు తేటతెల్లం చేయబడింది. మహా వీర పౌరుషవంతుడైన సోమదేవరాజు తనను ధిక్కరించి, తిరస్కరించి శత్రుపక్షాలలో చేరిన అడబాల నాయకుడు, రుద్రపనాయుడు, గౌరారెడ్డి, గంగినాయుడు అన్న సాహస పౌరుషవంతులైన వీరులను కదన రంగంలో చీల్చి చెండాడి శత్రువులు గగ్గోలుపెట్టగా వారి చట్టలు చీరించి గంగినేని కొండ తూర్పుద్వారం ముందు స్తంభాలను పాతించి తోరణాలుగా కట్టించాడట! ఈ విషయం నరపతి విజయంలో యీ క్రింది సీసంలో వర్ణించబడింది.

సీ. బలవంతుఁడగు నడబాల నాయకునిని
శూరుఁడౌ గుజ్జల వీరినేని
రౌద్ర సౌన్నిద్రు రుద్రపాధిపు మహా
శౌర్య గౌరారెడ్డి సాహసాంకు
గంగినాయకుని సంగ్రామ రంగంబున
సింగంబు మత్తమతం గజములఁ
బట్టు కైవడిఁ బట్టి చట్టలెత్తించి కి
న్కను నసహుండునై గంగినేని

గీ. కొండ ప్రాగ్ద్వారసీమ నుద్దండ వృత్తిఁ
గంబములఁ బాతి తోరణగాఁగఁ గట్టి
వినుతి కెక్కెను సకల భూజనులచేత
సోమదేవ నృపాల సుత్రాముఁడెలమి.

నరపతి విజయంకంటే అతి ప్రాచీనగ్రంథమైన ద్విపద బాలభాగవతంలో సైతం ఈ విషయం స్పష్టంగా ఉటంకించబడింది. ఆ ద్విపదలివి.

" దండి మీరంగ నాతండు గంగినేని
కొండ లగ్గలచేతఁగొని యందుపరుల
నుడియంగనీని గుజ్జల వీరినేని
నడబాలయన్న రుద్రప్ప నాయకుని
ఘనుని గౌరారెడ్డి గంగినాయకుని
గినిసిన రిపులెల్ల గగ్గోలు పడఁగ
చట్టలు చీరించి సరంభ మెసఁగఁ
గట్టించెఁ దూరుపు గవని కంబముల"

అంతేకాక ఒకానొక శత్రువు శిరస్సును భైరవదేవుని ముందట ఛేదించి బలియిచ్చినట్లు ద్విపద బాల భాగవతంలో ఈ క్రింది ద్విపదల్లో వర్ణించబడింది.

"మణిగిల్ల దుర్గంబు మదిలోనఁ గలుగు
కణక దాడిగ నేడి కైకొని నిలిచి
గోసంగి మన్నెని గుపినాత్య నృపతి
శాసకుండగుట మస్తకము గొట్టించి
ఆరసి తత్పట్టణాగ్ర తటాక
భైరవు ముంగల బలి యొసఁగించె."

మహావీరుడైన యీ సోమదేవరాజును ఆరవీటి నగర పరిపాలకులలో తొట్టతొలి వ్యక్తిగా కొందరు చరిత్రకారులు పేర్కొన్నారు.

## రాఘవరాజు

ఈ సోమదేవరాజు కుమారుడు రాఘవరాజు. రాఘవరాజు తల్లి పేరు కామలదేవి. ఈ రాఘవరాజు గురించి ద్విపద బాలభాగవతంలో విశేషంగా యేమీ వర్ణించలేదు. అయితే "ఉరుశౌర్యధైర్య భాసురుఁడు రాఘవదేవవసుధేశుఁడు" అని వర్ణించబడింది. నరభూపాలీయంలోకూడా "ఘనభుజాశౌర్య రాఘవుఁడు రాఘవ

దేవ ధరణీశుఁడు" అని పేర్కొనబడింది. అందుగుల వెంకయ్య రచించిన నరపతి విజయంలో యీ రాఘవ రాజుకు "యవనబల మర్దనోత్సాహ— తుళువబల సంహారవీర" అన్న బిరుదులుపయోగింపబడ్డాయి. వీటివల్ల యితడొకవంక తురుష్కులతోనూ, మరొకవంక కర్ణాటకులతోనూ యుద్ధాలు నెరపినట్లు అర్థమవుతున్నది. ఇతనికున్న "శబరకుల బలనిహనన వినోద" అన్న మరొక బిరుదంవల్ల ఆటవికులైన శబరదొరలను పోరతో జయించాడని విశదమవుతున్నది. ఇతనికి "వాసుదేవ చరణ కమల సేవాసక్త చిత్త" అన్న విశేషణం ప్రయోగించడంవల్ల యితడు విష్ణుభక్తుడని గోచరమవుతున్నది. అంతేకాదు. రాఘవరాజు విష్ణువునుగురించి అనేక యజ్ఞాలుచేసి బ్రాహ్మణులకు అనేక అగ్రహారాలను దానంగా యిచ్చాడట. ఈ విషయం నరపతి విజయంలో యీ క్రింది పద్యంలో పేర్కొనబడింది.

> చ. పరబలవేది రాఘవ నృపాలుఁడు పంకజనాభుఁ గూర్చి య
> ధ్వరములు నగ్రహారములుదాత్తమతిన్ దగఁజేసి ధారుణీ
> సురుల కొసంగెఁ బర్వముల శుద్ధ సువర్ణగవాది దానముల్
> గరిమను బిన్నశౌరిని జగద్వినుతున్ ఘనుఁగాంచె వేడుకన్.

ఈ రాఘవరాజు ఒక వంక బహమనీ సుల్తానులతోనూ, మరోవంక బుక్కరాయలతోనూ పోరాడుతూ చివరకే యుద్ధంలోనో మరణించి వుంటాడని చరిత్రకారు లభిప్రాయపడ్డారు. ఇతని చివరి దశలో సోమదేవరాజు సంపాదించి యిచ్చిన రాజ్యంలోని ఉత్తరభాగాన్ని బహమనీ సుల్తానులు, దక్షిణభాగాన్ని బుక్కరాయలు తమతమ రాజ్యాలలో కలుపుకొని వుంటారని కూడా కొందరూహించారు. రాఘవ రాజును గురించిన యీ విశేషాలలో యే ఒక్క విషయంకూడా శ్రీవిరూపాక్ష-శ్రీరామ శాసనాలలో పేర్కొనబడలేదు. ఈ రాఘవరాజు భార్య బాచలదేవి. ఈ దంపతులకు పిన్నమరాజు పుట్టాడు.

## పిన్నమరాజు

ఈ పిన్నమరాజును పిన్నభూపాలుడు, పిన్నమశౌరి, పిన్నశౌరి అనికూడా కొందరు వ్యవహరించారు. ద్విపదబాల భాగవతంలో—

> "అతనికిఁ బిన్న భూపాగ్రణి యొదవె
> సతత సౌభాగ్య బాచల దేవియందు
> ఆ పిన్న భూపాలుఁడారె వీడనఁగ
> నేపారు పురి దనకిరవుగా నిలిచి
> సకల మహీపాల జాలంబుగొలువఁ
> బ్రకటిత తేజుఁడై రాజ్యంబుఁ జేసె"

అని ఆరవీడు రాజధానిగా పిన్నమరాజు రాజ్యం చేసినట్లు పేర్కొనబడింది. అయితే యితడు స్వతంత్రపరిపాలన సాగించాడో, సామంతుడుగా రాజ్య పరిపాలన సాగించాడో చెప్పలేము. కాని అప్పటి

పరిస్థితులనుబట్టి కర్ణాట సామ్రాజ్యానికి లోబడిన సామంతుడని భావించవలసి వుంటుంది. ఇతని భార్య ఔబలదేవి. ఈ ఔబలదేవీ పిన్నమరాజులకు సంజనితుడైన బుక్కరాజే బుక్కరాయలుగా, ఆరవీటి బుక్క రాయలుగా ప్రసిద్ధిచెందాడు. శ్రీ విరూపాక్ష-శ్రీరామ శాసనాల్లో రాఘవరాజును గురించి విశేషాలేమీ వ్రాయనట్లే, యీ పిన్నమరాజు గురించి కూడా ఉటంకించలేదు.

## (ఆరవీటి) బుక్కరాయలు

"ఈ బుక్కరాయలు ఆరవీటి నగరాన్ని పరిపాలించాడు. సాళువ నరసింహరాయల రాజ్యాన్ని నిల బెట్టాడు. అంతేకాదు. పండితులను ఆదరించి కల్పవృక్ష మనిపించుకున్నాడు. దేవతాస్త్రీల దేహకాంతులను మించిన కాంతి, ముఖలక్షణాలు, ఎంతో గౌరవించదగిన శీలసంపదకల 'బల్లాంబిక'ను ధర్మపత్నిగా స్వీకరిం చాడు. ఈ బల్లాంబికా బుక్కరాయలకు విద్యావీర పరాక్రమ సుందరుడైన 'రామరాజు' అన్న పేరు గల కుమారుడు జన్మించాడు." అని శ్రీ విరూపాక్ష శాసనంలో పేర్కొనబడింది. (శ్రీ విరూపాక్ష శాసనం 6వ పుట. 9, 10, 11 శ్లోకాలు) ఈ శ్లోకాలే శ్రీరామ శాసనంలో సైతం ఉటంకించబడ్డాయి. (శ్రీరామ శాసనం 47, 49 పుటలు. 8, 9, 10 శ్లోకాలు) ఈ బుక్కరాయల వద్దనుంచి ఆరవీటివంశం మహావటవృక్షంవలె చిలువలుపలువలుగా, శాఖోపశాఖలుగా విస్తృతి చెందింది. ఇతనికి అబ్బలదేవి, బల్లాంబ అనే యిద్దరు భార్య లున్నారు. వీరిరువురిసంతతీ గుమ్మడి తీగవలె వ్యాప్తి చెంది ఫలించినందున అటుకావ్యాలలోను, ఇటు శాస నాలలోను యెవరికవసరమైన వ్యక్తులను వారు పరిగ్రహిస్తూ వచ్చారు. ఆవిధంగా గ్రహించడంలో సైతం సవతితల్లి బిడ్డలను విడిచిపెట్టడమేకాదు ఏకమాతృ గర్భసంజనితులైన వారిని సైతం విడిచిపెట్టడం జరిగింది. శ్రీ విరూపాక్ష-శ్రీరామశాసనాలలో ఆరవీటి బుక్కరాయలకు యిరువురు భార్యలున్నారన్న సంగతి ప్రస్తా వించబడలేదు. అంతకుపూర్వం బుక్కరాయలకు ముత్తాత తండ్రియైన తాత పిన్నమరాజుకు యిరువురు భార్య లున్నారన్న సంగతే ప్రస్తావించబడలేదు. బుక్కరాయల యిరువురుభార్యలసంగతి పింగళి సూరన రచించిన కళాపూర్ణోదయంలో వారి సంతతితోసహా వర్ణించబడింది. (చూడు. వంశవృక్షం. H) కళాపూర్ణోదయ కృతి పతి కృష్ణమరాజు అబ్బలదేవి బుక్కరాయల వంశంలోవాడే అయినా అతనివంశంతోపాటు బల్లాంబా బుక్క రాయల సంతతిని సైతం మునిమనుమల వరకూ పింగళి సూరన వర్ణించాడు.

ద్విపద బాలభాగవతకర్త ఆరవీటి బుక్కరాయల పుత్రులనిద్దరినీ గ్రహించినా, రామరాజు సంతా నాన్ని తన కవసరమైనంతవరకూ యిచ్చాడు. రామరాజభూషణుడు తన వసుచరిత్రలో బుక్కరాజు కుమా రుడు రామరాజును మాత్రమే గ్రహించి, అతని సంతతిని తన కవసరమైనంతవరకూ తాను వర్ణించాడు. తెనాలి అన్నయ్య సుదక్షిణాపరిణయంలో బుక్కరాయల కుమారుని రామరాజును గ్రహించి అతని సంతానాన్ని తన కవసరమైనట్లుగా తానువర్ణించాడు. రామరాజభూషణుడు వసుచరిత్రలో ఆరవీటి బుక్కరాయల మను మలలో ఒకడైన శ్రీరంగరాజును గ్రహించి అతనిసంతతిని తన కవసరమైనంతవరకూ వర్ణించగా (చూడు వంశవృక్షం. C), దోనేరు కోనేరుకవి ద్విపద బాలభాగవతంలోనూ, తెనాలి అన్నయ్య సుదక్షిణా పరిణయం లోనూ బుక్కరాయల మనమలలో మరొకడైన (పొట్లపాడి) తిమ్మరాజు సంతతిని తమ కవసరమైనంత వరకూ వర్ణించారు (చూడు వంశవృక్షాలు. A, B)

అందుగుల వెంకయ్య రచించిన నరపతి విజయం ప్రకారం అళియ రామరాయలవంశం అని శ్రీ చిలుకూరి వీరభద్రరావుగారు బుక్కరాయల కుమారుడైన రామరాజు సంతతి ముగ్గురుగా పేర్కొనగా— ఇదే నరపతివిజయం ప్రకారం బుక్కరాయల కుమారుడైన రామరాజుకు ఐదుగురు పుత్రులున్నట్లు హిరాసు ఫాదరీ పేర్కొన్నారు. (చూడు వంశవృక్షాలు. D, E). అసలు నరపతి విజయం ప్రకారం బుక్కరాజు కుమారుడైన రామరాజు సంతతిని, వారిలోకూడా శ్రీరంగరాయల వంశాన్ని తన కవసరమైనంత మేరకే వెంకయ్య వర్ణించినట్లు స్పష్టపడుతున్నది. (చూడు వంశవృక్షాలు. F, G) వెంకయ్యకూడా అందరి వంశాలను పరిపూర్ణంగా పేర్కొనలేదు, కొంతవరకే పేర్కొన్నాడు.

వీరందరినీ మించి సాంబోపాఖ్యానకర్తయైన రామరాజు రంగప్పరాజు ఆరవీటి బుక్కరాయల కుమారుడైన రామరాజుకు ఒక్కరూ యిద్దరూ భార్యలుకారు, నలుగురు భార్యలున్నట్లు పేర్కొని వారి వారి సంతానాలను వర్ణించినా తన కవసరమైనంతవరకూ రెండవ భార్యవల్ల కలిగిన రామరాజు పుత్రపౌత్ర వంశాలను విపులంగా వర్ణించాడు. (చూడు వంశవృక్షం I). ద్విపద బాలభాగవతకర్త యీ రామరాజు నల్గురు భార్యల విషయం చెప్పినా వారి వంశాలను సాంబోపాఖ్యాన కావ్యకర్తవలె వివరించి వర్ణించలేదు. ఒకానొక శాసనంలో విఠలరాజు వంశాన్ని తెలుపుతూ బుక్కరాజు పుత్రుడు రామరాజూ, అతనిసంతతీ అవసరమైనంత మేరకే పేర్కొనబడింది. (చూడు వంశవృక్షం. J)

చరిత్ర పరిశోధకులలో శ్రీ కె. వి. లక్ష్మణరావుగారు బుక్కరాయల కిద్దరు భార్యలున్నట్లు పేర్కొన్నా, అతని కుమారుడైన రామరాజు బహుభార్యాత్వ విషయం, అతని సంతతి విషయం తమ "హిందూదేశ కథాసంగ్రహము (మహమ్మదీయ యుగము)"లో యెత్తనేలేదు. (చూడు వంశవృక్షం. K) సంగ్రహాంధ్ర విజ్ఞాన కోశంలో బుక్కరాయల కుమారుడు రామరాయలు అని పేర్కొన్నా, వాస్తవిక చరిత్రకూ, వంశవృక్షానికీ విరుద్ధంగా ఆ రామరాయల కుమారుడే అళియరామరాయలని పొరపాటు వంశ వృక్షాన్ని యిచ్చారు. సంగ్రహాంధ్ర విజ్ఞానకోశము ఒకటవ సంపుటము 472వ పుటలో ఆరవీటి వంశము అన్న శీర్షికతో వ్రాసిన దానిలో ఈయబడిన వంశవృక్షం బుక్కరాయల మనుమడైన శ్రీరంగరాయల తరాన్నీ అళియ రామరాయల తండ్రినీ తెరమరుగుకు త్రోసివేసింది. (చూడు వంశవృక్షం.L).

ఆరవీటి వంశానికి మూలపురుషుడని ప్రసిద్ధివహించిన ఈ బుక్కరాయల జననం గురించి ద్విపద బాలభాగవతంలో ఈ క్రిందివిధంగా వర్ణించబడింది.

ప్రభవించె నతని కౌబలదేవియందు
ప్రభుమణి బుక్క భూపాల చంద్రుండు
యెక్కువ గుణముల నియ్యారెవీటి
బుక్కనరేంద్రుండు భువిఁ బుట్టినంత
వారిజాప్తోదయ వర్ణిత వేళఁ
దారలగతియయ్యెఁదక్కురాజులకు

నరనాథమణి సాళ్వ నరసింగరాయ
వరసఖుండయి బుక్క వసుధేశుఁడమరె
బుక్కభూపాలుండు బుధులకునెల్ల
దిక్కతండె యనంగఁ దేజంబునందె

ఇతడు రాజశేఖరుడైన సాళువనరసింగరాయలకు స్నేహితుడుగావుండి అతని రాజ్యాన్ని కాపాడినట్లు శ్రీవిరూపాక్ష-శ్రీరామ శాసనాలలో పేర్కొనబడింది. సాళువనరసింహ రాయలు క్రీ. శ. 1447 మొదలు 1465 వరకూ కర్ణాట సామ్రాజ్యాన్ని పరిపాలించిన మల్లికార్జునరాయలకునూ, క్రీ. శ. 1465 మొదలు 1478 వరకూ పాలించిన విరూపాక్షరాయలకునూ సమకాలీనుడై వారికి సామంతుడై వున్నాడు. కర్ణాటసామ్రాజ్యంలోని చంద్రగిరి పరిపాలకుడైన యితడు, ఆ సామ్రాజ్యం క్షీణించి దెబ్బతిన్న రోజులలో స్వతంత్రుడై ఆరవీటి బుక్కరాయల సహాయంతో క్రీ. శ. 1487 ప్రాంతంలో కర్ణాటసామ్రాజ్యాన్నంతటినీ తానే ఆక్రమించుకొని పట్టాభిషిక్తుడై క్రీ. శ. 1493 వరకూ రాజ్యపాలన చేశాడు. ఆరవీటి బుక్కరాయలు సాళువనరసింహరాయల రాజ్యసంస్థాపనలో అత్యంతప్రధానమైన పాత్రవహించాడని పద్యబాలభాగవతంలో కూడా ఈ క్రింది పద్యంలో వర్ణించబడింది.

"అతఁడు దను మన్నె పులియని యఖిల దిశలఁ
జెలఁగి పొగడ సాళువ నరసింగరాయ
రాజ్య సంస్థాపకుండయ్యెఁ బ్రౌఢి నార
వీటి బుక్కనరేంద్రుఁడుద్ఘాటితారి."

ఈ బుక్కరాయల బిరుదు గద్యలో "సాళువ నరసింహరాయ రాజ్యప్రతిష్ఠాపనాచార్య" అనికూడా పేర్కొనబడింది. ఈ బిరుదుగద్య పూర్తిపాఠం యిది.

"జయజయ స్వస్తిశ్రీ సంతత వేంకటాచలపతి చరణారవిందసేవాకందళిత సామ్రాజ్యసుఖోప భోగ, సాళువ నరసింహరాయరాజ్య ప్రతిష్ఠాపనాచార్య, శౌర్య గరిష్ఠ, సకలకళావిశారద, దైనందిన వితరణ నానాదిగంతరాగతవనీపకజాల పరిపాలన గుణవిశేష, అసహాయశౌర్య, సుమేరుధైర్య, అష్టాదశ విద్యాప్రజ్ఞా ప్రవీణ, రాజకులాభరణ, రాజరాజేశ్వర, పిన్నశౌరి రాజతనూజ, బుక్కరాజ విజయీభవ దిగ్విజయీభవ."

ఈ ఆరవీటి బుక్కరాజు శతాధిక వృద్ధుడై హాయిగా జీవించి శ్రీకృష్ణ దేవరాయల పట్టాభిషేకం సైతం చూచినట్లు నాటిరాజాస్థానాన్ని అలంకరించివున్నట్లు కృష్ణరాయ విజయంలో కుమారధూర్జటికవి పేర్కొన్నాడు.

చక్కెర విలుకాని చక్కందనముగల్గి
చొక్కమౌనార్వీటి బుక్కరాజు

అని దూర్జటి వర్ణించడం చూడగా బుక్కరాజు ఎంతటి సుందరవదనారవిందుడో స్పష్టపడుతుంది. దక్షిణభారతదేశంలో తామరతంపరగా పెరిగి పెంపొందిన యీతని సంతతి 300 సంవత్సరాలు పైగా హిందువులకు శత్రువులైన మహమ్మదీయ మతస్థులను తుడిచిపెడుతూ, హిందూ సంఘాన్నీ, మతాన్నీ సంరక్షించుకుంటూ, పరిపోషించుకుంటూ ఆచంద్రార్కమైన కీర్తిని సంపాదించింది.

ఈ బుక్కరాజు వంశనామంగా నిలచిన ఆరవీడు కర్నూలుజిల్లా మార్కాపురం తాలుకాలోని ఒక గ్రామం. విజయనగర సామ్రాజ్యాధిపతులైన ఆరవీటి వంశీకులకు ఇది పెట్టని కోట. కర్నూలుజిల్లా సిరివేలు తాలూకా దిగువ అహోబిలంలో వున్న నరసింహస్వామికి ఆరవీటి వణిజులు కొందరు ఏడు బంగారుకలశాలు మొదలైనవి దానం చేసినట్లు అహోబిలంలో వున్న ఒక శాసనంవల్ల స్పష్టపడుతున్నది. కడపజిల్లా రాయచోటి తాలూకాలో ఆరెవీడు అని ఒక గ్రామం, నెల్లూరుజిల్లా ఆత్మకూరు తాలూకాలో మరొక ఆరవీడు గ్రామం ఉన్నది. సిరివేలు తాలూకాలో వున్న శాసనాలవల్ల, (No : 581 of Kurnool District Inscriptions of Madras Presidency. Rangachari) కర్నూలుజిల్లాలోని ఆరవీడే ఆరవీటి వంశజులకు మూలస్థానమని స్పష్టపడుతున్నది. అయితే కర్నూలుజిల్లాలోని ఈ ఒక్క ఆరవీడు మాత్రమే ఆరవీటివంశజులదని మనం భావించనక్కరలేదు. "నెల్లూరుజిల్లాలోని ఆరవీడు కూడా మాదే! మా ఆధీనం లోనిదే!" అని స్పష్టపరచి చెప్పాలనుకున్నట్లుగా ఆరవీటి బుక్కరాజు మనుమనికి మనుమడూ శ్రీ విరూపాక్ష శాసనప్రదాతా అయిన శ్రీరంగరాయలు నెల్లూరిసీమను కూడా తన రాజ్యంలో కలుపుకొని పరిపాలించాడు. (శ్రీ విరూపాక్ష శాసనం 11 పుట 46 శ్లోకం). ఎంతెంతగానో తన రాజ్యాన్ని విస్తృతపరచిన శ్రీరంగరాయలు కడపజిల్లాను తన ఆధీనంలోకి తెచ్చుకోలేదనీ, ఆ రూపంగా ఆ జిల్లాలోని ఆరవీడును సైతం తనదిగా చేసుకోలేదనీ యెవరూ చెప్పలేరు.

బుక్కరాయలవంశంలో రామరాయనామధారులు శ్రీరంగరాయనామధారులు అనేకమంది వున్నారు. ఇదేవిధంగా తిరుమలశబ్దనామకులైన స్త్రీపురుషులుభయులూ అనేకులున్నారు. కవులూ, చరిత్రకారులూ రామరాజనామకులను రామరాయలుగానూ, రామరాయలునామకులను రామరాజుగానూ, శ్రీరంగరాజు నామకులను శ్రీరహితంగా రంగరాజుగానూ, శ్రీరంగరాయలు, రంగరాయలు నామాలతోనూ వ్యవహరించారు. ఇదే పద్ధతిలో శ్రీరంగరాయ, రంగరాయ నామధారులను శ్రీరంగరాజు, రంగరాజు నామధారులుగా వ్యవహరించారు. ఇదేవిధంగా తిరుమలరాజును తిమ్మరాజనీ, తిరుమల రాయలనీ వ్యవహరించారు. తిరుమలాంబను తిమ్మాంబగా పేర్కొన్నారు. పేరులలో వున్న సూక్ష్మమైన యీ మార్పులను దృష్టిలో పెట్టుకొని పాఠకులు రామరాజప్రభృతులను—ఏ విధంగా వ్యవహరించినా తికమకపడకుండా గుర్తించవలసి వుంటుంది. కవులు పద్యాలలో రాజులపేర్లుపయోగించేటప్పుడు గణాలకు అనుగుణమైన విధంగా పేర్లనుపయోగించారు. కొన్ని సందర్భాలలో ప్రజలలో సైతం వ్యవహారంలో సౌలభ్య అపేక్షతో యిటువంటి మార్పులు జరుగవచ్చును. అందువల్ల వంశ వృక్షంలో రామరాజు-రామరాయలు వంటి నామాలు యేవి వాడినా అన్నింటినీ ఒకటిగా భావించి, ఒకటవ వ్యక్తి, రెండవ వ్యక్తిగా వరుససంఖ్యలిచ్చి నిర్దేశించడం జరిగింది. ఒకేకాలంలో అనేకమంది వ్యక్తులున్నపుడు "A-B"ల వంటి చిహ్నాలతో ఒకేసంఖ్య యివ్వడంకూడా జరిగింది. ఈ విషయాన్ని పాఠకులు గుర్తించాలి.

## రామరాజు (1)

"బల్లాంబికా ఆరవీటి బుక్కరాయల పుత్రుడైన ఈ రామరాజు † మహావీర తేజోపరాక్రమవంతుడు. డెబ్భైవేల మంది తురుష్క సైన్యాలతో తనను ఎదిరించిన ఇబ్రహిం ఆదిల్‌షాను ఓడించి అతని భూములను గిరిదుర్గాలను స్వాధీనపరచుకున్నాడు. కాసప్పొడయలను పారద్రోలాడు. దేవేంద్ర వైభవాన్ని మించిన ప్రాభవంతో విరాజిల్లాడు. తన భుజబలంతో కర్నూలు దుర్గాన్ని జయించాడు. ఈ రామరాజు గొప్ప విష్ణుభక్తుడు. కర్నూలు దుర్గాన్ని జయించిన తరువాత, దానికి సమీపంలో ఉన్న విష్ణుపాద తీర్థంలో శత్రువులు విషమీయగా దానిని అమృతంగా సేవించి జీవించిన అమృతసిద్ధిగల మహాభక్తుడు. యాచక సమూహాలకు వరప్రసాదిని అయిన చింతామణిగా విరాజిల్లినవాడు. ఈ రామరాజు లక్ష్మిసమానురాలైన 'లక్కాంబిక' ను పట్టపురాణిగా స్వీకరించాడు. యితడు గొప్పతపస్సుచేసి శ్రీరంగరాయలు అనే పుత్రుని కన్నాడు."—

అని శ్రీ విరూపాక్ష శాసనంలో పేర్కొనబడింది. (చూడు శ్రీ విరూపాక్ష శాసనం 3, 5 పుటలు 11, 12, 13, 14, 15 శ్లోకాలు.) శ్రీరామ శాసనంలో ఈ సందర్భంలో—శ్రీవిరూపాక్ష శాసనంలోని 11, 14, 15 శ్లోకాలు మాత్రమే పరిగృహితమైనాయి. రామరాజు వీరపరాక్రమాన్ని వర్ణించే 12, 13 శ్లోకాలు శ్రీరామ శాసనంలో విడిచిపెట్టబడినాయి.

ఆరవీటి బుక్కరాజుకు అబ్బలదేవి, బల్లాంబిక అనే యిద్దరు భార్యలున్నారని గతంలో గుర్తించాము. అబ్బలదేవియందు బుక్కరాయలకు సింగరాజు మొదలైన పుత్రులు కలిగారు. వీరివంశాన్ని కొంతవరకూ కళాపూర్ణోదయ అవతారిక ననుసరించి మనం గ్రహించవచ్చును. (చూడు వంశవృక్షం. H.) ఈ సింగరాజు నంద్యాల పట్టణాధీశుడై, ఇతనివంశీకులు నంద్యాల వారుగా పరిగణించబడ్డారు.

ఆరవీటి బుక్కరాయల రెండవభార్యయైన బల్లాంబికకు రామరాజు జన్మించాడు. ఈ రామరాజు మహావీరశౌర్యపరాక్రమవంతుడు. ఇతనిని బుక్కరాయలు కందనవోలుకు (కర్నూలు) అధీశ్వరుడుగా చేశాడు. ఈ రామరాజు సైన్యంలో 3,500 ఏనుగులు, 70,000 గుఱ్ఱములు, 6,30,000 కాల్బలములు వున్నాయి. ఈ వివరాలు అందుగుల వెంకయ్య రచించిన నరపతి విజయంలో, ఈ క్రింది సీసపద్యంలో వర్ణించబడ్డాయి.

సీ. మదకరి కోకటి కిర్వది గుఱ్ఱములు గుఱ్ఱ
 మునకు విలుకాండ్రు ముగురు విచ్చు
కత్తుల వా రీరెకాండ్రట్ల వర్థిల
 నిట్టి యేనుఁగులను జుట్టు మూఁడు
వేల యేనూరునుద్వృత్తితో నడవంగఁ
 గందనోల్నాధిపఁగాఁ దలంచి
మొనఁ ద్రుంచి గట్టిగా ముట్టడి దిగిననా
 బిబ్బిని మిక్కిలి యుబ్బణంచి

† ఈ రామరాజును రామరాయలుగా సైతం కొన్ని సందర్భాలలో వ్యవహరించడం జరిగింది.

తే. గీ. ప్రకట సప్తాంగములఁగొని రామ విభుఁడు
కందనోల్రాజధానిగ గాఁగ వసుమ
తియును నేల మహాహవ దీక్షఁబూనె
బలిమికలిమి నాశావనీపకులఁ బెనుప.

ఇతని సైనిక సంపత్తినీ, యుద్ధ నైపుణ్యాన్నీ తెలుసుకొనలేక బిజాపూరు సుల్తానైన ఇబ్రహీం ఆదిల్ షా దండెత్తి ఘోరపరాభవంపొంది తన రాజ్యాన్నీ, సర్వస్వాన్నీ కోల్పోయాడు. ఆదిల్ షా 70,000 మంది సైన్యాలతో రామరాజు నెదుర్కొన్నట్లు శ్రీవిరూపాక్ష శాసనంలో స్పష్టంగా పేర్కొనబడింది. ఆదిల్ షాను ఓడించి అతని భూములనూ, గిరిదుర్గాలనూ స్వాధీనపరచుకున్నట్లు కూడా శ్రీవిరూపాక్ష శాసనంలో స్పష్టపరుచబడింది†. ఈ విషయం పద్య బాలభాగవతంలోనూ–ద్విపద బాలభాగవతంలోనూ ఉటంకించబడింది. ఆ పద్యాలివి.

"గబ్బుల్ డెబ్బదివేవు రాశ్వికులు వేడ్కన్ గొల్వగాఁగిన్కఁబె
న్మబ్బుల్ గప్పగఁగందనోలుగొను వేడ్కన్ జుట్టుముట్టన్ సవా
బిబ్బీనుబ్బణగించితోలె నరిరాడ్భీముండు లంకాసర
ణ్యాబ్బుంద్రాభుఁడు బుక్కభూవిభుని రామాధీశుఁడాహోయనన్" (పద్య బాలభాగవతము)

"ఎందునెన్నఁగఁ జాలునిద్ధశౌర్యమున
గందనవోలి దుర్గంబులో నుండి
బుక్కయరాయ భూభుజుఁడెల్లనృపుల
నెక్కువ యిదియని యెన్నంగఁజాలి
వీరులు డెబ్బదివేవు రాశ్వికులు
చేరికొల్వంగ వచ్చిన సవానెదిరి
కలనంది పంచబంగాళంబు సేసి
గెలిచెఁ దచ్చరితంబు గీర్తింపఁదరమె."

(ద్విపద బాలభాగవతము)

ఈ రామరాజు బిరుదుగద్య ఈ క్రింది విధంగావున్నది.

"జయజయ, స్వస్తి సమస్తి సమరసమయ బలరజోమిళిత సప్త సాగర ఘుంఘుమిత కల్లోలజాల, శరణాగత పాల, హల్లీసు సేనోల్లాసిత సప్తశత సైంధవగ్రహణ పరాక్రమధుర్య, రత్నసానుధైర్య దుర్వార తర సవాయి సైనికహరణ, సవాబిబ్బిరాజు సప్తాంగహరణ మార్గచరణ, రణభయానక జయాన కారవముఖరీ కృత కులగిరిదరీనికర, పోషితావనీ సుకరప్రకర, నిరావాపాదావనీ దుర్గనివాసి కాళవాడయ దుర్మద

† ఈ రామరాజు 70,000 మంది తురుష్క సైనికులతో పోరాడి విజయం సాధించగా – షుమారు 500 సంవత్సరాల తరువాత యిటీవల1971లోప్రధాని శ్రీమతి ఇందిరాగాంధి నాయకత్వంలోవున్న భారత ప్రభుత్వ సైన్యాలు–బంగ్లాదేశ్ విమోచనలో–సంరక్షణలో పాకిస్థాన్ ముస్లిమ్ సైనికులతో పోరాడి అమోఘమైన విజయాన్ని సాధించి తొంభై వేలమంది సైనికులను ఖైదీలుగా పట్టుకొని అపూర్వమైన చరిత్రను సృష్టించాయి.

ఖలనిర్మథన, ధర్మధౌరేయ, దానరాథేయ వీర రమాసమాపరోహణారంభ సోపాన దోస్తంభ, వాక్కుంఠీనస సార్వభౌమారంభ, పరిపంథినృప పుండరీకాధిపరాజ మండల కబళ నవ్యాగ్రిమోదగ్రమండ లాగ్ర సింహికా తనూజ, రామరాజ విజయీభవ."

ఈ బిరుదుగద్యలో "దుర్వారతర సవాయి సైనికహరణ, సవాబిబ్బిరాజసప్తాంగహరణ మార్గశరణ" అన్న బిరుదులు ఆదిల్‌షాను ఓడించడం వల్లనే రామరాజుకు ఉపయోగించబడ్డాయని స్పష్టపడుతున్నది.

ద్విపద బాల భాగవతంలో,

"వినుతింపఁదగు నాదవేని దుర్గమున
ననతుఁడై యుండు కాచాధీశు గెలిచి
అరుదుగా సప్తాఙ్గహరణంబు సేసె
గరిమోన్నతుండు బుక్కరాయ విభుఁడు."

అని ఆదవేని దుర్గాధీశుడైన కాచరాజును జయించి, అతని సప్తాంగాలను హరించినట్లు చెప్పబడింది. అందువల్ల యితనికి "నివాపాదావనీదుర్గ వాసికాసవోడయ దుర్మద ఖలనిర్మథన" అన్న బిరుదు వచ్చినట్లుకనిపిస్తున్నది. కాచరాజువిజయనగర సామ్రాజ్యాన్ని తొలుత పరిపాలించిన సంగమ వంశీయుల పక్షంలోవుండి క్రీ. శ. 1487వ సంవత్సరప్రాంతంలో సాళువ నరసింహరాయలు విజయనగర సామ్రాజ్యాన్ని ఆక్రమించుకొన్నప్పుడు అతన్ని వ్యతిరేకించి వుంటాడు. ఆరవీటి బుక్కరాయల కుమారుడైన యీ రామరాజు సాళువ నరసింహరాయల పక్షంవహించి, ఆదవేనిపై దండయాత్రసాగించి, కాచరాజును ఓడించి, అతని సప్తాంగాలను స్వాధీనపరచుకుని ఆదుర్గానికి తన రెండవకుమారుడైన కొండరాజును పరిపాలకుడుగా నియమించి వుంటాడు.

క్రీ. శ. 1492 మొదలు 1528 వరకూ కళింగదేశ పరిపాలన సాగించిన ప్రతాపరుద్ర గజపతి "జమునాపురాధీశ్వరుడైన హుసేన సాహి అనబడే తురుష్కుడు శరణాగతుడు కాగా శత్రువుల నుండి అతనిని రక్షించి కాపాడి"నట్లు తన సరస్వతీ విలాసంలో పేర్కొన్నాడు. ప్రతాపరుద్రగజపతి సింహాసనమెక్కిన యేడెనిమిదిసంవత్సరాలకు క్రీ.శ. 1500 ప్రాంతంలో దక్షిణదిగ్విజయ యాత్రకు బయలుదేరాడు. అప్పుడు బుక్కరాజు కుమారుడైన రామరాజు చేతులలో ఓడిపోయిన హుసేనసాహి (హల్లీసుసేనుడు) గజపతికి శరణాగతుడై ప్రాణాలుకాపాడుకొనివుంటాడు. రామరాజు హల్లీసుసేనునివద్దవున్న 700 గుఱ్ఱాలను సైతం స్వాధీన పరచుకొని వుంటాడు. అందువల్లనే యితనికి "హల్లీసుసేనోల్లాసిత సప్తశత సైంధవ గ్రహణ పరాక్రమ ధుర్య" అన్న బిరుదువచ్చివుంటుంది.

ఈ రామరాజు బిజాపూరు రాజును జయించి, అతని గిరిదుర్గాన్ని ఆక్రమించినట్లూ, కర్నూలు దుర్గాన్ని సైతం జయించినట్లూ ఒక్క శ్రీవిరూపాక్ష శాసనంలోనే కాక వీర వేంకటపతి విలపాక శాసనంలో సైతం వర్ణించబడింది.

"తతోऽజనిహరన్ దుర్గాణి సప్తాహితాత్,
అహ్నైకేన ససోమదేవ నృపతిః ......శ్రీపిన్న మోభూన్నృపః,
ఆరవీటినగరీ విభోరభూ, దస్యబుక్క ధరణీపతి స్సుతః,
యేనసాళువనృసింహరాజ్యమ, ప్యేధమాన మహాస్థిరీకృతమ్,
... ... ... ... రామరాజం సుతమ్
సహస్రై స్సప్తత్యా సహితమపి య సింధు జనుషామ్
సపాదస్వానీకం సమితి, భుజశౌర్యేణ మహతా,
విజిత్యాద త్తేస్మా దవనిగిరి దుర్గం విభూతయా
విధూతేంద్రః కాసప్పొడయ మపి విద్రావ్య సహసా
కందనవోలిదుర్గ మురుకందల దభ్యుదయో బాహుబలేనయో బహతరేణ్యా
విజిత్య............"

(ఎపిగ్రాఫికా ఇండియా 4 వ పుస్తకం. 272 వ పుట)

ఆదిల్ షాను బుక్కరాయల కుమారుడైన రామరాజు ఓడించినట్లు ద్విపద బాలభాగవతాది గ్రంథాలూ, శ్రీవిరూపాక్షాది శాసనాలూ యెలుగెత్తి చాటుతుండగా కీర్తిశేషులైన కొమర్రాజు వేంకటలక్ష్మణరావుగారు బుక్కరాయల మునిమనుమడూ, రామరాజు మనుమడూ, శ్రీరంగరాయల పుత్రుడూ అయిన అళియరామరాజు ఆదిల్ షాను ఓడించినట్లు తికమకలుగా, గజిబిజిగా కొంత చరిత్ర వ్రాశారు. (చూడు. హిందూదేశ కథాసంగ్రహము:—మహమ్మదీయ మహాయుగము పుటలు 392 మొదలు 397 వరకు.)

రామరాజు కర్నూలు దుర్గాన్ని జయించిన తరువాత దానికి సమీపంలోనేవున్న విష్ణుపాదతీర్థంలో శత్రువులు విషమియ్యగా దాన్ని అమృతంగా సేవించి జీవించిన భక్తుడుగా శ్రీవిరూపాక్ష శాసనంలో వర్ణించబడింది. (శ్రీవిరూపాక్ష శాసనం 5వ పుట 13వ శ్లోకం.) శాసనంలో శత్రువులు విషమిచ్చినట్లు పేర్కొనబడిందేగాని, ఆ శత్రువులు మహమ్మదీయులో, హిందువులో, జ్ఞాతులో, బంధువులో పేర్కొన బడలేదు. అయితే శ్రీవిరూపాక్ష శాసనంకంటే ప్రాచీన గ్రంథమైన ద్విపద బాలభాగవతంలో రామరాజుకు బంధువులే విషం పెట్టినట్లు చెప్పబడింది. ఆ ద్విపదలివి.

"ఆమహీపతికి బల్లాంబికయందు
రామనృపాలుండు రాజేంద్రుఁడొదవె
హరిపాదతీర్థంబునందు బాంధవులు
గరళంబు వెట్టినగతి యెఱింగియును
తెలిఁగొప్ప యెఱిగి తత్తీర్థంబునాని
యరిగించుకొనియె రామావని విభుఁడు."

నరపతి విజయంలో ఈర్ష్యాళువులైన జ్ఞాతులు యీ విషప్రయోగం చేసినట్లు యీ క్రింది పద్యంలో ఉటంకించబడింది.

చ. మగటిమికోర్వలేక దయమాలటు జ్ఞాతినియుక్త బుద్ధిచే
సగరతఁగన్న తీర్థమిడఁజాలక యర్భకుఁడున్నఁ జూచి శ్రీ
నగధర నీవెదిక్కని జనంబులు గగ్గొననంతఁ గ్రోలి యా
సగరునిఁబోలి రామనృపచంద్రుఁడు చెందఁడు తద్వికారమున్.

రామరాజు పట్టపురాణి లక్కాంబిక (లక్ష్మమ్మ) అని శ్రీవిరూపాక్షశాసనంలో (5వ పుట 14 వ శ్లోకం.) చెప్పబడింది. ఈ లక్కాంబికా రామరాజులకు మహావీరుడైన శ్రీరంగరాయలు పుత్రుడైనట్లు 15 వ శ్లోకంలో వర్ణించబడింది. లక్కాంబికను పట్టపురాణిగా శాసనకర్త పేర్కొనడం చూడగా, రామరాజుకు లక్కాంబిక ఒక్కతి మాత్రమేగాక మరికొందరు భార్యలున్నట్లు అర్థమవుతున్నది. ద్విపద బాలభాగవతంలో రామరాజుకు ఔబలాంబ, లక్కమాంబ, రంగమాంబ, అమలాంబ అని నలుగురు భార్యలున్నట్లు ఈ క్రింది ద్విపదలలో పేర్కొనబడింది.

ఆ రామభూపతి కంగనామణులు
పేరైన యౌబలాంబిక, లక్కమమ్మ
యంబుజనేత్ర రంగమ్మయు నమల
మాంబయు నల్గురునై రందులోన

వీరిలో లక్కమాంబకు తిమ్మరాజు, కొండరాజు, శ్రీరంగరాజు అను ముగ్గురు పుత్రులు జనించినట్లు ద్విపద బాల భాగవతంలో పేర్కొనబడింది.

"ఆ రామనృపు లక్కమాంబ పుణ్యమున
ధీరతహేమాద్రి తిమ్మభూవరుని
వరకీర్తి కొండభూవరుని శ్రీరంగ
ధరణీశు ముప్పురు తనయులఁగాంచె

నరపతి విజయంలోనూ, రామరాజ భూషణుని వసుచరిత్రలోనూ లక్కాంబికా రామరాజులకు ముగ్గురు పుత్రులుదయమైనట్లు ఉల్లేఖించబడింది.

"క. ఆ రామనృపతికి మహో
దారుఁడగు తిమ్మరాజు ధన్యుఁడు కొండ
క్ష్మారమణుఁడు బుధనుత స
చ్చారిత్రుఁడు రంగవిభుఁడు జనియించి రొగిన్"

(నరపతి విజయము)

శా. ఆరామక్షితి భర్తకుం బ్రథిత సత్యాలాప ధర్మోద్భవ
శ్రీరమ్యుండగు తిమ్మరాజు బల లక్ష్మీధామ భీమప్రథా
పారీణుండగు కొండశౌరి విజయ ప్రఖ్యాత చారిత్రుఁడౌ
శ్రీరంగేంద్రుఁడు గల్గి రైందవకుల క్షేమంకరాకారులై.

(వసుచరిత్ర)

తెనాలి అన్నయ్య రచించిన సుదక్షిణా పరిణయంలోనూ, రామరాజు రంగప్పరాజు రచించిన సాంబో పాఖ్యానంలోనూ, యీ రామరాజుకు ముగ్గురు పుత్రులున్నట్లు పేర్కొనబడింది కాని రెండవకుమారుడైన కొండరాజును యీ కావ్యకర్త లిద్దరూ పెదకొండరాజుగా ఉటంకించారు. అయితే శ్రీవిరూపాక్ష శ్రీరామ శాసనాల్లో మాత్రం ఒక్క శ్రీరంగరాయలేతప్ప యితర పుత్రులు పేర్కొనబడలేదు.†

---

† రామరాజు పుత్రులైన తిమ్మరాజు, కొండరాజుల ప్రసక్తి శ్రీవిరూపాక్ష శ్రీరామశాసనాల్లో లేకపోయినా పరిశోధకుల-పాఠకుల సౌకర్యార్థం వారిరువురి గురించి కూడా యీక్రింద సంగ్రహంగా పేర్కొనబడుతున్నది. లక్కమాంబా-రామరాజుల పెద్దకుమారుడైన తిమ్మరాజు 'అవుకు' పురాన్ని పరిపాలించడంవల్ల అతనికి, అతని సంతతికి 'అవుకు వారు' అన్న పేరువచ్చింది. అందువల్ల తిమ్మరాజును అవుకు తిమ్మరాజు అని వ్యవహరించడం ప్రాచీనకాలంనుంచీ జరుగుతున్నది. ఈ విషయాన్ని 'నరపతి విజయంలో' యీ క్రింది పద్యంలో వెంకయ్య పేర్కొన్నాడు.

కం॥ ఆ తిమ్మనృపతి భూకాం
తా తిలకంబైన యవుకు దానేలుచు వి
ఖ్యాతిగ నప్పురి పేరం
బ్రీతినిఁదనకులము వెలయఁబెంపొందె మహిన్.

కాగా యీ తిమ్మరాజు 'అవుకు' వంశానికి మూలపురుషుడయ్యాడు. ఈ అవుకు గ్రామం ప్రాచీనకాలంలో సీమ నామకమై కర్నూలుజిల్లా కోయిలకుంట్ల తాలూకాలో వున్నది. తిమ్మరాజుకాలంలో ఈ 'అవుకు' సీమ 'సిరివెల్ల' తాలూకా ప్రాంతానికి సైతం వ్యాప్తి చెందివున్నట్లు అర్థమవుతున్నది. ప్రాచీన శాసనాలలో 'అవుకు' సీమలోని గ్రామాలుగా పినయమ్మనూరు-పెదచింతకుంట-తుమ్మలపెంటగ్రామాలు పేర్కొనబడ్డాయి. ఈ తిమ్మరాజుకు అనేకమంది భార్యలున్నారు. మూడవ భార్యయైన గోసమాంబవల్ల నలతిరుమలరాజు, విఠలరాజు, చినతిమ్మరాజు, పాపతిమ్మరాజు, జన్మించారు. పెద్దకుమారుడైన నలతిరుమలరాజు తన తండ్రియైన యీ తిమ్మరాజు పేర దోనేరుకోనేరుకవి రచించిన పద్యబాలభాగవతాన్ని అంకితమిప్పించాడు. తన రెండవ తమ్ముడైన చినతిమ్మరాజు పేర ద్విపద బాలభాగవతాన్ని అంకితమిప్పించాడు. ఇందులో అవుకు వంశానికి మూలపురుషుడైన తిమ్మరాజు గురించి అనేక విషయాలు వర్ణించబడ్డాయి. దోనేరుకోనేరుకవి మొదట ద్విపద బాలభాగవతాన్ని రచించి అనంతరం పద్య బాలభాగవతాన్ని రచించినట్లు శ్రీచిలుకూరి వీరభద్రరావుగారు పేర్కొన్నారు గాని ఇది వాస్తవంకాదు. తిమ్మరాజుకు అకింతంగా తొలుత రచించిన పద్యబాలభాగవతాన్ని ద్విపదగా మలచి చినతిమ్మరాజు పేర అంకిత మీయవలసిందనీ, చినతిరుమలరాజు కోరినట్లు యీ క్రింది ద్విపదలలో స్పష్టంగా పేర్కొనబడింది.

"జనపతి మణికి మజ్జనకుడౌ రామ
జననాథు తిమ్మభూజానికి మున్ను

## శ్రీరంగరాయలు (1)

"శ్రీరంగరాయలు మహాతేజోవంతుడు. వీరాగ్రేసరుడు. క్షమాది సద్గుణాలతో అరుంధతి వంటి మహాపతివ్రతగా వెలుగొందే 'తిరుమలాంబిక'ను శ్రీరంగరాయలు ధర్మపత్నిగా స్వీకరించాడు. ఈ తిరుమలదేవీ శ్రీరంగరాయల దంపతులకు రామరాయలు, తిరుమలరాయలు, వెంకటాద్రిరాయలు అన్న ముగ్గురు కుమారులు కలిగారు." అని శ్రీవిరూపాక్ష శాసనంలోను (చూడు 5 పుట 15-16-17 శ్లోకాలు.) శ్రీరామశాసనంలోనూ (చూడు 49 పుట. 12-13-14-శ్లోకాలు) తెలుపబడింది.

---

వచియించితౌనంః బద్యకావ్యముగః
ప్రచురంబుగా బాలభాగవతంబు
వాసికి నెక్కి యివ్వసుధాతలమున
భాసిల్లు నాబాల భాగవతంబె
యరుదుగా నడచిన యన్ని మార్గములః
దిరముగా మా చిన తిమ్మయ్య పేర
ద్విపద కావ్యంబుగా వెలయంగః జేయు
మిపుడు మాకెంతయు హితమిది యనుచు"

తిమ్మరాజు క్రీ. శ. 1505 మొదలు 1545 వరకూ విజయనగర రాజుల పక్షాన నిలచి అనేక యుద్ధాలలో పాల్గొన్నాడు. ఇతని జీవితంలో మహత్తరాలైన వింత మాహాత్మ్యాలు కొన్ని జరిగినట్లు బాలభాగవతకర్త వర్ణించాడు. కళ్లులేని ఒక గోపకునకు వేంకటేశ్వరస్వామి అనుగ్రహించి ఒక నేత్రం యిచ్చి వేంకటేశ్వరస్వామి తిమ్మరాజుకు స్వప్నంలో కనిపించి రెండవకన్ను నీయవలసిందని ఆజ్ఞాపించగా దయతో ఆ గోపకునికి తిమ్మరాజు చూపు వచ్చేటట్లు చేశాడట. ఈ విషయాన్ని-

వేంకటేశ్వరు నాజ్ఞ విగత దృష్టికి దృష్టి
దయమీరనిచ్చె యే ధర్మమూర్తి

అని పద్య బాలభాగవతంలో వర్ణించగా, ద్విపద బాలభాగవతంలో—

"అపదృష్టి యగు నొక్క యాభీరునకును
నిపుణుండు వేంకట నిలయుండు చక్రి
యొక కంటిచూపు తానొసఃగి స్వప్నమునః
బ్రకటుఃడై తిమ్మభూపాలు మన్నించి
ఓ కృతకృత్య ! నీ కుర్వీశులెనయె ?
నీ కహోబల పుణ్యనిధి మోక్షమిత్తుః
గరుణ గోపాలుని కడమ చూపిమ్ము,
నరనాథ యనుచు నానతి యిచ్చుటయును
గొలువులో నగ్గోపకునకును చూపొసఃగె."

అని స్పష్టంగా తిమ్మరాజు తన కొలువులో బహిరంగంగా ఆ గోపకునకు దృష్టి ప్రసాదించినట్లు పేర్కొనబడింది. ఒకసారి యీ తిమ్మరాజు సైన్యంతో మండువేసవిలో ప్రయాణం చేస్తున్నాడట. అప్పుడు సైన్యానికి దాహమై నోళ్లెండి పోతు

శ్రీరంగరాయలు బుక్కరాజు కుమారుడైన రామరాజుకు మూడవ కుమారుడు. ఇతను శ్రీకృష్ణ దేవరాయలు మహా వైభవోపేతంగా, సమస్తభోగాలనూ అనుభవిస్తూ నిరాటంకంగా ప్రజానురంజకంగా ద్రావిడాంధ్ర కర్ణాట సామ్రాజ్యాన్ని పరిపాలిస్తున్న రోజులలో అతనికి లోబడిన సామంత మండలేశ్వరులలో ఒకడైన "మహామండలేశ్వర రామరాజ పెదశ్రీరంగదేవ మహారాజు కందనవోలు మండలమునకు అధిపతిగా వుండి పరిపాలన చేస్తు"న్నట్లు కర్నూలు పట్టణ శాసనాల్లోని ఒక శాసనం వల్ల తెలుస్తున్నది. (156 of 1905, E.R.) రామరాజ భూషణకవి తన వసుచరిత్రలో శ్రీరంగరాయలు మహావీరుడై శత్రునిర్మూలకుడై సింహాసనాసీనుడై వున్నట్లు తన పరాక్రమ రాజ్యాదులను తన సంతతికిసైతం సంక్రమింపచేయ గలిగినట్లు ఈ క్రింది పద్యంలో వర్ణించాడు.

శా. ఆరాజత్రితయంబులో నసమబాణారాతి విఖ్యాతదో
స్సారుండాత్త సుభద్రుఁ డర్జున గుణశ్లాఘ్యుండునై పొల్చునా
శ్రీరంగేంద్రుఁడశేష రాజ్యపదవీ సింహాసనాక్షీణ ల
క్ష్మీ రాజన్నిజ సంతతి ప్రథితుఁడై మించెన్ ధరామండలిన్.

---

న్నాయని తిమ్మరాజుకు తెలియజేయగా హృదయపూర్వకంగా అతడు విష్ణువును ప్రార్థించి దోనిసిరంగరాజు కొండ నెత్తముమీద వెంటనే ఒక నీటి బుగ్గ పుట్టేట్లు చేశాడట. ఈ విషయాన్ని పద్యబాలభాగవతంలో-

కల్లున మీఁగాంగ గట్టుపై వేసవిఁ
బుట్టించె జలములే భూనుతుండు

అని చెప్పి ద్విపద బాలభాగవతంలో ఆ కోనేరునాథకవే యీ క్రింది విధంగా వర్ణించాడు.

"ధన్యుండు రామ భూధవు తిమ్మనృపతి
సైన్యసమేతుఁడై చైత్రమాసమున
దండువోవుచునుండి తన భటుల్ త్రోవ
నెండిన నోళ్ళ దప్పెరిగించుటయును
నిండు చిత్తమున దొనిసిరంగరాజు
కొండ నెత్తమున వైకుంఠుని దలఁచి
గోవిందు వేడి గ్రక్కున నొక్కబుగ్గ
భూవినుతంబుగాఁ బొడమఁగఁ జేసె
నందఱుఁ జూడఁగా నన్నీర మచటఁ
గ్రందుగా నిలిచెలె ఘటికాద్రియందు."

దోనిసిరంగరాజు కొండకు మీగాముల గిట్టు అని నామాంతరమున్నట్లు యీ సందర్భంలో తేటపడుతున్నది. ఈ తిమ్మరాజు మహాయోధుడై పట్టవాడరాయడైన ఉద్దండరాయడనే వానిని కళింగ దేశాధీశ్వరుఁడైన ఒడ్డియరాయని సైతం జయించాడు. మహమ్మదు మలకకు ప్రాణదానం యిచ్చినట్లుకూడా యీక్రింది పద్యాలవల్ల స్పష్టపడుతున్నది.

గండర గూళికి గండని,
గండని కుద్దండ రాయగణ వారణ శ్రీ
గండాంకున కెంతెంబర
గండనికిన్ బట్టవాడ గజసింహునకున్॥

నరపతి విజయంలో అందుగుల వెంకయ్యకవి శ్రీరంగరాజు పరిపాలకుడైనట్లుగానూ విజయనగర (శ్రీకృష్ణదేవ) రాయల ఆస్థానంలో వున్నట్లుగానూ ఈ క్రింది పద్యాలలో సూచించాడు.

క. ఆరాజన్యుల తమ్ముఁడు
శ్రీరంగాధీశ్వరుండు శ్రితసంరక్షా
ధౌరంధర్యముచే నా
శ్రీరంగాధీశుఁడనఁగ క్షితినుతి గాంచెన్.

తే. గీ. కాఁగ నసదృశ బాహు విక్రమ నిరూఢిఁ
దనరెఁ గర్ణాటరాజ్య పదస్థుఁడగుచు
నుర్జయాహితరాజ విధుంతుదుండు
రామరాజేంద్ర శ్రీరంగరాజ విభుఁడు.

---

చాళుక్య చక్రవర్తికి
మాళవమదభంజనునకున్ మర్దిత శకసే
పాళునకున్ బిరుదు మన్నెవి
భాళునకున్ మన్నెపులికి భాసురమణికిన్.
మన్నెదళ ధూమకేతువ
మన్నియముగ బేటకార మాళవరాయా
త్యున్నత మస్తక శూలా
మన్నెసుర త్రాణ బిరుద మన్నెవిభాళా!
కదన ధనంజయునకు మహా
మదల్క ప్రాణదాన మతి కొడ్డియ రా
యదిశాపట్టణ కరిరా
య దళ విభాళునకు పాండవాన్వయ పతికిన్.

ఈ పద్యాలవల్ల తిమ్మరాజు వీరత్వం వ్యక్తమవడమేగాక ఆనువంశికంగా వచ్చిన "గండరగూళి, మాళవ రాయాత్యున్నత మస్తకశూల" అన్న బిరుదములు ధరించడానికి తగినవాడేనని అనిపిస్తున్నది. కృష్ణరాయ విజయంలో కుమార దూర్జటి "సాకల్యముగ కీర్తి సర్వ దిక్తటులందు ప్రాకటస్థితి నిల్పు నౌకువారు" అనీ "కీవిగ నౌకువారును కడింది రహిన్ వెలుగోటి వార లా రావెల వారుగూడుకొని" అని పేర్కొనడంవల్ల కృష్ణదేవరాయల పట్టాభిషేక సమయంలో రాజసభలో తిమ్మరాజున్నాడనీ, అనంతరం కృష్ణదేవరాయ పూర్వ దిగ్విజయయాత్రలో సైతం పాల్గొన్నాడనీ, ధ్రువపడుతున్నది. ఈ తిమ్మరాజు తమ్ముడైన శ్రీరంగరాయల కుమారుడైన అళియరామరాయలు సామ్రాజ్య ద్రోహియైన సలకం తిమ్మయను సంహరించిన సందర్భంలో అళియరామరాయలకు బాసటగా నిల్చినట్లు పద్య బాలభాగవతంలోని ఈ క్రింది పద్యం వల్ల విదితమవుతున్నది.

సలకయ తిమ్మాసుర దు
ర్విలసిత విలయాబ్ధిలగన విహ్వాల వసుధా

ఈ శ్రీరంగరాజు శ్రీకృష్ణదేవరాయలవద్ద మంత్రిగా వున్నాడని ఫెరిస్తా వ్రాసినట్లు హిరాసు ఫాదరీ వ్రాయడంలో వాస్తవం లేదు.

"We know from Ferishta that he was one of the ministers of Krishnadevaraya, and was succeeded in this place by his son Rama Raya" (The Aravidu dynasty of Vizianagar Ch. 11, page 19.)

ఫెరిస్తా వ్రాసిన వాక్యాలను బ్రిగ్స్ ఈ క్రింది విధంగా అనువదించాడు.

"The affairs of Beejanugguru being in confusion owing to the death of Heema Raju who was newly succeeded by his son Rama Raju, against whom rebellions had arisen by several times he (the Sultan) met with no interruption to his arms (Brigg's Ferishta Vol. III. p. 81.)

(హీంరాజు చనిపోగా నూతనంగా అతని పదవి సధిరోహించిన అతని కుమారుడైన రామరాజుమీద అనేకమంది రాజులు తిరుగబడినందువల్ల విజయనగరంలోని వ్యవహారాలు కల్లోలభరితాలయ్యాయి. అందువల్ల అతని (సుల్తాను) ఆయుధాలకు అడ్డమూ ఆదీ లేకుండా పోయింది.)

---

వలయస్థితికృతి వివృతో
జ్వలతర ధరణీ వరాహవర బిరుదాంకా !

పద్యబాలభాగవతంలో—

మానువకడసవాబూని పోరను బరా
జయము నొందించెనే శౌర్యశాలి.

అనీ, ద్విపద బాల భాగవతంలో—

కడిమిమై మానువకడ రణక్షోణి
గడుసరి నేదుల ఖాను జయించె

అనీ పేర్కొనడంవల్ల, ఈ తిమ్మరాజు బిజాపూరు సుల్తానైన అలీ ఆదిల్ షాహాను మానువదుర్గం (మానుకోట) దగ్గర జయించాడని తెలుస్తున్నది. ఈ విజయం క్రీ. శ. 1542 ప్రాంతంలోనో, ఆ తరువాతనో జరిగివుంటుంది. తిమ్మరాజుకు వీర నరసింహారాయలు "స్వామిద్రోహరగండ నూపురము"ను బహూకరించినట్లు పద్య బాలభాగవతంలోని యీ క్రింది పద్యంవల్ల వ్యక్తమవుతున్నది.

శా. శ్రీమద్వీర నృసింహరాయ నృపతి శ్రేయోదయా సాధిత
స్వామిద్రోహరగండ నూపుర విరాజ ద్రామరాట్తిమ్మ భూ
పామిత్యర్జితపుణ్య సత్ఫల సమస్తా శాంత విశ్రాంత ని
స్సీ మోర్వీ ప్రతిపాదన ప్రత్యయశా శీతాంశు వంశోన్నిధీ.

వీరనరసింహారాయల విషయంలో విద్రోహ బుద్ధితో వ్యవహరించిన వాడు తిమ్మరాజు తమ్ముడైన కొండరాజని అనిపిస్తుంది. ద్విపద బాలభాగవతంలో ఈ స్వామి ద్రోహి ఆదవేని దుర్గాధిపతియని యీ క్రింది ద్విపదలలో వివరించాడు.

విక్రమంబున నాదవేని దుర్గంబు
విక్రాంతులెన్న వేవేగ సాధించి

హిరాసు ఫాదరీ వ్రాసిన వాక్యాలు చూచి సుప్రసిద్ధ చరిత్రకారుడైన రాబర్ట్ స్యూయల్ "Heem Rajah or, as Briggs renders the name Tun-rajh-representing the 'Timma' are referring doubtless to Saluva Timma, the great minister of Krishnadevaraya" (Forgotten Empire p. 81) అని వ్రాసి హీంరాజు కొడుకైన రామరాజు కృష్ణదేవరాయల ప్రధాన మంత్రియైన సాళువ తిమ్మరుసు కుమారుడని, అళియరామ రాయల తండ్రి సాళువ తిమ్మరాజనడం యెంత సత్యదూరమైన విషయమో శ్రీరంగరాజు శ్రీకృష్ణ దేవరాయల మంత్రి అనడం కూడా అంతే సత్యదూరమైన విషయం. అళియరామరాయలు శ్రీరంగరాయల పుత్రుడుగాని సాళువ తిమ్మరాజు పుత్రుడు కాడు.

---

సిరులతో వీరనరసింహరాయలకుఁ
బరుషాత్మ దుర్గాధిపతి నొప్పగించి
గరిమ స్వామి ద్రోహ గండపెండార
మరి భీకరముగ రాయలొసంగ నొందె
లాలిత కీర్తి విలాసుండు పద్య
బాలభాగవత ప్రబంధ నాయకుండు

అయితే ఆదవేనిని రామరాజు జయించి దాని అధిపతిగా తన రెండవ కుమారుడైన కొండరాజును నియమించినట్లు గతంలో గుర్తించాము. విజయనగర సామ్రాజ్యం సంగమ వంశంనుంచి సాళువవంశానికీ, సాళువవంశంనుంచి తుళువ వంశానికీ, తుళువవంశంనుంచి ఆరవీటి వంశానికి సంక్రమించిందన్న విషయం ప్రసిద్ధ చరిత్రాంశంకదా. "సాళువ నరసింహరాయని కుమారుడైన ఇమ్మడి నరసింహరాయని సింహాసనాన్ని తుళువ వీరనరసింహరాయలు (శ్రీకృష్ణ దేవరాయల తండ్రి) ఆక్రమించడంవల్ల, ఆగ్రహించిన కొండరాజు వీరనరసింహరాయల మీద తిరుగబడి వుంటాడు. అప్పుడీ తిమ్మరాజు వీరనరసింహరాయల పక్షాననిలచితిరుగబడిన తమ్ముడైన కొండరాజు ఔద్ధత్యాన్ని అణచివేసివుంటాడు. వీరనరసింహరాయలు కొండరాజును క్షమించి ఆదవేని దుర్గాన్ని అతని స్వాధీనంలోనేవుంచి వుంటాడు. తమ్ముడన్న పక్షపాతం చూపకుండా అతనిని లొంగదీసినందుకు తిమ్మరాజుకు స్వామిద్రోహరగండ నూపురాన్ని వీరనరసింహరాయలు బహూకరించి వుంటాడు" అనికొందరు చరిత్రకారులు భావించారు.

అయితే తిమ్మరాజు ఏదులఖానుని పారద్రోలి వీరనరసింహరాయలకు ఆదవేని దుర్గాన్ని జయించియిచ్చి అతనివద్దనుంచి స్వామిద్రోహరగండపెండేరాన్ని" స్వీకరించాడని ద్విపద బాలభాగవతంలో ఈ క్రింది ద్విపదలలో పేర్కొనబడింది.

గడుసరి నేదుల ఖాను జయించె
విక్రమంబున నాదవేని దుర్గంబు
విక్రాంతులెన్న వేవేగ సాధించి
సిరులతో వీరనృసింహరాయలకుఁ
బరుషాత్మ దుర్గాధిపతి నొప్పగించి
గరిమ స్వామిద్రోహగండపెండేర
మరిభీకరముగ రాయలొసంగనందె
లాలితకీర్తి విలాసుండు పద్య
బాలభాగవత ప్రబంధ నాయకుఁడు

ఈ శ్రీరంగరాయలు అనేక రాజ్యాలను జయించాడనీ, అత్యంత సాత్త్వికభావం కలిగి సదాచార తత్పరుడై రాజర్షిగా విరాజిల్లాడనీ క్రీ. శ. 1549 లో వ్రాయబడిన 'స్వరమేళ కళానిధి' అనే సంగీతశాస్త్ర గ్రంథంలో ఈ క్రింది శ్లోకంలో వర్ణించబడింది.

శ్లో. ఏషాం కులాలంకృతిరేష జఝ్ఞే
శ్రీరంగనాథో జితి రాజ రాజః
తయాసదాచార దృశావి వింతే
రాజర్షి భావం రమితతు మోయః॥

అళియరామరాయలు శ్రీరంగరాయల పుత్రుడుగాని సాళువతిమ్మరాజు పుత్రుడు కాడు.

శ్రీరంగరాయలకు తిరుమలదేవియందు రామరాజు - తిరుమలరాయలు- వెంకటాద్రి అనే ముగ్గురు పుత్రులు మాత్రమే సంజనితులైనట్లు శ్రీ విరూపాక్ష శాసనంలో విస్పష్టంగా పేర్కొనబడింది.

రచిత నయ విచారం రామరాజం చ ధీరం
వర తిరుమలరాయం వేంకటాద్రి క్షితీశం
అజనయత స ఏతా నానుపూర్వ్యా కుమారా
నిహ తిరుమల దేవ్యా మేవ రాజామహారాజాః॥

(శ్రీ విరూపాక్ష శాసనం. 5వ పుట 17వ శ్లోకం.)

---

ఈ కోనేరుకవి వాక్యాలను ప్రమాణంగా స్వీకరిస్తే కొండరాజును ఓడించి ఏదులఖాను ఆదవేనిదుర్గాన్ని స్వాధీనం చేసుకున్నాడనీ, ఆతరువాత తిమ్మరాజు విజృంభించి ఏదులఖానును ఓడించి ఆదవేని దుర్గాన్ని వీరనరసింహరాయలకు స్వాధీనం చేశాడనీ చెప్పవలసి వుంటుంది. పద్య బాలభాగవతంలోని షష్ఠ్యంత-ఆశ్వాసాంత పద్యాలవల్ల తిమ్మరాజు క్రీ. శ. 1504 మొదలు 1507 వరకూ కర్ణాట రాజ్యాన్ని పరిపాలించిన వీరనరసింహరాయలకు సహాయకుడుగా వున్నట్లు తెలుస్తున్నది. తిమ్మరాజు సలకం తిమ్మయను వధించడంలో అళియరామరాయలకు (తన తమ్ముడైన శ్రీరంగరాజు కుమారునికి) సహాయ మొనర్చినట్లు గతంలో పేర్కొనబడింది. కాబట్టి తిమ్మరాజు క్రీ. శ. 1542 ప్రాంతంవరకూ జీవించివున్నాడని వూహించవచ్చును. ఈ చరిత్రాంశాలకు ఉపయోగపడుతున్నవి పద్య బాలభాగవతంలోనివిగా గతంలో ఉదాహరించబడిన "కదన ధనంజయునకు—సలకతిమ్మాసుర—మన్నెపశ ధూమకేతువ—శ్రీమద్వీర నృసింహరాయ" ఇత్యాది పద్యాలు. వీటికితోడు ఈ క్రింది ఆశ్వాసాంత పద్యం కూడా దోహదకారిగావున్నది.

మ. సహజాంభోజదినేశ! గౌడవరరాజ్య స్థాపనాచార్య! య
ష్టహరిద్రాయ మనోభయంకర! మహాజన్య స్థలీ పార్థ! శ
స్త్రహతానమ్రనృపాల! పాలితకళా సామ్రాజ్య సంపూజ్య! ని
త్యహితశ్రీపద! పట్లవాడ గజసింహా! దానశూరోత్తమా!

అయితే రామరాజ భూషణుని వసుచరిత్రలో తిమ్మాంబా శ్రీరంగరాయలకు కోనరాజు-తిమ్మరాజు-రామరాజు-తిరుమలరాజు-వెంకటాద్రిరాజు అనే ఐదుగురు పుత్రులు పుట్టినట్లు ఈ క్రిందిపద్యాలలో "సురద్రుమ పంచకం"తో పోల్చి మరీ స్పష్టపరచాడు.

క. ఆ మనుజేంద్రునకుఁ బురం
ధ్రీమణియగు తిమ్మమకును శ్రీరామునకున్
భూమిజ సుత్రామునకుఁ బు
లోమజయును బలె జగంబులో నుతికెక్కన్.

శా. చేతోజాత సమానమూర్తియగు నా శ్రీరంగ ధాత్రీధవుం
డా తిమ్మాంబికయందుఁ గోనవిభుఁ దిమ్మాధీశు రామప్రభున్
భూతాశేష విపత్తు శ్రీతిరుమలేంద్రు న్వేంకటాఖ్యానవ
ఖ్యాతుం గాంచె సురద్రు పంచకము నయ్యాంబోధిరాజుం బలెన్.

---

ఆదవేనిని రామరాజు రెండవకుమారుడైన కొండరాజు పరిపాలించాడనీ, అందువల్ల అతడూ, అతని సంతతీ ఆదవేని వారుగా ప్రసిద్ధి వహించారనీ నరపతి విజయంలో ఈ క్రింది పద్యంలో అందుగుల వెంకయ్య తెలియచేశాడు.

క. దీనావనుఁడౌ కొండమ
హీనభుండాదవేని నేలుచుఁబరఁగెన్
దానును సుతులును దత్సం
తానం బాయాదవేని ధామము పేరన్.

పూర్వం ఆదవేని అని, తరువాత ఆదవాని అని ప్రస్తుతం ఆదోని అని పిలువబడుతున్న యీ పట్టణం కర్నూలు జిల్లాలోని ఆదోని తాలూకాకు ముఖ్యపట్టణం. కళ్యాణిచాళుక్య రాజులకాలంనుంచీ ప్రసిద్ధికెక్కిన సీమలలో యీ ఆదవేని సీమ ఒకటి. ఈ పట్టణ సమీపంలో గిరిదుర్గం ఒకటి వున్నది. ప్రాచీన ఆదవేనిసీమ ఆదోని కర్నూలు తాలూకాప్రాంతాలకు చెందిఉన్నది. బొమ్మలాపురం-కెరెయబెలుగల్లు (చెరువుబెలగల్లు)-కోశేయ కల్లు (కోశేకల్లు)-బూదూరు (బూడూరు) గ్రామాలు ఆదవేని సీమలోనివిగా శాసనాలలో పేర్కొనబడ్డాయి. దుర్గసీమ-వళిత-రాజ్య-నామాలతో ఆదవేని ప్రసిద్ధి చెందింది.

రామరాజు పుత్రులు తిమ్మరాజు-కొండరాజు-శ్రీరంగరాజులు ముగ్గురే కాక మొత్తం అయిదుగురు పుత్రులున్నారని హిరాసుఫాదరీ రామరాజీయం (నరపతి విజయం) ఆధారంగా తాముపేర్కొంటున్నట్లు ఈ క్రింది విధంగా వ్రాశారు. "According to the poem mentioned above he had five sons, Sri Ranga, Channa, Venkapathi, Timma or Tirumala (who distinguished himself in the service of Krishnadevaraya)' and lastly Venkatapathi of these, the first, Sri Ranga became the father of Ramaraya, the regent of Sadasivaraya" (the Aravidu dynasty of Vijianagara p. 19) రామరాజీయంలో ముగ్గురు పుత్రుల విషయమే పేర్కొనబడిందిగాని అయిదుగురు పుత్రుల విషయం పేర్కొనబడలేదు. అందువల్ల యిదివాస్తవంకాదు.

నరపతి విజయకర్త అందుగుల వెంకయ్య, పద్య-ద్విపద బాలభాగవతకర్త కోనేరుకవి, సాంబో పాఖ్యానకర్త రామరాజు రంగప్పరాజులుకూడా తిరుమలాంబా శ్రీరంగరాజులకు ఐదుగురు కుమారులు కలిగినట్లే పేర్కొన్నారు. శ్రీవిరూపాక్ష శాసనంలో పేర్కొన్న దానినిబట్టి తిరుమలాంబా (తిమ్మాంబ) శ్రీరంగరాజులకు రామరాజు-తిరుమలరాజు-వెంకటాద్రిరాజులు ముగ్గురే పుత్రు లనవలసివస్తుంది. "శ్రీరంగ రాజుకు యిద్దరు భార్యలుండి కోనరాజు-తిమ్మరాజు తొలిభార్య సంతానమైవున్నారా? రామరాజు ప్రభృతులు ముగ్గురు మాత్రమే తిరుమలాంబ సంతానమా?" అని సందేహం కలుగుతున్నది. ఈ కారణం చేతనే శ్రీవిరూపాక్షశాసనంలో కోనరాజు-తిమ్మరాజులు విడిచిపుచ్చబడ్డారా? అని అనిపిస్తున్నది. కాని రామరాజ భూషణాదులు విస్పష్టంగా తిమ్మాంబికకే ఐదుగురు పుత్రులు కలిగినట్లు పేర్కొనడంవల్ల యీ విషయం నొక్కివక్కాణించడానికి వీలులేకుండా వున్నది. ద్విపద బాలభాగవతంలోనూ, వసుచరిత్ర, నరపతి విజయాలలోనూ కోనరాజు-తిమ్మరాజు ప్రసిద్ధ పురుషులుగా వర్ణించబడలేదు. ఒకవేళ కోనరాజు-తిమ్మరాజులు అప్రసిద్ధులైనందువల్ల శ్రీవిరూపాక్షశాసనంలో వారిని విడిచిపెట్టారనడానికి కూడా అవకాశం కనపడటంలేదు. అందులో స్పష్టంగా "ఆనుపూర్వ్యా" అన్న శబ్దప్రయోగంతో క్రమంగా ఒకరి తరువాత ఒకరు ముగ్గురు పుత్రులే పుట్టినట్లు సూచించబడడంవల్ల రామరాజుకంటే పెద్దవారు యిద్దరు కొడుకు లున్నారని చెప్పడానికి వీలులేకుండా వున్నది.

## (అళియ) రామరాయలు (2)

"ఈ రామరాయలు గొప్ప రాజనీతివిశారదుడు. లోకకంటకులైన శత్రువులను సంహరించి భరతాది పూర్వరాజులవలె కీర్తిపొందినవాడు. గొప్పవైణికుడు. దానశీలుడు" అని శ్రీవిరూపాక్షశాసనంలో రెండు శ్లోకాలలో వర్ణించబడింది. (చూడు శ్రీవిరూపాక్షశాసనం 5 పుట. 18-19 శ్లోకాలు.) ఈ రామ రాయల దానశీలాన్నీ, వీణావాదన నైపుణ్యాన్నీ వర్ణిస్తున్న "వితరణపరిపాటీం" (19 వ శ్లోకం) ఇత్యాది శ్రీవిరూపాక్షశాసనంలోని శ్లోకం శ్రీరామ శాసనంలో విడిచిపుచ్చబడింది. శ్రీవిరూపాక్ష శాసనంలోని 18 వ శ్లోకం మాత్రం పరిగ్రహించబడింది. (చూడు శ్రీరామశాసనం. 49-51 పుటలు. 15 వ శ్లోకం) ఈ రామరాయలు శ్రీకృష్ణదేవరాయలకు అల్లుడైనందువల్ల ఇతనిని అళియరామరాయలని ప్రాచీనకాలం నుంచీ పేర్కొంటూవచ్చారు. ఇతనిని రామరాజు అని కూడా పేర్కొనడం జరిగింది.

ఇతడు తండ్రీ తాతలకాలంనుంచీ తమ అధీనంలో వుంటూవచ్చిన కందనవోలును పరిపాలిస్తూ శ్రీకృష్ణదేవరాయల అల్లుడై కేవలం అల్లుడు మాత్రమేకాక, అంతరంగ, బహిరంగ రాజకీయ సహాయ కుడుగా కృష్ణరాయలకూ, సదాశివరాయ ప్రభృతులకూ కొండంత అండగా నిలచాడు. "సకల లోకాలనూ బాధిస్తున్న శత్రువులను సంహరించి భరతాది ప్రాచీనరాజులను మించినవాడుగా కీర్తిపొంది, భూచక్రాన్ని శాసించా"డన్న శ్రీవిరూపాక్ష శాసనవాక్యం అక్షరాలా వాస్తవికమైనది. విజయనగర

సామ్రాజ్యానికి దక్షిణాపథంలో విశిష్టస్థానాన్నీ, ఒక విధమైన పరిపూర్ణస్వరూపాన్నీ సమకూర్చడంలో మహాబుద్ధిమంతుడుగా వీర పరాక్రమ యోధాగ్రేసరుడుగా ఈ అళియరామరాయలు నిర్వహించిన అపూర్వమైన పాత్రగురించి అనేకమంది చారిత్రకులూ, పరిశోధకులూ పెక్కు వ్యాసాలు వ్రాశారు. గ్రంథాలే రచించారు. మహాయుద్ధవీరుడుగా అళియరామరాయల కెంతకీర్తి లభించిందో, కళాప్రియుడుగా వీణావాదన చాతుర్యంగల అతని సంగీతశాస్త్ర పరిజ్ఞానం, గానామృతలోలుపత్వం అంతగా లోకానికి తెలియకుండా మరుగునపడిపోయింది. ఇతని వీణావాదన నైపుణ్యం గురించి క్రీ. శ. 1589 నాటి రెండవ వేంకటపతిరాయల శాసనంలో కూడా వర్ణించబడింది. ఈ రామరాయల మంత్రులలో రామయామాత్యతోడరమల్లు అనేవాడొకడున్నాడు. ఇతనిని అళియరామరాయలు కొండవీడు రాజ్యానికి పాలకప్రతినిధిగా నియమించాడు. ఈ తోడరమల్లు సంగీత శాస్త్రకోవిదుడు. సంస్కృతాంధ్రభాషలలో కవి. మంచి పండితుడు. అళియరామరాయల చిన్నతమ్ముడైన వెంకటాద్రి ప్రోత్సాహంతో ఈ తోడరమల్లు "స్వరమేళకళానిధి" అన్న సంగీతశాస్త్ర గ్రంథాన్ని సంస్కృతంలో రచించి, అళియరామరాయల కంకితమిప్పించాడు. ఈ స్వరమేళకళానిధి గ్రంథ రచన క్రీ. శ. 1549 లో పూర్తిచేయబడింది. ఈ విషయం ఆ గ్రంథం చివరవున్న ఈ క్రింది శ్లోకంలో స్పష్టంగా పేర్కొనబడింది.

శ్లో. శాకేనాత్ర ధరాధరాబ్ధి ధరణీ గణ్యేచ సాధారణే
వర్షే శ్రావణమాసిజోన్నిమలతరే పక్షే దశమ్యాంతిథౌ
రామామాత్యవినిర్మిత స్వరదతోష్షడ్గీతి రత్నాకరాత్
సోఽయం మేళకళానిధిర్మతిమతా మాకల్పమాకల్పితాన్.

అళియరామరాయలు వీణావాదన చాతుర్యంలో మహానైపుణ్యం కలవాడుకాబట్టి, సహజంగానే స్వరమేళకళానిధికాబట్టి ఈ 'స్వరమేళకళానిధి' గ్రంథం అతనికి అంకితమివ్వబడింది. శ్రీకృష్ణదేవరాయలు అళియ రామరాయలకు తనకూతురునిచ్చి వివాహంచేసి "మహానుభావుడైన రామరాయలకు భార్యగా వుండదగిన కన్యకు నేను తండ్రినిగదా" అనియెంతో గర్విస్తూవుండేవాడట. ఈ విషయం స్వరమేళకళానిధిలో ఈ క్రింది శ్లోకాలలో రామరాయల వంశవర్ణన గావిస్తూ పేర్కొనబడింది.

శ్లో. ఏషాంకులాలంకృతిరేష జంఝె శ్రీరంగనాథో జితిరాజరాజః
తయాసదాచారదృశా వివింతే రాజర్షిభావం రమితఉమోయః॥
తిమ్మాంబికాతస్యబభూవదేవ సాధ్వీజనా మివయాసమిష్టిః
సతీయశోదా వినతానసూయాసుదక్షిణా సత్యవతీ సుభద్రా॥
తపోవిశేషణత మోరశేష రాజాధిరాజోఽజనిరామరాజః
కన్యాప్రదోఽస్మైసహికృష్ణరాయః కన్యాపితృత్వంబహుమాన్యతేస్మ॥

సుప్రసిద్ధ చరిత్ర పురుషుడైన ఈ అళియ రామరాయలకు ఐదుగురు పుత్రులు కలిగారు.

# తిరుమలరాయలు (1)

"శ్రీరంగరాయల పుత్రులలో రెండవవాడైన తిరుమలరాయలు అన్నదమ్ములకంటే గొప్ప మేధావంతుడు. బలవంతుడు. యుద్ధాలలో శత్రువులను జయించి తిరుగులేని రాజ్యాధికారాన్ని చలాయించాడు. సద్గుణవంతుడూ మహాదాతా అయిన తిరుమలరాయలు గొప్ప భక్తుడుగాకూడా రాణించాడు. కంచి, శ్రీరంగం, తిరుపతి, అహోబిలం మొదలైన దేవస్థానాలలోనూ, తీర్థాలలోనూ, శాస్త్రరీత్యా యెన్నెన్నో ఉపదానాలేకాక, సువర్ణ తులాభారంవంటి వాటినికూడా నిర్వహించి, యెన్నెన్నో దానాలు చేశాడు" అని తిరుమలరాయల గుణాదికాలను తొమ్మిది శ్లోకాలలో శ్రీవిరూపాక్ష శాసనంలో వర్ణించడం జరిగింది. (చూడు శ్రీవిరూపాక్ష శాసనం 7, 9 పుటలు. 21 శ్లోకం మొదలు 30 వ శ్లోకం వరకు.) శ్రీరామశాసనంలో రెండు శ్లోకాలు (51 పుట. 17-18 శ్లోకాలు) తిరుమలరాయల గుణాదికాలను పేర్కొనేవి ఉటంకించబడ్డాయి. ఇవి రెండూ కూడా శ్రీవిరూపాక్ష శాసనంలోని (7 పుట) 21, 22 శ్లోకాలే యథాతథంగా పరిగ్రహింపబడ్డాయి. కర్ణాట రాజ్యలక్ష్మిని చేపట్టిన ఆరవీటి వంశజులలో ఈ తిరుమలరాయలే మొదటివాడు. ఇతని అన్నయైన అళియ రామరాయలు కర్ణాట రాజ్యాన్ని పరిపాలించినవాడే అయినా అతడు ప్రత్యక్షపరిపాలకుడు కాడు. తుళువ వంశంలోని సదాశివరాయలను రాజుగావుంచి, అతని పేరుమీద రాజ్యాన్ని నడిపాడు. తిరుమలరాయలు పెనుగొండ రాజధానిగా కర్ణాట రాజ్యాన్ని పరిపాలించాడు.

శ్రీరంగరాయలకు ఐదుగురు పుత్రులున్నారన్న అభిప్రాయం ప్రకారం పెద్దవారైన కోనరాజు తిమ్మరాజు లిద్దరున్నారు. తిమ్మరాజు-తిరుమలరాజు శబ్దాలకు రాజు-రాయశబ్దాలకు వ్యవహారంలో తేడాపాటించబడలేదని నేను గతంలో తెలియచేశాను. ఈ దృష్ట్యా తిరుమలరాయలను, తిరుమలరాజుగా—తిమ్మరాజుగా సైతం అనేక సందర్భాలలో కవులు వ్యవహరించడంజరిగింది. అందువల్ల తిరుమలరాయలను తిమ్మరాజుగా వ్యవహరిస్తే కోనరాజు, తిమ్మరాజులలో తిమ్మరాజుకు-ఈ తిమ్మరాజుకు (తిరుమలరాయలకు) తేడా తెలిసే నిమిత్తం అళియ రామరాయల తమ్ముడైన తిమ్మరాజును (తిరుమలరాయలను) కవులు ఎల్లు తిమ్మరాజుగా వ్యవహరించారు. అంటే తిరుమలరాయలు ఎల్లుగా వుండేవాడనీ అళియరామరాయలకంటే పెద్దవారైన కోనరాజు తిమ్మరాజులలోని తిమ్మరాజు (చూడు వంశవృక్షం. F.) ఎల్లుగా వుండేవాడు కాడనీ మన కవగాహనమవుతున్నది. తిరుమలరాయలను ఎల్లు తిమ్మరాజుగా రామరాజ భూషణుడు నరసభూపాలీయంలో ఈ క్రింది పద్యంలో పేర్కొన్నాడు.

సీ...... తే. గీ. రాజదేవేంద్రుఁ డితఁడన 'దేజరిల్లు

నసఘ చాళుక్య నారాయణాంక వివిధ

బిరుద మన్నె విభాళాది బిరుదశాలి

ప్రాభవోపేతుఁ డెలతిమ్మపార్థివుండు.

(1 ఆ. 84 ప.)

తిరుమలరాయల భార్య వెంగళాంబ. ఈ విషయం శ్రీవిరూపాక్ష శాసనంలోని 31వ శ్లోకం (9వ. పుట) వల్ల తెలుస్తున్నది. అయితే శ్రీరామ శాసనంలోని 19, 20 శ్లోకాలవల్ల (51వ. పుట) తిరుమలరాయలకు

భార్య లనేకులున్నారనీ వారికి నలుగురు పుత్రులు జనించారనీ తెలుస్తున్నది. ఈ విషయం మునుముందు చర్చింపబడుతుంది.

ఈ తిరుమలరాయలు క్రీ. శ. 1552 ప్రాంతంలో కొచ్చర్లకోటను సైతం పరిపాలించినట్లు "లిథిక్" రికార్డువల్ల తెలుస్తున్నదని హెచ్. కృష్ణశాస్త్రిగారు వ్రాశారు. అళియరామరాయల పరిపాలనాకాలంలోనే యీ తిరుమలరాయలు తన తమ్ముడైన వెంకటాద్రితోసహా కలిసి బీదర్ రాజ్యంమీదకు దండెత్తివెళ్లి బరీద్‌షాను జయించినట్లు వసుచరిత్రాది గ్రంథాలలోని ఈ క్రింది పద్యాలవల్ల స్పష్టపడుతున్నది.

.......వినమద సూదన మల్కావినోదన వీరబరీద నరాదహారీ!

(వసుచరిత్ర. 3 ఆ. 188. ప.)

.........కలితకూట కనకవాట సంభ్రమద్భ్రమితఘోట బెడదకోటపటుకవాట పాటనా!

(వసుచరిత్ర. 5 ఆ. 128 ప.)

అనుచుఁ గడు మెచ్చి జయలక్ష్మియాజి రంగ
కాతర బరీద కేతన ఘటిత భద్ర
కలశ మెదురుగఁబూని యేఘనునిఁజెంచె
నతఁడు సామాన్యుఁడే వేంకటాద్రివిభుఁడు.

(వసుచరిత్ర 1 ఆ. 51 ప.)

అనుచు యవనులఁ దెగడి తన్నాశ్రయించు
వారి సామ్రాజ్యలక్ష్మి నెవ్వాఁడు గొనియె
సాహసోగ్ర బరీద సప్తాంగ హరణుఁ
డతఁడు విలసిల్లు శ్రీవేంకటాద్రివిభుఁడు.

(నరసభూపాలీయం. 1 ఆ. 85 ప.)

అసదృశోరుశౌర్యుఁ డాహవ గాండీవి
వేంకటాద్రిరాజ విబుధ రాజు
అని బరీదు గెల్చి యాతని బిరుదుమే
తమ్ముఁ గొనియె భూజనమ్ము పొగడ

(నరపతి విజయం. 264 ప.)

కృష్ణానదీతీరంలో చరిత్ర ప్రసిద్ధికెక్కిన తళ్లికోటయుద్ధం క్రీ.శ. 1565 జనవరి 23 వ తేదీనాడు జరిగింది. హిందూ మహమ్మదీయుల మహాయుద్ధంగా వర్ణించదగిన ఈ యుద్ధంలో అళియ రామరాయలు, తిరుమల రాయలు, వెంకటాద్రిరాజు అన్నదమ్ములు ముగ్గురూ పాల్గొన్నారు. ఆదిల్‌షా, నిజాంషా, బరీద్‌కుతుబ్‌షాలతో

జరిగిన ఈ యుద్ధంలో వృద్ధుడైవుండి కూడా 30 సంవత్సరాల యువకునివలె పోరాడిన అళియరామరాయలు స్వర్గస్థుడైనా తిరుమలరాయ వెంకటాద్రిరాజులు విజయలక్ష్మిని చేపట్టారు. అయినా దశాబ్దాల తరబడిగా రాజ్య యుద్ధతంత్రజ్ఞుడై కర్ణాటరాజ్య కథానాయకుడుగా, సూత్రధారుడుగా వెలుగొందిన అళియరామరాయలు స్వర్గస్థుడవటంవల్ల విజయనగరసామ్రాజ్యం శాగానష్టపడి బలహీనపడిందని చెప్పవచ్చు. అళియరామరాయల తరువాత తిరుమలరాయలు రాజ్యపట్టాభిషేకం చేసుకున్నట్లు అనేక శాసనాల్లో వర్ణించబడటంవల్ల తిరుమల రాయ, వెంటాద్రి రాజులు కూడా తల్లికోటయుద్ధంలో చనిపోయారన్న వాదానికి ఆస్కారంలేకుండా పోయింది. సదాశివరాయల శాసనంలోనూ, ఇతర కర్ణాటక శాసనాల్లోనూ (అళియ) రామరాయల మరణా నంతరం తిరుమలరాయలు రాజైనట్లు స్పష్టంగా వక్కాణించబడింది.

"శ్రీరామరాజే శ్రిత సత్వశౌర్యే శౌరేః పదం శాశ్వత మభ్యుపేతే;"
తదను భువ మశేషాం పాలయన్ రాజనీత్యా
తపన తనయ జేతా దానరీత్యా మహాత్మా,
భరత మహితభూమా భాతి తస్యానుజన్మా
వరతిరుమలరాజ స్సాహితీ భోజరాజ.

(సదాశివరాయల శాసనం. ఎపిగ్రాఫికా ఇండియా. 9 వ పుస్తకం. 338 పుట)

"స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శకవర్షంగళు 1490 నెయ విభవ సంవత్సర జేష్ఠ శు. 5 మంగళవారదల్లు శ్రీమన్మహారాజాధిరాజ పరమేశ్వర వీరప్రతాప వీరసదాశివమహారాయరు పృథివీరాజ్యంగైయుత్తిరిలు శ్రీమన్మహామండలేశ్వర అళియ రామరాజయదేవ మహాఅరసుగళు తురత్తురాజకార్యక్కాగి అస్తమాన వాగల్లాగి పట్టణ సింహాసన రాజ్యవెల్లా కెట్టు ఇలవాదల్లాగి రాజశ్రీ తిరుమల రాజయ్యదేవ మహా అరసుగళు ..... వాసిల్లిదమేలే..." (హోళల్ కెరె తాలూకా శాసనం. నెం 7. ఎపిగ్రాఫికా కర్ణాటికా 11 వ పుస్తకం. 328 పుట).

వీటి కేమివచ్చిందిగాని శ్రీవిరూపాక్ష శాసనంలోని మూడుశ్లోకాల్లో తిరుమలరాయలు అనేక విధాలుగా కీర్తివంతుడైన తరువాత పట్టాభిషిక్తుడైనట్లు స్పష్టంగా పేర్కొనబడింది.

త్రిషు శ్రీరంగజ్మాపరిబృఢకుమారేష్వధరణం
విజిత్యారిజ్మా పాంస్తిరుమల మహారాయ నృపతిః
మహారాజాస్సామ్రాజ్యే సుమతిరభిషిక్తో నిరుపమే
ప్రశాస్త్యుర్వీం సర్వామపి తిసృషు మూర్తిష్వివహరిః

(7 వ పుట. 21 శ్లోకం)

శ్రీరంగరాయల కుమారులు ముగ్గురిలో మంచి బుద్ధిమంతుడూ గొప్ప బలవంతుడూ అయిన తిరుమలరాయలు యుద్ధంలో శత్రువులను జయించి సాటిలేని సామ్రాజ్యంలో అభిషిక్తుడై త్రిమూర్తులలో విష్ణువువలె సమస్త భూమండలాన్ని పరిపాలిస్తున్నాడు.

యశస్వినామగ్రసరస్య యస్య పట్టాభిషేకేసతి పార్థివేంద్రోః
దానాంబు పూరైరభిషిచ్య మానాద్వేపదం భూమిరియం దధాతి.

(7 పుట 22 శ్లోకం)

తిరుమలరాయల పట్టాభిషేకం జరుగుతుండగా దాన ధారలతో అభిషేకించబడుతున్న భూమి పట్టమహిషి పదవిని పొందుతున్నదా అన్నట్లున్నది.

హుత్వా మంత్ర పురస్సరం రిపుయశోలాజాన్ప్రతా పాలనం
సంప్రాపయ్య పదాని సప్తభువనేష్వారోప్య మేరూపలం
ప్రీతః కీర్తిమయీం వధూం పరిణయన్ సత్కౌతు కోల్లాసినీం
యస్సింహాసన మాశ్రితో విజయతేగృహ్ణాం ద్విజేంద్రాశిషః

(7—9 పుటలు 28 శ్లోకం)

తిరుమలరాయలు శత్రువులకీర్తులనే పేలాలను మంత్రపురస్సరంగా, ప్రతాప మనే అగ్నిలో హోమంచేసి, ఏడు లోకాల్లోను ఏడడుగులు వైచి మేరువనే రాతిమీదెక్కించి తనపట్ల కుతూహలంతో పొంగుతున్న కీర్తియనే వధువును పరిణయమాడుతున్నవాడై బ్రాహ్మణశ్రేష్ఠుల ఆశీస్సులు పొందుతూ సింహాసనమెక్కాడు.

దీనివల్ల అళియరామరాయల అనంతరం తిరుమలరాయలు పట్టాభిషిక్తుడైనాడని తేటపడు తున్నది. బ్రాహ్మణ శ్రేష్ఠుల ఆశీస్సులు పొందుతూ సింహాసన మెక్కాడంటూ ఈ సందర్భంలో అగ్రజుడైన అళియ రామరాయల సంగతి అసలు ప్రస్తావించకపోవడం చూస్తే, అతను కీర్తిశేషుడైన తరువాతే తిరుమలరాయలు పట్టాభిషిక్తుడైనట్లు అర్థమవుతున్నది. ఆదిల్‌షా, కుతుబ్‌షా, నిజాంషాలతో జరిగిన యుద్ధంలో అళియ రామరాయలు అతని కుమారులు, తిరుమల రాయలు అతని కుమారులు, వెంకటాద్రిరాజు మహాపరాక్రమాన్ని చూపించారు. తిరుమలరాయల పరాక్రమం వసుచరిత్రలో ఈ క్రింది పద్యంలో వర్ణించ బడింది.

తగవరి గదా నిజాము దుద్దండ జయ వ
టిష్ఠ తిరుమలరాయ ధాటికిఁ జలించి
పఱచునెడ శక్తి మఱచియు మఱువఁడయ్యెఁ
దత దుచిత ప్రదేశ సంధాన యుక్తి.

(1 ఆ. 58 ప.)

తల్లికోట యుద్ధంలో అళియరామరాయలు చనిపోయిన తరువాత తిరుమలరాయలు కూడా తన అన్న రామరాయలు చేసినట్లే సదాశివరాయలను నామమాత్రంగా సింహాసనంమీద వుంచి రామరాయలు

లాగానే తాను కూడా మెల్లిమెల్లిగా రాజ్యాలను వశపర్చుకుంటూ పరిపాలన చేస్తున్నాడని కొన్ని శాసనాలవల్ల వెల్లడి అవుతున్నది.

శ్రీరామ రాజేశ్రిత సత్వశౌర్యే శౌరేః పదం శాశ్వత మభ్యుపేతే
తదనుభువ మశేషాం పాలయన్ రాజనీత్యా....................
.........తదనుజన్మావర తిరుమల రాజస్వామితీ భోజరాజః
స్వైరం సంవృత కంటకోధ సుకృతోత్కృష్టం విధాయాఖిలం
భూకేదార ముదార దాన సలిలాసారైస్సమాపూర్వచ;
సంవర్థ్యానఘ కీర్తి సస్యనివహం తత్పాలికాం విక్రమ
శ్రీకాంతాం భుజకాయ మాన శిఖరే ధత్తే హి యత్తేజ సా
ధర్మమర్మ విదస్తస్య..............................
.........................విమత ధ్వాంత భాస్వతః
ప్రాజ్య కర్ణాట రాజ్య శ్రీ స్థాపనాచార్య విశ్రుతేః,
ఆత్రేయ గోత్రపాథోజ మార్తాండస్య మనస్వినః
... ... ... ... ... ... ... ...
శ్రీ తిరుమల భూప శేఖర దయాంబుధే
వినయౌదార్య శీలస్య విజ్ఞప్తి మన పాలయన్
... ... ... ... ... ... ... ...
సదాశివమహారాయో మాననీయో మనస్వినాం
సహిరణ్య పయోధారా పూర్వకం దత్తవాన్ ముదా

(ఎపిగ్రాఫికా ఇండియా. 9వ పుస్తకం 338 పుట)

అయితే తిరుమల రాయలు పెనుగొండలో రాజ్యం చేస్తున్న కాలంలో తాను సింహాసనాన్ని అలంకరించినట్లు అతని కుమారుడైన శ్రీరంగరాయలు యువరాజుగా వున్నట్లు సైతం వసుచరిత్రవల్ల స్పష్టపడుతున్నది.

తే. గీ.......................తిరుమలరాయచంద్ర
సాంద్ర పట్టాభిషేకాంబు సముదయమున

(వసుచరిత్ర. 1 ఆ. 62 ప.)

చ. హరిపద భక్తశీలుఁడగు నా రఘునాథ నృపాల కూర్మి సో
దరుఁడు సింగరాయ వసుధావరుఁ డాత్మగుణ ప్రమోద వ
త్తిరుమలరాయ శేఖర వితీర్ణ మహా యువరాజ పట్ట బం
ధురుఁడయి సర్వభూభువన ధూర్వహశక్తి వహించు నెంతయున్.

(వసుచరిత్ర. 1 ఆ. 71 ప.)

కొన్ని శాసనాలలో తిరుమలరాయలు ఈ క్రింది విధంగా వర్ణించబడ్డాడు.

శ్రీరామ రాయేశ్రిత భాగధేయే, శౌరేః పదం శాశ్వతమభ్యుపేతే.
తదనుభువ మశేషాంపాలయన్ రాజనీత్యా తపన తనయ జేతా దానరీత్యా మహాత్యా
భరత మహిత భూమాభాతి తస్యానుజన్మావర తిరుమలరాజస్సాహితీ భోజరాజః
స్వైరం సంవృతకంటకోఽథ సుకృతోత్కృష్టం విధాయాఖిలమ్
భూ కేదార ముదార సలిలసారైస్సమా పూర్వ్యా చ,
సంవర్ధ్యాపనకీర్తి సస్యనివహం తత్పాలికాం విక్రమ
శ్రీకాతాం భుజకాయ మానశిఖరే ధత్తే హియ త్తేజసా

...............................................

ధర్మ మర్మ విదస్తస్య ధరణీకల్ప శాఖినః,
శోమవంశావతంసస్య స్వాధీన నయ సంపదః

....................................

విజ్ఞాపితస్య వినయా ద్విమత ధ్వాంత భాస్వతః
ప్రాజ్య కర్ణాటరాజ్యశ్రీ స్థాపనాచార్య విశ్రుతేః
ఆత్రేయగోత్ర పాథోజ మార్తాండస్య మనస్వినః
అంతేం బవర గండస్య సింధ్వన్త క్షితి రక్షిణః
వర్ణిత యశసోనానావర్ణ శ్రీమండలీక గండస్య
ఏ బిరుదరాయ రాహుత విశ్వైక్య భుజంగ బిరుద భరితస్య
విఖ్యాత బిరుదమన్నె విభాలలీలస్య విజయశీలస్య,
విశ్వంభరాభృతి స్ఫుట విశ్రుత ధరణీ వరాహ బిరుదస్య.
కళ్యాణ పురనాథస్య శల్యారి సమతేజసః
వేంగి త్రిభువనీ మల్లలింగ స్థిర యశోనిధేః
శ్రీమత్తిరుమల క్ష్మాప శేఖరస్య దయాంబుధేః
విన యౌదార్య శీలస్య విజ్ఞప్తి మనుపాలయన్
.......................సదాశివ మహారాయో
సహిరణ్య పయోధారా పూర్వకందత్తవాన్ ముదా

(ఎపిగ్రాఫికా ఇండియా. 9వ పుస్తకం. 338 వ పుట.)

తిరుమల రాయలకున్న బిరుదాలు కొన్ని సహజంగావున్నా మరికొన్ని వంశపారంపర్యంగా వచ్చినా అవి అతని గొప్పతనానికి ప్రతిబింబకాలుగానే వున్నాయి. తిరుమలరాయల బిరుదాలు శక్తి యుక్తులు వసుచరిత్రలో రామరాజభూషణు డనేక సందర్భాలలో వర్ణించాడు.

"వసుమ్మతీ భాగదూర్వాహత నెవ్వాని యుర్వరా వరాహాంక మర్థము వహించు"

"..........................................వీరప్రతాప రాజాధిరాజ
రాజ పరమేశ్వరాష్టదిగ్గాజ కులమునకో భయంకర బిరుద"..........(1ఆ. 13ప.)

"కటకేంద్రుఁడంపిన గంధ సింధురము లాత్మస్వామి మాఱు హస్తములు మొగుప
హయనాథుఁడంపిన హరులు కైజా మోరలార్చుచుఁ బతికి జోహారు సేయ
నావాడ పతి పంపిన యమూల్య కటకముల్ కర్త పేరుగఁ బదాగ్రములఁ బెనఁగఁ
బాండ్యేశుఁడంపిన భర్మాంబులధిపతి ప్రతిగా నిజాంకముద్రలు వహింప
శౌర్యకీర్తులతో వచ్చు సకలదిజ్ఞ, రేంద్ర రాజ్యేందిరల మాడ్కి నిగురుఁబోండ్లు
చటుల మాణిక్య మయదండ చారు చామ, రములు వీవంగఁ బేరోలగమున నుండి"
(1ఆ. 15ప.)

"........................................వీరప్రతాప రాజాధిరాజ
రాజ దేవేంద్ర తిరుమలరాయచంద్ర, సాంద్ర పట్టాభిషేకాంబు సముదయమున"
(1ఆ. 62ప.)

"ఉన్నత జయ జన్య బిరుద, మన్నెవిభాళాది బిరుదమాన్యునకు......" (1ఆ. 87ప.)

"........................................మూరు రాయర గండా!" (2ఆ. 1ప.)

"......... భూ మహావరాహ వారణాధిరాజ వారి రాశి మందరా." (2ఆ. 160ప.)

"..................ఎం, తెం బర గండాంక................"(3ఆ. 187ప.)

"...............పాదనమ్రమహాయరాట్ భాస్వత్సపాదాంకనా!" (5 ఆ. 126 ప.)

కొన్ని శాసనాలలో తిరుమలరాయలు మహాదాత అని వర్ణించబడినట్లే వసుచరిత్రలోకూడా ఇతడు గొప్ప దాత అని అనేక దానశాసనాలు వేయించాడనీ ఈ క్రింది పద్యంలో వర్ణించబడింది.

మ. ధరనెవ్వానికి వ్రాయుఁ బద్మజుఁడు వ్రాఁత ల్వానితో నేగు న
స్థిరముల్ శాశ్వితకీర్తియౌ తిరుమల శ్రీరాయ నారాయణుం
డు రహిన్ వ్రాసిన శాసనాక్షరములుండున్ బుత్రపౌత్రాన్వయ
స్థిరవృత్తిన్ బృథుకాక్షరంబులు గురు శ్రీ వర్ణతుల్యంబులే.

(వసుచరిత్ర. 1 ఆ. 61 ప.)

శాసనాలలో తిరుమలరాయలు "సాహితీ భోజరాజు"గా వర్ణించబడ్డాడు. భోజుడు సాహిత్యకవి పండితపోషకుడు. తాను స్వయంగా కవి పండితుడూ కూడా. ఇదేవిధంగా తిరుమలరాయలు సాహిత్య కవి

పండితపోషకుడు. తాను స్వయంగా కవీ పండితుడూ అనికూడా యీ బిరుదు స్పష్టపరుస్తుంది. తిరుమలరాయలు శ్రీజయదేవుని శ్రీగీతగోవిందానికి "శ్రుతిరంజని" అనే ప్రతిభావంతమైన వ్యాఖ్యానం వ్రాశాడు. ఈ విషయం కొన్ని శాసనాల్లోకూడా పేర్కొనబడింది. ఈ పుస్తకం పరిలభ్యమై మద్రాసు ఓరియంటల్ మాన్యుస్క్రిప్ట్స్ లైబ్రరీలో వున్నది. శ్రీవిరూపాక్షు శాసనంలో యెందువల్లనో సూచనామాత్రంగానైనా పేర్కొనబడలేదు గాని, ఈ తిరుమలరాయలే రామరాజభూషణ విరచితమైన వసుచరిత్ర కృతిపతి. ఈ మహాకావ్యరాజం క్రీ. శ. 1580 ప్రాంతంలో యితని కంకిత మివ్వబడింది. ఈ వసుచరిత్రకృతి అనుస్యూతంకాని శ్లేషలున్న ఏకార్థక కావ్యంగా సాహితీవేత్తలు భావించారు. దీనిలో అష్టవసువులకు సంబంధించిన ఆర్షవిజ్ఞాన సంయుక్తమైన ఎనిమిది అర్థా లున్నాయని, యిది విశిష్ట అష్టార్థక కావ్యమని నా పరిశోధనలవల్ల నిరూపితమైనది. ఈ మహత్తర కావ్యాన్ని రచియించిన మహాకవి రామరాజభూషణుడూ, కృతినంది పోషించిన తిరుమల రాయలూ ధన్యాత్ములు.

## వెంకటాద్రి (రాయలు) రాజు

లక్ష్మణునివలె వీర పరాక్రమాది గుణాలతో యుద్ధనైపుణ్యం గలవాడే యైనా లక్ష్మణుడు తన అన్నయైన శ్రీరామచంద్రునికి తోడు - నీడగా, అనుయాయిగా వున్నట్లే వెంకటాద్రిరాజు కూడా తన పెద్ద అన్నయైన రామరాయలకు (శ్రీరంగరాయల పెద్దకుమారునకు) తోడు - నీడగా, అనుయాయిగా వున్నట్లు స్పష్టపడుతున్నది. (చూడు శ్రీవిరూపాక్షు శాసనం పేజీలు 5,7. శ్లోకం 20, శ్రీరామ శాసనం. పేజి 51. శ్లోకం 16.) కాగా వెంకటాద్రిరాజు పరిపాలకుడుగా—రాజుగా వుండలేదని మనం గుర్తించ వలసి వున్నది. కాని నరపతి విజయంలో వెంకటాద్రిరాజు కందనోలిపురాన్ని పరిపాలించినట్లు ఉటంకించబడింది.

"ఏలెను గందనోలిపుర మింద్రసమానుఁడు వెంకటాద్రి భూ
పాలుఁడు..............................."

(నరపతి విజయం 266 ప.)

ఈ వెంకటాద్రిరాజు యెంతటి పరాక్రమవంతుడో అంతటి సహృదయుడు, అని శ్రీ విరూపాక్షు శాసనంలో లక్ష్మణ సౌమిత్రులతో పోల్చడంతోనే తెలుపబడింది. ఒక్క తళ్లికోట యుద్ధంలోనే కాదు, ఇతర అనేక యుద్ధాలలో వెంకటాద్రిరాజు వీరవిజయాలు సంపాదించాడు. ఈ వెంకటాద్రిరాజు తన రెండవ అన్న యైన తిరుమలరాయలతో కలిసి బీదరురాజ్యం మీదకు దండెత్తి బరీదుషాను జయించిన విషయం గతంలో పేర్కొనబడింది. రామరాజభూషణుని వసుచరిత్రలో వెంకటాద్రిరాజు పరాక్రమం ఈ క్రింది పద్యాలలో వర్ణించబడింది.

మ. కడిమిన్ వేంకటరాయశౌరి నెదురంగా లేక యత్యాహితం
బడరం గౌతమి దాటువేళ నిజకాంతాశ్రు ప్రవాహాప్తిఁగా
ల్నడదప్పన్ జడుఁడై నిజాముఁడు డు పాలంబంబునన్ దాఁటియె
క్కడఁగన్నన్ భజియించునయ్యు డుపరేఖన్నామ మోహంబునన్.

ఉ. ఏకసపాదలక్షమిత మింద్రజుదోశ్చరిత ప్రబంధ మ
స్తోకమెయంచుఁ జాపజిత ధూర్జటి వెంకటశౌరిశౌర్య దీ
ప్తాకృతికర్ణ భీష్మజయ శక్తినసేక సపాదలక్ష సం
ఖ్యా కమనీయభూరి విభవాప్తి వహించు నుదంచితోన్నతిన్.

(వసుచరిత్ర. 1 ఆ. 52, 53 ప.)

అళియరామరాయల సైన్యానికి, దక్కను సుల్తానుల సైన్యాలకు క్రీ. శ. 1542 లో ఘోర పోరాటం ప్రారంభమైంది. ఈ పోరాటంలో వెంకటాద్రిరాజు ప్రధానపాత్ర వహించాడు. "ఆహవగాండీవి" యని శత్రువీరులు సైతం ప్రశంసించేట్లుగా అసమాన శౌర్యప్రతాపాలు చూపిస్తూ విజృంభించిన వెంకటాద్రిరాజు వీరవిహారానికి శత్రుసైన్యాలు యుద్ధరంగంలో నిలువలేక చెల్లాచెదరై పారిపోవడం మొదలుపెట్టాయి. అప్పుడు దక్కనుసుల్తానులు తమతమ రాజ్యాలను రక్షించుకోవాలన్న ఆదుర్దాతో తమతమ సైన్యాలతో విడిపోయి, యెవరిదారిని వారు పారిపోయారు. దీన్ని గుర్తించిన అళియరామరాయలు తన సైన్యాన్ని మూడు విభాగాలుగాచీల్చి తనతమ్ములూ తానూ తలాఒకదానికి ఆధిపత్యం వహించారు. అళియరామరాయలు గోలుకొండ సుల్తానైన జమ్‌షీద్ కుతుబ్‌షాను—తిరుమలరాయలు అహమ్మదునగర సుల్తానైన బురహాన్ నిజాంషాను—వెంకటాద్రిరాజు బిజాపూరు, బీదరు సుల్తానులైన ఇబ్రహీం ఆదిల్‌షా, అమీర్ బరీద్‌షాలను వెంటాడి వారిని జయించి సంధిచేసుకోవాలన్న నిశ్చయంతో అడవిమార్గాల వెంటకూడా తరుముకొని వెళ్లారు. వెంకటాద్రిరాజుసైన్యాలకు, సవాబరీదుల సైన్యాలకు ఆదవేని, కూరకచెర్ల, మానువప్రాంతాలలో యుద్ధాలు జరిగినట్లు తెలుస్తున్నది. ఆదవేని దుర్గాన్ని అప్పటికి తన ఆధీనంలోవుంచుకున్న అసాద్‌ఖాన్ దుర్గాన్నివిడిచి కొద్దిపాటి ఆశ్వికసైన్యంతో మాయమై మిగిలిన సైన్యాన్ని ఆదిల్‌షా సైన్యంతో కలుసు కోవలసిందిగా ఆజ్ఞాపించాడు. వెంకటాద్రిరాజు సైన్యాలు బిజాపూరు సైన్యాల్ని తరుముతున్న రోజులలో, ఒక రోజున వారు ఆదమరచి వుండగా చాటుగా పొంచివున్న అసాద్‌ఖాను మూడువేల అశ్వికసైన్యంతో హటాత్తుగా మెరపుదాడిచేసి వెంకటాద్రిరాజు మొదలైనవారి కుటుంబాలను వస్తుసామగ్రితోసహా స్వాధీన పరచుకున్నాడు. తెల్లవారిన తరువాత వెంకటాద్రిరాజు కళ్లుతెరచి—చెల్లాచెదరైన తన సైన్యాన్ని కూడగట్టు కొని, మరికొంత ఆరవీటి సైన్యాన్ని రప్పించి కలుపుకొని ఆదిల్‌ఖానును వెంబడించి అద్భుత విజయాన్ని సాధించాడు. మహోగర్వోద్ధతుడైన బీదరుసుల్తాను అమీరుబరీద్‌షాను చిత్తు-చిత్తుగా ఓడించి రాజ్యాన్ని స్వాధీనం చేసుకోవడమేగాక అతన్నికూడా బంధించాడు. తమ కుటుంబాలకు శత్రువులవల్ల అవమానాలు జరుగకుండా అసద్‌ఖాన్ చెరనుంచి విడిపించాడు. ఈ విషయాన్ని నరసభూపాలీయ వసుచరిత్రలలోని ఈ క్రింది పద్యాలు బలపరుస్తున్నాయి.

తే. గీ. అనుచుఁ యవనులఁ దెగడితన్నాశ్రయించు
వారి సామ్రాజ్యలక్ష్మినెవ్వాఁడు గొనియె
నాహవోగ్ర బరీదసప్తాంగ హరణుఁ
డతఁడు విలసిల్లు శ్రీవేంకటాద్రి విభుఁడు

(నరసభూపాలీయం)

సీ. నిరతంబు దుర్మార్గ నిరతులౌ తురకల
నతుల సన్మార్గసంగతులఁ జేసె
ననియతమోహాంధులౌ పారసీకుల
స్వస్త్రీ సుఖైక నిశ్చలులఁ జేసె
నతినిర్దయాత్ములౌ యవనుల భూత
సంతానతృప్తి ప్రదాత్మకులఁ జేసె
ద్విజపశుపాతంబు దెగడు పాశ్చాత్యుల
ద్విజపశుపాత భావితులఁ జేసె
గీ. ననుచుఁ గడుమెచ్చి జయలక్ష్మియాజిరంగ
కాతర బరీద కేతన ఘటితభద్ర
కలశ మెదురుగఁబూని యేఘనునిఁ జెందె
నతఁడు సామాన్యుఁడే వేంకటాద్రి విభుఁడు.

(వసుచరిత్ర)

బీదరుసుల్తాను వెంకటాద్రిరాజుకు లొంగిపోయిన తరువాత బిజాపూరుసుల్తాను పలాయనం చిత్తగించాడు. అయినా వెంకటాద్రిరాజు అతన్ని వెంబడించాడు. తుంగభద్రానది కుత్తరంగా రాచూరు, ముదిగల్లు దుర్గాలకు మధ్యవున్న మానువదుర్గం దగ్గర ఉభయ సైన్యాలకూ యుద్ధం జరిగింది. ఈ యుద్ధంలో ఇబ్రహీం ఆదిల్‌షా భయంకరంగా పోరాడి కూడా ఘోరపరాజయం పొందాడు. ఈ యుద్ధంలో వెంకటాద్రి రాజు పెదతండ్రియైన అవుకు తిమ్మరాజు కూడా ప్రధాన పాత్ర వహించాడు. పద్య-ద్విపద బాలభాగవతాలు ఈ విషయాన్నే పేర్కొన్నాయి. వెంకటాద్రిరాజుకు లభించిన పరిపూర్ణ విజయం నరసభూపాలీయంలో ఈ క్రింది పద్యాలలో వర్ణించబడింది.

మ. బలధుర్యుండగు వేంకటేంద్రుని మహాబాహాబలాటోప వి
హ్వలుఁడై యున్నతిధావనక్రియ సపాదాభి ముఖ్యుఁడైనట్టి యే
దులు ఖానుండిదేనేడుఁ గ్రమ్మఱ సపాదుండయ్యె నానర్మిలిన్
దలఁదత్పాదముఁదాల్చె భీమరథి పొంతన్గాన నిత్యోన్నతిన్.

మ. స్థిరసంగ్రామ జయాభిరాముఁడగు నా శ్రీవెంకట క్ష్మావరుం
డరయ న్రాజశిఖావతంసుఁడగుఁ దథ్యంబుఁగాకున్న నీ
ధరణీపాలకులెల్ల మెచ్చఁగ సపాదక్షోణి భృత్ప్రాప్తిభా
సురదుర్గాధిపతిత్వ వైభవభవస్ఫూర్తి న్విజృంభించునే.

(నరసభూపాలీయం)

వెంకటాద్రిరాజు చేతుల్లో ఘోరపరాజయ, పరాభవాలు పొందిన బిజాపూరుసుల్తాను వెంకటాద్రిరాజు కాళ్లు పట్టుకొని—"సపాదక్షోణి భృత్ ప్రాప్తి భాసుర దుర్గాధిపతిత్వ వైభవం"తో—అంటే బిజాపూరురాజ్యం

లోని రాచూరు, ముదిగల్లు మానువదుర్గాలను కానుకగా యిచ్చి సంధిచేసుకొని తన రాజ్యం పరాధీనం కాకుండా కాపాడుకున్నాడు. "చారిత్రకమైన ఈ పరమ సత్యాలవల్ల ఫెరిష్తా తలక్రిందులుగా—తారుమారుగా వ్రాసిన అయథార్థగాథలకు విలువలేకుండా పోయింది." అని చరిత్రకారులు పేర్కొన్నారు.

తిరుమలరాయ సోదరులు తమసైన్యంతో కళ్యాణనగరదుర్గాన్ని పట్టుకున్న విషయం వసుచరిత్రలో లేదని హిరాసుఫాదరీ పేర్కొనడం వాస్తవంకాదు. తిరుమలరాయల సైన్యం కళ్యాణనగర దుర్గం దగ్గర బురహాన్ నిజాంషా సైన్యంతో పోరాడుతుంటే, తూర్పుదిక్కునుంచి అళియరామరాయల సైన్యం, పడమటి దిక్కునుంచి వెంకటాద్రిరాజు సైన్యం తమ తమ విజయయాత్రలు ముగించుకొని మధ్యలోవున్న తిరుమల రాయల సైన్యంతో కలుసుకున్నాయి. సోదరత్రయంతో పోరాడలేని నిజాంషా కళ్యాణనగరాన్ని విడిచి పెట్టి అహమ్మదునగరంవైపు పారిపోయాడు. "The Vasucharitramu does not give any information about the capture of Kalyani, which belonged to the Sultan of Ahmadnagar. (The Aravidu dynasty of Vijayanagar, P. 76.) అని హిరాసు ఫాదరీ వ్రాసిన విషయాన్ని ఈ క్రింది వసుచరిత్ర పద్యం త్రోసిపుచ్చుతున్నది.

శా. విశ్వామిత్రునిఁగొల్చి రాముఁడతఁ డుర్వింజెందెఁ గళ్యాణము
న్విశ్వామిత్రులుగొల్వ రాముఁడితఁ డుర్విం జెందెఁ గళ్యాణమున్
శశ్వత్కీర్తులు రాము లచ్యుతపురున్ సాధించు కళ్యాణలా
భైశ్వర్యంబులు ధర్మనిర్మథన ధర్మాలంబన వ్యగ్రముల్.

(వసుచరిత్ర)

ఇంతటితో ఆగక సైన్యాలు అహమ్మదునగరంలోకి ప్రవేశించి కోటలను నాశనంచేసి, ఆ నగరాన్ని నాగళ్లతో దుక్కిదున్నించి ఆముదాలు చల్లించాయనికూడా తెలుగు కవులు వర్ణించారు. అహమ్మదు నగరాన్నివిడిచి అక్కడికి 45 మైళ్ళ దూరంలోవున్న గోదావరినిదాటి యుద్ధంలో రక్తసిక్తాలైన తమ ఖడ్గాలను గోదావరిలో సైనికులు కడుగుకున్నారని కూడా కవులు వర్ణించారు. ఏమైనా వెంకటాద్రిరాజు నిజంగా లక్ష్మణునివలె మాత్రమేగాక లక్ష్మణునికంటె గొప్పవానిగా అన్నలకు విజయపరంపరలు సమకూర్చడంలో అత్యంత ముఖ్యమైన పాత్ర వహించాడని మనం చెప్పవచ్చు. శ్రీరామ శాసనంలో వెంకటాద్రిరాజు గురించి ప్రత్యేకించి ఈ క్రింది శ్లోకం రచించబడింది.

శ్లో. ఖ్యాతస్తస్య పితామహానుజతయా శ్రీవేంకటాద్రిక్షమా
పాల శ్రీలలనాస్వయం వృతపతేః జాతాను కంపాస్పదం
ఆసీదుద్ధృత శత్రుగంధ కరటి ప్రధ్వంస బద్ధవ్రతో
హర్యక్షః కవిలోక రక్షణ కలా ప్రత్యగ్ర భోజాకృతిః

(శ్రీరామశాసనం. 55 పుట 33 శ్లోకం.)

(ఆ వెంకటపతిరాయల తాతగారి తమ్ముడైన శ్రీవెంకటాద్రిరాయలు విష్ణుమూర్తి అనుగ్రహానికి పాత్రుడు. ఆయన శత్రుమత్తగజాలకు సింహం వంటివాడు. కవులను పోషించడంలో భోజుని వంటివాడు.)

శ్రీరంగరాయల రెండవ కుమారుడైన తిరుమల రాయల అనంతరం ఆతని కుమారుడైన శ్రీరంగ రాయలు (2B) రాజ్యానికి వచ్చాడు. ఈ శ్రీరంగరాయలు (2B) తనతండ్రి తిరుమలరాయలు రాజుగా వున్నప్పుడే యువరాజుగా పట్టాభిషిక్తుడైనాడని గతంలో తెలుపబడింది.

తిరుమలాంబా శ్రీరంగరాయల పుత్రులైన అళియరామరాయలు, తిరుమల రాయలు, వెంకటాద్రి రాయలు ముగ్గురికీకూడా సంతతివున్నది. అయితే శ్రీవిరూపాక్ష శాసనంలో తిరుమలరాయల అన్నదమ్ము లైన అళియ రామ రాయలు, వెంకటాద్రిరాయల సంతతి గురించి పేర్కొనబడలేదు. తిరుమలరాయల సంతతి సైతం శ్రీ రంగరాయలు మినహా-పేర్కొనబడలేదు. శ్రీరామ శాసనంలో తిరుమలరాయల సంతితోపాటు అటు అళియరామరాయల సంతతి, ఇటు వెంకటాద్రి రాయలసంతతి కూడా వర్ణించబడింది. అందువల్ల క్రమాను తంగా శ్రీవిరూపాక్ష-శ్రీరామ శాసనాల ననుసరించి తొలుత తిరుమలరాయల వంశం, అనంతరం అళియ రామరాయల వంశం, ఆ తరువాత వెంకటాద్రిరాయల వంశం పేర్కొనడం జరుగుతున్నది. కాగా తొలుత తిరుమల రాయల పుత్రపౌత్రాదుల విషయం ఉటంకించబడుతున్నది.

## శ్రీరంగరాయలు (2 B)

వెంగళాంబా తిరుమలరాయల కుమారుడైన శ్రీరంగరాయలు దానగుణంతో కీర్తి వహించాడు. శత్రువులను జయించి కొండవీడు, వినుకొండ మొదలైన దుర్గాలను స్వాధీన పరచుకున్నాడు. పెనుగొండ పట్టణంలో నివసించేవాడు. ఇతనికి తిరుమలదేవి, కృష్ణాంబ అన్న ఇరువురు భార్యలున్నారు. ఇతని పట్టాభిషేక సమయంలో విపరీతంగా సువర్ణదానం చేశాడు. శ్రీరంగరాయలు శత్రువులను అనేకమందిని జయించి మొత్తం ఎనభైనాలుగు దుర్గాలను పట్టుకొనగలిగిన మహావీరుడు. అందువల్లనే దిగ్గజ-కులపర్వత-ఆదిశేష అంశలతో జన్మించిన భూపతి కాగల ఏకైకవీరుడుగా వర్ణింపబడ్డాడు. మంచి నడ వడిక కలవాడు. "హోసబిరుదార గండడు, రాయరాహుత్తమిండడు, మన్యాన్నాములు, గూలియ మన్య వీరపులి, రణముఖ రామభద్రుడు, మండలీక గండడు, చాళుక్య చక్రవర్తి బిరుద రాయరాహుతవేశ్యా భుజంగుడు. ఒడ్డియ రాయదిశాపట్టుడు, రాజాధిరాజ, రాజాపరమేశ్వర, మూరురాయరగండ హిందరాయ సుల్తాన్, మొదలైన బిరుదులు గలవాడు. శరణాగతరక్షకుడు. ఆడితప్పిన రాజులను దండించినవాడు. ఆదహాలురాయని గర్వభంజకుడు. ఉత్కళ రాజును మహాపరాక్రమంతో జయించినవాడు. మహారాష్ట్ర మగధ దేశాలలో గౌరవించదగిన పదవి కలవాడు. కాంభోజ, భోజ, కాళింగ మహారాష్ట్రాది రాజుల వినతు లందినవాడు. కల్యాణ పురాధిపుడు. నెల్లూరిసీమను కూడా కలుపుకొని పరిపాలించినవాడు. ఆరవీటి పురంలో నాయకమణిగా వెలుగొందినవాడు.

ఈ శ్రీరంగరాయలు శాలివాహన శకం 1498 లో ధాతనామ సంవత్సర కార్తీకమాస శుక్ల పక్ష క్షీరాబ్ధి ద్వాదశినాడు (అనగా క్రీ.శ 1576-నవంబరు 3 వ తేదీ శనివారం) శ్రీరామచంద్రుని సాక్షిగా, కౌండిన్య గోత్రుడూ, ఆపస్తంభ సూత్రుడూ, అయిన లక్ష్మీపతి భట్టునకు, శ్రీ కాళహస్తీశ్వరుని నిత్యనైమిత్తికోత్సవములకు, జీర్ణోద్ధారమునకు పెక్కు భూములను రాణిపేరుమీద దానం యిస్తూ వేయించిన శాసనమిది.

ఈ లక్ష్మీపతిభట్టు తిమ్మావధాని పుత్రుడు. నరసభూపాలుని పౌత్రుడు. వీరి యింటిపేరు యాదాటి వారు. లక్ష్మీపతిభట్టు విష్ణుభక్తుడు. యజన—యాజన—అధ్యయన-ఆధ్యాపన—దాన—ప్రతిగ్రహములు అనే షట్కర్మలలో నిరతుడు. గొప్ప వేదవిజ్ఞాని. యజుశ్శాఖాధ్యాయులలో శ్రేష్ఠుడు. వివిధాగమవేత్త. లక్ష్మీపతి మధురమైన, స్వచ్ఛమైన సంభాషణ చేయగలవాడు. శమదమాదిగుణ సంపన్నుడు. సుప్రసిద్ధమైన చంద్రగిరి రాజ్యంలో ఉంటూ పలనాడు కొత్ససీమలలో ప్రసిద్ధిపొందినవాడు.

క్రీస్తుశకం 1576 లో శ్రీవిరూపాక్ష శాసనాన్ని వేయించిన శ్రీరంగరాయలు, తిరుమల రాయల పుత్రుడు. ఈ శాసనంలో శ్రీరంగరాయల అన్నదమ్ముల విషయం పేర్కొనబడలేదు. 31వ శ్లోకంలో "శ్రీవెంగళాంబా చిరపుణ్యరాశిః" అనడంవల్ల శ్రీరంగరాయలు తిరుమలరాయలవల్ల వెంగళాంబకు కలిగిన కుమారుడని స్పష్టమవుతున్నది.

శ్రీరామశాసనంలోని

సామాదయోవిధి ముఖాదివ సత్యవాచః
సామాద్యుపాయ నివహోయివ సాంయుగీనాత్
రామాదయో దశరథాదివ రాజమౌళేః
తస్మాదమేయ యశసస్తనయా బభూవుః ॥19॥
తోభూద్ రఘునాథ నామా
శ్రీరంగ రాజః శ్రిత పారిజాతః
సామరాజ శ్శిశుః రాంశురుర్వ్యాః
విఖ్యాతి మాన్వేంకట దేవరాయః ॥20॥

(చూడు 51 పుట)

అన్న శ్లోకాలవల్ల తిరుమలరాయలకు భార్యలనేకులున్నారనీ, దశరథునికి శ్రీరామాదులవలె తిరుమలరాయలకు రఘునాథరాయలు, శ్రీరంగరాయలు, శ్రీరామరాయలు, వేంకటపతిదేవరాయలు అన్న నలుగురు పుత్రులు జనించినట్లు స్పష్టపడుతున్నది.

తజ్జ్యాయసః సుర ద్రుమ లజ్జా
వహ చరిత్ర రామరాజ విభోః
జాజాత స్తిరుమల రాజ
ఖ్యాతశ్రీరంగ రాయోఽపి ॥23॥

(చూడు. 51 — 53 పుటలు)

అన్న 23 వ శ్లోకంలో శ్రీరామరాయలను, వెంకటపతిదేవరాయలకు — తజ్జ్యాయసః — అని అన్నగా పేర్కొనడంవల్ల శ్రీరామరాయలు, వేంకటపతిదేవారాయలు, ఒక తల్లిబిడ్డలేనేమో అనిపిస్తున్నది.

కాగా రఘునాథరాయలు తల్లి మరొకామె అన్నమాట. దీనివల్ల తిరుమలరాయలకు ముగ్గురు భార్యలున్నా రని, ఇద్దరు భార్యలకు ఒక్కొక్క కొడుకువంతున ఒకభార్యకు యిద్దరు కొడుకులు జనించారని స్పష్టపడుతున్నది. కాబట్టి తిరుమలరాయలను దశరథునితోను, ఆయన పుత్రులను శ్రీరామాదులతోను శాసన కావ్యకర్త పోల్చివుంటాడు.

అయితే రామరాజభూషణుడు వసుచరిత్రలో రచించిన ఈ క్రింది పద్యంప్రకారం మాత్రం వెంగళాంబ యందే తిరుమలరాయలకు రఘునాథరాయ, శ్రీరంగరాయ, శ్రీరామరాయ, వేంకటపతిదేవరాయలను నలుగురు పుత్రులు గలిగినట్లు స్పష్టపడుతున్నది.

శా. రారాజద్గుణశాలి తిర్మల మహారాయందు శ్రీవెంగళాం
బారామా మణియందుఁగాంచెసుతులం బ్రఖ్యాతసత్కీర్తి ॥
ఙ్శ్రీరామున్ రఘునాథభూమి రమణున్ శ్రీరంగరాయాగ్రణిన్.
శ్రీరామావని నాథుఁ బ్రాభవనిధిన్ శ్రీవేంకటక్ష్మావరున్. (1 ఆ. 66 ప.)

రఘునాథాదులు నలుగురూ రామరాజభూషణుడు పేర్కొన్నట్లు ఏకమాతృ గర్భజనితులే యైనపుడు తిరుమలరాయలు జ్యేష్ఠపుత్రుడైన రఘునాథరాయలను విడిచి రెండవపుత్రుడైన శ్రీరంగరాయలను యువరాజుగా యెందుకు నిలిపాడో కారణం చెప్పలేము. ప్రత్యేకించి శ్రీవిరూపాక్ష శాసనంలో శ్రీరంగ రాయలు తన అన్నదమ్ములను పేర్కొనకుండా తనను మాత్రమే యెందువల్ల వర్ణింపచేశాడో చెప్పలేము.

శ్రీరామశాసనంలో సైతం వూరకే తిరుమలరాయల పుత్రచతుష్టయం పేర్కొనబడింది గాని రఘునాథరాయలగురించి ప్రత్యేకించి యేమీ ఉటంకించబడలేదు.

వసుచరిత్రలో శ్రీరంగరాయలను వర్ణిస్తూ రామరాజభూషణుడు ఆరు పద్యాలు రచించాడు. అవి యివి.

చ. హరిపద భక్తశీలుఁడగు నా రఘునాథ నృపాలు కూర్మి సో
దరుఁడు సిరంగరాయ వసుధా వరుఁడాత్మగుణ ప్రమోద వ
త్తిరుమలరాయ శేఖర వితీర్ణ మహాయువరాజ పట్టబం
ధురుఁడయి సర్వ భూభువన ధూర్వహ శక్తి వహించు నెంతయున్.

చ. ఉరమున నేగుఁ గుండలి పయోధర ధారల నాను నెప్పుడుం
గిరులు గరుల్ రజోవివృతికిం జను వెల్లఁడు నేల కూర్మ శే
ఖరుఁడిది యేల బాలజనకల్పిత సౌఖ్యమటంచు ధారుణీ
తరుణి సిరంగరాయ వసుధావరుఁ జేరెఁ గుమారమన్మథున్.

సీ. కుంతలస్థలికి నే గుణ గరిష్ఠుని చీటి
కమనీయ కేతకీ గర్భ దళము
మంజుల లలాట సీమకు నే మహా భాగు
తేజంబు కాశ్మీర తిలక రేఖ
వత్సభాగమునకే వైభవాధికుని య
పారకీర్తిమ తల్లి హారవల్లి
కాంచి దేశమునకే ఘనుని సంతత దాన
వారి నిర్ఝరధారహీర రశన

తే. గీ. యంగమున కెవ్వని చమూతురంగ కోటి
ధాటికాధుత ధూళి మాందాళి పట్టు
సమధికా కల్పరుచిఁబూను జగతికతఁడు
రాజమాత్రుండె శ్రీరంగరాయ శౌరి.

మ. జలధిన్ దానపయోధునీ ఝురులచే, జంద్రున్ యశోలక్ష్మిచే,
జలదవ్రాతము నాత్మకారిత మహాసత్రాగ్ని ధూమంబుచేఁ
జలువొప్పన్వెలయింపఁజాలు భళిరే శ్రీరంగరాయ క్షమా
లలనావల్లభుఁడెల్ల దాతలకు నెల్లన్ దాత యూహింపగన్.

శా. తుంగక్ష్మాధరకోటులెక్కి కమలాప్తున్మ్రింగి వీరారి శా
ర్ఙ్గాంగారంబులనొక్క గ్రుక్కఁగొని సద్యశ్శాంతి మానంగనా
నుంగల్లోలవతీ భుజంగ జలసందోహంబులెల్లన్ సమి
ద్రంగ ప్రౌఢ సిరంగరాయ పృతనా రంగద్రజో జాలముల్.

సీ. భూరి భుజంగికా భుక్త నిర్మొక్తుఁడై
వారక బుసకొట్టు వానిఁ బెగడి
పంకనిశ్శంకుఁడై పారదారిక వృత్తి
వదలక పల్లొత్తు వానినెడపి
మధుపాంగనా సంగమప్రౌఢి నెపుడు వో
వనిచెక్కు చెమరుల వాని రోసి
బింకంపు సానుల వంక రాపడినెల
వంకపై బూనిన వాని మాని

తే. గీ. పుడమి చెలి జెందె నకలంక భోగ భాస
మాను నక్షయ సౌకర్యమాని తాను
భావు నమలిన దానవైభవు న కూట
రాగ నిస్తంద్రు శ్రీరంగరాయ చంద్రు.

(వసుచరిత్ర 1 ఆ. 71, 72, 73, 74, 75, 76 పద్యాలు.)

ఈ పద్యాలలో శ్రీరంగరాయలు పరిపాలనా సామర్థ్యం కలవాడుగాను - గొప్ప రూపసిగాను - కుంతల, వత్స, కాంచి, అంగ దేశాలను జయించిన వ్యక్తిగాను - గొప్ప దాతగాను - మహావీరుడుగాను - సద్గుణవంతుడుగాను - ప్రత్యేకించి తండ్రియైన తిరుమలరాయలగుణాలు మూర్తీభవించిన వ్యక్తిగాను వర్ణించబడింది. శ్రీరంగరాయలంటే రఘునాథరాయలకు చాల యిష్టమట. తనగుణాలు ప్రతిబింబించి వున్నవాడుకాబట్టి శ్రీరంగరాయలను యువరాజుగా పట్టాభిషిక్తుని చేసినట్లు "హరిపద భక్త శీలుఁడు" ఇత్యాది పద్యంలో రామరాజభూషణుడు పేర్కొన్నాడు. ఈ శ్రీరంగరాయలు క్రీ. శ. 1572 లో పట్టాభిషిక్తుడై 1585 వరకు పరిపాలన చేసినట్లు కనిపిస్తున్నది. పెనుగొండ రాజధానిగా పరిపాలన సాగించినా ఆరవీటి నగరాన్ని సైతం ఆనువంశికతను నిలుపుకొనడానికి తన రెండవరాజధానిగా నిలుపుకున్నట్లు శ్రీవిరూపాక్ష శాసనంవల్ల స్పష్టపడుతున్నది. (చూడు 11 పుట 41 శ్లోకం) ఈ సందర్భంలో ఆరవీటి పురహార నాయకుడుగా శ్రీరంగరాయలు వర్ణించబడ్డాడు.†

## రఘునాథరాయలు

ఈ రఘునాథరాయల గురించి చారిత్రకులు అధికంగా పేర్కొనకపోయినా వసుచరిత్ర అవతారికలో వున్న నాలుగు పద్యాలవల్ల ఇతని గుణగణాలు శౌర్యప్రతాపాలు మనకు తెలుస్తున్నాయి. ఆ పద్యాలివి.

క. ఆ జగ ధభినుత సుగుణ స
మాజులలో నగ్రజుండు మహనీయ యశో
రాజీవాసనుఁడు సుధీ
రాజీవాసనుఁడు వెలసె రఘునాథుఁడిలన్.

సీ. బలు వాహినులమించు మలకల ఘననామ
కంబులు దూల మూలంబులెత్తుఁ
బ్రతిరోధి వరణ వర్గము ద్రోచి తన్మహా
భోగశాలి క్షేత్రములు హరించు

† ఇక్కడితో శ్రీ విరూపాక్ష శాసనాన్ననుసరించి లభ్యమైన ఆరవీటివంశం ముగిసింది. ఇకమీదట శ్రీరామశాసనాన్ననుసరించి ఆరవీటివంశం ఉటంకించబడుతున్నది.

వలగొన్న బహురాజవంశ గుల్మంబులఁ
బహు దెఱంగులఁ గ్రుచ్చి పెల్లగిల్చె చు
వడిఁజొచ్చి కలఁచి యావనరాసుల సమగ్ర
జీవనంబెల్ల దుష్కీర్తిఁ గలుపు

తే. గీ. నవని నసహాయ శూరత నధిగమించు
ననఘ తిరుమలరాయ నందన సమిద్ధ
ఖీర రఘునాథ భుజపీఠిఁ బీటవెట్టు
సాహసోదగ్ర బిరుద వరాహమూర్తి.

శా. యాదోరాశి గభీరమూర్తి రఘునాథాధీశుఁడుద్దండ బా
హా దర్పాంధ సపాదమల్కిక నిజామానీకముల్ ద్రుంప జ
న్యా దూరక్షితిఁ బారు కృష్ణకును గృష్ణాంకంబు నాఁడబ్బెబి
బ్బీ దీవ్యన్నయ నాబ్జ కజ్జల జలాఖీల ప్రవాహంబునన్.

మ. హరి మైసాది శిరంబు సాదిమెయి జాత్యశ్వోత్తమాంగంబు గూ
డ రణోర్విన్ రఘునాథశౌరి యసిఁ జెండన్ దివ్యమందార వృ
ష్టి రహిఁ బ్రాణయుతంబులై గగనవాటింబర్వ గంధర్వ కి
న్నర రూపంబులు దాల్చి సారెకవి యానందించుఁ దచ్చౌర్యమున్.

(వసుచరిత్ర 1 ఆ. 67, 68, 69, 70 పద్యాలు.)

రఘునాథరాయలు గొప్ప యుద్ధవీరుడని, అనేక ముస్లిమ్ సైన్యాలను నిర్మూలనం చేసినట్లు రామరాజభూషణుడు పేర్కొన్నాడు. అనేకమంది చోరులు కట్టుకున్న ప్రాకారాలను విధ్వంసంచేసి రక రకాల భోగాలనుభవిస్తున్నవారి భార్యలనుకూడా చెరపట్టాడట. రఘునాథరాయలు మల్కి నిజాంసైన్య సమూహాలను సంహరిస్తే వారి భార్యలు దుఃఖించగా కారిన కాటుక కన్నీళ్లు కృష్ణానదిలో కలువడంవల్ల కృష్ణానదిజలం నల్లబడిందని రామరాజభూషణుడు వర్ణించాడంటే, ఎంతమంది సైనికులను అతను సంహరించి వుంటాడో మనం చెప్పలేము. "హరిమై" ఇత్యాది పద్యంలో గుఱ్ఱపు కళేబరంతో రౌతుతల, రౌతుకళేబరంలో గుఱ్ఱపుతల కలిసిపోయేట్లుగా ఆ శిరస్సులను ఛేదించి, యుద్ధరంగంలో రఘునాథరాయలు వీరవిహారం చేసాడని పేర్కొన్నాడంటే –మహాప్రవాహంగా నడుస్తున్న కవితలో తిరిగే సుడిగుండాలవలె విచిత్రంగా, సహజంగా నడిచే చిత్రకవితలాగా-ఆ మహాయుద్ధంలో సైతం ఆ నెత్తురుటేరుల్లో రఘునాథరాయలు అతి విచిత్రమైన చిత్ర యుద్ధంసైతం చేయగలడని-చేసాడని రామరాజభూషణుడు స్పష్టపరుస్తున్నాడన్నమాట. శ్రీరంగరాయలు తిరుమలరాయల సద్గుణాలు మూర్తీభవించిన వ్యక్తిగా పేర్కొనబడటం, రఘునాథరాయలు శత్రుస్త్రీలను, చోరవర్గస్త్రీలను చెరబెట్టాడని చెప్పడం చూస్తే రఘునాథరాయలు పరస్త్రీ వ్యామోహం కలవాడని అని పిస్తుంది. రామరాజభూషణుడు "తన్మహా భోగశాలి క్షేత్రములు హరించు" అని పేర్కొనడం చూస్తే

రఘునాథరాయల వ్యభిచారగుణాన్ని బహిరంగపరుస్తున్నట్లు కనిపిస్తున్నది. తిరుమలరాయలు ఈ కారణం చేతకూడ రఘునాథరాయలను యువరాజుగా చేయలేదేమో! కొందరు చరిత్రకారులు ఈ రఘునాథ రాయలను గుర్తించనేలేదు.

## వెంకటపతిదేవరాయలు

వెంకటరాయలు-వెంకటపతిరాయలుగా సైతం వ్యవహరింపబడిన ఈ వెంకటపతిదేవరాయలు శ్రీరామశాసనం ప్రకారం తిరుమలరాయల బహుభార్యలవల్ల కలిగిన సంతతిలో నాలుగవవాడు-చిన్నవాడు. వసుచరిత్ర ప్రకారం వెంగళాంబకు కలిగిన నాల్గవ పుత్రుడు. శ్రీరంగరాయ (2B) లకు చిన్నతమ్ముడు. ఈ వెంకటపతిదేవరాయలను తిరుమలరాయలు తమిళదేశంమీద చంద్రగిరిలో రాజప్రతినిధిగా నిలిపాడు. శ్రీరంగరాయల తరువాత ఈ వెంకటపతిదేవరాయలు క్రీ. శ. 1586 లో రాజ్యానికివచ్చాడు. ఇతడు మహాకీర్తివంతుడై రాజ్యంచేశాడు. గొప్పరాజనీతివేత్త (శ్రీరామశాసనం 51 పుట. 22 శ్లోకం). ఈ వెంకటపతిదేవరాయలు సుమారు 28 సంవత్సరాలపాటు అత్యంత సమర్థతతో రాజ్యపాలన సాగించాడు. మహమ్మదీయుల కుతంత్రాలతో తన రాజ్యంలో వచ్చిన తిరుగుబాటులను అణచివేశాడు. గోలుకొండ నవాబుతోయుద్ధంచేసి విజయలక్ష్మిని చేపట్టాడు. ఉదయగిరిని స్వాధీనం చేసుకున్నాడు. ఇతని కాలంలోనే డచ్చివారు మచిలీపట్టణం-నిజాముపట్టణం-చెన్నపట్టణం-పులికాటు అన్న ప్రదేశాలలో ఫ్యాక్టరీలు కట్టారు. పోర్చుగీసువారుకూడా ఈ ప్రదేశాల్లోనే ఫ్యాక్టరీలు కట్టారు. ఈ ఫ్యాక్టరీలు క్రీ. శ. 1605-1612 సంవత్సరాల మధ్య నిర్మించబడ్డాయి. అయితే క్రీ. శ. 1621-1640 సంవత్సరాలలోకూడా పులికాటు, మద్రాసులలో ఫ్యాక్టరీలు నిర్మించడం జరిగింది.

వసుచరిత్రకారుడైన రామరాజభూషణుడు ఈ వెంకటపతిరాయల గుణగణాలను నాలుగు పద్యాలలో వర్ణించాడు. వీటిలో వెంకటపతిదేవరాయలు గొప్పకీర్తికలవాడని, అనేకమంది సామంతులు సేవించగా చంద్రగిరిలోవున్నాడని పేర్కొనబడింది. చాలా అందమైనవాడుగా, దానశీలుడుగా, కవిపోష కుడుగా వర్ణించబడ్డాడు. వెంకటపతిదేవరాయల చంద్రగిరి నివాసాన్ని పేర్కొంటూ చారిత్రకంగా ఉపయోగపడగల వసుచరిత్ర పద్యం యిది.

మ. హరుఁడాతారకశైలదుర్గమున నధ్యాసీనుఁడై రాజశే
ఖరవిఖ్యాతివహించుఁజంద్రగిరి దుర్గంబందు శ్రీ వేంకటే
శ్వరుఁడొప్పెన్ బహురాజ శేఖరసదాసం సేవ్యుఁడై యార యి
ద్ధరబంశేలిక వాసి తద్గిరులకుందద్వల్లభ శ్రీలకున్.

(వసుచరిత్ర 1 ఆ. 81 ప.)

వెంకటపతిదేవరాయలు కీస్తుశకం 1614 లో మృతినొందగా, ఇతని అన్న అయిన శ్రీరామరాయల చిన్నకుమారుడు శ్రీరంగరాయలు (3) రాజ్యానికి వచ్చాడు. వెంకటపతిదేవరాయలకు సంతానమున్నట్లు కనపడదు.

## శ్రీరామరాయలు (3)

ఈ శ్రీరామరాయలు తిరుమలరాయల పుత్రులలో ఒకడు. వెంకటపతిదేవరాయలకు అన్న. (శ్రీరామశాసనం 51, 53 పుటలు. 23 శ్లోకం.) శ్రీరంగరాయలకు సవతితల్లి కుమారద్వయంలో అగ్రజుడు. దాననిరతుడై సుచరిత్రుడైనవాడు. ఇతనిని రామరాయలు అనికూడా చరిత్రకారులు వ్యవహరించారు. తిరుమలరాయలు తన మూడవపుత్రుడైన ఈ శ్రీరామరాయలను కన్నడదేశంలో తన రాజ ప్రతినిధిగ శ్రీరంగపట్టణంలో నిలిపాడు. ఇతనికి తిరుమలరాయలు (2) శ్రీరంగరాయలు (3) అనేపేర్లు గల యిద్దరు పుత్రులు జన్మించారు.

తిరుమలరాయల మూడవపుత్రుడైన ఈ శ్రీరామరాయలను (3) వసుచరిత్రకర్త రెండు పద్యాలలో వర్ణించాడు. ఇతడు కీర్తివంతుడు, దానశీలంకలవాడు, స్వార్థరహితుడని వర్ణించబడ్డాడు. ఇతడు శ్రీరంగపట్టణంలో శత్రుపీడలేకుండాచేసుకొని నివసించాడని చెప్పడానికి చారిత్రకంగా ఉపయోగపడగల వసుచరిత్ర పద్యమిది.

మ. ఘనశౌర్యుండు సిరంగరాయనరలోక స్వామితోఁ బుట్టు రా
మన్నృపాలాగ్రణి సహ్యజాంబుధి పయోమధ్యోర్వి శ్రీరంగప
ట్టణ లంకానగరంబు పుణ్యజన పీడావార్తలేకుండఁ గై
కొని యెన్మిత్ర భవోపకార నిరపేక్షుండై విచిత్రంబుగన్.

(వసుచరిత్ర 1 ఆ. 77 ప.)

## తిరుమలరాయలు (2) – శ్రీరంగరాయలు (3)

వీరిద్దరినిగురించి శ్రీరామశాసనంలో విశేషాలేమీలేవు. శ్రీరంగరాయలకు విద్యా, వినయ దయా, యశోవంతులైన పుత్రులనేకమంది పుటారు. వారిలో శ్రీరామరాయలు (4) కవులచేత బహుధా ప్రశంసింపబడుతూ చాలాకాలం ప్రకాశించాడు (చూడు. శ్రీరామశాసనం 53 పుట. 24, 25 శ్లోకాలు).

## శ్రీరంగరాయలు (3) – శ్రీరామరాయలు (4)

క్రీ. శ. 1614 లో వెంకటపతిదేవరాయలు మృతిచెందగా, అతని అన్నయైన శ్రీరామరాయల (3) చిన్నకుమారుడైన ఈ శ్రీరంగరాయలు రాజయ్యాడు. ఈ శ్రీరంగరాయలకు విద్యావంతులైన పుత్రులనేకులు కలిగారు. వారిలో శ్రీరామరాయలు (4) కవులవల్ల కీర్తించబడ్డాడు. ఈ శ్రీరంగరాయలు కొంత అమాయకుడైనందువల్ల సామంతరాజులు రెండుపక్షాలుగా చీలారు. ఒకపక్షం శ్రీరంగరాయలను సమర్థించగా, మరొక పక్షం వ్యతిరేకించింది. ప్రతిపక్షంవారు వెంకటపతి దేవరాయల కృత్రిమ సంతానమైన కుమారుణ్ణి, పటాభిషిక్తుణ్ణి చేయాలని పోరాడారు. ఈ ప్రతిపక్షానికి గొబ్బూరి జగ్గరాయలు నాయకుడు. శ్రీరంగరాయలను సమర్థిస్తున్న వర్గానికి యాచమనాయుడు నాయకుడు. జగ్గరాయలు హఠాత్తుగా

దాడిచేసి శ్రీరంగరాయలను జైలులో పెట్టి వెంకటపతిదేవరాయల కృత్రిమ పుత్రునికి రాజరికం కట్టబెట్టాడు. యాచమనాయుడు జగ్గరాయనితో పోరాటం సలిపి విజయం చేపట్టి శ్రీరంగరాయల (3) పుత్రుడైన శ్రీరామరాయలను (4) గద్దెనెక్కించాడు. తిరుచినాపల్లి జిల్లా తోపూరులో క్రీ. శ. 1616 లో జరిగిన యుద్ధంలో యాచమనాయక శ్రీరామరాయల (4) చేతుల్లో జగ్గరాయలు ఓడిపోయాడు. ఈ శ్రీరామ రాయలు (4) క్రీ. శ. 1617 మొదలు 1630 వరకు రాజ్యం చేశాడు. ఇతని రాజ్యకాలమంతా యుద్ధాలతోనే గడిచింది. క్రీ. శ. 1630 లో ఇతడు మరణించాడు. ఆ తరువాత అళియరామరాయల మనుమడైన (పెద) వెంకటరాయలు క్రీ. శ. 1630లో రాజపదవి నలంకరించాడు.

శ్రీరామశాసనంలో వర్ణించబడిన తిరుమలరాయల (1) వంశం ఈ శ్రీరామరాయలతో (4) ముగిసింది. ఆ తరువాత శ్రీరామశాసనంలో తిరుమలరాయల అన్నయైన (అళియ) రామరాయల వంశం వర్ణించబడింది.

ఆరవీటి వంశంలో శ్రీరంగరాయ నామధారులు అనేకమందివున్నారు. ఆరవీటి బుక్కరాయల మనుమడూ, లక్కాంబా-రామరాజుల పుత్రుడూ అయిన శ్రీరంగరాయలు మొదటివాడు. అందువల్ల శాసన వంశవృక్షంలో ఈ శ్రీరంగరాయలు ఒకటవ శ్రీరంగరాయలుగా చూపింపబడ్డాడు. అనంతరం ఈ శ్రీరంగరాయల పుత్రులైన అళియరామరాయలు, తిరుమలరాయలు, వెంకటాద్రిరాయలు అనబడే అన్న దమ్ములు ముగ్గురికీ సంతానం కలగడం, వారి ముగ్గురి సంతతిలోనూ శ్రీరంగరాయ నామధారులుండడం జరిగింది. అళియరామరాయ-తిరుమలరాయ-వెంకటాద్రిరాయలలో అళియరామరాయలు పెద్దవాడు. అందువల్ల యితని కుమారుడైన శ్రీరంగరాయలను, శ్రీరంగరాయలు(2-A)గాను, అళియరామరాయల పెద్దతమ్ముడైన తిరుమలరాయల కుమారుడగు శ్రీరంగరాయలను శ్రీరంగరాయలు(2-B)గాను అళియ రామరాయల చిన్నతమ్ముడైన వెంకటాద్రిరాయల కుమారుడగు శ్రీరంగరాయలను, శ్రీరంగరాయలు (2-C)గాను, శాసన వంశవృక్షంలో చూపించడం జరిగింది. ఒకే తరంలో కొద్దికాలం తేడాతో ముగ్గురన్న దమ్ముల బిడ్డలలో ముగ్గురు శ్రీరంగరాయ నామధారులున్నందువల్ల వీరు ముగ్గురూ ఒకేతరం వారని నిర్దేశించడానికి వీరికి రెండవ (2) సంఖ్యనూ, అన్నదమ్ముల క్రమాన్ని నిర్దేశించడానికి A-B-C లను వుంచడం జరిగింది.

## అళియరామరాయలు

ఈ అళియరామరాయలు ఒకటవ శ్రీరంగరాయలపుత్రులలో చిరకీర్తివంతుడయ్యాడు. మహారాజకీయవేత్తా, దూరాలోచనాతత్పరుడూ, మహావీర శూర పరాక్రమవంతుడూ, హిందూమత సంరక్షకులలో ప్రముఖుడూ అయిన ఈ రామరాయల గురించి గతంలో అళియరామరాయలు అన్నశీర్షికతో వ్రాయబడిన చరిత్రలో కొంతవరకూ తెలుపబడింది. (చూడు. LXXX—LXXXI పుటలు) ఇతనిని గురించి పెక్కుమంది చారిత్రకులు అనేకవ్యాసాలూ, గ్రంథాలూ రచించారు. ఇతనికి పరిపాలనాదక్షులూ,

నీతిపరులూ, శుభాభ్యుదయాశీలురూ, దాతలూ అయిన ఐదుగురు కుమారులు కలిగారు. వీరిలో శ్రీరంగరాయలు (2A) అనే పేరుగలవాడు విధినిర్వహణతో, దానగుణంతో ప్రజలలో కీర్తి పొందాడు. (చూడు. శ్రీరామ శాసనం 53 పుట. 26, 27, 28 శ్లోకాలు.)

## శ్రీరంగరాయలు (2A)

ఈ శ్రీరంగరాయలు అళియరామరాయల పుత్రులలో కీర్తివంతుడు. ఇతడు వేంకటేశ్వరస్వామి భక్తుడు. ఆ దేవునికృపవల్ల అతిసుందరులూ, దేవేంద్రవైభవోపేతులూ అయినఇద్దరుపుత్రులు ఈ శ్రీరంగరాయలకుపుట్టారు. వీరిపేర్లు పెదవెంకటరాయలు, పినవెంకటరాయలు శ్రీరామశాసనం 53 పుట. 29, 30 శ్లోకాలు.

## పెదవెంకటరాయలు

శ్రీరంగరాయల (2A) కుమారుడైన పెదవెంకటరాయలు శౌర్యాదిగుణాలలో గొప్పవాడు. అనేక జైత్రయాత్రలు సాగించినవాడు. పెనుగొండ రాజ్యంలో పట్టాభిషిక్తుడయ్యాడు. పండితులను కనకాభిషేకాలతో ముంచెత్తాడు. ఇతడు అళియరామరాయల మనుమడు. ఇతనిని వెంకటపతిరాయలు అనికూడా చరిత్రకారులన్నారు. ఇతడూ ఇతనితమ్ముడైన పినవెంకటరాయలు రామలక్ష్మణులవంటివారట. ప్రజలను పరిపాలించడంలోయెంతో వుత్సాహంగల వీరిద్దరూ—ఖరదూషణులను—అంటే తీవ్రద్రోహులను శిక్షించడంలో రామలక్ష్మణులవలె వ్యవహరించి ఆనందాన్ని కలిగించేవారట. పెదవెంకటరాయలు కేవలం వయస్సుచేతనేకాక శౌర్యాదిగుణాలచేత కూడా పెద్దవాడే. (చూడు శ్రీరామశాసనం 53, 55 పుటలు. 30, 31, 32 శ్లోకాలు.) ఈ పెదవెంకటరాయలు క్రీ. శ. 1630 లో రాజ్యానికి వచ్చి 12 సంవత్సరాలు పరిపాలనసాగించాడు. అయితే అంతకు పూర్వంపరిపాలించిన తిరుమలరాయల మునిమనుమడైన శ్రీరామరాయల (4) పెద తండ్రియైన తిరుమలరాయలు (2) ఈ పెదవెంకటరాయలను చాలాబాధిస్తూవచ్చాడు. ఈ తిరుమలరాయలు (2) 1630లో హతుడయ్యాడు. పెదవెంకటరాయలతమ్ముడగుపినవెంకటరాయలకు కుమారుడైన శ్రీరంగరాయలు (4)తన పెదతండ్రికి వ్యతిరేకంగా బిజాపూరుసుల్తానుతో లాలూచీపడి క్రీ.శ. 1638-1641 సంవత్సరాలలో రెండు పర్యాయాలు దండెత్తివచ్చేట్లుచేశాడు. క్రీ. శ. 1638 లో జరిగిన ఈయుద్ధంలో దక్షిణదేశంలోని సామంత ప్రభువులందరూ తోడ్పడి పెదవెంకటరాయలను విజయలక్ష్మివరించేట్లుగాచేసి మహమ్మదీయులను ఓడించారు. క్రీ. శ. 1641 లో రెండవసారియుద్ధంజరిగినపుడు నెల్లూరు ప్రాంతంపై రండౌలఖాను, తూర్పుప్రాంతంపై గోలుకొండ నవాబు పడుగు పేకగా దండయాత్రచేశారు. ఈ దాడికి తట్టుకొనలేక పెదవెంకటరాయలు చిత్తూరుజిల్లాలోని నారాయణవనం అడవులకు పారిపోయాడు. ఆ తరువాత క్రీ. శ. 1642 లో ఈ పెద వెంకటరాయలు స్వర్గతుడయ్యాడు. ఈ పెదవెంకటరాయలకు తాతయైన అళియరామరాయలకు వెంకటాద్రి (రాయలు)రాజు అని తమ్ముడొకడున్నాడు. అనగా ఈ పెదవెంకటరాయలు — పినవెంకటరాయలు అనబడిన అన్నదమ్ములకు ఈ వెంకటాద్రిరాయలు పినతాతఅన్నమాట.

## పినవెంకటరాయలు

ఈ పినవెంకటరాయలు అళియరామరాయల మనుమడు. పెదవెంకటరాయల తమ్ముడు. శ్రీరామునికి లక్ష్మణునివలె, అన్నకు అన్నిటా తోడునీడగా మసలినవాడు. (చూడు. శ్రీరామశాసనం 53 పుట. 30 శ్లోకం.) శ్రీరంగరాయ(2A)లకు ఇతడు ద్వితీయపుత్రుడు. గోపాలరాయలు ఇతని చిన్నపినతాత మనుమడు. ఇతని పినతాత తిరుమలరాయలు. గోపాలరాయలునకు ఈ పినవెంకటరాయలు పెదతాత మనుమడవుతాడు. అనగా వీరిద్దరూ అన్నదమ్ముల మనుమలైన అన్నదమ్ములన్నమాట. పినవెంకటరాయల కుమారుడైన శ్రీరంగరాయలు (4) గోపాలరాయలకు కుమారునివరుసకు చెందినవాడు. పుత్రునివంటివాడు. గోపాలరాయల తపఃఫలంగా శ్రీవేంకటేశ్వరస్వామి అనుగ్రహంతో యితనికి పినవెంకటరాయల కొడుకు దత్తపుత్రుడయ్యాడు.

## వెంకటాద్రి (రాయలు) రాజు

అళియరామరాయల చిన్నతమ్ముడు, తిరుమలరాయల తమ్ముడు అయి విష్ణుభక్తుడుగా, శత్రుమత్తగజాలకు సింహంవంటి వాడుగా, అపరభోజుడనిపించుకున్న కవిపోషకుడుగా కీర్తిపొందిన ఈ వెంకటాద్రిరాయలగురించి గతంలో వెంకటాద్రి (రాయలు) రాజు అన్నశీర్షికతో ఉటంకించబడిన చరిత్రలో తెలుపబడింది. (చూడు. LXXXIX—XCIII పుటలు.) ఇతని కుమారుడు శ్రీరంగరాయలు(2C).

## శ్రీరంగరాయలు(2C)

ఈ శ్రీరంగరాయలు వెంకటాద్రి (రాయల) రాజు కుమారుడు. అళియరామరాయలు, తిరుమలరాయలు ఈతనికి పెదతండ్రులు. ఇతడు సద్గుణాలు మూర్తీభవించినవాడు. దానశీలుడు. అళియరామరాయలకుమారుడైన శ్రీరంగరాయలూ(2A)వెంగళాంబా తిరుమలరాయల కుమారులలో ఒకడైన శ్రీరంగరాయలూ(2B)ఈతడూ అన్నదమ్ముల బిడ్డలు. కొద్దివయస్సు తేడాతో సమకాలికులు. ఈ శ్రీరంగరాయల(2C)కు గోపాలరాయలు అనేపుత్రుడు పుట్టాడు. (చూడు. శ్రీరామశాసనం 55 పుట. 34, 35 శ్లోకాలు)

## గోపాలరాయలు

శ్రీరంగరాయల(2C)పుత్రుడైన ఈ గోపాలరాయలు ఇంద్రవైభవంతో జీవించాడు. ఇతడు వెంకటాద్రి (రాయల) రాజు మనుమడు. అనేకదానాలు చేశాడు. మహాపుణ్యాత్ముడైన ఈ గోపాలరాయలు భార్యతోసహా శ్రీవేంకటేశ్వరస్వామినిగురించి తపస్సుచేశాడు. ఆ తపఃఫలంగా శ్రీవేంకటేశ్వరస్వామి సంప్రీతుడై "పూర్వం వసుదేవునికి శ్రీకృష్ణుడనే పేరుతో నేను పుత్రుడనై పుటినట్లే, యిప్పుడు పినవెంకటరాయల తీవ్ర తపస్సువల్ల ఆయనకు శ్రీరంగరాయలు (4) అనేపేరుతో నేను పుత్రుడనై జన్మించాను. పూర్వం నందుడు శ్రీకృష్ణుని పుత్రునిగా బడసినట్లు నీవుకూడా ఈ శ్రీరంగరాయ లనే పేరుగల నన్ను పుత్రునిగాస్వీకరించు'' అనిచెప్పాడట. (చూడు. శ్రీరామశాసనం 55 పుట. 36, 37 శ్లోకాలు.)

## శ్రీరంగరాయలు (4)

అళియరామరాయల మునిమనుమడైన ఇతడు శ్రీరంగరాయ నామకులైన పరంపరలో 4 వ వాడు. పినవేంకటరాయల కుమారుడు. వెంకటాద్రి (రాయల)రాజు మనుమడైన గోపాలరాయల దత్తపుత్రుడు.

అనేకమంది రాజులను జయించి రాజ్యవిస్తరణ గావించినవాడు. ఊరు మొదలైన దుర్గాలను తనకై తాను వంటరిగా పడగొట్టగల మహాబలవంతుడు. నేర్పరి. శత్రుభయంకరుడు. విష్ణుభక్తుడు. ఆరవీటి నగరానికి నాయకమణియైనవాడు. మండలీకభూమిని ఉద్ధరించినవాడు. కర్ణాటక సింహాసనాన్ని తన వశంచేసుకొని ఆసేతు శీతాచలం శత్రునిర్మూలనం చేసిన మహావీరుడు. ఈ శ్రీరంగరాయలు శాలివాహన శకం 1566లో తారణనామసంవత్సర మాఘ మాస శుక్లపక్ష ద్వాదశినాడు (అనగా క్రీ. శ. 1644 జనవరి 28 సోమవారం) కౌశికసగోత్రుడు, ఆపస్తంబ సూత్రుడు, యజుశ్శాఖాధ్యాయి, శివభక్తుడు అయిన సదాశివపండితునకు, శ్రీకాళహస్తీశ్వర స్వామికి మధ్యాహ్న కాలంలో అభిషేకనైవేద్యాలు చేసి ఛత్రంసాగించడానికై, శుక్రవారం అమ్మవారికి సమారాధన చేయడానికై, భూగృహాది దానాలిస్తూ యీశాసనం వేయబడింది. సదాశివపండితుని తండ్రి యీశ్వరయ్య. తాత కాలబాయ్య. వంశపరంపరగా అనుభవించడానికివీలుగా సదాశివపండితునికి యీ దానం యివ్వబడింది.

ఈ దానం శ్రీరంగరాయలు తనకై తాను బుద్ధిపూర్వకంగా చేయలేదు. ఇనిగాల గోత్రజుడైన దామర్ల వేకంటరాయల విజ్ఞప్తి ననుసరించి శ్రీరంగరాయలు హిరణ్య పయోధారా పూర్వకంగా యీ దానం చేశాడు. వేకంటరాయలు కరిచెన్నభూపాలునిపుత్రుడు. పెదవేంకటరాయల పౌత్రుడు. గొప్పదాత. పరాక్రమవంతుడు. సంగీత సాహిత్య సంపోషకుడు. శ్రీరామభక్తుడు. శ్రీరామభక్తుడైన దామర్ల వేంకటరాయల విజ్ఞప్తిననుసరించి శ్రీరంగరాయలు యీదానం చేశాడుకాబట్టి యీదాన శాసనం చివర "శ్రీరామ" అని లిఖించబడింది. అందువల్ల దీనిని "శ్రీరామశాసనం" అని పేర్కొనడం జరిగింది గాని వాస్తవానికిది శ్రీరామశాసనం కాదు.

ఈ శ్రీరంగరాయలు (4) పెదవెంకటరాయల అనంతరం క్రీ. శ. 1642 లో పట్టాభిషిక్తుడయ్యాడు. ఇతడు యెన్నెన్నో యిబ్బందులు వచ్చినా దాదాపు 33సంవత్సరాలు యెక్కడో ఒకచోట కాలు నిలదొక్కుకుని రాజు అనిపించుకుంటూనే వచ్చాడు. ఈ శ్రీరంగరాయలు అతితెలివితో అత్యాశతో అనేక కుట్రలూ కుతంత్రాలూ పన్ని తనగొయ్యితానే త్రవ్వుకున్నట్లు, ఆ వలలలో తానే చిక్కుకున్నాడు. ఇతని పరిపాలనా కాలంలో బిజాపూరు, గోల్కొండ సుల్తానులు పరస్పరం సంధిచేసుకున్నారు. దక్షిణాన సామంతరాజుల తిరుగుబాటు జరగడం ఒకవంక, మరోవంక వారి ప్రోత్సాహంతోనే బిజాపూరు, గోల్కొండ నవాబులు ఒక్కసారిగా పెద్దపెట్టున విజృంభించి దండయాత్రలు చేయడంజరిగింది. కర్ణాటక రాజ్యాన్ని జయించి పంచుకొనవలసినదిగా గోల్కొండ బిజాపూరు సుల్తానులకు మొగలు చక్రవర్తి ఆజ్ఞ యిచ్చాడు. దక్షిణాదిని వున్న యితరసామంతరాజులతో ఈ శ్రీరంగరాయలు (4) 1645 లో వేలూరు చేరుకున్నాడు. క్రీ. శ. 1646 లో బిజాపూరు సేనలతో అక్కడజరిగిన మహాయుద్ధంలో శ్రీరంగరాయలు (4) ఓడిపోయాడు. ఆతరువాత తంజావూరు వెళ్లి అక్కడినుండి తరలి మైసూరు చేరుకున్నాడు. అయితే క్రీ. శ. 1652లో బిజాపూరు, కర్ణాటకాలపై దాడివెడలి వాటిని లోబరచుకున్నాడు. ఇంతటితో ఆగక, మైసూరులో రాజపీఠాన్ని యేర్పరచుకొని, కొలువుతీరుస్తూ వేలూరును జయించాలని ఎన్నెన్నోకలలు కన్నాడు. చిట్టచివరికి క్రీ. శ. 1675 సంవత్సరంలో ఈ శ్రీరంగరాయలు (4) దివంగతుడయ్యాడు. మూడు శతాబ్దాలకుపైగా బద్ధవిరోధులయిన

మహమ్మదీయులతో ఘోరంగా పోరాడి, హిందూ సంస్కృతినీ జాతినీ సంరక్షించి "శహభాష్" అని చరిత్రలో 'జేజే' లను అందుకున్న విజయ (విద్యా) నగర సామ్రాజ్యం ఈ శ్రీరంగరాయ(4)లతో భరతవాక్యం పలికింది.

(అళియ) రామరాయల మనుమడగు పినవెంకటరాయలకు కుమారుడైన యీ శ్రీరంగరాయలు (అళియ) రామరాయల చిన్నతమ్ముడగు వెంకటాద్రి (రాయల) రాజుకు మనుమడైన గోపాలరాయలకు శ్రీవేంకటేశ్వరస్వామి దయతో దత్తపుత్రుడు కావడంవల్ల — యీ రెండు వంశాలను తిరిగి యీతడు ఏకం చేసినవాడయ్యాడు. ఈ దత్తతకారణంగానే శ్రీరామశాసనంలో పూర్తిగా కాకపోయినా కొంతవరకైనా అటు (అళియ) రామరాయల వంశమూ యిటు అతని చిన్నతమ్ముడైన వెంకటాద్రి(రాయల)రాజు వంశమూ స్థానం సంపాదించుకున్నాయి. శ్రీరంగరాయల (1) తరువాత రాజ్య పాలకత్వానికి రావడంవల్ల అతని రెండవ కుమారుడైన తిరుమలరాయల వంశంకూడా యీ శాసనంలో పేర్కొనబడింది. కాగా శ్రీవిరూపాక్ష శ్రీరామశాసనాల కలయికతో చారిత్రకంగా ఒక ఏకవాక్యత యేర్పడింది. అందువల్ల యీ శాసనాల కొక విశిష్టత రూపొందింది.

## శ్రీ విరూపాక్ష దానశాసన విశేషాలు

### 1. శాసన ప్రదాత

వెంగళాంబా—తిరుమలరాయల కుమారుడైన శ్రీరంగరాయలు (2B). ఈ శ్రీరంగరాయలు తనరాణి పేర దానం యిచ్చి వేయించాడు.

### 2. దాన గ్రహీత

కౌండిన్య గోత్రుడూ, ఆపస్తంబ సూత్రుడూ, ఆగమ శాస్త్రాలలో పండితుడూ అయిన యాదాటి లక్ష్మీపతి భట్టు. ఇతని తండ్రి తిమ్మావధాని. తాత నరస భూపాలుడు. ఇతడు చంద్రగిరి వాసి. పలనాడు, పొత్ప సీమలలో కీర్తివహించినవాడు. (చూడు. 13 పుట. 50 శ్లోకం మొదలు 60 వ శ్లోకం వరకు)

### 3. శాసనకాలం

శాలివాహన శకం 1498—ధాతనామ సంవత్సర—కార్తీకమాస—శుద్ధ ద్వాదశి—శనివారం (చూడు. 13 పుట. 53—54 శ్లోకాలు) క్రీ. శ. 1576—11—3వ. తేదీ శనివారం.

### 4. ఉద్దిష్ట దాన ప్రయోజనం

శ్రీకాళహస్తీశ్వరుని నిత్యనైమిత్తిక ఉత్సవాల నిర్వహణకు, జీర్ణోద్ధారం మొదలైనవాటి నిర్వహణకోసం అన్ని ఆధారాలతోనూ (హంగులతోనూ) ఈదానం ఉద్దేశించబడింది. (చూడు. 15వ పుట. 71శ్లోకం)

### 5. దాన భూమి-సరిహద్దులు

శ్రీరంగరాయలు తనరాణి పేరుమీద శ్రీకాళహస్తీశ్వరుని సంసేవల నిమిత్తం, శ్రీవెంగళాంబా పురం అనిపేరు వున్న ఉత్తమమైన ఒక గ్రామంతోపాటు శ్రీకాళహస్తి పట్టణానికి నాలుగు దిక్కులలోనూ వున్న 24 గ్రామాలు దానం యిచ్చాడు. (చూడు. 15 పుట. 71 శ్లోకం.)

### దిక్కులు

తూర్పు సరిహద్దు :– 'నాడుకాడు' గ్రామానికి సరిహద్దులో వున్న మామిడితోపు దగ్గరి ఏటికి తూర్పు భాగం.

ఆగ్నేయపు సరిహద్దు :– 'కంపిలి శ్రీపాలయం,' అనే గ్రామానికి సరిహద్దులోవున్న రావిచెట్టుకు ఆగ్నేయ దిక్కు.

దక్షిణ సరిహద్దు :– 'అందలమాల' గ్రామ సరిహద్దులోని ఉప్పుఏరుకు దక్షిణ భాగం.

నైఋతి సరిహద్దు :– ఉప్పుఏరు మూలనదికి నైఋతి దిక్కు.

పడమటి సరిహద్దు :– సముద్రానికి పడమటిదిక్కు.

వాయువ్య సరిహద్దు :– 'పీలిగుంచల పోటు' అనే గుల్మానికి దక్షిణ దిక్కుగాను, దానికి పడమరగా 'ఇసుకపేట' దగ్గరవున్న చిన్న చెఱువుకు వాయువ్యదిశ.

ఉత్తర సరిహద్దు :– చీమాలపాడుగ్రామం సరిహద్దులోని ఇసుకపేటకు ఉత్తరభాగం.

ఈశాన్యపు సరిహద్దు :– 'తిరుమూరు' గ్రామసరిహద్దులోవున్న 'తిరువరగం' అనే క్షేత్రం దగ్గర వున్న పుట్టకు ఈశాన్యభాగం.

## 6. దాన ప్రదేశం

శ్రీకాళహస్తి పట్టణానికి సమీపంలోనే వున్న శ్రీ రామాలయంలో యీ దానం చేయబడింది.

దాన గ్రామాల సరిహద్దులను తెలుపడంలో సామాన్యంగా దాతలు దిక్కులకు ప్రాధాన్యం యిచ్చేవారు. కాని యీ శాసనంలో (చూడు. 15 పుట 61 శ్లోకం మొదలు– 70వ శ్లోకం వరకు) దిక్కులకు కాక ప్రదేశాలకు ప్రాధాన్యం యివ్వడం జరిగింది. కొందరు ఆయాదిక్కులలో ఎవరెవరి భూములు లేదా యేయే ప్రదేశాలు సరిహద్దుగా వున్నాయో పేర్కొనగా శ్రీరంగరాయలు తాను దానం యిచ్చిన గ్రామాలు యేయే ప్రదేశాలకు యే దిక్కునవున్నాయో తెలియజేస్తూ సరిహద్దుల నేర్పరిచాడు. అందువల్ల దిక్కుల గుర్తింపులో తికమక లున్నాయని అనిపించినా జాగ్రత్తగా పరిశీలించేవారికి యెటువంటి సందేహాలూ కలుగనేరవు.

## శ్రీరామ దానశాసన విశేషాలు

## 1. దానప్రేరకుడు

మహాదాత, పరాక్రమవంతుడూ, సంగీతసాహిత్య పోషకుడూ, శ్రీరామభక్తుడూ, ఇనిగాల గోత్రజుడూ అయిన దామర్ల వెంకటరాయలు. పెదవేంకటరాయల పౌత్రుడు, కరిచెన్నభూమలుని పుత్రుడు. (చూడు. 59 పుట – 48 శ్లోకం)

## 2. శాసన ప్రదాత

అళియరామరాయల మునిమనుమడూ, శ్రీరంగరాయల (2A) మనుమడూ, పినవేంకటరాయల కుమారుడూ అయిన శ్రీరంగరాయలు(4). ఇతడు వేంకటాద్రి (రాయల) రాజు మనుమడైన గోపాలరాయల దత్తపుత్రుడు.

## 3. దానగ్రహీత

కౌశికసగోత్రుడూ, ఆపస్తంబ సూత్రుడూ, యజుశ్శాఖాధ్యాయీ, శివభక్తుడూ, అయిన సదాశివ పండితుడు. ఇతని తాత కాలబాయ్య. తండ్రి ఈశ్వరయ్య. (57; 59 పుటలు-44-45 శ్లోకాలు). ఈ సదాశివ పండితుడు శ్రీకాళహస్తీశ్వరస్వామి దేవాలయంలో అర్చకుడు.

## 4. శాసన కాలం

శాలివాహన శకం. 1566 తారణ నామ సంవత్సర - మాఘమాస - శుక్లపక్ష ద్వాదశి-సోమవారం. (చూడు. 57 వ పుట-43 వ శ్లోకం) క్రీ. శ. 1644-1-28 తేదీ సోమవారం.

## 5. ఉద్దిష్ట దాన ప్రయోజనం

శ్రీకాళహస్తీశ్వరస్వామికి మధ్యాహ్నంవేళ అభిషేకమూ, నైవేద్యమూ చేసి ఛత్రం సాగించడానికీ, ప్రతి శుక్రవారంనాడూ అమ్మవారికి సమారాధన చెయ్యడానికీ, ఈ గ్రామదానం ఉద్దిష్టమయ్యింది. (చూడు 59వ పుట. 46 తెలుగు వచనం)

## 6. దానభూమి—సరిహద్దులు

కాళహస్తి సీమలోని అక్కురితి మాగాణంలోని రామభట్టు చెఱువుతో సహా కాచర్ల గ్రామం దానం యివ్వబడింది. ప్రత్యేకించి వీటికి సరిహద్దులు శాసనంలో వుటంకించబడలేదు.

## 7. దాన ప్రదేశం

శ్రీకాళహస్తిపట్టణంలో యీ దానం చేయబడింది.

## శాసన కావ్య విశేషాలు

వివిధ ఛందస్సులలోకాని, ఒకే ఛందస్సులోకాని వచనంలోకాని వ్రాయబడిన శాసనాలను సైతం మనం కావ్యాలుగా భావించవలసి వుంటుంది. వేలకొలదిగా గాని, వందల కొలదిగా గాని పద్యాలతో కూడింది మాత్రమే కావ్యంకాదు. ఒకే ఒక్క పద్యమైనాసరే రసవంతమైనదైతే కావ్య స్థానాన్ని అలంకరిస్తుంది. ఈ విషయం మన ప్రాచీనులకు సమ్మతమైనదే. ఈ దృష్టితోనే "వాక్యం రసాత్మకం కావ్యం" అని ప్రాచీనులు రసాత్మకమైన ఒకే ఒక్క వాక్యం కూడా కావ్యం అవుతుంది అని ఉద్ఘోషించారు.

అయినప్పుడు వర్ణనాత్మకాలు, రసాత్మకాలు అయిన పద్యాలతో కూడిన శాసనాలు-అవి యే భాషామయాలైనవైనా కావ్యాలుగా యెందుకు పరిగణనకు రావు! తప్పకుండా పరిగణనకు వస్తాయి. ఈ విషయాన్ని ఆంధ్ర వాఙ్మయానికి ప్రామాణికుడైన ఆదికవిగా పేర్కొనబడుతున్న నన్నయభట్టే ఆమోదించాడు. రాజరాజనరేంద్రుడు నారాయణభట్టుకు నందంపూడి గ్రామాన్ని క్రీ. శ. 1053 నవంబరు 3వ తేదీన దానం యిచ్చాడు. ఈ దానం యిస్తున్నట్లుగా సంస్కృతంలో శాసనం వేయించాడు. ఈ శాసనకర్త ఆంధ్ర మహాభారత కర్తయైన నన్నయభట్టే. "కావ్యానాంకార్తా నన్నియభట్టో లేఖకో గండాచార్యః" అని నందంపూడి శాసనం చివర విస్పష్టంగా పేర్కొనబడింది. గద్యపద్యాత్మకమైన యీ నందంపూడి శాసనాన్ని కావ్యంగా శాసనంలోనే స్పష్టంగా పేర్కొనడం జరిగింది. ఈ శాసనంలో వర్ణనాత్మకాలు, రసాత్మకాలైన శ్లోకాలు అనేకం వున్నందువల్లకాబోలు - యీ శాసన కావ్యాన్ని ఒకే ఒక కావ్యంగా కాక అనేక కావ్యాలుగా భావించినట్లు కనిపిస్తున్నది. ఈ భావం ఉన్నందువల్లనే యీ శాసనంలో "కావ్యానాంకర్తా" అని బహువచన ప్రయోగం చేసినట్లు కనిపిస్తున్నది. ఈ శాసనంలోని తుదివచనంసైతం తుదిపదంసైతం శాసనకర్తయైన నన్నయభట్టుదే. లేఖకుడెప్పుడూ తనకై తాను కొంత చేర్చడు. శాసనం చెక్కేవ్యక్తి ఆమూలాగ్రం యేమి చెక్కాలో వ్రాసి యిచ్చేవాడు శాసనకర్తయే. శాసనలేఖకుని విధి కవి వ్రాసి యిచ్చినదానిని చూచి యథాతథంగా లిఖించడమే గాని వేరుకాదు. అందువల్ల శాసనాన్ని కావ్యాలుగా పేర్కొంటున్న శాసనకర్త్రాదులను పేర్కొంటున్న తుదివాక్యమంతాకూడా నన్నయభట్ట విరచితమే కాని తద్భిన్నంకాదు. ఈ దృష్ట్యా పద్యగద్యాత్మకాలైన శ్రీవిరూపాక్ష శ్రీరామ శాసనాలు రెండూ శాసన కావ్యాలే అవుతాయి. శ్రీవిరూపాక్ష శాసనం చివర కావ్యశబ్ద ప్రయోగం లేకుండా "తామ్రశాసనశ్లోకాన్ కవి శాసనస్స్వయం భూస్సరసమభాణీత్"— అని వున్నంతమాత్రంచేత దీన్ని కావ్యం అని అనకుండా వుండలేము. శ్రీరామ శాసన కావ్యకర్తయైన రామకవి నన్నయభట్టుకంటే మరింత ముందడుగు వేశాడు. నన్నయ బహుపద్యగద్యాత్మకమైన శాసనాన్ని కావ్యాలుగా పేర్కొనగా, యీ రామకవి శ్రీరామ శాసనరూపం దాల్చిన తన కవితను—కావ్యాలనలేదు. "వాఙ్మయం" అన్నాడు. "ప్రాహపౌత్రః సభాపతిః కామకోటిసుతో రామకవి శాసనవాఙ్మయం" అని యీ ఒక్క శాసనమే వాఙ్మయం పొమ్మన్నాడు. ఎన్ని కావ్యాలు కలిస్తే వాఙ్మయం అవుతుంది! నన్నయ తన శాసనాన్ని యెన్నెన్నో కావ్యాలుగా పేర్కొంటే, యీ రామకవి తన శాసనాన్ని యెన్నెన్నో కావ్యాలతో తుల్యమైన వాఙ్మయంగానే జమ కట్టాడు. అందువల్ల - అసలు వాస్తవానికి కావ్య వాఙ్మయంతో తులతూగగల స్థాయి శాసన వాఙ్మయానికి లేకపోయినా వీటిని కూడా ఒక ప్రత్యేక దృష్టితో కావ్యాలుగా మనం భావించవలసి వుంటుంది. ఈ దృష్ట్యా ప్రస్తుత శాసనాలు రెండింటిలోనూ వున్న విశేషాలు కొన్ని తెలుసుకుందాము.

శ్రీవిరూపాక్ష శాసనంలో ఆదిలో ఒక నమస్కార వాక్యం (చూడు 3 పుట. 1. సంఖ్య) తుది భాగంలో ఒక వచనం. (చూడు 15వ పుట 71 సంఖ్య)ఉన్నాయి. మిగిలిన శాసనమంతా వివిధ ఛందస్సులలో 77 పద్యాలలో ఉన్నది. వీటిల్లో ఒక శ్లోకం పునరుక్తమైనది. (అశ్రాంత విశ్రాణన కీర్తిసామ్యం 7 పుట. 26 శ్లోకం 9 పుట. 29 శ్లోకం) పునరుక్త శ్లోకాన్ని తగ్గిస్తే యీ శాసనంలో మొత్తం 76 శ్లోకా లున్నాయన్న మాట. ఈ శ్రీ విరూపాక్ష శాసనమంతా ఆమూలాగ్రం సంస్కృతభాషలో రచించబడింది.

శ్రీరామశాసనంలో తొట్టతొలుత సంస్కృతంలో నమస్కారవచనం (చూడు 47 పుట. 1 సంఖ్య) ఒకటి, శాసనం చివరిభాగంలో తెలుగుభాషలో రెండు వచనాలు (చూడు 57 పుట. 44 సంఖ్య — 59 పుట. 46 సంఖ్య.) ఉన్నాయి. మిగిలినభాగంలో వివిధ ఛందస్సులలో మొత్తం 57 సంస్కృత శ్లోకాలు వున్నాయి. కాగా శ్రీవిరూపాక్షశాసనం ఆమూలాగ్రం సంస్కృతభాషలోనూ, శ్రీరామశాసనం అత్యధికభాగం సంస్కృతభాషలోనూ కొద్దిపంక్తులు తెలుగులోనూ రచింపబడిందని మనం గుర్తించాలి. అయితే శ్రీవిరూపాక్షశాసనంలో చంద్రుడాదిగా ఆరవీటివంశంలో తిరుమలరాయల కుమారుడైన శ్రీరంగరాయలవరకూ వంశ వర్ణనచేస్తూ రచింపబడిన అనేక శ్లోకాలు యథాతథంగా శ్రీరామశాసనంలో పరిగ్రహింపబడ్డాయి. అవి యివి.

| శ్లోక ప్రారంభం | | శ్రీవిరూపాక్ష శాసనం | | | శ్రీరామ శాసనం | |
|---|---|---|---|---|---|---|
| | | పుట | శ్లోకం | | పుట | శ్లోకం |
| జయతి క్షీరజలధేః | — | 3 | 5 | — | 47 | 4 |
| పౌత్రస్తస్య | — | ,, | 6 | — | ,, | 5 |
| నందనస్తస్యాష్టమో | — | ,, | 7 | — | ,, | 6 |
| తతుర్యోజని | — | ,, | 8 | — | ,, | 7 |
| ఆరవీటినగరీ | — | ,, | 9 | — | ,, | 8 |
| స్వః కామినీ | — | ,, | 10 | — | 49 | 9 |
| సుతేవ కలశాంబుధేః | — | 3,5 | 11 | — | ,, | 10 |
| శ్రీరామ క్షితిపస్య | — | 5 | 14 | — | ,, | 11 |
| తస్యాధికైస్సమభవత్ | — | ,, | 15 | — | ,, | 12 |
| సతీం తిరుమలాంబికాం | — | ,, | 16 | — | ,, | 13 |
| రచిత నయ విచారం | — | ,, | 17 | — | ,, | 14 |
| సకల భువన | — | ,, | 18 | — | 49,51 | 15 |
| వ్యరాజత శ్రీవర | — | 5,7 | 20 | — | 51 | 16 |
| త్రిషు శ్రీరంగక్ష్మాపతి | — | 7 | 21 | — | ,, | 17 |
| యశస్వినామగ్రసరస్య | — | 7 | 22 | — | ,, | 18 |
| వారాశి గాంభీర్య | — | 11 | 37 | — | 57 | 39 |
| సారవీర రమయా | — | ,, | 41 | — | ,, | 40 |
| ఆత్రేయ గోత్రజానాం† | — | ,, | 43 | — | ,, | 41 |

†. ఈ శ్లోకంలోని పూర్వార్థంమాత్రమే శ్రీరామశాసనంలో పరిగ్రహింపబడింది.

| శ్లోక ప్రారంభం | | శ్రీవిరూపాక్ష శాసనం | | | శ్రీరామ శాసనం | |
|---|---|---|---|---|---|---|
| | | పుట | శ్లోకం | | పుట | శ్లోకం |
| దానపాలనయోః | — | 17 | 75 | — | 61 | 52 |
| స్వదత్తాద్విగుణం | — | ,, | 76 | — | ,, | 53 |
| స్వదత్తాం పరదత్తాం వా | — | ,, | 77 | — | ,, | 54 |
| ఏకైవ భగినీ లోకే | — | ,, | 78 | — | ,, | 55 |
| సామాన్యోయం | — | ,, | 79 | — | ,, | 56 |

"దానపాలనయోః" ఇత్యాదిగావున్న చిట్టచివరి ఐదు శ్లోకాలూ యెవరు రచించారో చెప్పలేము. ఇవి అతి ప్రాచీనకాలంనుంచీ అనేక శాసనాల్లో ఉపయోగింపబడుతూ వచ్చాయి. ఈ ఐదు శ్లోకాలతోపాటు "ఆత్రేయ గోత్రజానాం" ఇత్యాది శ్లోకాన్నిసైతం ప్రసిద్ధమైందిగా విడిచిపెట్టినా శ్రీవిరూపాక్ష శాసనంలో ఉపయోగించబడిన 17 శ్లోకాలూ యథాతథంగా శ్రీరామ శాసనంలో పరిగృహీతాలయ్యాయని మనం భావించవచ్చు.

"దానపాలనయోః" ఇత్యాది ప్రసిద్ధ శ్లోకాలు ఐదింటినీ "ఆత్రేయ గోత్రజానాం" ఇత్యాది శ్లోకాన్నిసైతం తొలగిస్తే శ్రీవిరూపాక్ష శాసన కావ్యకర్తయైన సభాపతి కుమారుడు రచించినవి మొత్తం 69 శ్లోకాలు ఒకవచనం. ఇదేవిధంగా యీ ప్రాచీన శ్లోకాలతోపాటు శ్రీవిరూపాక్ష శాసనంలో సభాపతి కుమారుడు రచియించగా గ్రహింపబడిన 23 శ్లోకాలను మినహాయిస్తే శ్రీరామ శాసనకర్తయైన రామకవి స్వయంగా రచించిన సంస్కృత శ్లోకాలు ముప్పైనాలుగు. తెలుగువచనాలు రెండు. శ్లోకాల సంఖ్యలో తేడావున్నట్లే శ్రీవిరూపాక్ష - శ్రీరామ శాసనాల కవితారచనలో కూడా కొట్టవచ్చినట్లు భిన్నత్వం కనిపిస్తున్నది. వర్ణనాత్మకాలైన శ్లోకాలన్నీ దాదాపు శ్రీవిరూపాక్ష శాసనంనుంచి పరిగృహీతాలైనందు వల్ల తిరుమలరాయల కుమారుడైన శ్రీరంగరాయల (2-B) అనంతరం శ్రీరామ శాసనకర్త అటు అళియ రామరాయల వంశాన్నీ, ఇటు వెంకటాద్రి (రాయల) రాజు వంశాన్నీ వర్ణించడంలో తన కవితాశక్తినీ ప్రతిభనూ ప్రదర్శించాలని ప్రయత్నించినట్లు కనపడదు. అయినా కవితారచనలో, ధారాశుద్ధిలో, పద ప్రయోగంలో, ప్రతిభలో, శ్రీరామ శాసనకర్తయైన రామకవి, శ్రీవిరూపాక్ష శాసనకర్తయైన సభాపతి కుమారునితో దీటు రాగలిగినవాడుగా కనపడడు. కాని మరీ తీసివేయవలసిన వ్యక్తికాదు. శ్రీరామ శాసన కావ్యకర్త రామకవి. ఇతని తండ్రి కామకోటి. తాత సభాపతి. (ప్రాచీనకాలంలో పెద్దపెద్ద గ్రామా లలో వున్న బ్రాహ్మణులందరికీ పెద్దగా, నాయకుడుగా ఒక బ్రాహ్మణుడుండేవాడు. అతనిని సభాపతి అనేవారు.) అయితే శ్రీవిరూపాక్ష శాసనకర్త తాను "పూరికే" కవులను శాసించడంలో శివునివంటి వాడైన సభాపతి కుమారుడు, శాసన శ్లోకాలను సరసంగా రచించినట్లు పేర్కొన్నాడేగాని, తనపేరుగాని, తన తండ్రిపేరుగాని చెప్పలేదు. అయినా అతనికవిత కవితే! సుగంధవంతమైన పుష్పసౌరభాన్ని తెమ్మెరల మిళితం కాకుండా యెవ్వరాపగలరు! ఇదేవిధంగా సత్కవితాసౌరభాలనుసైతం-కర్త తెలిసినా తెలియక పోయినా - సహృదయులు ఆహ్లాదకరంగా స్వీకరించి అనుభవించకుండా యెవ్వరాపగలరు? శ్రీవిరూపాక్ష

శాసనకర్తయైన సభాపతి కుమారుడు మామూలు కవిగా కాక ఒక అసాధారణమైన ప్రతిభావ్యుత్పత్తులున్న కవిగా కనిపిస్తున్నాడు. ఇతని వర్ణనాపద్ధతులు చూస్తుంటే పురాణాలలో అజ్ఞానవిలసితాలైన కాకమ్మ కథల వంటి వాటిని యీ కవి పెడచెవిని పెట్టాడనీ, యేకొద్దిగానో గొప్పగానో వేద విజ్ఞానాన్ని సముపార్జించి మరీ మౌలికాలైన స్వంత ఆలోచనలు చేయగల శక్తిసామర్థ్యాలు సంపాదించుకున్నవాడని అర్థమవుతున్నది.

## ప్రాచీన మహర్షుల ఖగోళ పరిశోధనలు

శ్రీవిరూపాక్ష శాసనంలోని తొట్టతొలి శ్లోకంలో కవి చంద్రమౌళికి నమస్కారం పెట్టాడు. అంతటితో ఆగలేదు. "త్రైలోక్య నగరారంభ మూలస్తంభాయ శంభవే" (చూడు లిపు. 2 శ్లో) అని త్రైలోక్య నగర నిర్మాణంలో మూలస్తంభమై శంభుడు నిలిచినట్లు పేర్కొన్నాడు. అనంతరం ఒక శ్లోకంలో మేరుపర్వత సహితంగా వరాహావతారాన్ని ప్రార్థించాడు. పిదప వేరొక శ్లోకంలో విఘ్నేశ్వరుణ్ని ప్రార్థించాడు. ఆ శ్లోకాలివి.

హరే ర్లీలావరాహస్య దంష్ట్రా దండస్సపాతువః
హేమాద్రి కలశాయత్ర ధాత్రీచ్ఛత్రశియం దధౌ॥
కళ్యాణాయాస్తు తద్ధామ ప్రత్యూహతిమిరాపహం
యద్ గజోప్యగజాహూతం పంచాస్యేనాపిలాలితమ్॥ (3 పు-3,4 శ్లో.)

చరిత్రకందని అతిప్రాచీనకాలంలో మహర్షులు తమ దివ్యజ్ఞానంతో అగాధంగా ఖగోళపరిశోధనలు చేసి అనంతవిశ్వసృష్టి రహస్యాన్నీ, దానిలక్ష్యాన్నీ గుర్తించారు. ఈ గుర్తింపు జరగడంలో మరెన్నెన్నో యితరాలైన అంశాలు కూడా బయటపడ్డాయి. ఈ అపూర్వ పరిశోధనా ఫలితాలన్నింటినీ మన మహర్షులు వేదవాఙ్మయ రూపంగా నిక్షిప్తపరచారు. పరమ వైజ్ఞానికాలైన యీ రహస్యాలను గుర్తించలేక కొందరు అసమర్థులు స్వార్థంతో బ్రతుకుతెరువుకోసం యెవరికి తోచిన అర్థాలను వారు చెడ వ్రాసిపెట్టారు.

మన పురాణాలలో సప్తద్వీపాలను, సప్తకులపర్వతాలను, సప్తసముద్రాలను సప్తఅధోలోకాలను, సప్తఊర్ధ్వలోకాలను సైతం వర్ణించారు. భూమండలం సప్తద్వీప పరివృతం అనికూడా వర్ణించారు.

"మనోస్స్వయం భువస్యాఽఽసన్దశ పౌత్రాస్తుతత్సమాః
యైరియం పృథివీ సర్వా సప్త ద్వీప సమన్వితా ॥
(వాయుపురాణం. 33 అ. 4 శ్లో.)

"ఏతేషాం పుత్ర పౌత్రైస్తు సప్తద్వీపా వసుంధరా
ప్రియ వ్రత స్య పుత్రైస్తు భుక్త స్వాయంభువేఽన్తరే"
(మార్కండేయ పురాణం. 53 అ. 42 శ్లో.)

జంబూ, ప్లక్ష, శాల్మల, కుశ, క్రౌంచ, శాక, పుష్కరద్వీపాలూ యీ సప్తద్వీపాలు.

ద్వీపాత్తు ద్విగుణో ద్వీపో జంబూః ప్లక్షోఽథశాల్మలిః
కుశః క్రౌంచస్తథాశాకః పుష్కరద్వీప ఏవచ
(మార్కండేయ పురాణం. 54 అ. 7 శ్లో.)

హిమవాన్ హేమకూటశ్చ ఋషభో మేరు రేవచ
నీలః శ్వేతస్తథాశృంగీ సప్తాస్మిన్ వర్షపర్వతాః
(మార్కండేయ పురాణం. 54 అ. 9 శ్లో.)

జంబూద్వీపంలో హిమవంత, హేమకూట, ఋషభ, మేరు, నీలగిరి, శ్వేతాచల, శృంగవంత ములు అనే పేర్లు గల ఏడు కులపర్వతాలున్నాయి.

సప్తద్వీపాలను చుట్టుముట్టి లవణ, ఇక్షు, సురా, సర్పి, దధిదుగ్ధ, జలముద్రా లేడు ఒకదాని కొకటి రెట్టింపు విస్తారం కలవై ఉన్నాయని యీ క్రింది శ్లోకం చెపుతున్నది.

"లవణేక్షు సురాసర్పిర్దధి దుగ్ధజలాబ్ధిభిః
ద్విగుణై ర్ద్విగుణైర్ వృద్ధ్యా సరతః పరివేష్టితాః"
(మార్కండేయ పురాణం. 54 అ. 7 శ్లో.)

ఇదేవిధంగా మన పురాణాలలో సప్త ఊర్ధ్వలోకాలనూ సప్త అధోలోకాలనూ వర్ణించారు. వివిధ దేవతలకు సంబంధించిన కథలు, గాథలతో, ఒక్క భూలోకంతోనే కాదు, స్వర్గ పాతాళలోకాలతోపాటు అన్ని లోకాలతోనూ సంబంధ బాంధవ్యాలు యేర్పరచడం జరిగింది. అనంత విశ్వసృష్టి రహస్యభేదనం చేసి నిక్షిప్త పరచిన మహర్షుల వేదవిజ్ఞానం—అందని పండుగా కాదు—అంది చేయి జారిపోయిన పండుగా కనుమరుగై పోయింది. అందువల్ల — వేదవిజ్ఞానం ఆధారంగానే సాంకేతికాలైన కథలూ గాథలతో, భగవంతుని లీలా మయమైన సృష్టి విశేషాలతో అవతరించిన పురాణాలకు వేద విజ్ఞానంతోవున్న సంబంధం గండిపడి తెగిపోయింది. కాగా పురాణగాథలకు, వేదవిజ్ఞానానికీవున్న సంబంధం సుదూరమై ఆ రెంటినీ ముడిపెట్టడానికి వీలయిన సమన్వయ దృక్పథాలు విలుప్తాలవడమేకాక స్వవచన వ్యాఘాతాలతో క్లిష్టతరాలు కూడా అయ్యాయి.

పార్వతి హిమవంతుని కూతురు-పరమేశ్వరుడు పార్వతికి భర్త—అతని నివాసం కైలాసం. ఈ కైలాసం హిమాలయాలకు ఉత్తరంలో వున్నది, అని మనపురాణ వాక్యాలు చెబుతాయి. హిమాలయపర్వతాలు భూలోకంలో భారతదేశానికి ఉత్తరభాగంలో ఉన్నాయి కదా! పార్వతీ పరమేశ్వరులతో ముడివడి వున్న హిమాలయాలను గురించి యేమని చెప్పగలం? హిమవంతు డనబడిన పర్వతరాజం మనకళ్లకు కనిపిస్తున్నది. మరి కూతురూ, అల్లుడూ అనే పేరుతో కనబడుతున్న కథ వాస్తవికమైనదా? కాదా? అవాస్తవికమైనదే అయితే పార్వతీ పరమేశ్వరుల దివ్యత్వం, దైవత్వం నిరాధారంగా పరికల్పితమైనదేనా? అయితే ఇంతకూ అసలు కైలాసం వున్నదా? లేదా! అనిమిషులూ, అస్వేదగాత్రులూ, అజరామరులుగా వర్ణితులైన దేవత

లున్నారా ? లేరా ? మహాభారతాది గ్రంథాలలో, రకరకాల చిత్రాతిచిత్రములైన కథలున్నాయి. ఇంద్రుడు స్వర్లోకవాసి. అధిపతి. అటువంటి ఇంద్రుడు హిమాలయాలకు ఉత్తరదిక్కులోవున్న మానససరోవరంలోని ఒక పద్మ కింజల్కంలో ఒక విపత్తునుంచి తప్పించుకొనడానికి-దాక్కున్నాడట! ఇటువంటి కథలూ, పరస్పర విరుద్ధంగా కన్పించే విషయాలూ, అనేకం విమర్శకులలో సందేహాలు కలిగించాయి. ఈ సందేహాలు కారణంగాను—వీటికి సరైన సమన్వయాన్ని అన్వేషించినవారు లేనికారణంగాను—దైవీయాలైన ప్రాచీన వర్ణనలు భూలోకంలో వున్నవాటిని చూచి వర్ణింపబడినట్లు ఒకానొక చారిత్రక భూగోళ సమన్వయ దృక్పథానికి అవకాశం యిచ్చింది. అందువల్ల సప్తద్వీప—సముద్ర-కులపర్వతాలు భూమిమీదనే వున్నాయన్న అభిప్రాయంతోపాటు, ప్రాచీనులు వర్ణించిన 14 లోకాలు సైతం భూమండలంమీదే వున్నాయన్న భావానికి స్థానం లభించింది. కాగా స్వర్గవాచకమైన "త్రివిష్టప" శబ్దాన్ని దృష్టిలో పెట్టుకుని హిమాలయాలకు ఉత్తరంలో వున్న "టిబెట్టు" దేశమే త్రివిష్టపంగా వర్ణింపబడిందనీ, ఆ టిబెట్టుదేశస్థులే దేవతలనీ సమన్వయ పరచబడింది. "టిబెట్టు ప్రాంతాలలో మానవుల కనురెప్పలకు వెంద్రుకలుండవు. అందువల్ల వారు కనురెప్పలు వేస్తున్నప్పుడు—కళ్లార్పుతున్నట్లుగా మనకు కనుపించదు. కాగా వారు అనిమిషులు—రెప్పపాటు లేనివారు—అని వర్ణితులయ్యారు. టిబెట్టుదేశం అతిశీతలదేశం. అందువల్ల అక్కడివారికి చెమటపట్టదు. కాగా వారు అస్వేదగాత్రులనబడ్డారు. ఈ టిబెట్టుదేశీయులకు నాయకుడైనవానికి దేహమంతా నేత్రాలవలె పొడలుండేవి. అందువల్ల అతనిని సహస్రాక్షుడన్నారు. అతడే ఇంద్రుడుగాను, మహేంద్రుడుగానూ భావించబడ్డాడు," అని పరిశోధక విమర్శకులు సమన్వయాలను కనిపెట్టి తృప్తిపడ్డారు—పడుతున్నారు. ప్రాచీనులు వర్ణించిన 14 లోకాలూ భూమండలంమీదే వున్నాయనీ, వారు పాతళలోకం అని వర్ణించినది ప్రస్తుత అమెరికా దేశాన్నేనని చెప్పేవరకూ యీ విమర్శలు ముందడుగువేశాయి.

వాస్తవానికి సాంకేతికాలైన పురాణగాథలను వేదవిజ్ఞానందృష్ట్యా సత్యాన్వేషణాభిలాషతో అన్వేషించేవారు మృగ్యులైనందువల్ల—ప్రాచీన గ్రంథాలపై సమన్వయ దృక్పథంతో పరిశోధనలు సాగిస్తున్నవారు, సరైన ఆచరణపూర్వకాలై, ప్రయోగాత్మకాలైన పరిశోధనలు కొనసాగించినవారు, వేదవిజ్ఞానవేత్తలుకానందువల్ల యీ పరిశోధనలు పూర్తిగా తప్పుదారిపట్టి తలక్రిందులుగా తమ ప్రయాణం సాగించాయనే చెప్పవచ్చు.

సప్తర్షులతోపాటు, అనేకమంది మహర్షుల, దేవతల గాథలు పురాణాలలో వున్నాయి. చరాచరాత్మకాలైన పెక్కు వర్ణనలు కూడా వున్నాయి. అయితే సప్తర్షిమండలం నక్షత్రలోకంలో ఆకాశంలో వున్నది. సప్తర్షులు భార్యాసమేతులై భూమండల నివాసితులైనట్లు పురాణగాథలున్నాయి. ధ్రువనక్షత్రమే కాదు మరెన్నోనక్షత్రాలు ఆకాశంలో వున్నాయి. ధ్రువాది నామాలతో భూలోకవాసుల కథలుగా మన కావ్యపురాణాలు అనేక విషయాలు చెబుతాయి. ఖగోళంలో 'గంగ' వున్నది. మరి భూమిమీద కూడా గంగానది వున్నది. ఈ విషయాలన్నింటినీ మన పురాణాదులే వర్ణించాయి. అంతేకాదు. సప్తఊర్ధ్వలోకాలు భూమండలంలో లేవని స్పష్టంగా చెప్పడానికా అన్నట్లు ఒకదానిమీద ఒకటిగా సూర్యలోకాన్ని సైతం దాటి లక్షలమైళ్ల దూరంలో ఆయా లోకాలున్నట్లు మనప్రాచీన గ్రంథాలే వర్ణించాయి. సప్త అధోలోకాలు సైతం

భూమండలాని కెన్నో లక్షలమైళ్ల దూరంలో వున్నట్లుకూడా వర్ణించాయి. అయినప్పుడు సూర్యలోకానికి ఉపరితలంలో లక్షలమైళ్ల దూరంలో స్వర్గలోకం ఉన్నదని దాని అధిపతి మహేంద్రుడా లోకంలో వుంటాడనీ అక్కడ ఇంద్రలోకవాసులైన దేవతలుంటారనీ, వర్ణించిన పురాణకథలు వాస్తవాలంటామా? టిబెట్టే స్వర్గం. టిబెట్టు దేశస్థులే (టిబెటియన్సు) దేవతలు. దేహమంతా పొడలున్న ఇంద్రనామకుడూ—టిబెట్టు దేశస్థుల పరిపాలకుడే మహేంద్రుడు, అన్న సమన్వయాన్ని వాస్తవమని ఆమోదిస్తామా? భూమండలానికి కొన్నిలక్షల మైళ్ల దూరంలో ఊర్ధ్వ, అధోలోకాలున్నాయని ఒక క్రమాన్నీ దూరాన్నీ పేర్కొన్న మహర్షుల అభిప్రాయంముందు "భూమండలంలోనే 14 లోకాలుఉన్నాయి. అమెరికాయే పాతాళ లోకంగా పూర్వం వర్ణించబడింది,'' అని నేటి విమర్శకులు భావిస్తున్న విషయం నీటిమూట కావడంలేదా? పాతాళలోకం నాగలోకమనీ, నాగపురుష, నాగినీ సుందరీమణులు అద్భుత శక్తియుక్తులతో జీవిస్తూ వుంటారనీ, మన ప్రాచీన గ్రంథాలు వర్ణించిన సంగతి యీ పరిశోధకులు విస్మరించారు. అమెరికావారినే నాగులుగా వీరు ఆమోదిస్తారా! ఆమోదించినా అది తర్కసహంగా, యథార్థంగా నిలుస్తుందా !

సృష్టివ్యవస్థకు సంబంధించి అమూల్యమైన ఖగోళ పరిశోధనలతో వేదవిజ్ఞానిగా దేవతల విషయంలోనూ, దైవీయాలైన శక్తుల విషయంలోనూ నేను గత 18 సంవత్సరాలుగా అగాథమైన పరిశోధనలు కొనసాగించాను. ఈ పరిశోధనలలో అనంత విశ్వరహస్యాలు అనేకం బయటపడ్డాయి. వేదవిజ్ఞానానికీ, పురాణగాథలకూ వున్న అవినాభావ సంబంధంగురించి, ఆధునిక వైజ్ఞానికులుసైతం ఆమోదించి శిరసావహించగల సమన్వయ విశేషాలనేకం నాకు లభించాయి. వీటన్నింటికీ తిరుగులేని, మౌలికాలై, తర్కసహాలు, అజేయాలు అవిభేద్యాలు అయిన విశేషాలతో సమగ్ర ఆర్షవిజ్ఞాన గ్రంథాన్ని నేను రచిస్తున్నాను. అయితే శ్రీవిరూపాక్ష శాసనకర్త వేదవిజ్ఞానియైన మహాకవిగాచేసిన వర్ణనలు దృష్టిలో పెట్టుకుని నేనీవిషయాలను ఇక్కడ ప్రస్తావించవలసివచ్చింది. ఈ కవి చంద్రమౌళి స్తుతిచేసిన తొలి శ్లోకంలో "త్రైలోక్యనగర నిర్మాణంలో మూలస్థంభంగా నిలిచినవాడు'' అని శంభుణ్ణి వర్ణించాడు. త్రిలోకాలంటే స్వర్గ, మర్త్య, పాతాళ లోకాలని ప్రాచీనులు కొందరు భావించగా, భూలోకం, భువర్లోకం, స్వర్గలోకం అని మరికొందరు భావించారు. ఇది సరికాదు. భూలోక, భువర్లోక, స్వర్గలోక, మహాలోక, జనోలోక, తపోలోక, సత్యలోకములు, సప్త ఊర్ధ్వలోకములు. అతల, వితల, సుతల, తలాతల, రసాతల, మహాతల, పాతాళలోకములు, సప్త అధోలోకములు. వాస్తవానికి త్రిలోకనిర్వచనంలో అధోలోకాల్లో చిట్టచివరిదైన పాతాళలోకాన్నీ, - అధోలోకాలకు పైనా, ఊర్ధ్వలోకాలకు దిగువా చిట్టచివరిదిగావున్న భూలోకాన్నీ - ఊర్ధ్వలోకాలలో అత్యంత ఉన్నత స్థానంలో ఉపరితలంలో సుదూరంలోవున్న మొట్టమొదటిలోకమైన సత్యలోకాన్నీ పరిగ్రహించి, త్రిలోకాలుగా పేర్కొనవలసిఉన్నది. ఇందుకు భిన్నంగా దారితప్పి త్రిలోకాలను పేర్కొనడం తర్కసహామూకాదు, వాస్తవికమూకాదు.

## మహేశ్వరుడు

శాసనకర్త త్రైలోక్యనగరానికి మహేశ్వరుణ్ని మూలస్తంభంగానిలచినవ్యక్తిగా వర్ణించాడు. మహేశ్వరుడన్నా,పరమేశ్వరుడన్నా,శంభుడన్నా,త్రినేత్రుడన్నా,అర్ధనారీశ్వరుడన్నా,ఏతాదృశదైవనామప్రతినిధిగా నిలిచేది ఖగోళవ్యవస్థలో యీ అనంతవిశ్వంలో మిథునరాశి ఒక్కటే. ద్వాదశాత్మకమైన రాశిచక్రంలో

శివపరంగా ప్రత్యేకించి అర్ధనారీశ్వరపరంగా నిలిచేది యీ మిథునరాశి మాత్రమే. మృగశిర నక్షత్రంలో 3, 4 పాదాలూ ఆర్ద్రనక్షత్రం, పునర్వసు నక్షత్రంలో 1, 2, 3 పాదాలూ మిథునరాశిగా పరిగణనకు వస్తాయి. సకలసృష్టికీ హాయినీ, ఆహ్లాదాన్నీ ఆయుర్దాన్నీ కలిగించే చందమామ మృగశిరా నక్షత్రానికి అధిదేవత. మృగశిర (కార్తె) ప్రాణదానంచేయగల, దాహం తీర్చగల జలప్రదాయిని. మృగశిరాచంద్రుడు మహేశ్వరునికి యింపుసొంపులు సమకూర్చగల జటాజూటంలోని జాబిలి. ఆర్ద్రనక్షత్రం త్రినేత్రుని అగ్నినేత్ర ప్రతీకమైన మహాగ్నిగోళం. ఈ ఆర్ద్ర రెండుకోట్ల యాభై లక్షల సూర్యగోళాలు కలిస్తే యెంత బ్రహ్మాండమైన గోళం అవుతుందో అంతటిగోళం! భూగోళం చుట్టుకొలత ఇరవైయైదువేల మైళ్లకు తక్కువ. సూర్యగోళం చుట్టుకొలత ఇరవైయైదులక్షలమైళ్లు. అయినప్పుడు భూమికంటే ఆర్ద్రనక్షత్రం యెంత బృహత్తరమైందో మనం గ్రహించవచ్చు. పునర్వసునక్షత్రాలు అష్టవసువులనూ, తద్రూపంగా సృష్టిలోని సమస్త ధాతుపదార్థాలనూ పునర్జన్మ యెత్తించినట్లు పునరుజ్జీవం కలిగించగలిగిన మహాద్భుత నక్షత్రాలు. వీటి అధిదేవత అదితి. సకల లోకక్షేమంకరులైన ఆదితేయ నామకులైన దేవతలంతా యీ పునర్వసునక్షత్ర ప్రభావంతో, తదధిదేవతయైన అదితి చైతన్యంతో సంజనితులైనవారే. సర్వలోకాలకూ నూతనచైతన్యాన్ని కలిగించేశక్తి గలవి పునర్వసు నక్షత్రాలు. లోకక్షేమకరమైన తేజోవిషయంలో అగ్రగణ్యాలని నిర్ణయించబడిన ఇరవై నక్షత్రాలలో మూడు నక్షత్రాలీ పునర్వసులోనే చేరివున్నాయి. సృష్టికార్యంలో ఒక విశిష్టమైన స్థానాన్ని ఆక్రమించిన యీ మిథున రాశి త్రిలోకాలకు - తద్రూపంగా 14 లోకాలకు మూలస్తంభమై నిలిచిందన్న కవి వాక్కులోని వాస్తవికతను గుర్తించాలంటే ఆధునిక వైజ్ఞానికులు యెన్నికోట్ల సంవత్సరాలు పరిశోధనలు సాగించవలసివుంటుందో!

భూమండలంలో భిన్నప్రదేశాలను విభజించిన సాంకేతికాలైన ద్వీపాల గురించి ప్రస్తుతం చర్చించ వలసింది లేదు.

## మేరువు

"హారేర్లీలావరాహస్య" ఇత్యాది శ్లోకంలో ఆర్షవిజ్ఞానం యెంత అగాధమైనదో ప్రాచీనమహర్షుల ఖగోళపరిశోధనలు యెంత అపూర్వమైనవో తెలియచెప్పడానికి యీ కవి ఒక చక్కని అవకాశం కల్పించాడు. మేరుపర్వతం భూగోళం మీదనే వున్నదని చారిత్రక భౌగోళికుల, విమర్శకుల అభిప్రాయం కదా! ఇందుకు భిన్నంగా శాసనకవి మేరుపర్వతం వరాహావతారదంష్ట్ర ఉపరితలంలో ఉన్నదంటున్నాడు. పైగా మేరు స్వరూపాన్ని చెప్పకుండానే మేరుపర్వత శిఖరం భూగోళంవలె వుంటుంది, అని వర్ణించాడు. మేరుపర్వత శిఖరమే భూగోళంవలె వుంటే, అసలు మేరువు యేరూపంలో వున్నదనాలి? ఎప్పుడైతే మేరుపర్వతశిఖరం భూగోళశోభను వహిస్తున్నదన్నాడో అది భూగోళంమీద లేదనీ దానికి దూరంగా వున్నదనీ ఆ కారణం చేతనే భూగోళంతో మేరుశిఖరాన్ని పోల్చడం జరిగిందనీ స్పష్టపడడంలేదా! అయితే మేరుస్థానం భూమండలం కాదన్నమాట! వాస్తవానికి మేరుపర్వతమని వర్ణింపబడింది వృశ్చిక ధనూరాసుల ఉపరిభాగంలోని ఒకానొక నక్షత్రవలయం. వృషభ మిథునరాసుల సంధిలో ఉన్న రాక్షసగుణ సంకలితుడై మృగాశిరా రూపుడైన హిరణ్యాక్షుని వినాశనానికి మూలకారకమైన వరాహస్వరూపానికి మూలస్థానం యీ వృశ్చిక ధనూరాసుల సంధికి ఉపరిభాగమే. హిరణ్యాక్షుడంటే అసలైన అర్థం హిరణ్యామయమైన మేరుపర్వతంమీద (దురాశా

పూరితమైన ) దృష్టికలవాడు అని. ఈ దుష్టరాక్షసుని ఆశాదృష్టి వలయంనుంచి మేరువును కాపాడినదికూడా వరాహమే. శ్రవణానక్షత్రానికి అత్యంత ఉన్నతస్థానంలోవున్న విష్ణుస్థానానికి కొంత దిగువగా యీ మేరుస్థానం వున్నట్లు స్పష్టపడుతున్నది. ఇది బ్రహ్మస్వరూప నక్షత్రాలలో గర్భస్థానంగా విలసిల్లగల మధ్య ప్రదేశంలో వున్నట్లు కనిపిస్తున్నది. "హుత్వామంత్ర" (7,8పుటలు-28శ్లోకం) ఇత్యాది శ్లోకంలో సప్త ఊర్ధ్వ లోకాలకూ ఉపరిభాగంలో అంటే సత్యలోకంలో ఉన్నతస్థానంలో మేరువు వున్నదని శాసనకవి యెలుగెత్తి చాటాడు. అందువల్లనే బ్రహ్మ హిరణ్యగర్భుడుగా వర్ణించబడ్డాడని కూడా తోస్తున్నది. మేరువుచుట్టూ సూర్యుడు తిరుగుతున్నాడని అనేక సందర్భాలలో ప్రాచీనులు పేర్కొన్నారు. ధ్రువనక్షత్రాన్ని మేరువుగా భావించినవారుకూడా వున్నారు. మేరుపర్వతం భూమిచుట్టూ మేఖలవలె వుంటుందనీ, దానిచుట్టూ సూర్య చంద్రులు తిరుగుతూ వుంటారనీ బ్రహ్మాండపురాణంలో ఉటంకించబడింది. చంద్రుడు భూమిచుట్టూ తిరుగు తున్నమాట యథార్థమేగాని సూర్యుడు తిరుగుతున్నాడన్నది యథార్థంకాదు. అయితే మేరువు యెక్కడో ఖగోళంలో దూరతీరాలలో వుండగా భూమిమీదనే అది వున్నది అని చెప్పేమాటలను ఆర్ష విజ్ఞాని యైనవాడు ఆమోదించగలడా ? వాస్తవానికి సప్తకులపర్వతాలని పేర్కొన్న పురాణవాక్యాలు అప్రామాణికాలు. ఆర్ష విజ్ఞానానికి పరమ విరుద్ధాలు. ఒక అభిప్రాయంప్రకారం సప్తకులపర్వతాలు హిమవంతుని సంతతి ! అయినప్పుడు యీ సప్తకులపర్వతాలలో హిమవత్పర్వతాన్ని సైతం చేర్చిన పురాణవాక్యం ప్రామాణికమైన దవుతుందని చెప్పగలమా ? అంతేకాదు, హిమవంతుని సంతతియైన కుల పర్వతాలకేకాదు యితర పర్వతాలకుకూడా రెక్కలు వుండేవనీ, వాటినూలంగా అవి యెక్కడపడితే అక్కడికి యెగిరివెళ్లి గ్రామపట్టణాది ప్రాంతాలపై వాలడంవల్ల అవన్నీ నేలమట్ట మయ్యేవట ! ఈ పర్వత ప్రయాణాలు కారణంగా యమయాతనలుపడుతున్న ప్రజల కష్టాలను చూచి ఇంద్రుడు ప్రజలను కాపాడేనిమిత్తం తన వజ్రా యుధంతో సప్తకులపర్వతాల రెక్కలు విరుగగొట్టాడనీ, అప్పుడే కుల పర్వతాలన్నీ ఇంద్రునిదాడికి భయపడి సముద్రంలో దాక్కున్నాయనీ ఒక అప్రసిద్ధమైన కథ వున్నది. (ఇంద్రుడు పర్వతాల రెక్కలు ఛేదిస్తున్నప్పుడు హిమవంతుని కుమారుడైన మైనాకుడు భయపడి సముద్రంలో దాక్కున్నాడన్నకథ ప్రసిద్ధమైనదే.) ఈ కథను మనం కేవలం సాంకేతికంగా పరిగ్రహించినా కులపర్వతాలు భూమిమీద - ప్రత్యేకించి సముద్రంలో వున్నాయని చెప్పవలసివుంటుంది. కాగా జలేతరమైన భూప్రదేశంమీద కులపర్వతాలు లేవని భావించవలసి వుంటుంది. ఈ గాథను యేదో పురాణాలలో ప్రక్షిప్తభాగంగా త్రోసిపుచ్చినా వచ్చే యిబ్బంది యేమీలేదు. అయితే మార్కండేయాది పురాణాలు పేర్కొన్న కులపర్వతాలు సరైనవికావనీ, అసలైన కులపర్వతాలు వేరే ఉన్నాయనీ పేర్కొన్న ప్రాచీనులు లేకపోలేదు.

"మహేంద్రో మలయస్సహ్యః శుక్తిమాన్ గంధమాదనః
వింధ్యశ్చ పారియాత్రశ్చ సప్తైతే కులపర్వతాః ॥ "

అని త్రికాండశేష నిఘంటు కర్త మరికొందరి ప్రాచీనులమతాన్ని ప్రతిబింబించాడు. ఈ దృష్ట్యా మేరువు సప్తకుల పర్వతాలలో చేరలేదని అది భూమండలంమీద లేనేలేదని యెక్కడో దూర తీరాలలోనే వున్నదనీ మనం ఆమోదించకతప్పదు. కాగా శ్రీ విరూపాక్ష శాసనకర్త భూగోళాకారంలో శిఖరం ఉన్న మేరువు వరాహదంష్ట్రంమీద వున్నదని వర్ణించిన వేదఖగోళ విషయం సత్యసమ్మతమే అవుతుంది.

## సప్త సముద్రాలు—సప్త ద్వీపాలు

భూమండలం సప్తసముద్రాలతో, సప్తద్వీపాలతో ఆవృతమైవున్నదని అనేక గ్రంథాలు పేర్కొన్నాయి. సప్తద్వీపాల ఉనికి వాస్తవమైనదిగానే కనిపిస్తున్నదిగాని సప్తసముద్రాలు భూమిమీదనే వున్నాయనడం వాస్తవమైనదిగా కనపడదు. సప్తద్వీపాల ఉనికిని ఆమోదిస్తే సప్తసముద్రాలకు తావులేదు. ఏకైక సముద్రం మాత్రమే వుంటుంది. సప్తసముద్రాలు భూమిమీదనే వున్నట్లు ఆమోదిస్తే సప్తద్వీపాలున్నాయని చెప్ప డానికి వీలులేదు. చుట్టూ జలమున్న ప్రాంతమే ద్వీపమనబడుతుంది. సప్తద్వీపాలున్నాయంటే అర్థం వాటి చుట్టూ జలమున్నదనీ అది ఒకే జలరాశియనీ చెప్పవలసివుంటుంది. అంటే ఒక పెద్దజలరాశిలో విడివిడిగా ఏడు పర్వతాలుంటే యేవిధంగా వుంటుందో సప్తద్వీపాలు ఆ విధంగా వున్నాయని అర్థమవుతుంది. విభిన్నా లుగా సప్తసముద్రాలు భూమిమీద వుండాలంటే ఏడు భూఖండాలకు రెండు దిక్కులలో మాత్రమే జలరాశి (ఆ దిక్కులు కూడా పరస్పర అభిముఖాలుగానే వుండాలి.) ఉండివుండాలి. అయినప్పుడు సప్తసముద్రాలు పరి గణనకు వస్తాయిగానీ, సప్తద్వీపాలు పరిగణనకురాకుండా ఇరువైపుల జలం, ఇరువైపుల భూమివున్న భూఖండాలు లెక్కలోకివస్తాయి. కాగా సప్తద్వీపవ్యవస్థకు స్థానం వుండదు. సప్తసముద్రాలూ సప్త ద్వీపాలూ కూడా భూమిమీద ఉండాలంటే - విభిన్న ఖండాలుగా సప్తసముద్రాలుండి ఒక్కొక్కసముద్రంలో ఒక్కొక్కద్వీపం ఉండాలి. సప్తసముద్రాలూ ద్వీపాలూ యీ విధంగా ఉన్నట్లు ప్రాచీనులెవరూ పేర్కొనలేదు.

ఆధునిక వైజ్ఞానికుల లెక్కలప్రకారం జలభాగంతోసహా కలిపి భూగోళ వైశాల్యం 25 వేల చదరపు మైళ్లకు తక్కువ. అయితే సప్తసముద్రాలూ, సప్తద్వీపాలూ భూమిమీదనే వున్నాయన్న కొందరు ప్రాచీనుల లెక్కలప్రకారం భూమి ఆధునికుల లెక్కలకంటే వందరెట్లకుపైగా వైశాల్యంకలది. ప్రాచీనులిచ్చిన ద్వీప—సముద్రాల వైశాల్యం యిది.

| | | | | |
|---|---|---|---|---|
| జంబూ | ద్వీపం | ............ | 8,00,000 | మైళ్లు |
| ప్లక్ష | ,, | ............ | 16,00,000 | ,, |
| శాల్మల | ,, | ............ | 32,00,000 | ,, |
| కుశ | ,, | ............ | 64,00,000 | ,, |
| క్రౌంచ | ,, | ............ | 1,28, 00,000 | ,, |
| శాక | ,, | ............ | 2,56,00,000 | ,, |
| పుష్కర | ,, | ............ | 5,12,00,000 | ,, |
| | | | 10,16,00,000 | మైళ్లు |

| | | | | |
|---|---|---|---|---|
| లవణసముద్రం | | ............ | 16,00,000 | మైళ్లు |
| ఇక్షు | ,, | ............ | 32,00,000 | ,, |
| సురా | ,, | ............ | 64,00,000 | ,, |
| సర్పి | ,, | ............ | 1,28,00,000 | ,, |
| దధి | ,, | ............ | 2,56,00,000 | ,, |
| క్షీర | ,, | ............ | 5,12,00,000 | ,, |
| జల | ,, | ............ | 10,24,00,000 | ,, |
| | | | 20,32,00,000 | మైళ్లు |

† జల భూభాగాలనుకలిపి పరిగణిస్తే భూమండలం వైశాల్యం ఈ లెక్కలప్రకారం 30 కోట్ల, 48 లక్షల మైళ్లుంటుంది. ఆధునిక వైజ్ఞానికుల లెక్కఅయిన 25 వేలమైళ్లు యీ బృహత్సంఖ్యలో వందోవంతైనా కాదుగదా ! పురాణాల లెక్కలప్రకారమే చూస్తే భూమండలం శతాధికభాగం అంతరించగా మిగిలినది ప్రస్తుత రూపంలో వున్నదని మనం చెప్పవలసి వుంటుంది. వాస్తవానికి సప్తసముద్రాలలో ఒక సముద్రమే భూమి మీద వున్నది. అయితే భూమిమీదవున్న సముద్రం జలసముద్రమా ? లవణసముద్రమా ? అన్నది సందేహాస్పదం. అసలు లవణసముద్ర మన్నది లవణపదార్థ సముద్రమో లేక లవణజల సముద్రమో భవిష్యత్తులో పరిశోధనలుచేసి తెలుసుకోనవలసివున్నది. లవణసముద్రం—లవణజల సముద్రమేయై భూమిమీద వున్నదే అయితే; లవణజల భిన్నమైన జలసముద్రం మరొకచోట యెక్కడో వున్నదని చెప్పవలసి వుంటుంది. భూమిమీదవున్న సముద్రమే జలసముద్రమైతే లవణపదార్థమయమైన మరొకసముద్రం వేరొకచోట యెక్కడో వున్నదని భావించవలసివుంటుంది.

మహర్షులు పేర్కొన్న క్షీరసముద్రం ఖగోళంలో–సుదూరంలో విష్ణునక్షత్రాలకు సమీపంగా బ్రహ్మ–ఆదిశేషు– ఆదిగాగల నక్షత్రాల పరిసరాలలోనే–అనేక నక్షత్రాల రూపంలో వున్నది. దీనిని తెలుగువారు "పాలపుంత" అనగా ఆధునిక వైజ్ఞానికులు Thick milky way అన్నారు. ఖగోళంలో యీ క్షీరసముద్రమున్నట్లే మిగిలిన ఐదుసముద్రాలూ యెక్కడెక్కడ వున్నాయో ఆధునిక వైజ్ఞానికులు పరిశోధించవలసివున్నది. శ్రీవిరూపాక్ష శాసనకర్త తిరుమలరాయల తేజస్సును వర్ణిస్తూ యీ క్రింది శ్లోకాన్ని రచించాడు.

"యస్యాతి ప్రౌఢ తేజస్సవితరివిమత ధ్వాంతభేదిన్యుదీతే
క్షీరార్ణాంత స్ఫుటతర వికసత్పుండరీ కోపమస్య
శ్వేతచ్ఛత్రస్యమధ్యే కనకలశికా భాసతే కర్ణికాభా
తస్యోపాంతే మరాళద్వయ మివ విచల చ్చామర ద్వంద్వ మాస్తే. (చూడు 7 పుట–23 శ్లోకం.)

† "భూమి చుట్టుకొలత 24, 901 మైళ్లు– భూమి మొత్తం వైశాల్యం 19, 68, 36, 000 చదరపుమైళ్లు – ఇందులో భూభాగం 5,57,86,000 చదరపుమైళ్లు–జలభాగం 14,10,50,000 చదరపు మైళ్లు"– అని ఆధునిక వైజ్ఞానికుల అంచనా. ప్రాచీనుల లెక్కలదృష్టిలో యిదికూడా తక్కువే—

ఇందులో కవి పాలసముద్రంతోపాటు దానికి సమీపంలో వున్న హంసల జంటవంటి చామరాల జంటను కూడా పేర్కొన్నాడు. పాలసముద్రానికి సమీపంలో రెండు హంసల ఆకారంలో వున్న నక్షత్రాలను సరస్వతికీ, బ్రహ్మకూ వాహనాలుగా ప్రాచీనులు పేర్కొనగా వాటిని యీ కవి హంసలవంటి చామరాలుగా వర్ణించాడు. ఈ వర్ణనను చూచినపుడు యీ కవి దృష్టిలోసైతం క్షీరసముద్రం భూమిమీద లేదని, మరొకచోట యెక్కడో వున్నదని భావించినట్లు కనిపిస్తున్నది. దీనికి తగ్గట్లు 'జయతి క్షీరజలధేః'' (3 పుట 5 శ్లోకం) ఇత్యాది శ్లోకంలో చంద్రుడు క్షీరసముద్రంలో పుట్టాడని వర్ణించి, ఆ చంద్రుడు విష్ణుదేవునికి యెడమకన్నుగా వున్నాడని కూడా పేర్కొన్నాడు. ఖగోళశాస్త్రం ప్రకారం "పాలకడలిశయనుడు"గా వర్ణించబడే విష్ణువు క్షీరసముద్రానికి ఉపరిభాగంలో నక్షత్రరూపంలో వున్నాడు. ఖగోళంలో ఉత్తరదిక్కుగా వున్న యీ నక్షత్రంవైపే మన యీ సౌరమండలంలోవున్న గ్రహనక్షత్రాది గోళాలన్నీ ప్రయాణం చేస్తున్నాయి. ఈ ప్రయాణాన్ని ఆధునిక ఖగోళశాస్త్రజ్ఞులు సైతం గుర్తించి ఆమోదించారు. విష్ణువుకు నేత్రంగా వర్ణించ బడిన చందమామ భూమిచుట్టూ తిరుగుతున్న చందమామకాదని మనం గుర్తించాలి. వివిధ గ్రహాలచుట్టూ అనేకమైన చందమామలున్నాయి. ఈ చందమామలన్నింటికీ మూలభూతమైన చందమామ ఒకటున్నదనీ అదే విష్ణువుకు యెడమకన్నుగా విరాజిల్లుతూ వుంటుందనీ వేదజ్ఞుల అభిప్రాయం. ఇదేవిధంగా వివిధ సూర్యగోళాలకు మూలభూతమైన సూర్యగోళమే విష్ణువుకు కుడికన్నువంటిదని కూడా ప్రాచీనుల అభిప్రాయం. క్షీరసముద్రంలో పుట్టిన చందమామ విష్ణువుకు యెడమకన్నుగా విరాజిల్లుతున్నాడని కవి పేర్కొన్నాడంటే విష్ణుస్వరూపాలైన నక్షత్రాలకు (Vega) సమీపంగానేవున్న క్షీరసముద్రాన్నీ, చంద మామను మనదృష్టికి తీసుకువస్తున్నాడన్నమాట.

## వినాయకుడు

ఎంతోమంది కవులు వినాయకస్తుతి చేశారు. అయితే చక్కని శ్లేషలను మిళితంచేసిన యీ కవి సునిశితమైన దృష్టితో స్తుతిశ్లోకం రచించాడు. విఘ్నేశ్వరుడు గజముఖుడు. అయితే అతడు గజసంతతి కాదు. అందువల్ల అగజసుతుడు. అగజ అంటే గజం కానిది, నగరాజ కుమారి అని రెండర్థాలు. వినాయకుడు పంచాస్యలాలితుడు. ఇక్కడ పంచాస్య శబ్దంచేత పంచముఖుడైన పరమేశ్వరుడు, మృగరాజమైన సింహమూ పరిగ్రాహ్యాలవుతాయి. వినాయకుణ్ని శివుడెలాగో లాలిస్తాడు. అందులోనూ మొదట పొరపాటు జరిగినా చివరకు తన అనుగ్రహంతో, తన లీలతో జనించినవాడే కదా వినాయకుడు. అందువల్ల వినాయకుణ్ణి శివుడు లాలించడంలో విడ్డూరపడవలసిందేమీ లేదు. గజసింహాలు బద్ధశత్రువులు. అయితే సింహం యెంతటి సింహమైనా చివరికి ఆ మహామాత పార్వతీదేవి వాహనమైన సింహమైనా యీ గజముఖుణ్నిమాత్రం యేమీ చేయలేదు. కన్యారాశీరూపమైన పార్వతీమాతకు వాహనమై, కేతనమై అలరారే సింహరాశి నక్షత్రాలు విఘ్నేశ్వరునికి యజ్ఞోపవీతాదులవంటి అలంకార ప్రాయాలు. కేవలం కవి కల్పనగాకాక ప్రాచీన ఖగోళశాస్త్ర వ్యవస్థను దృష్టిలో పెట్టుకొని యీ కవి వైజ్ఞానిక దృక్పథంతో గజసింహాల మైత్రిని వర్ణించాడు. పైగా యీ వినాయకుడు తేజస్స్వరూపుడని వర్ణించడం రూపంగా నక్షత్ర స్వరూపుడుగా వెలుగొందుతున్నాడని కవి స్పష్టపరచాడు.

దేవతాపరాలైన ప్రాచీనుల వర్ణనలన్నీ ప్రత్యేకించి ఆర్షవిజ్ఞానులైనవారు వర్ణించినవన్నీ అత్యంత వాస్తవికాలైన ఖగోళవ్యవస్థలకు సంబంధించినవే.

## ఇంద్రత్వం

టిబెట్టు త్రివిష్టపంకాదని అనుకున్న తరువాత టిబెట్టుదేశస్థులు దేవతలు కారనికూడా అనుకోనవలసివస్తుంది. ఇంద్రశబ్దం సామాన్యంగా ఒకానొక దేవతావాచకంగా వాడబడుతున్నదిగాని, వాస్తవానికి దాని అర్థం 'తేజోవంతుడు-గొప్పవాడు' అని మాత్రమే. దేవతలలో గొప్పవాడు దేవేంద్రుడు. అతడే స్వర్గాధిపతి. మానవులలో గొప్పవాడు మానవేంద్రుడు. దేవేంద్రుడు సహస్రాక్షుడుగా వర్ణింపబడ్డాడు ఇక్కడ సహస్ర శబ్దంచేత సహస్రాధికమైన అనేక సంఖ్య పరిగ్రాహ్యమవుతుంది. కాని అది కేవలం వెయ్యికి మాత్రమే పరిమితంకాదు. దేవేంద్రునికి దేహమంతావున్న నేత్రాలు నిమీలితాలుగానే (మూయబడి) వుంటాయిగాని తెరుచుకొనివుండవు. ఆర్షవిజ్ఞానపరంగా యిక్కడ గుర్తించవలసిన రహస్యం ఒకటున్నది. వాస్తవానికి ప్రయత్నిస్తే ప్రతిమానవుడూ నిత్యయౌవనుడుగా మానవేంద్రుడు కావచ్చును. మానవుని శరీరంమీద అంతటా సూక్ష్మాతిసూక్ష్మాలైన రంధ్రాలుంటాయి. వీటిని చర్మచక్షువులని కూడా అంటారు. అందువల్ల ప్రతిమానవుడూ సహస్రాక్షుడే ! ఈ రంధ్రాలద్వారానే శరీరంలోపలినుంచి చెమట బయటకు వస్తూవుంటుంది. "హంసస్సోఽహం" అన్న ఆర్షవిజ్ఞాన సిద్ధాంతంప్రకారం మానవుడు లోచనబంధయోగాన్ని సాధించగలిగినపుడు – లోచననామకాలైన దేహంమీది సూక్ష్మరంధ్రాలన్నీ పూర్తిగా మూసుకుపోతాయి. అప్పుడు మానవుడు నిమీలిత సహస్రాక్షుడై మానవేంద్రుడవుతాడు. అస్వేదగాత్రుడవుతాడు. నిత్యయౌవనుడవుతాడు. ఈ ఆంతర్యాన్ని గుర్తించక "దేహమంతటా నేత్రాలవలె పొడలున్నవాడు కాబట్టి సహస్రాక్షుడనబడ్డాడని ఆధునికులు వ్రాసిన వ్రాతలు ప్రామాణికాలు కానేరవు. కాగా ఒకప్పుడు టిబెట్టుదేశాన్ని పరిపాలించినవాడు దేవేంద్రు డనబడ్డాడనడం సత్య విదూరమైన విషయం. కోట్లాదిగావున్న దైవీయాలైన శక్తులను గురించి ఆర్షవిజ్ఞానపరంగా – వివిధ శబ్ద – నిశ్శబ్ద శక్తులను ఉపయోగించి పరిశోధనలు యెంతగానో కొనసాగించవలసివున్నది. మన పురాణగాథలకు మూలమైన వేదవిజ్ఞాన స్వరూప స్వభావాలు అప్పుడుగాని ప్రామాణికాలుగా బయటకురావు.

## ఖగోళప్రతిబింబం

అత్యంత ప్రాచీనకాలంలో అపూర్వంగా అగాథంగా ఖగోళపరిశోధనలుచేసి మన మహర్షులు అనంత విజ్ఞానాన్ని సంపాదించి దానికి ప్రతిబింబకంగా వేదవాఙ్మయాన్ని సృజించారు. ఈ విజ్ఞానాన్ని సర్వజనవ్యాప్తం చెయ్యడానికి, వీలైనంత యెక్కువకాలం నిలుపడానికి భూగోళంమీద ఖగోళప్రతిబింబకమైన వ్యవస్థను యేర్పరచినట్లు కనిపిస్తున్నది. ఖగోళంలోవున్న వివిధ గ్రహనక్షత్రాదుల వర్గాలను దృష్టిలో పెట్టుకొని వాటికి చిహ్నంగా ప్రత్యేక నామాలతో వస్తు స్థల నిర్దేశాలతో ఒక చిత్రపటంవలె భూమిమీద వివిధప్రాంతాలను యేర్పరచినట్లు కనిపిస్తున్నది. ఖగోళంలో నక్షత్రరూపమైన గంగానది విష్ణుపాదోద్భవి అయి మిథునరాశిగావున్న నక్షత్రరూపమైన శివుని జటాజూటంమీదకు వచ్చి దిగువకు జారిపోతున్నట్లు కనిపిస్తున్నది. ఆకాశంలోవున్న యీ గంగకు ప్రతిబింబంగా భూమిమీదవున్న ఒక

నదికి గంగానది అని పేరుపెట్టినట్లు కనిపిస్తున్నది. యమునా, సరస్వతీ, కృష్ణా, గోదావరి మొదలైన జీవనదులన్నింటికీ వివిధ ప్రవాహాలవలె బారులు తీరివున్న నక్షత్రాల శ్రేణులను దృష్టిలో పెట్టుకొని పేర్లుపెట్టినట్లు తోస్తున్నది. సుప్రసిద్ధక్షేత్రాలు, దేవాలయాలు ప్రాచీనకాలంలో వెలసినవన్నీ ఖగోళంలోని దివ్యశక్తివంతాలైన నక్షత్రాలకు ప్రతిబింబకాలుగా యేర్పరచినట్లు కనిపిస్తున్నది. ఈ సిద్ధాంతాన్ని మనం ఆమోదించనప్పుడు "ఆకాశంలో గంగపేరుతో నక్షత్రసముదాయం యెందుకుండాలి? దానికాపేరు యెందుకు పెట్టాలి? శతసహస్రాబ్దాలుగా గంగానదిని ఆ పేరుతోనే యెందుకు పిలువవలసి వచ్చింది? ఆయానదుల కసలు ఆ పేర్లే యెందుకు పెట్టాలి?" అన్న ప్రశ్నలకు సమాధానం చెప్పలేము. కన్యాకుమారి అగ్రమన్నది క్రీస్తు అవతరణ తరువాత ఆ మతప్రభావంతో యేర్పడిందికాదు. అది కన్యారాశికి చిహ్నంగా వేదర్షులు యేర్పరచిన ప్రాంతమేకాని వేరుకాదు. ఈ దృష్ట్యా మన మహర్షుల ఖగోళపరిశోధనలను దృష్టిలో పెట్టుకొని మేషాది ద్వాదశరాశుల ప్రతిబింబంగా భూమండలవ్యవస్థను నిర్ణయించవలసి వున్నది. అయితే ఖగోళంలో వున్న మేరువుకు చిహ్నంగా భూమండలంలోని ఒకపర్వతానికి మేరువు అని పేరుపెట్టి వుండవచ్చును. ఖగోళంలోని వివిధ నక్షత్ర రూపాలైన మహాగోళాలకు చిహ్నాలుగా వింధ్యాద్రిపర్వతనామాలను సైతం మన మహర్షులు యేర్పరచి వుండవచ్చును. ఇంతమాత్రంచేత భూమిమీదవున్న వస్తుస్థలాదులు ఖగోళంలో వున్నవాటితో దీటు రాగలవి, సమానమైనవి అని అనుకొనడం పొరపాటే కాగలదు. కొన్నికోట్ల భూమండలాల వైశాల్యంకల ఖగోళంలోని కన్యారాశిని భూమిమీదవున్న కన్యాకుమారిఅగ్రంతో మనం పోల్చగలమా? ఇదేవిధంగా యెన్నెన్నోకోట్ల భూమండలాలను మించివున్న నక్షత్రఝరియైన ఆ గగనగంగతో పోల్చినపుడు భూమిమీది గంగానది అవగింజలో అరవైయవ వంతుకైనా దీటురాదు.

ఆర్ష విజ్ఞానం దృష్ట్యా అగాధమైన సృష్టివ్యవస్థను పరిశీలిస్తే ఒక్క భూమండలమేకాదు మొత్తం సృష్టే భగవంతుని ఒక లీలగాకనిపిస్తుంది. ఒకక్రీడగా కనిపిస్తుంది. లీల అనడం తప్ప మనప్రాచీనులు మరొకమాట అనలేకపోయారు. ఈ లీలలో అగాధమైన విచిత్రం కూడా వున్నదేమో అనిపిస్తుంది. భూమండలంలో ఆర్యావర్తానికి, యీ రూపంగా ప్రాచీన భారతదేశానికి సృష్టిలో సహజంగా ఒక విశిష్టత వున్నట్లు కనిపిస్తున్నది. ఖగోళంలో ఉత్తరదిగ్భాగంలో బ్రహ్మాండమైన హిమగోళాలున్నాయని ఆధునిక ఖగోళశాస్త్రజ్ఞులు భావిస్తున్నారు. కొద్ది సంవత్సరాల క్రిందట రష్యాలో ఎడారివంటి ఒక పెద్ద ప్రదేశంలో ఒక గ్రామమంత బృహత్తరమైన మంచుగడ్డ ఆకాశంలోనుంచి పడింది. దీనిని పరిశీలించిన తరువాత ఉత్తర ఖగోళంలో హిమగోళాలున్నాయని వైజ్ఞానికులు అభిప్రాయపడ్డారు. పార్వతి అనబడిన నక్షత్రపుంజం ఖగోళంలోని ఆ హిమగోళాలనుంచి ఉద్భవించింది కావచ్చును. అయితే ఇక్కడ మనం గుర్తించవలసిన విచిత్రవిషయం భారతదేశానికి సరిగ్గా ఉత్తరదిగ్భాగంలోనే హిమాలయపర్వతాలుండడం, అందుకే అసలు భారత దేశానికి సృష్టిలోనే యేదైనా ప్రత్యేకత వున్నదేమో అనిపిస్తున్నది. ఈ ప్రత్యేకత లేకపోతే భారతదేశంలో పుట్టినంతమంది మహర్షులు ప్రపంచంలో మరెక్కడా పుట్టలేదేమి? అన్నప్రశ్న యెదురవుతున్నది. ఆర్షవిజ్ఞానాన్ని దృష్టిలో పెట్టుకొని ఖగోళ పరిశోధనలపరంగా సృష్టి వ్యవస్థాపరంగా—బహుముఖమైన విజ్ఞానాన్ని యేకోన్ముఖంచేస్తూ, సమన్వయపరుస్తూ, నేనొక బృహత్తరమైన ప్రామాణికమైన గ్రంథాన్ని రచియిస్తున్నాను. ఈ గ్రంథంవల్ల బహుముఖమై అగాధమైన ఆర్ష విజ్ఞానం వెలుగులోకి వచ్చి ఆధునిక వైజ్ఞానికులనే ఆశ్చర్య పరచగలదు.

## వర్ణనలోపాలు

శ్రీ విరూపాక్ష శాసనకర్త మామూలు కవులకంటే ఆర్షవిజ్ఞాన దృష్టికల విశిష్టవ్యక్తే అయినా రాజులను అతిగావర్ణించబోయి వాస్తవాలనుమరిచిపోయి వర్ణించినట్లుకనిపిస్తున్నది. తిరుమలరాయల గుణాలను వర్ణిస్తూ "భోగిత్వేవిధితేపి"(7 పుట. 24 శ్లోకం) ఇత్యాది శ్లోకం రచించాడు. భూమిని ఆదిశేషువు, ఆదికూర్మం, అష్టదిగ్గజాలు,కులగిరులు మోస్తున్నాయన్న పురాణప్రసిద్ధవిషయాన్ని పేర్కొన్నాడు. ఆదిశేషువు మొదలైనవి నక్షత్ర మహారూపాలై ఖగోళంలో వున్నవే. ఖగోళంలోని మొత్తం గ్రహనక్షత్రాది మండలాలను అన్నింటినీ ఎనిమిది దిక్కులకూ ఎనిమిది వర్గాలుగా విభజించి విడగొట్టినప్పుడు అవి ఎనిమిది యేనుగులవలె కనిపిస్తాయి. ప్రత్యేకించి తూర్పుదిక్కున అత్యధిక నక్షత్రపుంజాలతో తేజోవంతమై మహత్తరమైన ఏనుగు కనిపిస్తుంది. అందుకే అన్నింటికంటే ఐరావతం ప్రత్యేకస్థానం పొందకలిగింది. గ్రహనక్షత్రాదుల పరస్పర ఆకర్షణశక్తి వల్ల భూమ్యాది గోళాలన్నీ శూన్యంలో నిలిచివున్నాయని ఆధునిక వైజ్ఞానికుల సిద్ధాతం. అయితే ఆదిశేషువు ఆదికూర్మం, అష్టదిగ్గజాది స్వరూపాలైన నక్షత్ర సమూహాలకున్న ఆకర్షణశక్తి మహత్తరమైనదని, అత్యంతబలీయమైనదని మహర్షులు గుర్తించినట్లు కనిపిస్తున్నది. ఆదిశేషువు మొదలైన నక్షత్రాలగుంపులు విష్ణునక్షత్రాల శక్తికి లోబడివున్నాయని మనం మరచిపోరాదు. శ్రీవిరూపాక్ష శాసనకర్త శ్లేషలతో ఆదిశేషువును వక్రగతి గలవాడుగా, ఆదికూర్మాన్ని జడా(జల)శ్రయిగా, అష్టదిగ్గజాలను మదజలంతో చురుకుదనం లేనివిగా, కులగిరులు కఠినమైనవిగా వంకలుపెట్టి వర్ణించడం సరికాదు. తిరుమలరాయల పొగడ్తకోసం యీ వర్ణన చేశాడేగాని వాస్తవానికి ఒకేఒక్క ఆ నిరాకార, నిరంజన, నిర్వికల్ప సచ్చిదానంద స్వరూపంతప్ప యీ సృష్టిలో వక్రగతి లేనిదీ, జడ(జల)త్వాన్ని ఆశ్రయించనిదీ, మదరహితమైనదీ, కఠినత్వం లేనిదీ మరేదిలేదు. కుల పర్వతాలకు కఠినత్వమున్నది తిరుమలరాయలకు లేదన్నాడే గాని, అతడెన్నెన్నోయుద్ధాలలో విజయాలు సంపాదించాడే, కఠినత్వం లేకుండా యీ విజయాలు యెలా సాధ్యమువుతాయి ?

ఇదేవిధంగా రామరాజు దానగుణాన్ని తిరుమలరాయల దానగుణాన్ని వర్ణించడానికి శాసనకవి "వితరణ పరిపాటీం" (5 పుట—19 శ్లోకం.) "అశ్రాంతవిశ్రాణన" (7 పుట - 26 శ్లోకం.) ఇత్యాది శ్లోకాలలో కల్పవృక్షాన్ని కించపరచాడు. ఆర్షవిజ్ఞానంప్రకారం కల్పవృక్ష నక్షత్రాలు; కామధేను నక్షత్రాలు వేరు వేరుగా ఉన్నాయి. వాటి అనుగ్రహం పొందినవారికి-అంటే వాటిశక్తిని వశంచేసుకున్నవారికి కామ్యాలన్నీ సిద్ధిస్తాయి. మన మహర్షులు యెప్పుడో గుర్తించిన ఖగోళంలోని కల్పవృక్ష నక్షత్రాలను, కామధేను నక్షత్రాలను క్రీ. శ. 1624 వరకూ పాశ్చాత్య ఖగోళశాస్త్రజ్ఞులు గుర్తించనే లేకపోయారు.

కల్పవృక్షం ...... CAMELOPARDALIS

కామధేనువు ...... **URSA MAJOR** గుంపు చుక్కలలో వరుసగా 22, 23, 11, 12, 13, 14, గుర్తులు కల-చై-సై లాంబ్డా-మ్యూ-న్యూ-క్సై-అక్షరసంజ్ఞలుగల యీ నక్షత్రాలే కామధేను నక్షత్రాలు. ఈ కల్పవృక్ష కామధేను నక్షత్రాలు సర్వశక్తిమంతాలని వేదవిజ్ఞానుల అభిప్రాయం. ఈ నక్షత్రాల శక్తితో పరమాణుమాత్రంగానైనా తులతూగలేని ఒక మానసమాత్రుణ్ణి స్తుతిపేరుతో ఆ మహాగోళాలను కించ పరచి వర్ణించడం విజ్ఞానియైన కవి చేయవలసిన పనికాదు. తిరుమలరాయలు నిత్య యౌవనమే కాదు నిత్య

సంపదకూడాలేనివాడే! కల్పవృక్షపు చిగురుటాకులు చిగురుటాకులు కాకపోయినా నిత్యచైతన్యం కలవే! ఏది కావాలన్నా యివ్వగల కల్పవృక్షానికి వాణీవీణావాదాన్ని మించగల వీణావాదంసైతం సాధ్యమే అవుతుంది. తిరుమలరాయలు 'జిష్ణుత్వే'(7పుట-27శ్లోకం)ఇత్యాదిశ్లోకంలో-మిగిలిన సద్గుణాలమాట కేమిగాని అగ్నిశుచిత్వం కలవాడని చెప్పడం నిజంగా అతిశయోక్తేఅవుతుంది. సర్వభక్షకుడైన అగ్నితోమానవమాత్రుడు సరిరాగలడా !

## మంత్రప్రయోగం

"హుత్వా మంత్ర పురస్సరం రిపుయశో లాజాన్" (7,8 పుటలు 28 శ్లోకం.) అంటూ శత్రువుల కీర్తులనే పేలాలను మంత్ర పురస్సరంగా ప్రతాపాగ్నిలో హోమంచేశాడని శాసనకవి వర్ణించాడు. పేలాల హోమంతో కూడిన కీర్తివినాశకమైన వామాచారప్రయోగం యిక్కడ సూచితమైనది. వామాచార ప్రయోగాలు రాజులశక్తికీ, పౌరుషప్రతాపాలకు కళంకాన్ని తెస్తాయే కాని భూషణరూపాలు కానేరవు. ఈ సందర్భంలో తిరుమలరాయల విజయయాత్ర, కేవలం సైనిక యుద్ధపాటవటంతో కూడింది మాత్రమే కాదనీ, పురాణ యుగంలోవలె అస్త్రప్రయోగపూరితం కాకపోయినా మొత్తంమీద మంత్రప్రయోగాలతో సైతం కొనసాగిందనీ చెప్పవలసివుంటుంది. ఈ సందర్భంలో శత్రువుల కీర్తిని పేలాలవలె వేయించాడని మనం భావించరాదు. వేయించడం వేరు - హోమంచెయ్యడం వేరు! వేయించిన పేలాలు సర్వజనసంసేవ్యాలు. భక్ష్యయోగ్యాలు. హోమం చేయబడిన పేలాలు అగ్నిలో భస్మమవుతాయేతప్ప రూపనామాలతో తిరిగి మనకు దక్కవు.

శ్రీవిరూపాక్ష శాసనకవి "హుత్వామంత్ర పురస్సరం" (7-8 పుటలు 28 శ్లోకం) ఇత్యాది శ్లోకములలో 'సంప్రాపయ్య పదాని సప్త భువనేష్వారోప్య మేరూపలమ్' అని పేర్కొన్నాడు. 'పదాని సప్త భువనేషు' అనడంవల్ల 'సప్త' శబ్దం, 'పద' భువన శబ్దాలు రెండింటికీ సమన్వయ మవుతున్నది. సప్త పదాలూ కావచ్చును, సప్త భువనాలూ కావచ్చునన్నమాట. "సఖ్యం సాప్తపదీన ముచ్యతే" అన్నాడు కదా కాళిదాసు. పదశబ్దంచేత వాచ్య మయ్యేవి కేవలం అడుగులు మాత్రమేకావు. మాటలు కూడా వాచ్యమవుతాయి. ఏడడుగులు వేస్తేనేకాదు, ఏడు మాటలు మాట్లాడినా సఖ్యం ఏర్పడుతుందన్నది పూర్వవాక్కు. శాసనకవి భూమిమీద సప్త పదాలనికాక సప్త ఊర్ధ్వలోకాలని దృష్టిలో పెట్టుకొని 'సప్త పద' శబ్దాన్ని ప్రయోగించాడు. కాగా సప్తభువనాలతోపాటు సప్తభువనాలమీదా ఏడడుగులను వుంచడంఅన్న అర్థంతోపాటు సప్తలోకపరాలయిన భూ-భువః-సువః-మహః-జనః-తపః-సత్య అన్న సప్తపదాలు (శబ్దాలు) సైతం పరిగ్రాహ్యాలవుతున్నాయి. ఈ సప్త పదాలను శబ్ద-నిశ్శబ్ద తత్వంతో స్వాధీనం చేసుకోకలిగిన మానవుడు సత్యలోకంలో ఉన్నతస్థానంలో వున్న మేరువు నధిరోహించ గలుగుతాడన్నమాట. ఆర్షవిజ్ఞానపరమైన యీ మహత్తర సత్యంతోపాటు వాస్తవికమైన మేరుపర్వతస్థానాన్ని సైతం శాసనకవి యిందులో వెల్లడించాడు.

ఈ శ్లోకంలో తిరుమలరాయలు కీర్తి వధువును వివాహమాడినాడన్న విషయం కూడా కవి స్పష్ట పరచాడు. వివాహంలో సప్త పదాలు-ఉభయత్ర-అంటే శబ్దపరంగాను, పాద విన్యాసపరంగాను, ఉంటాయన్నది సుప్రసిద్ధమైన అంశం. ఈ వివాహ సప్తపదిని సైతం దృష్టిలో పెట్టుకొని "సప్తపద" అనే శబ్దాన్ని-రాతిమీద అడుగులు వేసే సంప్రదాయాన్ని-దృష్టిలో పెట్టుకుని మేరు శిలాధిరోహణాన్ని, కవి వర్ణించాడు.

అటు భువనపరంగా, శబ్దపరంగా, ఇటు వివాహపరంగాసైతం ముప్పేటతోకూడిన శ్లేషను యీ కవి యిక్కడ మేళవించాడు.

## విషం - అమృతం

బల్లాంబికా-బుక్కరాయల కుమారుడైన రామరాయలు కర్నూలు దుర్గాన్ని జయించిన తరువాత ఆ పట్టణ సమీపంలోవున్న విష్ణుపాదతీర్థంలో ఆతని శత్రువులు విషంపెట్టినట్లు 'కందనవోలి దుర్గ' (5 పుట-13 శ్లోకం) ఇత్యాది శ్లోకంలో శాసనకవి వెల్లడించాడు. ఈ విషాన్ని అమృతంగా సేవించిన రామరాజు హాయిగా జీవించాడన్న విషయాన్నికూడా తేటతెల్లం చేశాడు. శాసన కవి ఈ సందర్భంలో విస్పష్టంగా చెప్పలేదు కాని రామరాజు "అమృత వర్షిణి" మంత్రసిద్ధి కలవాడన్న విషయం తేట తెల్లమవుతున్నది. కేవల అమృతవర్షిణి సిద్ధిమాత్రమేకాక విష్ణుభక్తుడైన రామరాజు నారాయణ మహాస్త్ర మంత్రప్రయోగాన్ని సైతం చేసి విషప్రభావం లేకుండా జీవించగలిగాడని చెప్పవచ్చు. ఆరవీటివంశంలో తొలినుంచీ రాజులంతా వేదవిజ్ఞానులైన బ్రాహ్మణులకు భక్తులైనట్లు, మంత్రప్రయోగాల్లో అనుభవాన్ని సంపాదించినట్లు, కనిపిస్తున్నది. తిరుమలరాయలు శత్రుకీర్తి వినాశకమైన వామాచార మంత్రప్రయోగం చేశాడన్న విషయం గతంలో పేర్కొనబడింది. రామరాజుకు విషాన్ని అమృతంగా సేవించగల'అమృతసిద్ధి' ఉన్నప్పుడు అతని వంశంలో శత్రువినాశకాలైన వామాచార ప్రయోగాలకు స్థానం ఉండడంలో ఆశ్చర్యంలేదు.

ఈ శ్రీవిరూపాక్ష శాసనకవి గంగాలహరివంటి కవితావైభవం కలవాడు. ఆమూలాగ్రమూ సంస్కృత భాషామయంగా నడచిన యితని కవితలో సామాన్యంగా మనం వంకలు పెట్టగలిగినదేమీలేదు.

శాసనంలో 70వ శ్లోకం తరువాత "శ్రీకాళహస్తినగ" ఇత్యాదిగా "రాజభామా స్వరేదయా" అన్నంతవరకూ (చూడు శ్రీవిరూపాక్ష శాసనం - 4 వప్లేటు వెనుకభాగం. 15వ పంక్తిలో 6 అక్షరాల తరువాతనుంచి చివరిపంక్తివరకూ) ఉన్న శాసనభాగం సుమారు $5\frac{1}{2}$ పంక్తులు వ్రాతలో మార్పు కనిపిస్తున్నది. శాసనలేఖకుడైన గణపయాచార్యునికి ఏ కొద్దిగానో అనారోగ్యం చెయ్యడంవల్లనో, మరేకారణంచేతనో, యిక్కడ మరొకవ్యక్తి చెక్కినట్లు కన్పిస్తున్నది. గణపయాచార్యుని కుమారుడే చెక్కి వుండవచ్చు. ఈ $5\frac{1}{2}$ పంక్తుల తరువాత తిరిగి గణపయాచార్యుడే చెక్కాడు. అత్యధిక భాగం గణపయాచార్యుడే చెక్కినందువల్ల శాసనం తుదివరకూ అతడే చెక్కినట్లు శాసనంలో పేర్కొనబడింది. శ్రీరామశాసనకర్త రామకవి, శ్రీవిరూపాక్ష శాసనకవితో దీటురాగలిగిన కవిగా కనిపించడు. అం మాత్రంచేత రామకవిని అసమర్థునిగా త్రోసివేయలేము.

## ఉచ్చారణ—లిపి

శ్రీరామ శాసనం సంస్కృతంలో వ్రాయబడిందే అయినా మధ్యలో రెండు తెలుగు వచనాలున్నాయన్న సంగతి లోగడ గుర్తించాము-ఈ రెండు శాసనాలలోనూ ద్విరుక్త మకార వర్ణలేఖన విషయంలో ఒక విశేషాన్ని మనం గుర్తించవలసివున్నది. శీతోష్ణ పరిస్థితులవల్ల, సౌలభ్య అపేక్షవల్ల నిత్యవ్యవహారంలో భాషలో అనేకమైన పరిణామాలు వస్తూవుంటాయి. కొన్నిసందర్భాలలో ఉచ్చారణప్రభావంతో శబ్ద స్వరూపం మారుతూవుంటుంది. ఎంతటి కవులైనా, ఎంతటి శబ్దశాస్త్రవేత్తలైనా, ఛందశ్శాస్త్రవేత్తలైనా యీ ప్రభావానికి లోనవుతూనే వచ్చారు. కొన్నికొన్ని సందర్భాలలో లేఖన ప్రభావంతో-అంటే లిపి స్వరూప ప్రభా,

వంతో భ్రమప్రమాదాలకు లోనుకావడంవల్ల శబ్దస్వరూపం మారిపోయిన సందర్భాలుకూడా వున్నాయి. రేఫతో అన్యహల్సంయుక్తం యేర్పడినప్పుడు, ప్రాచీనకాలంలో రేఫకు మారు వలపలగిలక వ్రాస్తూఉండేవారు. రేఫకు తరువాత హల్లుకు ద్విత్వం కూడా పెట్టేవారు. తొలుత వుచ్చరించవలసిన అక్షరం తరువాతిదిగాను, తరువాత ఉచ్చరించవలసిన అక్షరం తొల్లిటిదిగాను వ్రాసేపద్ధతిలో వలపలగిలక సాంప్రదాయం రూపొందింది. అందువల్ల తొలుత వుచ్చరించవలసిన రేఫ చిహ్నమైన వలపలగిలక తొలుత కాక ఒక అక్షరం తరువాత ఉండడంవల్ల అక్షరాలను చూచి శబ్దాలను చదివే వ్యక్తులు తరువాత ఉన్న వలపలగిలక విషయం మరచిపోయి రేఫలను విడిచి శబ్దాలను వుచ్చరించడం, వ్రాయడం మొదలుపెట్టారు. ఒక అక్షరం తరువాత వున్న వలపలగిలక చిహ్నాన్ని అదే అక్షరపు ద్విరుక్త స్వరూపంగా భావించి ఆ అక్షరాన్ని ద్విత్వంగా మార్చేవారు. కాగా, రేఫతో కూడిన సంయుక్తాక్షరం రేఫరహితమైన ద్విరుక్తాక్షరంగా మార్పుచెందింది. లిపి ప్రభావంతో వచ్చిన ఈ భాషా పరిణామానికి ఈ క్రింది శబ్దాలను మనం ఉదాహరణగా తీసుకొనవచ్చును.

| | | | | | |
|---|---|---|---|---|---|
| కరుకు | — | కక్కుర్‍ | (కర్కు) | — | కక్కు |
| నరుకు | — | నక్కుర్‍ | (నర్కు) | — | నక్కు |
| మొరుకు | — | మొక్కుర్‍ | (మొర్కు) | — | మొక్కు |
| ఒరుగు | — | ఒగ్గుర్‍ | (ఒర్గు) | — | ఒగ్గు |
| తరుగు | — | తగ్గుర్‍ | (తర్గు) | — | తగ్గు |
| కరుగు | — | కగ్గుర్‍ | (కర్గు) | — | కగ్గు |
| అరుగు | — | అగ్గుర్‍ | (అర్గు) | — | అగ్గు(దెబ్బతిను) |
| ఒరుడు | — | ఒడుర్‍ | (ఒర్డు) | — | ఒడ్డు (ఇతరుడు) |
| ఉరియు(పు) | — | ఉప్పుర్‍ | (ఉర్పు) | — | ఉప్పు |
| కార్యము (సం) | | కజ్జర్‍ము | (కర్జము) | — | కజ్జము |
| | | కప్పూర్‍రము | (కర్పూరము) | | కప్పూరము |
| | | కప్పుర్‍రము | (కర్పురము) | | కప్పురము |
| గరుగు (వు) | | గగ్గుర్‍ | (గర్గు) | | గగ్గు |
| తరుచు | | తచ్చుర్‍ | (తర్చు) | | త్రచ్చు—తచ్చు. |

‘తరచు’ శబ్దంలో రకారం తొలి అక్షరం మీదకుసైతం వచ్చి సంశ్లేషత్వాన్ని పొందింది.

ప్రాచీనులు రేఫకు మారుగా వలపలగిలక వ్రాస్తూ తత్పూర్వాక్షరానికి—మరొక అక్షరమున్నదని తెలపడానికో ఊది పలకవలసిన సంయుక్తమని తెలపడానికో-ద్విత్వాక్షరం కూడా పెట్టేవారు. అనగా ‘కర్జము’ అని వ్రాయడానికి మారు ‘కజ్జర్‍ము’ అని ద్విరుక్తాక్షరం తరువాత వలపలగిలకను వారు పెట్టేవారన్నమాట. దీనివల్ల తెలుగు మాటలలోనేకాదు భర్గ—గర్గాది సంస్కృత శబ్దాలలోసైతం రేఫం లోపించి తద్భవాలుగా రేఫ రహిత పదాలు రూపొందాయి. నన్నెచోడాది శివకవులే కాక తదితరకవు లనేకమందికూడా యిటువంటి ప్రయోగాలకు లోనయ్యారు. వాస్తవానికి ఈ రేఫ విలుప్తత్వమన్నది అతిప్రాచీనకాలంలోనే వివిధ ప్రాకృతా

లలో రూపొందినట్లు కన్పిస్తున్నది. పాళీభాష యెప్పటిదో ? ఆ భాషలో ధర్మపథం దమ్మపదం కాలేదా ? అయినప్పుడు వెయ్యి పదిహేనువందలసంవత్సరాల చరిత్రవున్న తెలుగులో రేఫవిలుప్తత్వం జరపడం ఆశ్చర్యకరం కాదు. ఇదే పద్ధతిలో 'తిరుమల' శబ్దంలో స్వరమేకాక రేఫ విలుప్తత్వంతోపాటు లకారం కూడా లోపించి 'తిమ్మ' శబ్దం రూపొందింది. (తిరుమల-తిర్మల-తిమ్మ) కాగా, తిరుమలరాయ నామధారులు తిమ్మరాయలుగాను, తిరుమలాంబలు తిమ్మాంబలుగాను ప్రాచీనకాలంనుంచీ వ్యవహరింపబడుతూ వచ్చారు. ఉచ్చారణ ప్రభావం తోను లిపి ప్రభావంతోనూ కూడా భాషలో మార్పులు వస్తూవుంటాయని, 'ధ్వని-లిపి-పరిణామం' అన్న గ్రంథంలో వివరించాను. ప్రత్యేకించి లిపి ప్రభావంతో జరిగిన కొన్ని పొరపాట్లను (67 పుట మొదలు 72 వ పుట వరకు) ఋ ౠ ఌ చర్చలో వివరించాను.

ద్విరుక్త మకారాన్ని ఉచ్చరిస్తున్నప్పుడు, ఉచ్చారణలో తొలి మకారం పూర్ణానుస్వారంగా మనకు వినిపిస్తుంది. చిన్నపిల్లలకు డిక్టేషను (dictation) చెబుతూ 'అమ్మ, కొమ్మ, కమ్మని కూర' వంటి పదాలు మనంచెబితే, కొందరు ఉచ్చారణలో వినిపించే అనుస్వారాన్ని దృష్టిలో పెట్టుకుని, అంమ్మ, కొంమ్మ, కంమ్మనికూర అని పూర్ణ బిందుయుక్తాలుగా వ్రాయడం కద్దు. ద్విత్వ మకారానికిమారు బిందు పూర్వకమైన మకారాన్ని ప్రాచీనలాక్షణికులే అనేకమంది వ్రాస్తూవుండేవారని, లోగడ నాపరిశోధనా గ్రంథా లలో నిరూపించాను. (చూడు దివ్యప్రభా వివరణ సహితమైన కేతనకృత ఆంధ్రభాషా భూషణానికి నేను వ్రాసిన పీఠిక – 42 వ పుట మొదలు 53 వ పుట వరకు. ప్రాచీన వాఙ్మయంలో వ్యావహారికభాష లేక ధ్వని-లిపి-పరిణామం అన్న నా పరిశోధన గ్రంథంలో 164 వ పుట మొదలు 240 వ పుట వరకు.) ఇటీవల కొందరువిమర్శకులు యీ బిందులేఖనం ఉన్నదనడానికి శాసనాధారాలులేవని విమర్శించారు. శ్రీవిరూపాక్ష శాసనంలో తిమ్మావధాని శబ్దం తింమావధాని (तिमावधानि) అని పూర్ణబిందుయుక్తంగా దేవనాగరిలో ఉల్లేఖించబడింది. (చూడు. శ్రీవిరూపాక్షశాసనం-14వ పేజీ తరువాత 4వప్లేటు (ముందుభాగం)-18పంక్తిచివర). ఇదేవిధంగా శ్రీరామశాసనంలో అమ్మవారికి అని వ్రాయడానికి మారు అంమవారికి (अंमवारिकि) అని విస్పష్టంగా తెలుగుశబ్దం పూర్ణబిందుయుక్తంగా, దేవనాగరలిపిలో ఉల్లేఖించబడింది. (చూడు. శ్రీరామశాసనం-60 పుట తరువాత-4వ ప్లేటు-వెనుకపక్క 5వ పంక్తి ప్రారంభంలో) ప్రాచీన లాక్షణికులలో ప్రామాణికుడుగా యెన్నతగిన అనంతుడు ద్విరుక్తమైన మకారాన్ని ద్విరుక్తమకారంగా పేర్కొనడానికిమారు పూర్ణబిందు పూర్వక మకారంగా పేర్కొన్నాడు. ఇతన్ని అనుసరించిన లాక్షణికులు మరికొందరు కూడా వున్నారు. లాక్ష ణికులైనవారే ద్విత్వ మకారానికిమారు పూర్ణబిందుపూర్వక మకారాన్ని వ్రాసినప్పుడు శాసనకర్తలూ లేఖకులూ వ్రాయడంలో అబ్బురంలేదు.

శ్రీరామశాసనం 60వ పుట తరువాత ఉన్న 4వ ప్లేటు(వెనుకప్రక్క) 6వ పంక్తిలో ఎత్వసహితమైన 'చెరువు' శబ్దాన్ని అత్వసహితమైన 'చరువు' (चरुवु) శబ్దంగా ఉల్లేఖించడం జరిగింది. "రామాభట్ల చరువు సహితం గాను..." అన్నది శాసనప్రయోగం. దేవనాగరిలిపిలోవున్న తెలుగువాక్యంలో యీ 'చరువు' శబ్దం స్పష్టంగా ఉల్లేఖించబడింది. ఇదికూడా సంస్కృతంలోనూ, తెలుగులోనూ ఉన్న తాలవ్య చకార వివక్షను నిశితంగా దృష్టిలో పెట్టుకోనందువల్ల జరిగిన పొరపాటే. ఎత్వానికి తాలవ్యత్వంతోపాటు అంతకుముందే కంఠ్యత్వం కూడా వున్నది. అకారం కంఠగతమేకదా! కాగా ఎకారం కంఠ్యత్వ ప్రాధాన్యాన్ని పొందినపుడు,

కంఠ్యత్వ సాహజాత్యంతో అకారంగా మారడంకద్దు. ఇదేవిధంగా అకారం ఎకారంగా మారడంసైతం కద్దు. జనవ్యవహారంలో చెక్క, చెంప, చెడ్డ, చెద, చెమ్మ, చెర, జెట్టి, జెముడు, జెల, జెష్ట, మొదలైన చెకార, జెకారాలుకల పదాలు చక్క, చంప, చడ్డ, చద, చమ్మ, చర, జట్టి, జముడు, జల, జష్ట మొదలైన పదాలుగా మారతాయి. అందువల్ల తెలుగులో దంత్య తాలవ్య వ్యవస్థ, చకార జకారాలలో తారుమారౌతూ వచ్చింది. సంస్కృతంలోని చంద్ర మొదలైన శబ్దాలను తెలుగులో ఉచ్చారణవశాన ఎకారయుక్తాలుగా "చెంద్రుడు" మొదలైనవిగా వ్రాయడం జరిగేది. అందువల్ల తెలుగు చ-జ లలో సంస్కృత పదాలలో అకార ఎకారాల వ్యవస్థను దృష్టిలో పెట్టుకొని ప్రాచీన లాక్షణికులనేకమంది శబ్ద స్వరూపాన్ని జాగ్రత్తగా వివేచించారు. దీనినిగురించి నా "ధ్వని-లిపి-పరిణామం" గ్రంథంలో (చూడు 253 వ పుట మొదలు 280వ. పుటవరకు) వివరంగా చర్చించాను. ప్రస్తుత శ్రీరామశాసనంలోసైతం ఎత్వసహితమైన చెరువు అత్వసహిత మైన "చరువు"గా ఉల్లేఖించబడింది. ఈ శాసనం తెలుగులిపిలోకాక దేవనాగరిలిపిలో చెక్కబడినందువల్ల సంస్కృతంలో హ్రస్వ ఎకారానికి స్థానంలేనందువల్ల దానికి లిపిస్వరూపంసైతం లేనందువల్ల లోక వ్యవహారంలోని తాలవ్య "చ" కారోచ్చారణను తలకట్టు స్వరూపాన్ని దృష్టిలో పెట్టుకొని-నాగరిలిపిలో "చెరువు" చెక్కే అవకాశంలేక "చరువు" అని తాలవ్య "చ" కారదృష్టితో చెక్కినట్టు కనిపిస్తున్నది. ఏమైనప్పటికీ తెలుగులో తటాకార్థకమై దంత్యచకార యుక్తమైన చరువు శబ్దంలేనందువల్ల దీన్ని సహజమైన చెరువుగానే మనం గ్రహించకతప్పదు. దంత్యతాలవ్యాల ఉచ్చారణతో అక్షరాలు ప్రాచీనకాలంలో తారుమారు చెందాయనడానికి లాక్షణికుల కంఠోక్తులతో యీ శాసన ప్రయోగంకూడా ప్రామాణికమై నిలుస్తున్నది.

## ఛందోఽలంకారాలు

శ్రీవిరూపాక్షశాసనకర్త యీ శాసనకావ్యాన్ని విభిన్నఛందస్సులలో రచించాడు. ఛందశ్శాస్త్ర వేత్తగా సుప్రసిద్ధాలైన అనుష్టుప్-శార్దూల విక్రీడితాది వివిధఛందస్సులను ఉపయోగించాడు. ఇతడు రచించిన 69 శ్లోకాలను 16 రకాలైన ఛందస్సులలో రచించాడు. అవి యివి. 1. అనుష్టుప్ఛందస్సు. 2. ఆర్యాగీతి. 3. ఇంద్రవజ్రావృత్తం. 4. ఉపజాతివృత్తం. 5. ధోధకవృత్తం. 6. పుష్పితాగ్రవృత్తం. 7. పృథ్వీ వృత్తం. 8. మాలినీవృత్తం. 9. రథోద్ధతవృత్తం. 10. వసంతతిలకవృత్తం. 11. శార్దూలవిక్రీడితం. 12. శాలినీవృత్తం. 13. శిఖరిణివృత్తం. 14. స్రగ్ధరావృత్తం. ఈ 14 వృత్తాలనేకాక పేరు తెలి యని రెండు వృత్తాలనుసైతం యీ శాసనకర్త ఉపయోగించాడు. "కందనవోలి" (5వ పుట. 13 శ్లోకం.) "ఉద్గిర" (9వ పుట 32వ శ్లోకం.) "తాండవితోదయో" (11వ పుట 40వ శ్లోకం.) అన్న శ్లోకాలను "భ,ర,న,భ,భ,గ" గణాలతో విరచించాడు. ఈ గణాలున్న వృత్తానికి లక్ష్యమైనంతలో ప్రాచీన లాక్షణికు లెవరూ పేరుపెట్టినట్లు కనిపించదు. ఇది 16వ ఛందమైన "అష్టి" ఛందస్సులోనిది. "అష్టి" ఛందంలో మొత్తం 65,136 వృత్తాలు పుట్టాయి. "భ,ర,న,భ,భ,గ" గణాలున్న ప్రస్తుత వృత్తం "అష్టి" ఛందంలో పుట్టిన వృత్తాలలో 28,019వ వృత్తం.

శ్రీవిరూపాక్ష శాసనంలోని 42వ శ్లోకం (11వ పుట) ఛందోబద్ధమో కాదో సందేహాస్పదంగా ఉన్నది. ఇందులో కొంతభాగం విలుప్తమైనట్లుకూడా కనిపిస్తున్నది. అయితే యిది మాత్రాచ్ఛందమైనా కావాలి. లేదా విషమవృత్తమైనా కావాలి.

178



శ్రీరామ శాసనకర్తయైన రామకవి శ్రీవిరూపాక్ష శాసనంలోని శ్లోకాలనేకం గ్రహించినా తాను స్వయంగాకూడా అనేక శ్లోకాలను రచియించాడు. రామకవి స్వయంగా రచించిన 34 శ్లోకాలను అనుష్టుప్ - ఆర్యాగీతి - ఇంద్రవజ్రావృత్తం - ఉపజాతి వృత్తం - మంజుభాషిణీవృత్తం - వసంతతిలకవృత్తం- వసంతతిలక ఇంద్రవజ్రమిశ్రిత విషమవృత్తం - శార్దూలవిక్రీడితం - ఛందస్సులతో రచించాడు.

శ్రీవిరూపాక్ష శాసనకర్త యీ శాసనకావ్యంలో మొత్తం 13 రకాల అలంకారాలను 31 శ్లోకాలలో వినియోగించాడు. ఈ కవి వాడిన అలంకారాలివి. 1. అతిశయోక్తి. 2. అపహ్నవంచేత ఉత్థాపితమైన ఉత్ప్రేక్షాలంకారం. 3. ఉత్ప్రేక్షాలంకారం. 4. ఉపమాలంకారం. 5. పరికరాలంకారం. 6. యమకాలంకారం. 7. రత్నావళి అలంకారం. 8. రూపకంతోకూడిన ఉదాత్తాలంకారం. 9. రూపకాలంకారం. 10. విరోధాభాసాలంకారం. 11. శ్లేషగర్భవ్యతిరేకాలంకారంతోకూడిన అతిశయోక్త్యలంకారం. 12. శ్లేషతోకూడిన ఉత్ప్రేక్షాలంకారం. 13. శ్లేషాలంకారంతో కూడిన ఉపమాలంకారం.

శ్రీరామ శాసనంలో రామకవి వీటికితోడు అనుప్రాస-విశేషోక్తి-సహోక్తి అలంకారాలు శ్లేషతో కూడిన ఉపమాలంకారమూ విశిష్టంగా ఉపయోగించాడు. శ్రీరామ శాసనంలో 9 రకాల అలంకారాలు మొత్తం యిరవైయైదు సందర్భాలలో ఉపయోగించబడ్డాయి. ఈ తొమ్మిదిరకాలైన అలంకారాలూ యివి. 1. అతిశయోక్తి. 2. అనుప్రాస. 3. ఉత్ప్రేక్ష. 4. ఉపమ. 5. యమక. 6. రూపక. 7. విశేషోక్తి. 8. శ్లేషతోకూడిన ఉపమ. 9. సహోక్త్యలంకారం.

శాసనకవితకూడా కావ్య కవితయేనన్న ప్రాచీన సిద్ధాంతానికి అనుగుణంగా యీ రెండు శాసన కవితలనూ రూపొందించిన - మూడుతరాల వ్యవధిలో సంజనితులైన యీ శాసనకవులిద్దరూ — ఆహ్లాదకరమై ప్రశంసనీయమైన కవితనే రూపొందించారు. శ్రీరామశాసన కవితావైశిష్ట్యం గురించి ప్రత్యేకించి చెప్పవలసింది యేమీలేదు. శ్రీవిరూపాక్ష శాసనకవిత అడుగుజాడలలోనే నడచిన రామకవి శ్రీవిరూపాక్ష శాసనప్రదాత అయిన శ్రీరంగరాయల - అతని పెదతండ్రి - పినతండ్రుల వంశాలను మాత్రమే దృష్టిలో పెట్టుకుని శాసనకావ్య నిర్మాణంలో తన భారాన్ని కొంతవరకూ తగ్గించుకున్నాడు. శ్రీవిరూపాక్ష శాసన ప్రదాతవరకూ ఆ శాసనకర్త రచననే తన శాసనకావ్యంలో ప్రతిబింబింపజేసి ధన్యుడయ్యాడు. ఈ రెండు శాసనాలు క్రీస్తుశకం 1576—1644 సంవత్సరాలలో వెలసినవే అయినా మొత్తం ఆరవీటివంశానికి ప్రతీకలుగా - అనుస్యూతమైనవంశపు జీవనదిగా వెలుగొందుతున్నాయి. వీటివల్ల ఆరవీటివంశానికి చాలా వరకూ ఏకవాక్యత లభిస్తుందనడంలో సందేహంలేదు. ఈ రూపంగా తెలుగుదేశాన్ని పరిపాలించిన విజయ నగరసామ్రాజ్యాధిపతుల వెలుగుజాడలు మనకు దృగ్గోచరం కాగలవు.

వాఙ్మయ మహోధ్యక్ష
వడ్లమూడి గోపాలకృష్ణయ్యా,
కళా-ప్రపూర్ణ

*Joint Dtrector,*
A. P. Govt. Oriental Manuscripts
Library & Research Institute.

హైదరాబాదు,
15-3-1973.

# Sri Virupaksha - Sreerama Copper Plate Inscriptions

## (1576-1644 A.D.)

**Vijayanagar Empire**

## *History of Araveeti Dynasty*

*Research & Criticism*


Vangmayamahadhyaksha

**Dr. Vadlamudi Gopalakrishnaiah**

' Kala-Prapoorna '

## CONTENTS

# Foreword

This book '*Sri Viroopaksha and Srirama*' copper plate inscriptions is the seventh in the series of books published by the Oriental Manuscripts Library and Research Institute, Government of Andhra Pradesh.

The first, a charter known as 'Sri Viroopaksha Inscription' was laid by Srirangarayalu son of Tirumalarayalu in the month of November 1576 A.D. gifting twentyfour villages for the daily worship of Srikalahastiswara. The second charter, known as 'Srirama Inscription' was a gift of a village made by another Srirangarayalu son of Pinavenkatarayalu in the year 1644 A.D. January for the daily worship of Srikalahastiswara and the Goddess there.

These copper plate inscriptions were handed over to the then Director, State Archives on 1st January 1971 by Sri Parasurama Gurukul at Kalahasti and on 2nd January 1971 they were shown to the Special Secretary, Education, Government of Andhra Pradesh, Sri S. R. Ramamurthy at Tirupati. Sri Ramamurthy observed that such valuable inscriptions as these would be very useful for Historians and that they should be published. Thereafter photos of these copper plates were taken by the Director and Sri C. V. S. L. Sastry, working in the O. M. L. & R. I as Research Officer was asked to prepare a manuscript copy of the same. Sri Sastry informed me that, he prepared a manuscript copy and it is handed over to the Director but he never knew what happened to that script. However the then Director of State Archives gave copies of these photos to Sri N. C. S. Venkatacharyulu with a request to prepare a manuscript copy of them, and also write meanings in Telugu and gist of each sloka, and Sri Venkatacharyulu very carefully prepared the copy along with meanings and gist of every sloka.

The Oriental Manuscripts Library and Research Institute could get an opportunity as the Joint Director to conduct my researches into several old works and publish several books. It is all due to the honour and affection of the former Chief Minister of Andhra Pradesh Sri Kasu Brahmananda Reddi. Not only that this Institute could get an opportunity to publish a research work on these copper plate inscriptions giving a lot of hitherto unknown historical facts brought to light by me in this book. There is no doubt, this book will be received with a word of praise by various research scholars as these inscriptions besides containing other matters, occupy a unique place in the history of the country.

As these two inscriptions were in Sanskrit and Devanagari script, the Devanagari version of these scripts is also being published for the benefit of non-Telugu researchers. With the same and in view besides the Telugu version of the research work, an English translation of the same is also being published.

As far as I know, these inscriptions were never published before, nor any research scholars of inscriptions or historians wrote any comments based on these inscriptions. These inscriptions stand as authentic proof for the facts regarding Araveeti Dynasty, right from the ancestors of Araveeti Bukkarayalu with different lineages, till the fall of Vijayanagara empire.

It is mentioned, in my research work that some of the slokas from *Sri Viroopaksha Inscription* were taken by the author of *Sri Rama Inscription* and incorporated them in *Sri Rama Inscription*. However, we find some of these slokas from *Sri Viroopaksha Inscription* in some of the later other inscriptions also (See *Veera Venkatapati Vilapaka Inscription-Epigraphica India*, Volume IV, page 272). There is nothing wrong in taking slokas from older inscriptions as far as the former generations instead of writing something fresh about the old, in order to maintain a single version of facts about the lineage of rulers. Originating three generations of gap between them, these two inscriptions provide us a complete and uninterrupted history of the Araveeti Dynasty and thus, it is needless to say, they occupy a unique place in history.

The original texts of these inscriptions have been published in Telugu and Devanagari scripts verbatim in this book. For the text of each plate of these inscriptions in the Telugu script is printed on one page and in the Devanagari script on the next page line to line as original and its replica. The photo copies of the respective copper plates are printed on the page facing its Devanagari text.

While writing forewords and prefaces to the books *Seetakalyanam*, *Indumati Parinayam* and *Sringara Padams* (all in Telugu,) - *Sri Geeta Govindam*, *Geeta Sankaram* and *Vaikrutachandrika* (in Sanskrit,) *Radha Vamsidhar Vilas Natak* (in Hindi) and *Enugula Veeraswamy's Journal* (in English), I had to do extensive research, mostly at home than in office, sitting through nights sometimes and during my strenuous work at home my wife Mrs. Sasikala helping in many ways and I thank her for the same.

Sri K. Vithal Reddi, Telugu Pandit, Oriental Manuscripts Library and Research Institute must be congratulated for his patience and sincere understanding in writing, while I dictated the scripts of the preface for the book *Enugula Veeraswamy's Journal* and also the present research work.

The introduction I wrote for the book *Radhavamsidhar Vilas Natak*, was translated into Hindi by my dear student Sahitya Ratna, Sri Gurram Subba Rao, M.A., Sri Vadrevu Purushottam helped me extensively in translating into English, my preface to *Enugula Veeraswamy's Journal* and the present research work and

I am indebted to them both. Sri C. V. S. L. Sastry (Research Officer) and Sri V. V. Chary helped me while I was comparing the Telugu version of my research work with the translated version and my congratulation are due to them. I also congratulate to all those employees who worked along with me as Joint Director of Oriental Manuscripts Library and Research Institute.

Our thanks are due to Sri S. R. Ramamurthy, I.A.S., for the keen interest evinced by him to bring to light invaluable old texts and to the revival of our ancient cultural wealth. We are thankful to Dr. N. Ramesan, M. A., Ph.D., I.A.S., for his kind encouragement in the development of Andhra Pradesh Government Oriental Manuscripts Library and Research Institute, to the Assistant Secretary Sri I. Raghunatha Rao. We are also very thankful to Sri D. Kamayya who until his retirement as Deputy Secretary, has shown great enthusiasm. Our hearty congratulations to Sri K. Kesavarao, B.A., B.L., who assumed charge recently as Deputy Secretary, Education Department.

We are grateful to the Andhra Pradesh Text-book Press authorities for taking keen and patient interest in bringing out this book nicely. Our thanks are due to the Deputy Directors Sri G. Ramakrishna Rao and Sri D. Veeramanie who rendered us their invaluable help whenever required.

My hearty congratulations to Sri P. Narayanan, Sri M. R. Sabhapathi, Assistant Directors, Sri V. Gangadharam, Sri K. Narasimha Rao, Sri Y. Sreeramulu and Sri B. James, and others who helped in the printing work of this book.

*Vangmayamahadhyaksha*
VADLAMUDI GOPALAKRISHNAIAH
'Kala-Prapoorna'
*Joint Director*
A.P. Govt. Oriental Manuscripts
Library & Research Institute.

*Hyderabad.*
18-3-1973

# DEDICATION

*I am dedicating*
*this research work with affection*
*to*
*great educationists,*
*large-hearted close friends of mine*

**Sri Lankapalli Bullaiah**
*Vice-Chancellor, Andhra University,*

*and to his wife*

**Smt. Samyukta Bullaiah**

V. Gopalakrishnaiah

# Vijayanagar Empire
# History of Araveeti Dynasty

*Research & Criticism*

Vangmayamahadhyaksha

**Dr. Vadlamudi Gopalakrishnaiah**

'Kala-Prapoorna'

## History of Araveeti Dynasty

Earth is but a little marble in this infinite Universe. When we look at in this perspective of the Universe, man who is born as an infinitesimal particle, is shining with his extraordinary genius. He stands as personification of wisdom beyond the cognizance of the senses. And it is the same human being who endures the life of an insignificant insect exposed to the dangers of being crushed under strain and stresses. This is the same man who can explore into the mysteries of the infinite Universe and the powerful all pervading Sakti which is boundless and timeless.

It is incomprehensible to the human mind to state when the creation started and likewise it is equally incomprehensible to state when the quest for knowledge sprouted in the human mind. The first man came into existence and gradually developed into a society and spread into branches as different races. While some are perishing, new ones are coming into this world and thus man arrived at this multifated state. Though he was in ignorance at one time, he attained the glorious knowledge and shone brilliantly at another time. Even though he attained Sachhidananda Swaroopa by his Paratatwa Gnana which is science to the all sciences. Sometimes he was deprived of his knowledge but yet his quest for knowledge never abated.

As the tribe of man increased many folds and different creeds came into existence, though the mirage like ignorant caste differences came in the way, man enjoyed the fruits of the real knowledge which resulted through his quest for scientific outlook into the inner most mysteries, without any reservations of caste or creed. Though Jainism, Buddhism, Christianity, Islam and several other religions came into existence these religions never attained that supreme state as Hinduism is propounding the real nature of the human soul in its relation with the supreme spirit pervading the Universe. Even in the days of yore researches were going on about not only the matters, materials and five premordial elements but the origin of creation and the nature, shape and other aspects of the supreme being the creator. It is incomprehensible to us today to ascertain except by surmises when these researches started. So many strange things appeared and disappeared in this Universe but the Indian way of thinking that is the science or philosophy that teaches the nature of the real and illusory, stood like a pinnacle of glory because it is a real thinking of the actual state of the supreme being.

### Religion

The so called barriers which we created in the name of religion are impediments to our progress. They are neither dark clouds nor even like bright clouds. They are like mere mirages. Actually speaking religion is not a tight cage in which the human being is being imprisoned to be tormented in different ways. ' Mata ' means axiom which in turn is not merely an empty theory or an erratic theory. Religion is that which guards man. Yet some selfish and avaricious individuals since a few centuries from now interpreted religion in the most irreligious ways which, instead of saving human being started destroying them.

The definition of religion is highly scientific. It reflects the Universe that is an eye opener to all those advocates of different religions, castes and creeds. Jainism is the religion professed by Jaina the

generic name of the chief saints of Jainism—Bhuddhism is the religion professed by Buddha. Similarly Christianity and Islam and other religions first started as the established truths professed by the saints. Just as the Universe is laden with the constellation of stars, meteors and planets—and just as the supremacy of certain planets and stars reigns supreme during certain periods in the infinite time-cycle and wanes afterwards different religious tenets originate, develop and become extinct. This is subject for research pertaining to the system of creation in the light of the celestial sphere. I am now writing an important book on the science of the Universe based on my profound researches in the subject.

### Hindus—Hinduism

If we delve deep into the matter, we can say that Hinduism is not confined to the domain of a particular species of human race. It was stated by many a scholar of yore that those races migrated from Sindhu river basin are called Hindus and that ' Sa ' and ' Dha ' in the word ' Sindhu ' became ' Ha ' and ' Da ' respectively and thus the word ' Hindu ' came into usage. Whether they were Aryans or non-Aryans or a mixed race, people migrated from a particular region were indiscriminately called as Aryans and Hindus and their religion as Hinduism. But the word Hindu does not appear to have originated from the word ' Sindhu '. The first syllable in the word ' Indu ' must have been added ' Ha ' and thus the form of the word ' Hindu ' taken its shape.

According to the sciences of the sages, the inquisitive probing search of our ancestors was beyond the reach of the modern science of Astronomy. It was the science of sciences. Astronomy was but a first step in the probing search of an Indian whose quest into the secrets of the Universe was deep. There are several solar families in this eternal Universe says the sage and he is the real vedic sage who can say ' Dasa Diso Nana Suryah ' and ' Surya Ekaki Charati—Chandra majjayate punah ' which means that Sun is self lustrous and that Sun himself is born as Moon. Thus the Vedic sage proclaimed to the world the independent status of the Sun and the self lustreless character of the Moon and this is but like an atom in his vast knowledge of the Universe. Earth is moving round itself and is also revolving round the Sun. Like wise Moon is moving round itself and is revolving round the Earth and Sun also. The great Indian scientists of the yore recognised the importance of Moon to the lives of the human beings and the inseparable relation between the Moon and the human beings, started reckoning their time as Lunar Calendar. It is easier to recognise the movement of the Moon than the movement of the Sun throughout the year and know it easily. Vedic astronomers said "Chandramamanaso jatah" (Moon is like heart) and Moon is the enkindler of the heart. So, our ancients recognised the power of the Moon and Moon's influence on the hearts of humans and their minds and other organs and ultimately on their lives. Even modern scientists propounded recently that as the influence of Moon will reflect on the minds and lives of the human beings because Moon is effected by the influence of planets like Saturn etc. Our ancients made extensive researches into the rays of Moon and moonlight and thus they said that there is nectre in the rays of Moon. Thus it is not only because of the Moon's moving round the Earth, and not because of the reckoning of time by Moon but also because of the indivisible character of Moon in the lives of humans and the Moon's natural growth in the nature, the word 'Indu' pertaining to Moon and our ancestors attributed it to either the axiom or the race and called ' Indumata ' 'Indu JATI'. Later the word ' Indu ' might have transformed into ' Hindu ' with an elongation ' Hindoo '.

When there are several other names attributed to Moon, we may get a doubt naturally why our ancestors chose Indu. The word Indu is based on 'Ina' 'Indu' (Moon) shines because of ' Ina ' (Sun) and

తిరుమలరాయలు కంచి, శ్రీరంగము, తిరుపతి, అహోబిలము మున్నగు దేవస్థానములయందును, తీర్థములయందును తిరిగి తిరిగి ధర్మశాస్త్రములచే చెప్పబడిన ఉపదానము లన్నిటితోను సమముగా బంగారు తులాభారము మొదలైన దానములను అధికమైన శ్రేయస్సుకొరకు విధివిధానముగా విస్తరింపజేసెను.

స్రగ్ధరావృత్తము.

31. అనంతరం-తరువాత, తత్తనయః-ఆ తిరుమలరాయల కుమారుడు (అయిన), శ్రీరంగరాయః-శ్రీరంగరాయలు, హస్తాపజితస్రుశాఖీ-హస్తముచే జయింపబడిన కల్పవృక్షముకలవాడును, శ్రితభాగధేయః-ఆశ్రితులకు భాగ్యమైనవాడును, శ్రీ వేంగలాంబా చిరపుణ్యారాశిః-శ్రీ వేంగలాంబ చిరకాల మార్జించిన పుణ్యములకు రాశీభూతుడైనవాడును (అయి), ప్రతీతః-ప్రసిద్ధుడై, చకాస్తి-ప్రకాశించుచున్నాడు.

తరువాత తిరుమలరాయల తనయుడైన శ్రీరంగరాయలు రాజ్యమునకు వచ్చెను. అతడు ఆశ్రితులకు భాగ్యమైనవాడై తన దానహస్తముచేత కల్పవృక్షమును జయించెను. అతడు వేంగలాంబ చిరకాల మార్జించిన పుణ్యములకు రాశియైనవాడు.

ఉపజాతివృత్తము-రూపకము.

32. యః-ఏ శ్రీరంగరాయలు, ఉద్దగిరౌస్థితః-ఉద్దగిరియందుండినవాడై, దుర్గమ కొండవీడు వినికొండ పుర ప్రముఖాన్-దుర్గమములైన కొండవీడు వినికొండ అను ప్రముఖములైన పట్టణముల, దుర్గచయాన్-దుర్గసమూహములను, పరివిజిత్య-జయించి, భూవలయైకరత్న పెనుగొండపురే-భూవలయమున ఒకేయొక రత్నముగానున్న పెనుగొండ పట్టణమున, వసన్-నివసించుచు, సమగ్ర మకరాదిమ లాంఛనతః-సంపూర్ణములైన మకరాది లాంఛనములతో, రాజతి-ప్రకాశించుచున్నాడు.

ఉద్దగిరియందుండి సాధింప శక్యముకాని కొండవీడు, వినికొండ మొదలగు దుర్గసమూహములను జయించి భూమండలమునకు నాయకమణియైన పెనుగొండ పట్టణమున నివసించుచు, సంపూర్ణములైన మకరాది లాంఛనములతో ప్రకాశించుచున్నాడు.

వృత్తనామము తెలియదు.

33. యస్య-ఏ శ్రీరంగరాయలకు, తిరుమలదేవీ-తిరుమలదేవియు, కృష్ణాంబాచ-కృష్ణాంబయు (అనెడి), తే దేవ్యౌ-ప్రసిద్ధురాండ్రైనదేవేరులు, శౌరేః-విష్ణుమూర్తికి, శ్రీ-లక్ష్మీదేవియు, ధరణీ-భూదేవియు, ఇవ-వలెను, శిశిరకరస్య-చంద్రునకు, రోహిణీ చిత్రే ఇవ-రోహిణి, చిత్రలవలెను, విజయేతే-ఒప్పుచున్నారు.

ఆ శ్రీరంగరాయలకు విష్ణుమూర్తికి శ్రీదేవి, భూదేవివలెను, చంద్రునకు రోహిణి చిత్రలవలెను, తిరుమలదేవి, కృష్ణాంబ అను ఇరువురు భార్య లొప్పుచుండిరి.

ఆర్యాగీతి. ఉపమాలంకారము.

34. యథావిధి-శాస్త్రముననుసరించి, మహీసురోత్తమ కృతాభిషేకోత్సవే-భూసురోత్తములచేత చేయబడిన అభిషేకోత్సవమున, యదీయ కరవారిదం-ఎవనిచేయి యనెడి మేఘము, సర్వతః-అంతటను, కనకవృష్టిదం-బంగారువర్షము నిచ్చునది (యయ్యెనో), యశోమయతరంగిణీం-కీర్తియనెడినది, దశదిగంతరే-పదిదిక్కుల నడుమను, జృంభతే-విజృంభించుచున్నదో, సతాం-మంచివారియొక్క, కృపణతోరుదావానలః-దారిద్ర్యమనెడి గొప్ప దావాగ్ని, ప్రశమితః-చల్లార్పబడినది, అభవత్-అయ్యెనో.

శ్రీ రంగరాయలకు బ్రాహ్మణశ్రేష్ఠులు శాస్త్రముననుసరించి పట్టాభిషేకము చేసిరి. అప్పుడు ఆ రాజు చేయి అనెడి మేఘము అంతటను బంగారము వర్షించెను. ఆయన కీర్తియనెడి నది దశదిశలనడుమను విజృంభించెను. మంచివారి దారిద్ర్యమనెడి దావానలము చల్లార్పబడెను.

పృథ్వీవృత్తము. రూపకాలంకారము.

35. సరోజాసనః-బ్రహ్మ, ఆశానాగకులాచలేంద్రఫణిరాడంశైః-దిగ్గజములయొక్కయు, కులపర్వతములయొక్కయు, ఆదిశేషునియొక్కయు అంశములచేత, భవ్యే-పవిత్రమైన, భుజే-భుజమునందు, అవికలం-వికలముకాని, అశేషం అపి-సమస్తమైన, ధాత్రీభారం-భూభారమును, వ్యాతనోత్-ఉంచెను, వీరశ్రీరమమాస్యథస్య పరయావిక్రాంతిమానేపకిం-(అన్వయము కుదురుటలేదు), సదా-ఎల్లప్పుడు, దానాంభః-దానజలము (మదజలము)ను, కాంచనమయంకటకంచ-బంగారుకటకమును (కంకణము, పర్వతసానువు), భోగితాం-భోగిత్వమును (భోగముకలిగియుండుటను, పడగలుకలిగియుండుటను), ధత్తే-ధరించుచున్నాడు.

శ్రీ రంగరాయలు దానజలమును, సువర్ణకటకమును, భోగిత్వమును కలిగియున్నాడు. దానాంభస్సు, కటకము, భోగిత్వము అను పదములకు వరుసగా మదజలము, పర్వతసానువు, పడగలుగలిగియుండుట అను అర్థములు కూడ నుండుటచే దిగ్గజములు, కులపర్వతములు, ఆదిశేషుడు-వీనియొక్క అంశలు శ్రీ రంగరాయలలో నున్నట్లు కవి కల్పించినాడు. బ్రహ్మదేవుడు ఈ అంశలను గమనించి భూభారమంతయు ఈ అంశలచే పవిత్రమైన అతని భుజమున ఉంచినాడట.

శార్దూలవిక్రీడితవృత్తము. శ్లేషతోకూడిన ఉత్ప్రేక్ష.

36. యస్మిన్-ఏ, ఏకవీరే-ఏకైకవీరుడైన శ్రీరంగరాయలు, ధరిత్రీం శాసతి-భూమినిపరిపాలించుచుండగా, కార్ష్ణ్యం-నల్లదనము, ఏణాక్షీణామేవ-లేడికనులుగలస్త్రీలకే, విలగ్నం-అంటియున్నదో, కౌటిల్యం-వక్రత్వము, తత్కుంతలే-వారి శిరోజములందు, కర్కశత్వం-కఠినత్వము, తద్వక్షోజే-వారి స్తనములయందు, చాపలం-చాపల్యము, తత్కటాక్షే-వారి కడగంటిచూపులలోను, విలగ్నం-అంటుకొనియున్నదో.

శ్రీ రంగరాయలు ఏకవీరుడై రాజ్యము చేయుచుండగా నలుపు హరిణాక్షులనే అంటియుండెను. వక్రత్వము వారి వెంట్రుకలనే ఆశ్రయించెను. కఠినత్వము వారి స్తనములయందే ఉండెను. చాపల్యము వారి కడగంటి చూపులయందే ఉండెను.

శాలినీ వృత్తము.

37. వారాశిగాంభీర్యవిశేషధుర్యః-సముద్రముయొక్క గాంభీర్యవిశేషభారమును వహించినవాడు, చౌరాశిదుర్గైకవిశాలవర్యః-ఎనుబదినాలుగుదుర్గములను సాధించినవాడును, శార్ఙ్గధరాంతరంగః-శార్ఙ్గధరుడైన విష్ణుమూర్తి అంతరంగమునగలవాడును (అందువలననే), పరాష్టదిగ్రాయ మనః ప్రకామ భయంకరః-శత్రువులైన అష్టదిక్కులనుండురాజుల మనస్సులకు మిక్కిలి భయము కలిగించువాడు.

శ్రీ రంగరాయలు సముద్రమువలెగంభీరుడు. ఎనుబదినాలుగు దుర్గములు సాధించినవాడు. శార్ఙ్గధరుడైన విష్ణువును ధ్యానించువాడు. అష్టదిక్కులయందలి శత్రురాజుల మనస్సులకు భయము కలిగించువాడు.

ఉపజాతివృత్తము. పరికరాంకురాలంకారము.

38. హతరిపుః-శత్రువులను సంహరించినవాడు, యాచకానాం-యాచకులకు, అనిమేషానోకహః-కల్పవృక్షమైనవాడు, మహిత చరిత ధన్యః-గొప్ప నడవడిచేత ధన్యుడైనవాడు, హోసబిరుదర గండః-హోసబిరుదర గండడు (బిరుదు), రాయ రాహుత్త మిండః-రాయరాహుత్తమిండడు (బిరుదు), మన్నియాన్నాములాది ప్రకటితబిరుద శ్రీ-మన్నియాన్నాములు మొదలైన ప్రసిద్ధములైన బిరుదముల శోభచేత, పాటితారాతిలోకః- శత్రుసమూహమును చీల్చినవాడు.

శ్రీ రంగరాయలు శత్రువులను నాశనము చేసినవాడు. యాచకులకు కల్పవృక్షము, గొప్ప నడవడిచేత ధన్యుడైనవాడు, హోసబిరుదరగండడు, రాయరాహుత్తమిండడు, మన్నియాన్నాములు మొదలైన ప్రసిద్ధ బిరుదుల శోభచే శత్రువులకు బాధకలిగించినవాడు.

మాలినీవృత్తము. రూపకము.

39. అయం-ఈ శ్రీ రంగరాయలు, నతానాం-నమస్కరించినవారికి, ఉభయదల పితామహః-ఉభయపక్షములవారికిని బ్రహ్మదేవునివంటివాడు (వారి నొసటివ్రాతను మార్చగలవాడు), రిపూణాం-శత్రువులకు, అభయపదార్పణతత్పరః-అభయమైన స్థానమును ఇచ్చుటయందు ఆసక్తిగలవాడు, అవహాలు రాయమానమర్దీ ఇతి-అవహాలురాయుని గర్వమును భంజించినవాడు అని, అఖిల జనైః- జనులందరి చేత, అభిధీయమానధామా-పొగడబడుచున్న తేజస్సుగలవాడు.

శ్రీరంగరాయలు నమస్కరించుచో ఉభయపక్షములవారి నొసటి వ్రాతల మార్పగల బ్రహ్మదేవుడు. శత్రువుల కభయమిచ్చుట యందాసక్తుడు. అదహాలురాయని గర్వమును భంజించినవాడని పొగడ్త పొందినవాడు.

పుష్పితాగ్రావృత్తము. రూపకము

40. బిరుదమన్యర గండతయా-బిరుదమన్యరగండడు అగుటచేత, తాండవితోదయః-తాండవము చేయుచున్న అభ్యుదయము కలవాడు, సేందు బలోత్కలేంద్ర జయపండిత వీరయుతః-ఇందుబలముతో కూడిన ఉత్కలరాజును జయించుటలో నేర్పుగల వీరత్వము కలవాడు, చండిమశాలి బాహుబల దండిత వైరిగణః-ప్రచండ భుజబలముచేత శత్రు సమూహములను దండించినవాడు, గూలియమన్య వీరపులిమాన్య మహాబిరుదః-గూలియమన్య వీరపులి అనెడి గౌరవింపదగిన గొప్ప బిరుదు కలవాడు.

బిరుదమన్యర గండడగుటచేత గొప్పఅభ్యుదయము కలవాడు. ఇందుబలముతో కూడిన ఉత్కలేంద్రుని గొప్పపరాక్రమముచే జయించినవాడు, ప్రచండ బాహుబలముచే శత్రుసమూహమును దండించినవాడు, గూలియమన్య వీరపులి అను గొప్పబిరుదు కలవాడు.

41. సారవీర రమయా సముల్లసన్-బలమైన వీరసంపదతో పొంగులువారుతున్నవాడు, ఆరవీటి పుర హారనాయకః-ఆరవీటిపురమను హారమునకు నాయకమణియైనవాడు, కుండలీశ్వర మహాభుజః-శేష సర్పమువంటి గొప్ప భుజము కలవాడు, మండలీక ధరణీ వరాహతాం-మండలీకభూమికి వరాహత్వమును, శ్రయన్-ఆశ్రయించినవాడు.

గొప్పపరాక్రమముచే పొంగులువారుచున్నవాడు, ఆరవీటిపురమనెడి హారమునకు నాయకమణియైనవాడు, శేషసర్పమువంటి గొప్పభుజము కలవాడు, మండలీకభూమిని ఉద్ధరించుటలో వరాహావతారమైనవాడు.

రథోద్ధతవృత్తము. ఉపమ, రూపకము

42. రాజ్ఞాం వరః-రాజులలో శ్రేష్ఠుడు, రణముఖ రామభద్రః-యుద్ధముఖమున రామభద్రునివంటివాడు, ఇతి-అని, శ్రుతః-పేరుపొందినవాడు, నానావర్ణ శ్రీమండలీక గండః ఇతి-నానావర్ణ శ్రీమండలీక గండడు అని, వణితబిరుదః-వక్కాణింపబడిన బిరుదు కలవాడు.

శ్రీరంగరాయలు రాజులలో శ్రేష్ఠుడు. యుద్ధముఖమున శ్రీరామునివంటివాడని పేరు పొందినవాడు. మండలీకగండడని వక్కాణింపబడిన బిరుదము కలవాడు.

ఛందోబద్ధముకాదు. వ్రాతలో కొంతభాగము మరచిపోవుటచే ఈ రూపమున నుండియుండును.

43. ఆత్రేయ గోత్రజానాం-ఆత్రేయగోత్రమున పుట్టిన, భూభుజాం-రాజులలో, అగ్రసరః-శ్రేష్ఠుడు, ఉదారయశాః-గొప్పకీర్తిగలవాడు, అతిబిరుద తురగఘట్టః-మిక్కిలి పేరుపొందిన గుఱ్ఱములను లోబరచుకొన్నవాడు, మతిగురుః-బుద్ధికి బృహస్పతి, ఆరట్ట మగధ మాన్య పదః-మహారాష్ట్ర మగధము లలో గౌరవించదగిన పదవి కలవాడు.

ఆత్రేయ గోత్రమున పుట్టినరాజులలో శ్రేష్ఠుడు, గొప్పకీర్తికలవాడు, ఎంతపొగరు గుఱ్ఱములనైనను వశము చేసుకొనగలవాడు, బుద్ధికి బృహస్పతి, మహారాష్ట్రులకు, మగధులకు కూడ గౌరవించదగిన పదవికల వాడు.

ఆర్యాగీతి.

44. శల్యారినీతిశాలీ-ధర్మరాజునీతివంటి రాజనీతి గలవాడు, కల్యాణపురాధిపః-కల్యాణపురమునకు అధిపతి, కలాచతురః-కళలయందు నేర్పరి, చాలిక్క చక్రవర్తీ-చాళుక్య చక్రవర్తి, మాణిక్య మహాకిరీట మహనీయః-మణులతో పొదిగిన గొప్పకిరీటముచేత శోభించువాడు.

రాజనీతిలో ధర్మరాజు వంటివాడు, కల్యాణపురమునకు అధిపతి, కళలయందు నేర్పరి, చాళుక్య చక్రవర్తి, మణులు పొదిగిన కిరీటముచే శోభిల్లువాడు.

ఆర్యాగీతి.

45. ఏ బిరుదరాయరాహుత వేశ్యైక భుజంగ బిరుదరమణీయః-ఏ బిరుదరాయ రాహుత వేశ్యైక భుజంగుడను బిరుదుచే శోభిల్లువాడు, ఒడ్డియరాయదిశా పట్టబిరుద ఘోషేణ-ఒడ్డియరాయ దిశాపట్ట బిరుదము యొక్క ఘోషణచేత, రమ్యోరుకీర్తిః-రమ్యమైన గొప్పకీర్తి గలవాడు.

ఏ బిరుద రాయరాహుత వేశ్యాభుజంగుడని, ఒడ్డియరాయదిశాపట్టుడని బిరుదములు ధరించి గొప్పకీర్తి వహించినవాడు.

ఆర్యాగీతి.

46. ఓషధి పత్యుమాయిత గండః- చంద్రబింబమువంటి చెక్కిలిగలవాడు, తోషణరూపజితాసమకాండః-ఆనందముకలిగించు రూపముచేత మన్మథుని జయించినవాడు, భాష గె తప్పువరాయర గండః-ఆడితప్పిన రాజులను దండించినవాడు (బిరుదు), పోషణ నిర్జరభూ నవఖండః-పోషించిన నెల్లూరుసీమయను నూతన రాజ్యఖండము గలవాడు.

చంద్రబింబమువంటి చెక్కిలిగలవాడు, ఆనందముకలిగించు రూపముచేత మన్మథుని జయించినవాడు, ఆడితప్పినరాజులను దండించినవాడు, నెల్లూరిసీమను కలుపుకొని ఏలినవాడు.

ధోధకవృత్తము. ఉపమాలంకారము.

47. రాజాధిరాజః-రాజాధిరాజు, తేజస్వీ-తేజస్సుకలవాడు, శ్రీ రాజపరమేశ్వరః-శ్రీ రాజ పరమేశ్వరుడు, (బిరుదు), మూరురాయరగండాంకః-మూరురాయరగండడను బిరుదుకలవాడు, మేరులంఘియశోభరః-మేరుపర్వతమును దాటుచున్న గొప్ప కీర్తికలవాడు.

రాజాధిరాజు, తేజస్సుగలవాడు, రాజపరమేశ్వరుడు, మూరురాయరగండడను బిరుదు కలవాడు, మేరుపర్వతమును దాటుచున్న గొప్ప కీర్తికలవాడు.

అనుష్టుప్ శ్లోకము.

48. పరదారేషువిముఖః-ఇతరులభార్యలయెడ విముఖుడు, పరరాయ భయంకరః-శత్రురాజులకు భయముగొలుపువాడు, శిష్టసంరక్షణపరః-సజ్జనులను రక్షించుటయందు ఆసక్తికలవాడు, దుష్టశార్దూలమర్దనః-దుర్జనులనెడి పెద్దపులులను చంపువాడు.

శ్రీ రంగరాయలు పరులభార్యలయెడల విముఖుడు, శత్రురాజులకు భయంకరుడు, శిష్టరక్షణమున ఆసక్తికలవాడు, దుష్టులనెడి పెద్దపులులను మర్దించువాడు.

అనుష్టుప్ శ్లోకము.

49. హిందరాయసురత్రాణః-హిందరాయసుల్తాన్ అను బిరుదుకలవాడు, సింధురాజ గభీరధీః-సముద్రమువలె గంభీరమైన బుద్ధికలవాడు, అరీభగండభేరుండః-శత్రువులనెడి ఏనుగులకు గండభేరుండమైనవాడు, హరిభక్తిసుధానిధిః-హరిభక్తియనెడి అమృతమునకు నిధియైనవాడు.

హిందరాయసుల్తాన్ అను బిరుదు కలవాడు, సముద్రమువలె గంభీరమైన బుద్ధి కలవాడు, శత్రువులనెడి ఏనుగులకు గండభేరుండమైనవాడు, హరిభక్తి యనెడి అమృతమునకు నిధియైనవాడు.

అనుష్టుప్ శ్లోకము, రూపకము.

50. ఇత్యాదిబిరుదైః-ఈ మొదలైన బిరుదులచేత, నిత్యం-ఎల్లప్పుడును, కలితాంజలి బంధయా-అంజలి పట్టియున్నదై, జయజీవేతి వాదిన్యా-జయ, జీవ అని పలుకుచున్నదైన, వందితత్యా-వందిగణముచేత, అభిష్టుతః-పొగడబడినవాడు.

పైన చెప్పబడిన బిరుదులతో అంజలిబంధము పట్టి జయ, జీవ అని ఘోషించుచున్న వందిగణముచే ఎల్లప్పుడును పొగడబడినవాడు.

అనుష్టుప్ శ్లోకము.

51. ప్రతీహారపదంప్రాప్తైః-హజారమున చేరిన, కాంభోజ భోజ కాళింగ మరహాటాదిపార్థివైః-కాంభోజము, భోజము, కాళింగము, మహారాష్ట్రము మొదలైన దేశముల రాజులచే, ప్రస్తుతస్తుతి ఘోషణః-చేయబడుచున్న పొగడ్తలఘోష కలిగినవాడు.

హజారమున చేరిన కాంభోజ భోజ కాళింగ మహారాష్ట్రాది రాజులు శ్రీ రంగరాయలను స్తుతించుచుండగా గొప్ప సందడి అయ్యెను.

అనుష్టుప్ శ్లోకము.

52. సః అయం శ్రీ రంగరాయ క్షితిపతి తిలకః-ఆయీ శ్రీ రంగరాయరాజేంద్రుడు, రత్నసింహాసనస్థః-రత్నసింహాసనమున నున్నవాడై, కీర్త్యా-కీర్తిచేతను, నీత్యా-రాజనీతిచేతను, నృగనలనహుషాన్-నృగనల నహుష చక్రవర్తులను, అథ-ఇంకను, అవన్యాం-భూమియందు, అన్యాన్ అపి-ఇతరరాజులనుకూడ, నిరస్యన్-నిరసించుచు, ఆసేతోః ఆసుమేరోః-సేతువునుండి మేరువువరకు, అవనిసురనుతః-బ్రాహ్మణులచే పొగడబడినవాడై, ఆచ ఉదయాద్రేః-ఉదయపర్వతమునుండి, ఆపాశ్చాత్యాచలాంతాత్-పడమటికొండ చివరివరకు, అఖిలహృదయం ఆవర్జ్య-అందరిహృదయమును ఆకట్టుకొని, స్వైరం-స్వేచ్ఛగా, రాజ్యం ప్రశాస్తి-రాజ్యమేలుచున్నాడు.

అట్టి యీ శ్రీ రంగరాయరాజేంద్రుడు రత్నసింహాసనమున నున్నవాడై, కీర్తిచేతను, రాజనీతి చేతను, నృగ నల నహుష చక్రవర్తులనేకాక భువిలోనున్న ఇతరరాజులను కూడ నిరసించుచు సేతువునుండి మేరువువరకు అంతటను బ్రాహ్మణులచే పొగడబడినవాడై ఉదయాద్రినుండి పడమటికొండ చివరివరకు అందరి హృదయమును ఆకట్టుకొని స్వేచ్ఛగా రాజ్యమేలుచున్నాడు.

స్రగ్ధరావృత్తము.

53. క్రమాత్-క్రమముగా, *వసునిధివేదేందుగణితే*-1498 వ, శ్రీ శకాబ్దే-శాలివాహనశకవత్సరమున శ్రీధాతృనామకే వర్షే-ధాతనామసంవత్సరమున, కార్తికనామని మాసి-కార్తికమాసమున.

1498 వ శాలివాహన శకవత్సరమున ధాతనామసంవత్సరము కార్తికమాసమున.

అనుష్టుప్ శ్లోకము.

54. వలక్షే పక్షే-శుక్లపక్షమున, పుణ్యాయామ్-పుణ్యకరమయిన, ఉత్థాన ద్వాదశీతిథౌ-క్షీరాబ్ధి ద్వాదశినాడు, సర్వసంపద్విధాయిని-ఎల్లసంపదలనుగలిగించు, రామచంద్రస్య సన్నిధౌ-రామచంద్రుని సన్నిధియందు.

శుక్లపక్షమున పుణ్యాకరమైన క్షీరాబ్ధి ద్వాదశినాడు సర్వ సంపదలు కలిగించెడి రామచంద్రుని సన్నిధియందు.

అనుష్టుప్ శ్లోకము.

55. కౌండిన్య గోత్ర కలశ సరిదీశ సుధాంశవే-కౌండిన్య గోత్ర మను క్షీరాబ్ధికి చంద్రుడైన వానికి, విజ్ఞాత నిగమాంతర్థ దరాపస్తంబ సూత్రిణే-వేదాంతార్థ మెరిగిన శ్రేష్ఠమైన ఆపస్తంబ సూత్రునకు.

కౌండిన్య గోత్రునకు, వేదాంతార్థ మెరిగినవానికి, ఆపస్తంబ సూత్రునకు.

అనుష్టుప్ శ్లోకము.

56. యజుశ్శాఖావతామ్ - యజుశ్శాఖ నవలంబించు వారిలో, అగ్రయాయినే - శ్రేష్ఠునకు, షట్కర్మసంతతోపాత్త నర్మణే-యజన యాజ నాధ్యయ నాధ్యాపన దాన ప్రతిగ్రహములను షట్కర్మల యాంతర్యము నెల్లప్పుడును గ్రహించినవానికి, వేదవర్మణే-వేదములు కవచముగా గలవానికి.

యజుశ్శాఖాధ్యాయులలో శ్రేష్ఠునకు, షట్కర్మనిరతునకు, వేదములు కవచముగాగలవానికి.

అనుష్టుప్ శ్లోకము. రూపకము

57. వివిధాగమనిర్ణీతి విబుధాధిప మంత్రిణే-వివిధములైన ఆగమార్థముల నిర్ణయించుటలో బృహస్పతివంటివానికి, సరోజాక్ష పదాంభోజ సంసక్తాత్మీయ చేతసే-విష్ణుదేవుని పాదపద్మములయందు లగ్న మయిన చిత్తముగలవానికి.

వివిధములయిన ఆగమార్థములను నిర్ణయించుటలో బృహస్పతియైనవానికి, విష్ణుదేవుని పాద పద్మములయందు లగ్నమయిన చిత్తముగలవానికి.

అనుష్టుప్ శ్లోకము. రూపకము.

58, 59. అకారణవచః కేళికాననాంతర కేకినే - కారణములేని వాగ్వ్యవహారమున వనమయూరమువంటివానికి, యాదాటి ఖ్యాత నరసావనీంద్రస్య మనీషిణః-బుద్ధిమంతుడయిన యాదాటి నరసభూపాలునియొక్క, పౌత్రాయ-మనుమనికి, ధీమతే-బుద్ధిమంతునికి, తిమ్మావధాని వరసూనవే-తిమ్మా వధాని కుమారునికి, శాంత్యాదిగుణశాలినే-శాంత్యాది గుణములుగలవానికి, శ్రీలక్ష్మీపతిభట్టాయ-శ్రీ లక్ష్మీపతి భట్టునకు.

నిశ్చలమైన సంభాషణలో వనమయూరమువంటివానికి, బుద్ధిమంతుడయిన యాదాటి నరస భూపాలుని (కరణము) యొక్క మనుమనికి, బుద్ధిమంతునకు, తిమ్మావధాని పుత్రునకు, శమదమాది గుణములుగలవానికి, శ్రీలక్ష్మీపతి భట్టునకు,

రెండు అనుష్టుప్ శ్లోకములు.

60. విఖ్యాత శ్రీచంద్రగిరి రాజ్యే-ప్రసిద్ధమయిన చంద్రగిరి రాజ్యమున, వాసమ్-నివాసమును ఉపాశ్రితమ్-ఆశ్రయించిన వానిని, పడనాడు స్థలేచ-పడనాడుసీమలోను (వడనాడా? పలనాడా ?), ఔత్స సీమాయామ్ అపి-ఔత్ససీమయందును, విశ్రుతమ్- పేరుపొందినవానిని.

ప్రసిద్ధమయిన చంద్రగిరి రాజ్యమున నివాసమేర్పరచుకొనిన వానిని, పడనాడు సీమలోను, ఔత్స సీమలోను ప్రసిద్ధుడయిన వానిని.

ఇక్కడ చతుర్థీ విభక్తికి బదులు ద్వితీయా విభక్తి వచ్చుటచే ఈ శ్లోకము అనన్వితముగా ఉన్నది. అనుష్టుప్ శ్లోకము.

61. నాడుకాడు గ్రామవర సీమాంతారచితస్థితేః-నాడుకాడు అను గ్రామపు సరిహద్దుననున్న, ప్రఖ్యాతామ్రవణతుద్రనద్యాః ప్రాచీమితం దిశమ్-ప్రసిద్ధమైన మామిడితోపు దగ్గరి ఏటికి తూర్పు దిక్కున.

నాడుకాడు గ్రామము సరిహద్దుననున్న మామిడి తోపుదగ్గరి ఏటికి తూర్పున.

అనుష్టుప్ శ్లోకము.

62. (కం ?)పిలిశ్రీపాలయాఖ్య గ్రామ సీమాంచల స్థితాత్-(కం?) పిలి శ్రీపాలయమను గ్రామపు సరిహద్దుననున్న, అశ్వత్థధరణీరుహాత్-రావిచెట్టునుండి, ఆగ్నేయీందిశమ్ ఆయాతమ్-ఆగ్నేయ దిక్కుననున్నది.

(కం ?)పిలిశ్రీపాలయమను గ్రామమునకు సరిహద్దుననున్న రావిచెట్టునకు ఆగ్నేయదిక్కున నున్నది.

అనుష్టుప్ శ్లోకము.

63. ప్రథితాందలమాలాఖ్య గ్రామసీమాంచల స్థితిమ్ యాంత్యాః-ప్రసిద్ధమయిన అందలమాల యను గ్రామపు సరిహద్దుననున్న, లవణ కుల్యాయాః దక్షిణ స్యాందిశి స్థితమ్-ఉప్పు చేరుకు దక్షిణముననున్నది.

అందలమాల గ్రామ సరిహద్దులోని ఉప్పు చేరుకు దక్షిణమున నున్నది.

అనుష్టుప్ శ్లోకము.

64. రాజల్లవణమూలశ్రీతరంగిణ్యాశ్చ-ఒప్పుచున్న ఉప్పుటేరు ముఖ్యనదికిని, నైర్ఋతమ్-నైర్ఋత దిక్కున నున్నది. ప్రతీతిగాత్-ప్రసిద్ధమయిన, పారావారాత్-సముద్రమునుండి, పశ్చిమాశాసమాయాతమ్-పడమటి దిక్కుగా నున్నది.

ఉప్పుటేరు మూలనదికి నైర్ఋతి *దిక్కున* నున్నది. సముద్రమునకు *పడమటి దిక్కున* నున్నది.

అనుష్టుప్ శ్లోకము.

65. చకాసతః దుగ్గరాజఖ్యాత పట్టణ గ్రామస్య-ప్రకాశించుచున్న దుగ్గరాజపట్టణ గ్రామమునకు, సీమాంతే-సరిహద్దున, చిప్పలపొట్టి గుల్మతః-చిప్పలపొట్టి *గుల్మ*మునకును, మనోహరాత్-అందమయిన, కేతకి శ్రీగుల్మాత్ అపి-మొగలి *గుల్మ*మునకును, దక్షిణస్మాత్-*దక్షిణమున* నున్నది.

దుగ్గరాజ పట్టణగ్రామపు సరిహద్దున చిప్పలపొట్టిగుల్మమునకును, మొగలి గుల్మమునకును *దక్షిణమున* నున్నది.

అనుష్టుప్ శ్లోకము.

66-67. ఖ్యాతిమ్ పయుషః-పేరుపొందిన, పీలిగుంచలపోట్యాఖ్య గుల్మాచ్చ-పీలిగుంచలపోటు అనుగుల్మమునకును (దక్షిణమున) నున్నది. తత్పశ్చిమాత్-దానికి పడమర, సైకతోన్నతస్థలస్థితి మాశ్రితాత్-ఇసుక మేటికి దగ్గరగానున్న, వరక్షుద్ర తటాకాత్ చ-చిన్న చెరువుకు, వాయవీందిశమ్ ఆశ్రితమ్-వాయవ్య దిక్కుననున్నధి.

పీలిగుంచలపోటు అను గుల్మమునకును *దక్షిణమున* నున్నది. దానికి *పడమరగా* ఇసుక మేట దగ్గర నున్న చిన్న చెరువుకు వాయువ్య*దిశగా* నున్నది.

$1\frac{1}{2}$ అనుష్టుప్ శ్లోకములు.

68-69. శ్రీమచ్చీమాల పాట్యాఖ్య గ్రామసీమాంతవర్తినః-చీమలపాటి గ్రామపు సరిహద్దుననున్న, సైకతాత్యున్నత స్థలాత్-ఇసుక మేటకు, ఉత్తరామ్ ఆశామ్-ఉత్తరదిక్కును, సంప్రాప్తం-పొందినది, తిరుమూరు గ్రామవర సీమాంతవసతిస్థితాత్-తిరుమూరుగ్రామ సరిహద్దుననున్న, ప్రాప్తాత్-దగ్గరనున్న, తిరువరంగ శ్రీక్షేత్రాంతిక తలస్థితాత్-తిరువరంగమను క్షేత్రమునకు దగ్గరనున్న, విశ్రుతాత్ వామలూరాత్-ప్రసిద్ధమయిన పుట్టకు, ఈశానీం దిశమ్ ఆయాతమ్-ఈశాన్యదిశకు వచ్చినది.

చీమాలపాడు గ్రామపు సరిహద్దులోని ఇసుకమేటకు *ఉత్తరమున* నున్నది. తిరుమూరు గ్రామ సరిహద్దులో నున్న తిరువరంగమను క్షేత్రము దగ్గరనున్న పుట్టకు *ఈశాన్యముగా* నున్నది.

2½ అనుష్టుప్ శ్లోకములు.

70. మాన్యశ్రీ వేంగలాంబాయాః పురమితి – వేంగళాంబా పురమను, అపరాభిధమ్ – మారుపేరుగల, ఉ – – – రు ఇతి ఖ్యాతనామానమ్ – ఉ – – – రు అని వ్యవహారనామముగల, ఉత్తమమ్ – శ్రేష్ఠమయిన గ్రామమ్ – గ్రామమును.

*శ్రీ వేంగళాంబాపుర* మని మారుపేరును, *ఉ – – – రు* అని వ్యవహారనామమును గల ఉత్తమమయిన గ్రామమును.

అనుష్టుప్ శ్లోకము.

71. సర్వమాన్యంచ – సర్వమాన్యముగాను.
ఇక్కడినుండి వ్రాతమార్పు ఉన్నది.

శ్రీ కాలహస్తినగరాత్ – శ్రీ కాలహస్తి పట్టణమునుండి, చతుర్దిశి – నలువైపులను, ఆసమంతాత్ – చుట్టుపట్ల, చతురుత్తరవ – – తి (వింశతి ?) గ్రామాణి – ఇరువదినాలుగు (?) గ్రామములను, సుబహూనితు – అధికమైనవానిని, శ్రీ కాలహస్తినాథస్య – శ్రీ కాలహస్తీశ్వరునికి, నిత్యనైమిత్తికోత్సవజీర్ణోద్ధారాది కార్థమ్- నిత్య నైమిత్తికోత్సవములు, జీర్ణోద్ధారము మొదలగు వానికొరకు, యావదాధారాది సంయుక్తమ్ – అన్ని విధములయిన ఆధారములతో గూడినదిగా, ఆచంద్రార్కస్థితమ్ – ఆచంద్రార్క స్థాయిగా, స్వరేధయా – స్వర్గమును వృద్ధిచెందించుకొను, రాజభామా – రాణి (ఇచ్చినది).

*శ్రీ కాలహస్తి పట్టణము నలువైపుల ఇరువదినాలుగు (?) గ్రామములను శ్రీ కాళహస్తీశ్వరుని నిత్య నైమిత్తికోత్సవములకు, జీర్ణోద్ధారమునకు రాణి యిచ్చినది.*

ఈ భాగము వచనములో చేర్పబడినది.

72. తదిదమ్ – ఆ ఇది, గుణనిదానస్య – గుణములకు మూలమయినవాడును, అతిబలశాసన తరుకర దానస్య – కల్పవృక్షమునుమించి దానముచేయువాడును, నయధుర్యస్య – రాజనీతి ధురంధరుడును (అగు) శ్రీ రంగరాయస్య – శ్రీ రంగరాయల, శాసనమ్ – శాసనము.

ఇది గుణములకు నిదానమయినవాడు, కల్పవృక్షమునుమించి దానముచేయువాడు, రాజనీతిధురంధరుడు అయిన శ్రీ రంగరాయల శాసనము.

ఆర్యాగీతి.

73. శ్రీ రంగరాయనృపతేః - శ్రీ రంగరాయ భూపతియొక్క, శాసనతః - ఆజ్ఞవలన, తామ్రశాసన శ్లోకాన్ - తామ్రశాసన శ్లోకములను, కవిశాసనస్వయంభూః - కవులను శాసించుటలో శివునివంటివాడయిన, సభాపతేః సూనుః - సభాపతి కుమారుడు, సరసమ్ - సరసముగా, అభాణీత్ - చెప్పెను.

శ్రీరంగరాయల ఆజ్ఞవలన,ఈ తామ్ర శాసనశ్లోకములను, కవులను శాసించుటలో శివునివంటివాడయిన **సభాపతి కుమారుడు** సరసముగా చెప్పెను. (ఇక్కడ 'కవి శాసన స్వయంభూః' అనుటవలన నత్కీరునికథ స్ఫురించుచున్నది.)

ఆర్యాగీతి.

74. శ్రీ రంగరాయ భూపాలశాసనాత్ - శ్రీ రంగరాయభూపాలుని శాసనమువలన, వీరణాత్మజః - వీరన కుమారుడయిన, శ్రీ మద్గణపయాచార్యః - శ్రీమంతుడయిన గణపయాచార్యుడు, తామ్రశాసనం - తామ్రశాసనమును, వ్యలిఖత్ - వ్రాసెను.

శ్రీరంగరాయలఆజ్ఞవలన, *వీరనకుమారుడయిన గణపయాచార్యుడు ఈ తామ్రశాసనమును వ్రాసెను.*

అనుష్టుప్ శ్లోకము.

75. దానపాలనయోః మధ్యే - దానము, పాలనము అనువానిలో, అనుపాలనమ్ - ఇతరులిచ్చిన దానములను పాలించుట, దానాత్ - తాను దానముచేయుటకంటెను, శ్రేయః - మంచిది, దానాత్ - దానమువలన, స్వర్గమ్ - స్వర్గమును, అవాప్నోతి - పొందును, పాలనాత్ - పాలనమువలన, అచ్యుతంపదమ్ - మోక్షమును (పొందును).

దానము, పాలనము అనువానిలో దానముకంటె-పాలనము మేలు. దానమువలన స్వర్గము లభించును. పాలనమువలన మోక్షము కలుగును.

అనుష్టుప్ శ్లోకము.

76. పరదత్తానుపాలనాత్ - ఇతరులదానములను పాలించుటవలన, స్వదత్తాత్ - తానిచ్చినదానముకంటె, ద్విగుణం పుణ్యమ్ - రెట్టింపుపుణ్యము, పరదత్తాపహారేణ - ఇతరులిచ్చినదానిని హరించుటవలన, స్వదత్తమ్ - తనదానము, నిష్ఫలం - ఫలములేనిది, భవేత్ - అగును.

ఇతరులదానములను పాలించుటలన తాను దానముచేసినదానికంటె రెట్టింపు ఫలము గలుగును. ఇతరుల దానములను హరించుటలన తనదానము నిష్ఫలమగును.

అనుష్టుప్ శ్లోకము.

77. యః-ఎవడు, స్వదత్తామ్-తానిచ్చినదిగాని, పరదత్తాంవా-ఇతరులిచ్చినదిగాని, వసుంధరామ్-భూమిని, హరేత-హరించునో,(సః-వాడు), షష్టిర్వర్షసహస్రాణి-అరువదివేలయేండ్లు, విష్ఠాయామ్-మలములో, క్రిమిః-పురుగై, జాయతే-ఉండును.

తానుగాని, ఇతరులుగాని దానముచేసిన భూమిని ఎవడు హరించునో వాడు అరువదివేల సంవత్సరములు మలములో క్రిమియై యుండును.

అనుష్టుప్ శ్లోకము.

78. సర్వేషామ్ ఏవ భూభుజామ్-అందరురాజులకును, విప్రదత్తా-బ్రాహ్మణుల కీయబడిన, వసుంధరా-భూమి, ఏకైవభగినీ-ఒక్కతే సోదరి, న భోజ్యా - అనుభవింపరానిది, న కరగ్రాహ్యా - కరగ్రహణము (చేయి పట్టుకొనుట - పన్నుతీసికొనుట) చేయరానిది.

బ్రాహ్మణులకిచ్చిన భూమి రాజులందరికిని సోదరివంటిది. దానిని అనుభవించరాదు. కర (చేయి, పన్ను) గ్రహణముచేయరాదు.

అనుష్టుప్ శ్లోకము. రూపకము.

79. అయంధర్మసేతుః-ఈ ధర్మమను వంతెన, నృపాణామ్-రాజులకు, సామాన్యః-సామాన్యమైనది, భవద్భిః-మీచేత, కాలేకాలే-ఆయా కాలములయందు, పాలనీయః-పాలింపదగినది, (ఉచ్ఛేదము కాకుండ చూడదగినది) (అని) రామచంద్రః-శ్రీరాముడు, భావినః పార్థివేంద్రాన్-భవిష్యత్తులోని రాజులను, భూయోభూయో-మరల మరల, యాచతే-యాచించుచున్నాడు.

ఈ ధర్మమను వంతెన రాజులందరికిని సామాన్యమైనది. దీనిని తమతమకాలములలో ఉచ్ఛేదను కాకుండ చూడవలెను. భావిరాజులను రామచంద్రుడు మరలమరల యాచించుచున్నాడు.

---

శ్రీ వేంకటేశాయనమః.1।। యస్య సంపర్క పుణ్యేన [a]రీ రత్న
మభూచ్ఛిలా। యదుపాస్యం సుమనసాం తద్వస్తుద్వంద్వ మాశ్రయే.2॥ యస్య
ద్విరద వక్త్రాద్యాః పారిషద్యాః పరశ్శతం। విఘ్నం నిఘ్నంతి భజ
తాం విష్వక్సేనం తమాశ్రయే.3॥ జయతి క్షీర జలధేర్జాతం సర్వే
క్షణం హరేః। ఆలంబనం చకోరాణా మమరాయుష్కరం మహః.4॥ పౌ
త్రస్తస్య పురూరవా బుధసుత స్తస్యాయు రస్యాత్మజః స్సంజజ్ఞే న
హుషో యయాతి రభవ త్తస్మాచ్చ పూరు స్తతః। తద్వంశే భరతో బభూ
వ నృపతి స్తత్సంతతౌ శంతనుః। తత్పుర్యో విజయాభిమన్యు రుద
భూ త్తస్మాత్పరీక్షి స్త[b]తః5॥ నంద స్తస్యాష్టమోభూ త్సమజని నవ
మ స్తస్య రాజ్ఞ శ్చలిక్కఙ్మాప స్తత్సప్తమ [c] శ్రీపతిరుచిరభ
వ ద్రాజపూర్వో నరేంద్రః। తస్యాసీద్బిజ్జలేంద్రో దశమయిహ
నృపో వీరహంమాలిరాయ స్తార్తీయీకో, మురారే కృతన
తి రుదభూ స్త[d] స్యమాయాపురీశః.6॥ తత్పుర్యోజని తాతపి
న్న[e] మహీపాలో నిజాలోకనత్రస్తా మిత్రగణ స్తతో౽జ
ని హరన్ దుర్గాణి సప్తాహితాత్। అప్యైనాకేన స సోమి
దేవ నృపతి స్తస్యైవ జజ్ఞే సుతో వీరో రాఘవదేవరా
డితి తత శ్రీపిన్న మోభూన్నృ[f] పః.7॥ ఆరవీటి నగరీ
విభోరభూత [g] స్య బుక్కధరణీ పతిస్సుతః। యేన సాలువ
నృసింహ రాజ్య మప్యేధమాన మహసా స్థిరీ కృతం.8।।

---

a. నారీ b. త్తతః c. మః d. త్త e. మ f. న్నృ g. త్త

श्री वेंकटेशायनमः। यस्य संपर्क पुण्येन [1]रीरत्न
मभूच्छिला। यदुपास्यं सुमनसां तद्वस्तुद्वंद्वमाश्रये ।। यस्य
द्विरदवक्त्राद्याः पारिषद्याः परश्शतं। विघ्नं निघ्नंति भज
तां विष्वक्सेनं तमाश्रये ।। जयति क्षीरजलधेर्जातं सव्ये
क्षणं हरेः। आलंबनं चकोराणाममरायुष्करं महः।। पौ
त्रस्तस्य पुरूरवा बुधसुतस्तस्यायुरस्यात्मजस्संजज्ञे न
हुषो ययातिरभवत्तस्माच्च पूरुस्ततः। तद्वंशे भरतो बभू
व नृपतिस्तत्संततौ शंतनुः। तत्तुर्यो विजयाभिमन्युरुद
भूत्तस्मात्परीक्षिस्त[2]तः।। नंदस्तस्याष्टमोभूत्समजनि नव
मस्तस्य राज्ञश्चलिक्कक्ष्मापस्तत्सप्तम[3] श्रीपतिरुचिरभ
वद्राजपूर्वो नरेंद्रः। तस्यासीद्विज्जलेंद्रो दशमयिह
नृपो वीरहंमालिरायस्तार्तीयीको मुरारौ कृतन
तिरुदभूस्त[4]स्यमायापुरीशः।। तत्तुर्योजनि तातपि
न्न[5] महीपालो निजालोकनत्रस्तामित्रगणस्ततोज
नि हरन् दुर्गाणि सप्ताहितात्। अह्नैकेन स सोमि
देवनृपतिस्तस्यैव जज्ञे सुतो वीरो राघवदेवरा
डिति तत श्रीपिन्नमोभूनृपः[6]।। आरवीटिनगरी
विभोरभूतस्य[7] बुक्कधरणीपतिस्सुतः। येन सालुव
नृसिंहराज्यमप्येधमानमहसा स्थिरीकृतं।

1. ना, 2. त्त, 3. मः, 4. त्त, 5. म, 6. न्नृ, 7. त्तस्य

స్వః కామినీ a స్వతనుకాంతిభి రాత్మపంతీం। బు
క్కాఌవనీపతిలకోబుధకల్పసాbఖీ। కల్యాణినీం క
మలనాభయివాబ్ధికన్యాం। బల్లాంబికా ముదవహద్బహుమాన్య
శీలాం.9॥ సుతేవ కలశాంబుధే స్సురభిలాశుగం మాధవా త్కు
మార మివ శంకరా త్కులమహీభృతః కన్యకా। జయంత మమ
రప్రభోరపి శచీవ బుక్కాఌధిపాc స్తుతం జగతి బల్లమాల
భత రామరాజం సుతం.10॥ శ్రీరామరాజ క్షితిపస్య తస్య
చింతామణే రర్థి కదంబకానాం। లక్ష్మీరివాంభోరు
హాలోచనస్య లక్కాఌంబికాముష్య మహిష్యలాసీత్.11॥ తస్యాధికై
స్సమభవత్తనయ స్తపోభి శ్రీరంగరాజనృపతి శ్శశివంశదీ
పః। ఆసన్ సముల్లసతి ధామని యస్య చిత్రం నేత్రాణివై
రిసుదృశాం చ నిరంజనాని.12॥ సతీం తిరుమలాంబికాం చ
రితలీలాయారుంధతీం ప్రియామపి తితిక్షయా వసుమతీయ
శోరుంధతీం। హిమాంశురివ రోహిణీం హృదయహారిణీం సద్గు
ణై రమోదత సధర్మిణీ మయమవాప్య వీరాగ్రణీః.13॥ రచిత
నయవిచారం రామరాజంచ ధీరం। వరతిరుమలరాయం వేం
కటాద్రి క్షితీశం। అజనయత సయేతా నానుపూర్వ్యా కుమారా
నిహ తిరుమల దేవ్యామేవ రాజా మహౌజాః.14॥ సకల భువన
కంటకా నరాతీన్ సమితి నిహత్య స రామరాజవీరః।

a. నీః b. శా c. పాత్పుతం

स्वः कामिनी[8] स्वतनुकांतिभिराक्षिपंतीं बु
क्कावनीपतिलको बुधकल्प[9]साखी । कल्याणिनीं क
मलनाभयिवाब्धिकन्यां । बल्लांबिकामुदवहद्बहुमान्य
शीलां ।। सुतेव कलशांबुधेस्सुरभिलाशुगं माधवात्कु
मारमिव शंकरात्कुलमहीभृतः कन्यका । जयंत मम
रप्रभोरपि शचीव बुक्काधिपास्तुतं[10] जगति बल्लमाल
भत रामराजं सुतं ।। श्रीरामराजक्षितिपस्य तस्य
चिंतामणेरर्थिकदंबकानां । लक्ष्मीरिवांभोरु
हलोचनस्य लक्कांबिकामुष्य महिष्यलासीत् ।। तस्याधिकै
स्समभवत्तनयस्तपोभि श्रीरंगराजनृपतिश्शशिवंशदी
पः । आसन् समुल्लसति धामनि यस्य चित्रं नेत्राणि वै
रिसुदृशांच निरंजनानि ।। सतीं तिरुमलांबिकां च
रितलीलयारुंधतीं प्रियामपि तितिक्षया वसुमतीं य
शो रुंधतीं । हिमांशुरिव रोहिणीं हृदयहारिणीं सद्गु
णैरमोदत सधर्मिणीमयमवाप्य वीराग्रणीः ।। रचित
नय विचारं रामराजं च धीरं वरतिरुमलरायं वें
कटाद्रिक्षितीशं । अजनयत सयेतानानुपूर्व्या कुमारा
निह तिरुमलदेव्यामेव राजा महौजाः ।। सकल भुवन
कंटकानरातीन् समिति निहत्य स रामराजवीरः ।

---

8. नी, 9. शा, 10. पात्सुतं ।

భరతమను భగీరథాధిరాజః। ప్రథితయశాః ప్రశసాస a
చక్రముర్వ్యాః.15॥ వ్యరాజత శ్రీవరవేంకటాద్రిరాజb క్షితౌల
త్స్మణచారుమూర్తిః। జ్యాఘోష దూరీకృత మేఘనాదః। కు
ర్వన్ను c మిత్రాశయహర్షణపోషం.16॥ త్రిషు శ్రీరంగజావరిబ్బ
ధకుమారే ష్వధిరణం। విజిత్యారిక్ష్మాపాన్ స్తిరుమలమ
హారాయనృపతిః। మహారాజా స్సామ్రాజ్యే సుమతి రభిషితోd
నిరుపమే। ప్రశాస్త్యుర్వీం సర్వామపి తిసృషు మూర్తిష్వివ హరిః.17॥
e శస్వినామగ్రసరస్య యస్య పట్టాభిషేకే సతి పార్థివేంద్రోః।
దానాంబుపూరైరభిషిచ్యf మానా దేవీపదం భూమి రియం దధా
తి.18॥ సామాదయో విధిముఖాదివ సత్యవాచః సామాద్యుపా
యనివహోయివ సాంయుగీనాత్। రామాదయో దశరథాదివ
రాజమౌళేః తస్మాదమేయయశసస్తనయా బభూవుః.19॥ రాజా త
తోభూ ద్రఘునాథనామా శ్రీరంగరాజః శితపాలికాతః। శ్రీ
రామరాజ శ్శిశుg రాంశు రుర్వ్యాః విఖ్యాతిమా న్వేంకటదేవరా
యః.20॥ శ్రీరంగరాయ స్సహజేషు తేషు పారంగతో నీతిపయఃప
యోధేః। అష్టాసుదిక్షు ప్రథిత స్స లేభే పట్టాభిషేకం పేనుగొం
డరాజ్యే.21॥ అయం శ్రీవేంకటపతి దేవరాయో నయోజ్వలః। అ
వనీ మశిషత్కీర్త్యా దిశోదశ విశోభయన్.22॥ తజ్జాh యసఃi
సురద్రుమలజ్జావహచరిత రామరాజవిభోః। జాతస్తిరు

a. శాస b. ః c. న్న d. క్తో e. యశ f. చ్య g. శి h. జ్యా i. సః

भरतमनुभगीरथाधिराजः प्रथितयशाः प्रशसा[11]
चक्रमुर्व्याः ।। व्यराजत श्रीवरवेंकटाद्रिराज[12] क्षितौ ल
क्ष्मणचारुमूर्तिः । ज्याघोषदूरीकृतमेघनादः । कु
र्वन्चु[13]मित्राशय हर्षपोषं ।। त्रिषु श्रीरंगक्ष्मापरिबृ
ढकुमारेष्वधिरणं । विजित्यारिक्ष्मापान् तिरुमलम
हा राय नृपतिः । महौजास्साम्राज्ये सुमतिरभिषितो[14]
निरुपमे । प्रशास्त्युर्वीं सर्वामपि तिसृषु मूर्तिष्विव हरिः ।।
[15]शस्विनामग्रसरस्य यस्य पट्टाभिषेके सति पार्थिवेंदोः ।
दानांबुपूरैरभिषिच्च[16]माना देवीपदं भूमिरियं दधा
ति ।। सामादयो विधिमुखादिव सत्यवाचः सामाद्युपा
यनिवहायिव सांयुगीनात् । रामादयो दशरथादिव
राजमौलेः तस्मादमेययशसस्तनया बभूवुः ।। राजा त
तोभूद्रघुनाथनामा श्रीरंगराजः श्रितपालिकातः । श्री
रामराजश्शिशु[17]रांशुरुर्व्याः विख्यातिमान्वेंकटदेवरा
यः ।। श्री रंगरायस्सहजेषु तेषु पारंगतो नीतिपयः प
योधेः । अष्टासु दिक्षु प्रथितस्सलेभे पट्टाभिषेकं पेनुगों
डराज्ये ।। अयं श्रीवेंकटपतिदेवरायो नयोज्वलः । अ
वनीमशिषत्कीर्त्या दिशोदशविशोभयन् ।। तज्जा[18]यस[19]
सुरद्रुमलज्जावहचरितरामराजविभोः । जातस्तिरु

11. शास, 12. :, 13. न्सु, 14. क्तो, 15. यश, 16. च्य, 17. शि, 18. ज्ज्या, 19 सः।

మలరాజ[a]ఖ్యాత శ్రీరంగరాయోపి. 23॥ తయో శ్రీరంగరాయస్య తనయా వినయాధికాః। అజాయంత దయావంత శ్రుతవంతో యశస్వి నః. 24॥ శ్రీరంగరాయన్నృపతే స్తనయేషు తేషు పారంగిరా మధి గతః కవిపుంగవానాం। రత్నేషు కౌస్తుభయి వాంబుధి సంభవేషు శ్రీరామరాయ నృపతిః సుచిరం విలశిత్ః[b]25॥ పూర్వం విశ్రుత రామరాజనృపతే శ్రీరామభద్రాకృతే[c] కల్యాణో దయాశాలిన స్తనుభవా[d] పంచ ప్రపంచావనే దక్షా నీతిపథానుగా స్సమభవ[e] క్షీరాపగా కామినో గీర్వాణాయ[f] భూరుహోయిత బుధశ్రేణీష్టదానోత్సుకాః. 26॥ అజ్ఞాతిజిత సుగ్రీవాః। ప్రాజ్ఞతం[g] నకృతాగహ[h]। సర్వేతే విబుధ గ్రాయ[i] గుణై[j] రుచిరవిగ్రహాః. 27॥ విఖ్యాత చర్యేషు నృపేషు తేషు శ్రీరంగరాజ శ్శిశిరాంశు రుర్వ్యాః। వితి[k] త్రయే విశ్రుత కీర్తిరాసీత్ సౌరేషు శాలేష్వివ పారిజాతః. 28॥ శ్రీరంగరాజస్య తపోవిశేషః సంతోష[l] ణశ్శేషగిరీశ్వరస్య। కారుణ్యాభూమ్నా కమనీయ్యశోభా పుత్రావభూతాం పురుహూతభోగా. 29॥ పేదవేంకటేంద్ర పినవేంకటాధిరాడితి నామకౌ ప్రకృతి పాలనోత్సుకౌ। ఖరదూషణ ప్రహతి దక్షిణా బు[m]భౌ దదతః ప్రమోదమిహా రామలక్ష్మణౌ. 30॥ శ్రీశాలీ పెదవేంకటేంద్ర నృపతి జ్యా[n] ష్ఠోవ యో భి స్తయో[o] శౌర్యాదార్యగభీరతా ధ[p]తి కలా పూర్వైశ్చ సర్వైర్గుణైః। యస్యారాతి నృపాల భేదన కలా యాత్రాసు సేనారజఃపూరై ర్భూర్జలధిర్భ వేదితి హరిశ్చిత్తే విధత్తే స్థితిం. 31॥ శ్రీరంగరాజేంద్రకు

a. జః b. వ్యలాసీత్ c. తేః d. వాః e. న్ f. గీర్వాణాలయ g. దా h. గ్రహాః i. హ్యా j. ణా k. ధి l. పి m. వు n. జ్యే o. యోః p. ధృ

मलराज[20]ख्यात श्रीरंगरायोपि ।। तयो श्रीरंगरायस्य
तनया विनयाधिकाः । अजायंत दयावंत श्रुतवंतो यशस्वि
नः ।। श्रीरंगरायनृपतेस्तनयेषु तेषु पारं गिरामधि
गतः कविपुंगवानां । रत्नेषु कौस्तुभयिहांबुधि
संभवेषु श्रीरामरायनृपतिः सुचिरं विलशीत्[21] ।
पूर्वं विश्रुतरामराजनृपते श्रीरामभद्राकृते[22] कल्याणो
दयशालिनस्तनुभवा[23] पंच प्रपंचावने दक्षा नीतिपथानुगा
स्समभव[24]क्षीरपगाकामिनो । गीर्वाणायल[25] भूरुहायित बु
धश्रेणीष्टदानोत्सुकाः ।। अज्ञातिजितसुग्रीवाः प्रांज्ञतं[26] न कृ
तागहा[27] । सर्वे ते विबुधग्राय[28] गुणै[29] रुचिर विग्रहाः ।। विख्यात
चर्येषु नृपेषु तेषु श्रीरंगराजश्शिशिरांशुरुर्व्याः विति[30]त्र
ये विश्रुतकीर्तिरासीत् सौरेषु शालेष्विव पारिजातः ।। श्री
रंगराजस्य तपोविशेषैः संतोष[31]णश्शेषगिरीश्वरस्य ।
कारूण्यभूम्ना कमनीय्यशोभौ पुत्रावभूतां पुरुहूतभोगौ ।।
पेदवेंकटेंद्र पिनवेंकटाधिराडिति नामाकौ प्रकृति
पालनोत्सुकौ । खरदूषणप्रहति दक्षिणाबुभौ[32] ददतः प्रमो
दमिह रामलक्ष्मणौ ।। श्री शाली पेदवेंकटेंद्र नृपति [33]ज्येष्ठो व
योभिस्तयो[34] शौर्योदार्यगभीरता [35]धति कला पूर्वैश्च सर्वैर्गुणैः ।
यस्यारातिनृपालभेदनकलायात्रासु सेनारजः पूरैर्भूर्ज
लधिर्भवेदिति हरिश्चित्ते विधत्ते स्थितिं ।। श्रीरंग राजेंद्र कु

20. जः, 21. व्यलासीत्, 22. तेः, 23. वाः, 24. वन्, 25. गीर्वाणालय, 26. दा, 27. ग्रहाः, 28. ह्य, 29. णा, 30. धि, 31. षि, 32. वु, 33. ज्यें, 34. योः, 35. धृ ।

శ్రీరంగరాయల-శ్రీరామ తామ్రశాసనం

క్రీ. శ. 1644, జనవరి 28

3వ ఫలకం, ముందుప్రక్క.



SRIRANGARAYA'S SRIRAMA COPPER PLATE INSCRIPTION

*28th January, 1644 A.D.*

3RD PLATE: FRONT SIDE

మారకేస్మిన్ వీరోత్తమే వేంకటదేవరాయే, పట్టాభిషేకేa పేనుగొం
డరాజ్యే తదాభిషిక్తా స్సుధియోపి హేమ్నా.32॥ ఖ్యాతస్తస్య పితామ
హానుజతయా శ్రీవేంకటాద్రి క్షమాపాల b శ్రీలలనా స్వయంవృతప
తేః జాతాను కంపాస్పదం। ఆసీదుధృతc శత్రు గంధకరటి ప్రధ్వం
సబద్ధ వ్రతో హార్యక్షః కవిలోక రక్షణ కలా ప్రత్యగ్ర భోజాకృ
తిః.33॥ తస్య శ్రీరంగపతి రాత్మ భూర్గుణాబ్ధిరభూత్d। యస్యౌదార్య
మహిమ్నా కల్పతరుః క్వాపి నందతే వసతిం.34॥ రాజ్ఞ స్తస్య గుణాఢ్య
తస్య సుకృతైః ప్రాచీన జన్మార్జితైః। పుత్రోభూత్పురుహూతభోగమ
హిమా గోపాలరాజాగ్రణీః। సర్వేషాం విదుషాం సమీహితఫలం
దత్వా జగత్యాం స్వయం యో విస్మారయతిస్మ దానచతురాన్ భోజా
దిమాన్ పార్థివాన్.35॥ సర్వేషాం విదుషాం సమీహిత ఫలం దత్వా
జగత్యాం స్వయం। యో విస్మారయతిస్మ దానచతురాన్ భోజాది
మాన్ పార్థివాన్e॥ సోయం ప్రియాసహచర f సుకృతీ తపోభి రారా
ధయ ద్వేంకటశైలనాథం। ప్రీతస్తదానీమగదీ దభీష్టదాయీ స
దేవః కృపయా తమేవం.36॥ పుత్రస్సన్ ధరణీమవాప మధునా శ్రీరంగ
రాయాభిధో విఖ్యాతశ్చినవేంకటేంద్రనృపతే రుగ్రైస్తపోవైభ
వైః। పూర్వం శ్రీవసుదేవభూవసురిపోః కృష్ణాభిధోహం యథా నందః
ప్రాగివ తం సుతం కలయతాg శ్రీరంగరాయాభిధం.37॥ శ్రీరంగే
శ్వరదత్తరాజ్య మహిమా శ్రీరంగయారాగ్రణీః। పాదాంభోజవి
నంబ్రh భోజ మగధ క్ష్మాపార్పిత ప్రాభృతః। సర్వేషాం పృథుపీi భుజా
మధిశిరో విన్యస్తపాదాంబుజః। పృథ్వీం పాలయతే నయేన యేన j

---

a. షిక్తే   b. లః   c. ద్ధృత   d. ఛందో భంగము   e. రెండుపాదములు పునర్లిఖితములు.   f. రః
g. తాత్   h. నమ్ర   i. పృథివీ   j. యేన-పునర్లిఖితము.

मारकेस्मिन् वीरोत्तमे वेंकटदेवराये पट्टाभिषेके[36] पेनुगों
डराज्ये तदाभिषिक्तास्सुधियोपि हेम्ना ।। ख्यातस्तस्य पिताम
हानुजतया श्रीवेंकटाद्रिक्षमापाल[37] श्रीललनास्वयंवृतप
तेः जातानुकंपास्पदं । आसीदुधृत[38] शत्रुगंधकरटिप्रध्वं
सबद्धव्रतो हर्यक्षः कविलोकरक्षणकला प्रत्यग्रभोजाकृ
तिः ।। तस्य श्रीरंगपतिरात्मभूर्गुणाब्धिरभूत्[39] । यस्यौदार्य
महिम्ना कल्पतरुः क्वापि नंदते वसति ।। राज्ञस्तस्य गुणाम्बु
तस्य सुकृतैः प्राचीनजन्मार्जितैः । पुत्रोभूत्पुरुहूतभोगम
हिमा गोपालराजाग्रणीः । सर्वेषां विदुषां समीहितफलं
दत्वा जगत्यां स्वयं यो विस्मारयतिस्म दानचतुरान् भोजा
दिमान् पार्थिवान् ।। सर्वेषां विदुषां समीहितफलं दत्वा
जगत्यां स्वयं । यो विस्मारयतिस्म दानचतुरान् भोजादि
मान् पार्भिवान्[40] ।। सोयं प्रियासहचर[41] सुकृती तपोभिरारा
धयद्वेंकटशैलनाथं प्रीतस्तदानीमगदीदभीष्टदायी स
देवः कृपया तमेवं ।। पुत्रस्सन् धरणीमवापमधुना श्रीरंग
रंगरायाभिधो विख्यातश्चिनवेंकटेंद्रनृपतेरुग्रैस्तपोवैभ
वैः । पूर्वं श्रीवसुदेव भूवसुरिपोः कृष्णाभिधोहं यथा नंदः
प्रागिव तं सुतं कलयता[42] श्रीरंगरायाभिधं ।। श्रीरंगे
श्वरदत्तराज्यमहिमा श्रीरंगरायाग्रणीः । पादांभोजवि
नंम्र[43] भोजमगधक्ष्मापार्पितप्राभृतः । सर्वेषां पृथुवी[44] भुजा
मधिशिरो विन्यस्त पादांबुजः । पृथ्वीं पालयते नयेन येन[45]

---

36. षिक्तो, 37. लः, 38. द्धृत, 39. छंदो भंगः, 40. पुनर्लिखितम्, 41. रः, 42. तात्, 43. नम्र, 44. पृथिवी, 45. येन–पुनर्लिखितम् ।

మహతా సప్తార్ణ[a]వీ మేఖలాం. 38॥ వారాశి గాంభీర్య విశేషధుర్య [b]శౌ
రాది దుర్గైక విభాలవర్యః పరాష్టదిగ్రాయ మనః ప్రకామ భ
యంకర శ్శార్జధరాంతరంగః. 39॥ సారవీరరమయా సముల్లసః
ఆరవీటిపురహారనాయకః। కుండలీశ్వరమహాభుజః శ్రయన్
మండలీక ధరణీ వరాహతాం. 40॥ ఆత్రేయ గోత్రజానా మగ్రసరో భూభు
జా ముదారయశాః। అరిభగండ భేరుండో హరిభక్తిసుధానిధిః. 41॥ సోయం
నీతిజితాదిభూపతితతి[c]సుత్రామశాఖీ సుధీసార్థానాం భుజతేజ
సా స్వవశయన్ కర్నాట సింహాసనం। ఆసేతోరపి చాహిమాద్రి విమ
తాన్ సంహృత్య శాసన్ముదా సర్వోర్వీం ప్రచకాస్తి సింధుపరిఘాం శ్రీ
రంగరాయాగ్రణీః. 42॥ రసర్తుబాణచంద్రాఖ్య[d] గణితే శకవత్సరే। శ్రీమ
త్తారుణ వర్షేచ మాసి మాఘాభిధానకే। శుక్ల పక్షేచ పుణ్యాయాం
ద్వాదశ్యాంచ మహాతిథౌ. 43॥ శ్రీమద్దక్షిణకైలాస స్థాన విశేష సాకార ని
రాకార స్వరూప బ్రహ్మ[e] వశిష్టముని లూత వాతాశన హస్తి హ[f]ట
విక భూదేవ నత్కీర కన్యకాద్వయ యాదవాదిముఖ్య ప్రమథ
గణ సాయుజ్య పదస్థానంబైన పూర్వగిరి పశ్చిమ ద్వార దక్షిణ
పీఠ వుత్తర వాహినిం గల ఆలయమందు। శిలాప్లక్షవృక్షాది
మూల నివాసంబైన। శ్రీమన్ శ్రీ కాలహస్తీశ్వర స్వాముల అర్చ
కులైన. 44॥ శ్రీమత్కౌశిక గోత్రాయ ఆపస్తంబ సూత్రిణే[g]య
జుశ్శాఖావతా మగ్రయాయినే ఖీష్టదాయినే।మృష్టాంన దానసం
తుష్టశిష్టాచారద్విజన్మనే॥ విద్వత్కవి మనోహంస విశదాం

---

a. ర్ణ b. ర్యః c. తిః d. శక. 1566 e. హ్మ f. ఆ g. ఛందోభంగము

महता सप्तार्नवी[46] मेघलां ।। वाराशि गांभीर्य विशेष धुर्य[47] टौ
रादिदुर्गैक विभालवर्यः । पराष्टदिग्रायमनःप्रकाम भ
यंकरश्शा ङ्गधरांतरंगः ।। सारवीररमयासमुल्लसः
आरवीटिपुरहारनायकः । कुंडलीश्वरमहाभुजः श्रयन्
मंडलीकधरणीवराहृतां ।। आत्रेयगोत्रजानामग्रसरो भूभु
जामुदारयशाः । अरीभगंडभेरुंडो हरिभक्तिसुधानिधिः ।। सोयं
नीतिजितादिभूपतितति[48] सुत्रामशाखी सुधीसार्धानां भुजतेज
सा स्ववशयन् कर्नाटसिंहासनं आसेतोरपि चाहिमाद्रि विम
तान् संहृत्य शासन्मुदा सर्वोर्वीं प्रचकास्ति सिंधु परिघां श्री
रंगरायाग्रणीः ।। रसर्तुबाण्चंद्राख्य गणिते[49] शकवत्सरे । श्रीम
त्तारुण वर्षे च मासि माघाभिधानके ।। शुक्लपक्षे च पुण्यायां
द्वादश्यां च महातिथौ ।। श्रीमद्दक्षिणकैलासस्थानविशेषसाकारनि
राकारस्वरूप ब्रह[50] वशिष्टमुनि लूत वाताशन हस्तिहाट[51]
विक भूदेव नत्कीर कन्यकाद्वय यादवादि मुख्य प्रमथ
गणसायुज्यपदस्थानंबैन । पूर्वगिरि पश्चिमद्वार दक्षिण
पीठ वुत्तर वाहिनि गल आलयमंदु । शिलाप्लक्षवृक्षादि
मूलनिवासंबैन श्रीमन् श्रीकालहस्तीश्वरस्वामुल अर्च
कुलैन ।। श्रीमत्कौशिकग्रोत्राय आपस्तंबसूत्रिणे[52] य
जुश्शाखावतामग्रयायिनेभीष्ट दायिने । मृष्टांनदानसं
तुष्टशिष्टाचारद्विजन्मने ।। विद्वत्कविमनोहंसविशदां

---

46. र्णवी, 47. र्यः, 48. तिः, 49. शक १५६६, 50. हन्, 51. आट, 52. छंदोभंगः।

భోజకీర్తయే। చంద్రచూడపదాంభోజచలద్భ్రమరచేతసే॥ కాలబాయ్య
సుధీవర్యపౌత్రాయామితతేజసే। యీశ్వరయ్య సుపుత్రాయ సదాశి
వసుధీమణిః a.45॥ శ్రీ కాలహస్తీశ్వరస్వామికి మధ్యాహ్నకాల
మందు అభిషేకనైవేద్యం శేశి చత్రం సాగించేటందుకు। శుక్రవారం
అంమవారికి సమారాధనచేశేటికో b రకు। కాలహస్తిశీమ
లో అక్కురుతి మాగాణమందు। రామాభట్ల చరువు సహితంగాను కా
సరగ్రామమును.46॥ సర్వమాన్యం చతుస్సీమాసహితం చ సమంతతః। ని
ధి నిక్షేప పాషాణ సిద్ధ సాధ్య జలాన్వితం॥ అక్షిణ్యాగామిసయ్యు
క్తం దేవభోజ్యం సభూరుహం। వాపీకూపతటాకైశ్చ కనద్దామైశ్చ సంయుతం॥
పుత్ర పౌత్రాదిభి c భోజ్యం క్రమాదాచంద్రతారకం. 47॥ ఖ్యాతే నిగాలగోత్రాబ్ధే
రిందో ర్బంధోర్మనీషిణాం॥ దామర్లవంశ కమలక్షేమంకర వివస్వతః
భోగే భూలోకసుత్రాణ్ణా త్యాగే బుధ d శాఖినః॥ లంఘితే నగరే జేతుం
లంఘితార్న e వవైరిణిః। భేరీభాంకారమాత్రేణ భిన్నదుర్గారిభూపతేః॥
నిజ ఖడ్గమణీ వేత్ర నిత్యనృత్యజ్జయశ్రితః। కన్యాంనస్వర్ణభూదా
నై f కాలక్షేపం వితన్వతః పరదార పరద్రవ్య పరాన్ముఖ g ఖ హృద స్సదా।
సంగీత రస సాహిత్య సౌహిత్యే భోజభూభుజా. h॥ శ్రీరామచరణాం
భోజభ్రమరాయితచేతసః। నిత్యప్రసంన వక్త్రస్య నిత్యలక్ష్మీ
క జన్మనః॥ పేదవేంకటభూపాలపౌత్రస్యాతియశస్వినః। కరిచం
నమహీపాలకుమారస్య గుణాంబుధేః॥ వేంకటక్షోణిపాలస్య వి
జ్ఞప్తిమనుపాలయన్। శ్రీరంగరాయభూపాలో మాననీయో మనస్వి
నాం॥ సహిరణ్య పయోధారా పూర్వకం దత్తవాన్ముదా. శ్రీ 48॥

---

a. ణయే ఛందోభంగము b. కొ c. భిః d. విబుధ e. ర్ణ f. నైః g. ఖ్మ h. జః

भोज कीर्तये। चंद्रचूडपदांभोजचलद्भ्रमरचेतसे।। कालबाय्य सुधीवर्यपौत्रायामिततेजसे। यीश्वरय्यसुपुत्राय सदाशि वसुधीमणिः[53]। श्री कालहस्तीश्वरस्वामिकि मध्याह्नकाल मंदु अभिषेकनैवेद्यं शेशि चत्रं सागिचेटंदुकु। शुक्रवारं अंमवारिकि समाराधन चेशेटि को[54] रकु कालहस्ति शीम लो अक्कुरुति मागाणमंदु रामाभट्लचरुवु सहितंगानु का सरग्राममुनु।। सर्वमान्यं चतुस्सीमा सहितं च समंततः। नि धि निक्षेप पाषाणसिद्धसाध्य जलान्वितं।। अक्षिण्यागामिसय्यु क्तं देवभोज्यं सभूरुहं। वापीकूपतटाकैश्च कनद्यामैश्च संयुतं।। पुत्रपौत्रादिभि[55] भोज्यं क्रमादाचंद्रतारकं। ख्यातेनिगालगोत्राब्धे रिंदोर्बंधोर्मनीषिणां।। दामर्लवंशकमलक्षेमंकरविवस्वतः भोगे भूलोकसुत्राम्णा त्यागे [56]बुधशाखिन:।। लंघिते नगरे जेतुं लंघितार्नव[57] वैरिणः। भेरी भांकारमात्रेण भिन्नदुर्गारिभूपतेः निजखड्गमणीवेत्रनित्यनृत्यज्जयश्रियः। कन्यांनस्वर्नभूदा नै[58] कालक्षेपं वितन्वतः।। परदारपरद्रव्यपरान्मु[59]ख हृदस्सदा। संगीतरससाहित्यसौहित्ये भोजभूभुजा[60]।। श्रीरामचरणां भोजभ्रमरायितचेतसः नित्यप्रसंनवक्त्रस्य नित्यलक्ष्मी कजन्मनः।। पेदवेंकटभूपालपौत्रस्यातियशस्विनः। करिचं नमहीपालकुमारस्य गुणांबुधेः।। वेंकटक्षोणिपालस्य वि ज्ञप्ति मनुपालयन्। श्वरंगराय भूपालो मानानीय्यो मनस्वि नां।। सहिरण्यपयोधारापूर्वकं दत्तवान्मुदा। श्री।।

53. णये छन्दोभंगः, 54. कोः (ह्रस्वः), 55. भिः, 56. विबुध, 57. र्ण, 58. नैः, 59 ङ्मु, 60. जः।

శ్రీరంగరాయల-శ్రీరామ తామ్రశాసనం
క్రీ. శ. 1644, జనవరి 28
4వ ఫలకం వెనుకప్రక్క.



SRIRANGARAYA'S SRIRAMA COPPER PLATE INSCRIPTION
*28th January, 1644 A.D.*
4TH PLATE: BACK SIDE

వీర శ్రీరంగ a క్షితిపతి వర్యస్య కీర్తిధుర్యస్య। శాస
నమిదం సుధీజనకువలయచంద్రస్య భూమహేంద్రస్య.49॥ వీర శ్రీ
రంగరాయోక్త్యా ప్రాహ పౌత్రః సభాపతిః b। కామకోటిసుతో రామ
కవి c శాసనవాఙ్మయం.50॥ వీర శ్రీరంగరాయ క్ష్మాపతి దేశేన సోమ
నాథార్యః। శాసనమలిఖ త్కామయతనయః శ్రీగణపయార్యపౌ
త్రమణిః.51॥ దానపాలనయోర్మధ్యే దానా d శ్రేయోనుపాలనం। దానా e స్వ
ర్గ మవాప్నోతి పాలనా దచ్చుతం f పదం॥ స్వదత్తా ద్వి g గుణం పుణ్యం పర
దత్తానుపాలనం। పరదత్తాపహారేణ స్వదత్తం నిష్ఫలం భవేత్॥
స్వదత్తాం పరదత్తాంవా యో హరేత వసుంధరాం। షష్టిర్వర్ష సహ
స్రాణి విష్టా h యాం జాయతేక్రిమిః॥ ఏకైవ భగినీ లోకే స
ర్వేషా మేవ భూభుజాం న భోజ్యా న కరగ్రాహ్యా విప్రదత్తా వసుం
ధరా॥ సామాన్యోయం ధర్మసేతుం i నృపాణాం కాలేకాలే పాల
నీయో భవద్భిః। సర్వా నేతాన్ భావినః పార్థివేంద్రాన్ భూయో
భూయో యాచతే రామచంద్రః ॥శ్రీ॥52

శ్రీరామ

a. ఛంధోభంగము b. తేః c. కవిః d. నాత్ e. నాత్ f. దచ్యుతం g. ద్వి h. ష్ఠా i. తుః.

वीर श्रीरंगराय[61] क्षितिपतिवर्यस्य कीर्तिधुर्यस्य शास
नमिदं सुधीजनकुवलयचंद्रस्य भूमहेंद्रस्य ।। वीरश्री
रंगरायो क्त्या प्राह पौत्रः सभापतिः[62] । कामकोटिसुतो राम
कवि[63] शासनवाङ्मयं ।। वीरश्रीरंगरायक्ष्मापतिदेशेनसोम
नाथार्यः । शासनमलिखत्कामयतनयः श्री गणपयार्यपौ
त्रमणिः ।। दानपालनयोर्मध्ये दाना[64] शेयोनुपालनं । दाना[65] स्व
र्गमवाप्नोति पालनादच्चुतं[66] पदं ।। स्वदत्ता [67]द्विगुणं पुण्यं पर
दत्तानुपालनं । परदत्तापहारेण स्वदत्तं निष्फलं भवेत् ।।
स्वदत्तां परदत्तां वा यो हरेत वसुंधरां । षष्टिर्वर्षसह
स्राणि विष्टायां[68] जायते क्रिमिः ।। एकैव भगिनी लोके स
र्वेषामेव भूभुजां । न भोज्या न करग्राह्या विप्रदत्ता वसुं
धरा ।। सामान्योयं धर्म सेतुं[69] नृपाणां काले काले पाल
नीय्यो भवद्भिः । सर्वानेतान् भाविनः पार्थिवेंद्रान् भूयो
भूयो याचते रामचंद्रवः ।। श्री ।।

श्रीराम

61. छन्दोभंगः, 62. तेः, 63. कविः 64. नात्, 65. नात्, 66. दच्युतं, 67. द्विद्व, 68. विष्ठायां, 69. तुः

శ్రీరంగరాయల-శ్రీరామ తామ్రశాసనం

క్రీ. శ. 1644, జనవరి 28

5వ పలకం, ముందుభాగం




SRIRANGARAYA'S SRIRAMA COPPER PLATE INSCRIPTION

*28th January, 1644 A.D.*

5TH PLATE: FRONT SIDE

శ్రీరంగరాయల - శ్రీరామ తామ్రశాసనం
క్రీ. శ. 1644, జనవరి 28
శాసనఫలకాలు కలిపి ఉంచిన రాజముద్రికకల శీలు.



SRIRANGARAYA'S SRIRAMA COPPER PLATE INSCRIPTION
*28th January, 1644 A.D.*
A RING OF SRIRAMA COPPER PLATE INSCRIPTIONS ALONG WITH ROYAL SEAL

# శ్రీరామ శాసనం

వ్యాఖ్యానం

యన్. సి. యస్. వెంకటాచార్యులు

# శ్రీరామశాసన వ్యాఖ్యానం

1. శ్రీవేంకటేశాయ-శ్రీమంతుడైన వేంకటేశ్వరునకు, నమః-నమస్కారము.

2. యస్య-దేనియొక్క, సంపర్కపుణ్యేన-స్పర్శవలని పుణ్యముచేత, శిలా -రాయి, నాకీరత్నమ్-స్త్రీ రత్నముగా, అభూత్-అయ్యెనో, యత్-ఏది, సుమనసామ్-దేవతలకు, ఉపాస్యమ్-ఉపాసించదగినదో, తత్-ఆ, వస్తుద్వంద్వమ్-వస్తువులజంటను (దేవుని పాదద్వయమును), ఆశ్రయే-ఆశ్రయింతును.

దేని సంపర్కమువలని పుణ్యంచేత ఒకశిల స్త్రీ రత్నంగా మారిందో ఏది దేవతలకు కూడా ఉపాసించ తగిందో ఆ వస్తుద్వయమును (దేవుని పాదయుగళమును) ఆశ్రయింతును.

అనుష్టుప్ ఛందస్సు.

3. యస్య-ఎవనియొక్క, పరశ్శతం-వందలకొలది, ద్విరదవక్త్రాద్యాః-గజాననుడు మొదలైన, పారిషద్యాః-సభ్యులు, భజతాం-భజించువారియొక్క, విఘ్నం-విఘ్నమును, నిఘ్నంతి-నశింప జేయుచున్నారో, తమ్-ఆ, విష్వక్సేనమ్-విష్వక్సేనుని, ఆశ్రయే-ఆశ్రయింతును.

ఎవనియొక్క గజాననుడు మొదలైన వందలకొలది సభ్యులు భజించువారి విఘ్నమును నశింపజేయుచున్నారో ఆ విష్వక్సేనుని ఆశ్రయింతును.

అనుష్టుప్ ఛందస్సు.

4. క్షీరజలధేః జాతమ్-పాలసముద్రమునుండి పుట్టినది, హరేః-విష్ణుమూర్తికి, సవ్యేక్షణమ్-ఎడమకన్ను, చకోరాణామ్-జక్కవపిట్టలకు, ఆలంబనమ్-ఆధారము, అమరాయుష్కరమ్-దేవతల ఆయువును వృద్ధిచేయునది (అయిన), మహః-తేజస్సు, జయతి-ప్రకాశిస్తున్నది.

పాలసముద్రమునుండి పుట్టినది, విష్ణుదేవుని ఎడమకన్ను, జక్కవపిట్టలకు ఆధారము, దేవతల ఆయుస్సును వృద్ధిచేయునది అయిన తేజస్సు (చంద్రుడు) ప్రకాశిస్తున్నది.

అనుష్టుప్ ఛందస్సు.

5. తస్య-అతనికి, బుధ సుతః-బుధునికుమారుడైన, పురూరవాః-పురూరవుడు, పౌత్రః-మనుమడు, తస్య-ఆ పురూరవునికి, ఆత్మజః-కుమారుడు, ఆయుః-ఆయువు, అస్య-ఈ ఆయువునకు, నహుషః-

నహుషుడను పుత్త్రుడు, సంజజ్ఞే- పుట్టెను, తస్మాచ్చ- ఆ నహుషునినుండి, యయాతిః- యయాతి, అభవత్ - కలిగెను, తతః- అతనినుండి, పూరుః- పూరుడు (కలిగెను), తద్వంశే- ఆ పూరుని వంశమున, భరతః- భరతుడనే, నృపతిః- రాజు, బభూవ- కలిగెను, తత్సంతతౌ-ఆ భరతుని సంతతిలో, శంతనుః-శంతనుడు (కలిగెను), తత్తుర్యః- అతనికి నాలుగవవాడు, విజయాభిమన్యుః- అర్జునునికుమారుడైన అభిమన్యుడు, ఉదభూత్ - కలిగెను, తస్మాత్ - ఆ అభిమన్యునినుండి, పరిక్షిత్ - పరీక్షిత్తు (కలిగెను), తతః- తరువాత.

చంద్రునికుమారుడు బుధుడు, అతనిపుత్రుడు పురూరవుడు, పురూరవునికొడుకు ఆయువు, అతని కొడుకు నహుషుడు, నహుషునికొడుకు యయాతి, యయాతిపుత్త్రుడు పూరుడు. అతని వంశంలో భరతుడు పుట్టాడు. అతని సంతతిలో శంతనుడు కలిగాడు. అతనికి నాలుగవవాడు అర్జునుని కుమారుడైన అభిమన్యుడు, అతనికి పరీక్షిత్తు పుట్టాడు.

శార్దూల విక్రీడితవృత్తం.

6. తస్య- ఆ పరీక్షిత్తుకు, అష్టమః- ఎనిమిదవవాడు, నందః- నందరాజు, అభూత్ - అయ్యెను, తస్యరాజ్ఞః- ఆ రాజుకు, నవమః- తొమ్మిదవవాడు, చలిక్యక్ష్మాపః- చాళుక్యభూపాలుడు, సమజని- పుట్టెను, తత్సప్తమః- అతనికి ఏడవవాడు, శ్రీపతిరుచిః- విష్ణుతేజస్సుగల, రాజపూర్వఃనరేంద్రః- రాజరాజనరేంద్రుడు, అభవత్ - కలిగెను, తస్య- అతనికి, దశమః- పదవవాడు, బిజ్జలేంద్రః- బిజ్జలదేవుడు, ఆసీత్ - ఉండెను, ఇహ- ఇందు, తార్తీయీకః- మూడవవాడు, వీరహంమాలిరాయః నృపః- వీరహంమాలిరాయడనేరాజు, తస్య- అతనికి, మురారేః- విష్ణుదేవునికి, కృతనతిః- నమస్కరించినవాడు (అయిన), మాయాపురీశః- మాయా పురీశ్వరుడు, అభూత్ - కలిగెను.

పరీక్షిత్తుకు ఎనిమిదవవాడు నందుడు. అతనికి తొమ్మిదవవాడు చాళుక్యరాజు, అతనికేడవవాడు విష్ణుసమానతేజుడైన రాజరాజనరేంద్రుడు. అతనికి పదవవాడు బిజ్జలుడు. అతనికి మూడవవాడు వీరహంమాలిరాయడు. అతనికి కుమారుడు విష్ణుభక్తుడైన మాయాపురీశ్వరుడు.

స్రగ్ధరావృత్తము.

7. తత్తుర్యః- అతనికి నాలుగవవాడు, నిజాలోకనత్రస్తామిత్రగణః- తనచూపుచేత భయపడిన శత్రు సమూహము కలవాడు (అయిన), తాతపిన్నమమహీపాలః- తాతపిన్నమరాజు, అజని- పుట్టెను, తతః- అతనినుండి, ఏకేనఅహ్నా- ఒకరోజులో, అహితాత్ - శత్రువునుండి, సప్తదుర్గాణి- ఏడుకోటలను, హరన్ - హరించువాడైన, సః- ఆ, సోమిదేవనృపతిః- సోమిదేవరాజు, అజని- పుట్టెను, తస్యైవ- అతనికే, రాఘవ దేవరాట్ ఇతి-రాఘవ దేవరాజనే, వీరః సుతః -వీరుడైనకుమారుడు, జజ్ఞే-పుట్టెను, తతః- అతనినుండి, శ్రీ పిన్నమ నృపః-పిన్నమరాజు, అభూత్ -కలిగెను.

ఆ మాయా పురీశునికి నాలుగవవాడు తాత పిన్నమరాజు. అతని చూపుకే శత్రువులు భయపడే వారు. అతని కుమారుడు సోమిదేవరాజు. ఇతడు ఒక్కరోజులో శత్రువులనుండి ఏడుకోటలను పట్టుకొన్నాడు. సోమిదేవరాజు కొడుకు రాఘవదేవరాజు. అతని కుమారుడు పిన్నమరాజు.

శార్దూల విక్రీడిత వృత్తము.

8. అస్య-ఈ, ఆరవీటినగరీవిభోః-ఆరవీటినగరపాలకునకు (పిన్నమరాజుకు), యేన-ఎవనిచేత, సాలువ నృసింహరాజ్యమపి- సాలువ నరసింహుని రాజ్యముకూడా, ఏధమాన మహసా-వృద్ధిచెందుతున్న వైభవముతో, స్థిరీకృతం-స్థిరముచేయబడినదో (సః-ఆ), బుక్కధరణీపతిః-బుక్కరాయలు, సుతః-కుమారుడు, అభూత్-అయ్యెను.

ఆ పిన్నమరాజు కొడుకు బుక్కరాయలు. ఇతడు ఆరవీటి నగరాన్ని పరిపాలించాడు. సాలువ నరసింహరాయల రాజ్యాన్ని నిలబెట్టాడు.

రథోద్ధతవృత్తము.

9. బుధ కల్పశాఖీ-పండితులకు కల్పవృక్షమువంటివాడైన, బుక్కావనీపతిలకః-బుక్కరాయ శ్రేష్ఠుడు, స్వఃకామినీః-దేవకాంతలను, స్వతనుకాంతిభిః-తన శరీరకాంతిచేత, ఆక్షిపంతీం-ఆక్షేపించుచున్నదియు, కల్యాణినీం-శుభలక్షణములు గలదియు, బహుమాన్యశీలాం-మిక్కిలి గౌరవించదగిన నడవడి గలదియు (అగు), బల్లాంబికాం- బల్లమాంబికను, అబ్ధికన్యాం- లక్ష్మీదేవిని, కమలనాభః ఇవ-విష్ణుమూర్తివలె, ఉదవహత్-పెండ్లిచేసుకొనెను.

పండితులకు కల్పవృక్షమువంటివాడైన బుక్కరాయలు తన దేహకాంతులచే దేవకాంతలను ఆక్షేపించుచున్నదియు, శుభలక్షణములు గలదియు మిక్కిలి గౌరవించదగిన శీలముగలదియు అగు బల్లాంబికను లక్ష్మీదేవిని విష్ణుమూర్తివలె వివాహమాడెను.

వసంత తిలకావృత్తము. ఉపమ, రూపకము.

10. మాధవాత్-విష్ణువునుండి, కలశాంబుధేస్సుతా-లక్ష్మీదేవి, సురభిలాశుగంఇవ - మన్మథుని వలెను, శంకరాత్-శివునివలన, కులమహీభృతః కన్యకా-పార్వతీదేవి, కుమారం ఇవ-కుమారస్వామివలెను, అమరప్రభోః అపి-దేవేంద్రుని వలన, శచీ-శచీదేవి, జయంతం ఇవ-జయంతుని వలెను, జగతి-భూమియందు, బుక్కాధిపాత్-బుక్కరాయలవలన, బల్లమా-బల్లాంబిక, నుతం-పొగడబడిన, రామరాజం సుతం-రామరాజనే కుమారుని, అలభత-పొందెను.

విష్ణువువలన లక్ష్మీదేవి మన్మథుని, శివునివలన పార్వతీదేవి కుమారస్వామిని, ఇంద్రునివలన శచీదేవి జయంతుని కన్నట్లు బుక్కరాయలవలన బల్లాంబిక రామరాజను కుమారునిగనెను.

పృథ్వీవృత్తము. ఉపమాలంకారము.

11. అర్థికదంబకానాం-యాచక సమూహమునకు, చింతామణేః-చింతామణియైన, తస్య-ఆ, శ్రీరామరాజక్షితిపస్య-శ్రీరామరాయభూపాలునకు, అంభోరుహాలోచనస్య-విష్ణుమూర్తికి, లక్ష్మీః ఇవ-లక్ష్మీదేవివలె, లక్కాంబికా-లక్కాంబిక, ముఖ్యమహిషీ-పట్టపురాణిగా, అలాసీత్-ప్రకాశించెను.

యాచక సమూహములకు చింతామణియైన ఆ శ్రీరామరాయ భూపాలునకు, విష్ణుమూర్తికి లక్ష్మివలె, లక్కాంబిక పట్టపురాణియై ప్రకాశించెను.

ఇంద్రవజ్రా వృత్తము. ఉపమాలంకారము.

12. యస్య ధామని - ఎవనియొక్క ప్రకాశము, సముల్లసతి - వెలుగొందుచుండగా, చిత్రం-ఆశ్చర్యముగా, వైరిసుదృశాంచ-శత్రురాజుల భార్యలయొక్క, నేత్రాణి-కన్నులు, నిరంజనాని-కాటుక లేనివి, ఆసన్-అయినవో, సః-ఆ, శశివంశ దీపః-చంద్రవంశమును ప్రకాశింపజేసెడి, శ్రీరంగరాజనృపతిః-శ్రీరంగ రాయలు- తనయః- పుత్రుడై, తస్య-ఆ రామరాయలయొక్క, అధికైః తపోభిః-గొప్పవైన తపస్సులచేత సమభవత్-పుట్టెను.

ఆ రామరాయల గొప్ప తపస్సువల్ల చంద్రవంశ దీపకుడైన శ్రీరంగరాయలు పుత్రుడయ్యెను. ఆయన తేజస్సు వెలుగుచుండగా వైరికాంతల నేత్రములు కాటుకలేనివి అయ్యెను.

వసంతతిలకావృత్తము. విశేషోక్త్యలంకారము.

13. అయం-ఈ, వీరాగ్రణీః-వీరాగ్రేసరుడు, చరితలీలయా-నడవడియొక్క విలాసముచేత, అరుంధతీం-అరుంధతియైన దానిని, తితిక్షయా-క్షమాగుణముచేత, వసుమతీయశః-భూదేవియొక్క కీర్తిని, రుంధతీం-నిరోధించుచున్న దానిని, సద్గుణైః-మంచి గుణములచేత, హృదయ హారిణీం-మనస్సును ఆకట్టుకొను దానిని, తిరుమలాంబికాం సతీం-తిరుమలాంబికా సతిని, హిమాంశుః-చంద్రుడు, రోహిణీం ఇవ-రోహిణినివలె, ప్రియాంసధర్మిణీం-ప్రియసహధర్మచారిణిగా, అవాప్య-పొంది, అమోదత-ఆనందించెను.

వీరాగ్రేసరుడైన శ్రీరంగరాయలు సద్గుణములచేత తన మనస్సును ఆకట్టుకొన్న, తిరుమలాంబికను చంద్రుడు రోహిణినివలె ప్రియ సహధర్మచారిణిగాపొంది ఆనందించెను. ఆ తిరుమలాంబిక నడవడిలో అరుంధతివంటిది, క్షమా గుణముచేత భూదేవికీర్తిని నిరోధించినది.

పృథ్వీవృత్తము. ఉపమాలంకారము, యమకము.

14. మహారాజాః-గొప్పబలశాలియైన, సః రాజా-ఆ రాజు (శ్రీరంగరాయలు), ఇహ-ఇక్కడ, తిరుమలదేవ్యాం ఏవ-తిరుమలదేవియందు, రచితనయవిచారం-సుసంబద్ధమైన రాజనీతిభావముగల, రామరాజంచ-రామరాజును, ధీరం-ధీరుడైన, వరతిరుమలరాయం-శ్రేష్ఠుడైన తిరుమలరాయలను, వేంకటాద్రిక్షితీశం-వేంకటాద్రిరాయలను, ఏతాన్ కుమారాన్-ఈ పుత్త్రులను, అనుపూర్వ్యా-వరుసగా, అజనయత-కనెను.

మహాబలవంతుడైన శ్రీరంగరాయలు తిరుమలదేవియందు వరుసగా రాజనీతి విశారదుడైన రామరాయలను, ధీరుడు, శ్రేష్ఠుడునైన తిరుమలరాయలను, వేంకటాద్రిరాయలను కనెను.

మాలినీ వృత్తము.

15. సమితి-యుద్ధమునందు, సకలభువనకంటకాన్-సకలభువనములను బాధించువారైన, అరాతీన్-శత్రువులను, నిహత్య-చంపి, సః రామరాజవీరః-ఆ వీరుడైన రామరాజు, భరతమను భగీరథాధిరాజం-భరతమను భగీరథాది రాజులను మించునట్లుగా, ప్రథితయశాః-ప్రశస్తిపొందిన కీర్తికలవాడై, ఉర్వ్యాః చక్రమ్-భూచక్రమును, ప్రశశాస-పరిపాలించెను.

వీరుడైన ఆ రామరాజు సకలలోకములను బాధించుచున్న శత్రువులను సంహరించి భరతమను భగీరథాది పూర్వరాజులను మించి ప్రశస్తిపొందిన కీర్తిగలవాడై భూచక్రమును శాసించెను.

పుష్పితాగ్రవృత్తము.

16. జ్యాఘోష దూరీకృత మేఘనాదః-వింటినారి ధ్వనిచేత దూరముచేయబడిన మేఘగర్జనకలవాడు, లక్ష్మణుని పక్షమున-వింటినారి ధ్వనిచేత పారద్రోలబడిన ఇంద్రజిత్తుగల వాడు, సుమిత్రాశయ హర్షపోషం-మంచి మిత్రులయొక్క హృదయమున ఆనందమును పెంపొందించుటను, లక్ష్మణుని పక్షమున-సుమిత్రయొక్క హృదయమున ఆనందమును పెంపొందించుటను, కుర్వన్-చేయువాడును (అయి), లక్ష్మణ చారుమూర్తిః-శుభలక్షణములుగల సుందరమైన మూర్తిగల, లక్ష్మణునియొక్క సుందరమైన మూర్తివంటి మూర్తిగల, శ్రీవర వేంకటాద్రిరాయః-ఐశ్వర్యముచేత శ్రేష్ఠుడైన వేంకటాద్రిరాజు, క్షితౌ-భూమియందు, వ్యరాజత-ప్రకాశించెను.

వేంకటాద్రిరాజు లక్ష్మణునివలె ప్రకాశించెను. లక్ష్మణుడు తన వింటినారిధ్వనిచేత మేఘనాదుని (ఇంద్రజిత్తును) జయించెను. వేంకటాద్రిరాయలు తన వింటినారిధ్వనిచేత మేఘనాదమును (మేఘగర్జనమును) గెలిచెను. లక్ష్మణుడు సుమిత్రహృదయమున ఆనందమును పెంపొందించెను. వేంకటాద్రిరాయలు సుమిత్రుల (మంచిస్నేహితుల) హృదయమున ఆనందమును పెంపొందించెను.

ఉపజాతివృత్తము—శ్లేషతో కూడిన ఉపమ.

17. శ్రీరంగక్ష్మాపరిబృఢ కుమారేషు త్రిషు-శ్రీరంగరాయల పుత్త్రులు ముప్పురిలోను, సుమతిః-మంచి తెలివిగలవాడును, మహౌజాః-గొప్ప బలముగల వాడును (అయిన), తిరుమల మహారాయ నృపతిః-తిరుమలరాయలు, అధిరణం-యుద్ధమునందు, అరిక్ష్మాపాన్-శత్రురాజులను, విజిత్య-జయించి, నిరుపమే-సాటిలేని, సామ్రాజ్యే-సామ్రాజ్యమునందు, అభిషిక్తః-అభిషిక్తుడై, త్రిసృఘమూర్తిఘు-త్రిమూర్తులలో, హరిః ఇవ-విష్ణువువలె, సర్వామపి ఉర్వీం-సమస్తమైనభూమిని, ప్రశాస్తి-పరిపాలించుచున్నాడు.

శ్రీరంగరాయల కుమారులు ముప్పురిలో మంచిబుద్ధిమంతుడు, గొప్ప బలవంతుడు అయిన తిరుమలరాయలు యుద్ధమున శత్రువులను జయించి సాటిలేని సామ్రాజ్యమున అభిషిక్తుడై, త్రిమూర్తులలో విష్ణువువలె సమస్తమైన భూమండలములను పరిపాలించుచున్నాడు.

శిఖరిణీవృత్తము-ఉపమాలంకారము.

18. యశస్వినామ్-కీర్తిమంతులలో, అగ్రసరస్య-శ్రేష్ఠుడైన, యస్య పార్థివేంద్రోః -ఏరాజచంద్రుని యొక్క, పట్టాభిషేకే సతి-పట్టాభిషేకము జరుగుచుండగా, దానాంబుపూరైః-దానధారలచేత, అభిషిచ్యమానా-అభిషేకింపబడుచున్నదై, ఇయం భూమిః-ఈ భూమి, దేవీపదం-పట్టమహిషి పదవిని, దధాతి-ధరించు చున్నదో.

తిరుమలరాయల పట్టాభిషేకము జరుగుచుండగా దానధారలచే అభిషేకించ బడుచున్నభూమి పట్టమహిషి పదవిని పొందుచున్నదా యనునట్లున్నది.

ఉపజాతివృత్తము. ఉత్ప్రేక్షాలంకారము.

19. సత్యావాచః-సత్యవచనుడైన, తస్మాత్ రాజమౌళేః-ఆరాజేంద్రునివలన, విధిముఖాత్-బ్రహ్మముఖమునుండి, సామాదయః ఇవ-సామాదులైన వేదములవలెను, సాంయుగీనాత్-యుద్ధనీతినుండి, సామాద్యుపాయ నివహా ఇవ-సామము మొదలైన ఉపాయసముదాయముల వలెను, దశరథాత్-దశరథుని నుండి, రామాదయః ఇవ-రాముడు మొదలైన వారివలెను, అమేయయశసః-గొప్పకీర్తిగల, తనయాః-పుత్త్రులు, బభూవుః-కలిగిరి.

సత్యవచనుడైన ఆ రాజమౌళి వలన బ్రహ్మ ముఖమునుండి వేదములవలెను, యుద్ధనీతినుండి సామాద్యుపాయముల వలెను, దశరథునినుండి రామాదుల వలెను, గొప్ప కీర్తిగల (నలుగురు) పుత్త్రులు కలిగిరి.

ఉపజాతివృత్తము-శ్లేషతో గూడిన ఉపమ.

20. తతః శ్రితపాలికాతః-ఆ తిరుమలరాయల నాశ్రయించిన భార్యలనుండి, రఘునాథనామా రాజా-రఘునాథరాయలును, శ్రీరంగరాజః-శ్రీరంగరాయలును, ఉర్వ్యాఃశిశిరాంశుః-భూమికిచం ద్రునివంటి వాడైన, శ్రీరామరాజః-శ్రీరామరాయలును, విఖ్యాతిమాన్-గొప్ప కీర్తిమంతుడైన, వేంకటదేవరాయః-వేంకటదేవరాయలును, అభూత్-కలిగెను (కలిగిరి).

ఆ తిరుమలరాయల భార్యలయందు రఘునాథరాయలు, శ్రీరంగరాయలు, శ్రీరామరాయలు, వేంకటదేవరాయలు అను నలుగురు కుమారులు కలిగిరి.

ఇంద్రవజ్రవృత్తము.

21. తేషుసహజేషు-ఆసోదరులలో, నీతిపయః పయోధేః పారంగతః-రాజనీతియను క్షీరసముద్రము పారము ముట్టినవాడైనట్టియు, అష్టాసు దిక్షు-ఎనిమిది దిక్కులయందు, ప్రథితః-పేరుపొందినవాడైనట్టి, సః శ్రీరంగరాయః-ఆ శ్రీరంగరాయలు, పెనుగొండరాజ్యే-పెనుగొండ రాజ్యమునందు, పట్టాభిషేకంలేభే-పట్టాభిషేకమును పొందెను.

ఆ సోదరులలో రాజనీతిపారంగతుడు, ఎనిమిదిదిక్కులయందును పేరు పొందినవాడు అయిన శ్రీరంగరాయలు పెనుగొండరాజ్యమున పట్టాభిషిక్తుడయ్యెను.

ఇంద్రవజ్రవృత్తము.

22. నయోజ్జ్వలః-నీతిచేత ప్రకాశించెడి, అయం శ్రీవేంకటపతిదేవరాయః-ఈ వేంకటపతిదేవ రాయలు, కీర్త్యాః-కీర్తిచేత, దశదిశః-పది దిక్కులను, విశోభయన్-ప్రకాశింపజేయుచు, అవనీమ్ అశిషత్-భూమిని పరిపాలించెను.

రాజనీతిచే ప్రకాశించెడు శ్రీవేంకటపతిదేవరాయలు దశదిశలను కీర్తిచేత వెలిగించుచు రాజ్య మేలెను.

అనుష్టుప్ ఛందస్సు.

23. తజ్జ్యాయసః-అతని అన్నగారైన, సురద్రుమల జ్జావహ చరిత రామరాజవిభోః-కల్పవృక్షమును సిగ్గుపడజేయు నడవడిగల రామరాయలకు, తిరుమలరాజఖ్యాతః-తిరుమలరాయలు, జాతః-పుట్టెను, శ్రీరంగ రాయః అపి (జాతః)-శ్రీరంగరాయలుకూడ (పుట్టెను).

వేంకటపతిదేవరాయల అన్నగారైన శ్రీరామరాయలు కల్పవృక్షమును సిగ్గుపడజేయు చరిత్రము కలవాడు. ఆయనకు తిరుమలరాయలు, శ్రీరంగరాయలు పుట్టిరి.

ఆర్యాగీతి. ఉపమ.

24. తయోః-వారిలో, శ్రీరంగరాయస్య-శ్రీరంగరాయలకు, వినయాధికాః-గొప్పవినయము కలవారు, దయావంతః-దయగలవారు, శ్రుతవంతః-విద్యగలవారు, యశస్వినః-కీర్తిగలవారు, (అయిన) తనయాః-పుత్త్రులు, అజాయంత-పుట్టిరి.

వారిలో శ్రీరంగరాయలకు విద్యావినయదయాయశోవంతులైన పుత్త్రులు కలిగిరి.

అనుష్టుప్ ఛందస్సు. యమకము, అనుప్రాసము.

25. శ్రీరంగరాయనృపతేః-శ్రీరంగరాయలయొక్క, తేషు తనయేషు-ఆ పుత్త్రులయందు, కవి పుంగవానాం గిరామ్-కవిపుంగవుల వాక్కులయొక్క, పారమ్ అధిగతః-పారముముట్టినవాడు (అయిన), శ్రీరామరాయనృపతిః-శ్రీరామరాయలు, అంబుధి సంభవేషు రత్నేషు-సముద్రమున పుట్టిన రత్నములలో, కౌస్తుభఇవ-కౌస్తుభమణివలె, సుచిరమ్-చాలకాలము, వ్యలాసీత్-విలసిల్లెను.

శ్రీరంగరాయల పుత్త్రులలో శ్రీరామరాయలు కవులచే మిక్కిలి పొగడబడుచు కౌస్తుభమణివలె చిరకాలము ప్రకాశించెను.

వసంతతిలక. ఉపమ.

26. క్షీరాపగాకామినః-పరమపదమును పొందిన వాడును, శ్రీరామభద్రాకృతేః-శ్రీరాముని ఆకారమువంటి ఆకారము గలవాడును అయిన, పూర్వం విశ్రుత రామరాజ నృపతేః-వెనుక ప్రసిద్ధిపొందిన (అళియ) రామరాయలకు, ప్రపంచావనే దక్షాః-ప్రపంచమును పాలించుటలో నేర్పరులు, నీతిపథానుగాః-నీతి మార్గమునసుసరించువారును, కల్యాణోదయశాలినః-శుభాభ్యుదయములు గలవారును, గీర్వాణాలయ భూరుహాయిత బుధశ్రేణీష్టదానోత్సుకాః-కల్పవృక్షమువలె పండితమండలి కోరికలు తీర్చుటలో ఉత్సాహముగల వారును అయిన, తనుభవాః-పుత్త్రులు, పంచ-ఐదుగురు, సమభవన్-ఉండిరి.

స్వర్గస్థులైన అళియరామరాయలకు పరిపాలనాదక్షులు, నీతిపరులు, శుభాభ్యుదయశీలులు, కల్పవృక్షసములైన దాతలు అయిన అయిదుగురు పుత్రులుండిరి.

శార్దూలవిక్రీడితము. ఉపమ.

27. తే సర్వే-వారందరును, జ్ఞాతిజితసుగ్రీవాః-జ్ఞాతిచే జయింపబడని సుగ్రీవులు, ప్రాజ్ఞదాన కృతాగ్రహాః-పండితులకు దానముచేయుటయందు పట్టుదలగలవారు, విబుధ గ్రాహ్యగుణైః-పండితులచే గ్రహింపబడదగిన గుణములచే, రుచిర విగ్రహాః-ప్రకాశించు విగ్రహములు గలవారు.

వారందరును జ్ఞాతిచే జయింపబడని సుగ్రీవులు, పండితులకు దానముచేయుటయందు పట్టు దలగలవారు, పండితులు ప్రశంసింపదగిన గుణములతో ప్రకాశించు విగ్రహములు గలవారు.

అనుష్టుప్ శ్లోకము. రూపకము.

28. విఖ్యాత చర్యేషు-ప్రసిద్ధిపొందిన నడవడిగల, తేషు-ఆ, నృపేషు-రాజులలో, ఉర్వ్యాః-భూమికి, శిశిరాంశుః-చంద్రునివంటివాడైన, శ్రీరంగరాజః-శ్రీరంగరాయలు, విధిత్రయే-దుష్ట శిక్షణ, శిష్ట రక్షణ, ప్రజాపాలన అను మూడు విధులలోను, శాలేషు-చెట్లలో, పారిజాతఃఇవ-కల్పవృక్షమువలె, పౌరేషు-ప్రజలలో, విశ్రుతఃఆసీత్-ప్రసిద్ధుడయ్యెను.

ప్రసిద్ధిచెందిన నడవడిగల ఆ రాజకుమారులలో భూమికి చంద్రునివంటివాడు శ్రీరంగరాయలు. ఆయన తన విధులను చక్కగా నిర్వహించుచు వృక్షములలో కల్పవృక్షమువలె ప్రజలలో కీర్తిపొందినాడు.

ఉపజాతివృత్తము. ఉపమ.

29. శ్రీరంగరాజస్య-శ్రీరంగరాయలయొక్క, తపోవిశేషైః-తపోవిశేషములచేత, సంతోషి తాః-సంతోషముపొందినవాడైన, శేషగిరీశ్వరస్య-వేంకటేశ్వరునియొక్క, కారుణ్యభూమ్నా-గొప్పదయచేత, కమనీయశోభా-కోరదగిన శోభగలవారును, పురుహూతభోగా-ఇంద్రునిభోగమువంటి భోగముగలవారును, (అయిన), పుత్రౌ-కుమారులు (ఇద్దరు), అభూతామ్-కలిగిరి.

శ్రీరంగరాయల తపోవిశేషములచేత సంతోషించిన వేంకటేశ్వరస్వామి దయా బాహుళ్యము వలన మనోహరమైన శోభగలవారును, దేవేంద్రవైభవము గలవారును అయిన పుత్రులు ఇద్దరు కలిగిరి.

ఇంద్రవజ్రావృత్తము.

30. పెదవేంకటేంద్ర పినవేంకటాద్రిరాట్ ఇతినామకౌ-పెదవేంకటపతిరాయలు, పినవేంకటపతి రాయలు అను పేర్లుగలవారిద్దరు, ప్రకృతి పాలనోత్సుకౌ-ప్రజలను పరిపాలించుటయందు ఉత్సాహము కల వారు, ఉభౌ-వారిరువురును, ఖరదూషణప్రహతి దక్షిణౌ-తీవ్రమైనద్రోహము చేసెడివారిని శిక్షించుటలో నేర్పరులై (రామలక్ష్మణుల పక్షమున-ఖరదూషణులను రాక్షసులను చంపుటలో నేర్పరులు), ఇహ-ఇక్కడ, రామలక్ష్మణౌ-రామ లక్ష్మణులవంటివారై, ప్రమోదం దదతః-ఆనందము కలిగించుచున్నారు.

పెదవేంకటపతిరాయలు, పినవేంకటపతిరాయలు ప్రజలను పరిపాలించుటయందు ఉత్సాహముకల వారు. తీవ్రద్రోహులను (ఖరదూషణులను) శిక్షించుటలో రామలక్ష్మణులవంటి వారై ఆనందమును కలిగించు చున్నారు.

మంజుభాషిణీవృత్తము-శ్లిష్టోపమ.

31. యస్య-ఎవనియొక్క, అరాతి నృపాల భేదన కలాయాత్రాసు-విజయయాత్రలందు, సేనా రజః పూరైః-సేనయొక్క పాదధూళి ప్రవాహములచేత, భూః-ఈ ప్రపంచము, జలధిః భవేత్ ఇతి స్థితిమ్-సముద్రమగును అను భావమును, హరిః-విష్ణువు, చిత్తే-మనస్సునందు, విధత్తే-వహించునో (ఆ), శ్రీశాలీ-శ్రీమంతుడైన, పెదవేంకటేంద్రనృపతిః-పెదవేంకటపతిరాయలు, వయోభిః-వయస్సుచేతను, శౌర్యౌదార్య గభీరతాధృతికలా పూర్వైః-శౌర్యము, ఔదార్యము, గాంభీర్యము, ధైర్యము, కళ మొదలైన, సర్వైఃగుణైః చ-అన్నిగుణములచేతను, తయోః-వారిద్దరిలో, జ్యేష్ఠః-పెద్దవాడు.

శ్రీమంతుడైన పెదవేంకటపతిరాయలు వయస్సుచేతనేగాక శౌర్యాది సమస్త గుణములచేతను పెద్దవాడు. అతని జైత్రయాత్రలయందు రేగిన ధూళి ప్రవాహములతో ప్రపంచము సముద్రమగునా అని (లోకరక్షణ దీక్షితుడైన) విష్ణువు భావించుచుండెడివాడు.

శార్దూలవిక్రీడితవృత్తము. ఉత్ప్రేక్ష.

32. శ్రీరంగరాజేంద్ర కుమారకే-శ్రీరంగరాయల కుమారుడును, వీరోత్తమే-వీరులలో అగ్రగణ్యుడును (అయిన), అస్మిన్-ఈ, వేంకటదేవరాయే-వేంకటపతిరాయలు, పెనుగొండరాజ్యే-పెనుగొండ రాజ్యమందు, పట్టాభిషిక్తే-పట్టాభిషిక్తుడుకాగా, తదా-అప్పుడు, సుధియఃఅపి-పండితులును, హేమ్నా-బంగారముతో, అభిషిక్తాః-అభిషేకించబడిరి.

శ్రీరంగరాయలకుమారుడు, వీరోత్తముడు అయిన వేంకటపతిదేవరాయలు పెనుగొండరాజ్యమున పట్టాభిషిక్తుడయినప్పుడే పండితులు బంగారముతో అభిషేకము పొందిరి.

ఉపజాతివృత్తము. సహోక్తి.

33. తస్య-ఆ వేంకటపతిరాయలయొక్క, పితామహానుజతయా-తాతగారి తమ్ముడుగా, ఖ్యాతః-ప్రసిద్ధుడైన, శ్రీ వేంకటాద్రి క్షమాపాలః-శ్రీ వేంకటాద్రి రాయలు, శ్రీలలనా స్వయంవృతపతేః-శ్రీ విష్ణుమూర్తికి, జాతానుకంపాస్పదమ్-కలిగిన అనుగ్రహమునకు ఆస్పదుడైనవాడును, ఉద్ధృత శత్రు గంధకరటి ప్రధ్వంస బద్ధవ్రతః హర్యక్షః-చెలరేగిన శత్రువులనెడి మత్తగజములను నాశము చేయుటయందు పట్టుదలగల సింహము అయినవాడును, కవిలోకరక్షణకలా ప్రత్యగ్రభోజాకృతిః-కవి సమూహములను రక్షించుట యనెడి కళయందు నవీన భోజునివంటివాడును (అయి), ఆసీత్-ఉండెను.

ఆ వేంకటపతిరాయల తాతగారి తమ్ముడైన శ్రీ వేంకటాద్రిరాయలు విష్ణుమూర్తి అనుగ్రహమునకు పాత్రుడు. ఆయన శత్రు మత్తగజములకు సింహమువంటివాడు. కవులను పోషించుటలో భోజుని వంటివాడు.

ర్దూలవిక్రీడిత వృత్తము. రూపకము.

34. యస్య-ఎవనియొక్క, ఔదార్య మహిమ్నా-ఔదార్యముయొక్క గొప్పతనముచేత, కల్పతరుః-కల్పవృక్షము, క్వాపి-ఎక్కడనో వసతిం నందతే-నివాసమును కోరుచున్నదో (ఆ), గుణాబ్ధిః-గుణసముద్రుడైన-శ్రీరంగపతిః-శ్రీరంగరాయలు, తస్య-ఆ వేంకటాద్రిరాయలకు, ఆత్మజః-పుత్రుడు,అభూత్-అయ్యెను.

ఆ వేంకటాద్రిరాయల కుమారుడు శ్రీరంగరాయలు. ఆయన గుణసముద్రుడు. ఆయన ఔదార్యమును తట్టుకొనలేక కల్పవృక్షము (ఈ లోకమునగాక) స్వర్గలోకమున ఉన్నానుగదాయని సంతోషించుచున్నది.

ఆర్యాగీతి—మొదటి చరణమున ఛందోభంగము. అతిశయోక్తి.

35. యః-ఎవడు, స్వయమ్-స్వయముగా, జగత్యామ్-భూమియందు, సర్వేషాం విదుషామ్-అందరు విద్వాంసులకు, సమీహితఫలమ్-కోరినఫలమును, దత్త్వా-ఇచ్చి, దానచతురాన్-దానమునందు నేర్పుగల, భోజాదిమాన్-భోజుడు మొదలైన, పార్థివాన్-రాజులను, విస్మారయతిస్మ-మరపించుచుండెనో (అటువంటి), పురుహూతభోగమహిమా-గొప్ప ఇంద్రభోగముగల, గోపాలరాజాగ్రణీః-గోపాలరాజశ్రేష్ఠుడు, గుణాద్భుతస్య-గుణములచేత ఆశ్చర్యమును కలిగించెడి. తస్యరాజ్ఞః-ఆ రాజునకు (శ్రీరంగరాయలకు), ప్రాచీనజన్మార్జితైః సుకృతైః-పూర్వజన్మములలో సంపాదించినపుణ్యములచేత, పుత్త్రఃఅభూత్-కుమారుడు అయ్యెను.

ఆ శ్రీరంగరాయలు అద్భుత గుణములు కలవాడు. అతని పూర్వజన్మములయందలి పుణ్యములచేత గోపాలరాయలు అతనికి పుత్రుడయ్యెను. ఆ గోపాలరాయలు దేవేంద్రవైభవము కలవాడు. ఆయన పండితులకందరకు కావలసినవన్నియుఇచ్చి దానమున నేర్పరులనిపించుకొన్నభోజాదులైన పూర్వరాజులను మరపించెను.

శార్దూలవిక్రీడితవృత్తము. ఉపమాలంకారము.

36. సుకృతీ-పుణ్యవంతుడైన, సోయమ్-ఆ యీ గోపాలరాయలు, ప్రియాసహచరః-భార్యతోకూడినవాడై, తపోభిః-తపస్సులచేత, వేంకటశైలనాథమ్-వేంకటేశ్వరస్వామిని, ఆరాధయత్-ఆరాధించెను, తదానీమ్-అప్పుడు, అభీష్టదాయీ-కోరికలనొసంగెడి, సః దేవః-ఆ దేవుడు, ప్రీతః-ప్రీతిపొందినవాడై, తం-అతనినిగూర్చి, కృపయా-దయతో, ఏవం-ఈ విధముగా, అగదీత్-పలికెను.

ఆ గోపాలరాయలు భార్యతోగూడినవాడై వేంకటేశ్వరస్వామినిగూర్చి తపస్సుచేసెను. ఆయన ప్రీతుడై దయతో అతనికి ఇట్లు చెప్పెను.

మొదటిపాదము వసంతతిలక. మిగత మూడుపాదములు ఇంద్రవజ్ర. విషమవృత్తము.

37. యథా-ఏ విధముగా, పూర్వమ్-పూర్వకాలమున, శ్రీవసుదేవభూవసురిపోః-వసుదేవభూపాలునకు, కృష్ణాభిధః-కృష్ణుడను పేరుగలవాడనై, పుత్రస్సన్-పుత్రుడనై, ధరణీమ్అవాపమ్-భూలోకమును పొందితినో,

(అట్లే), అధునా-ఇప్పుడు, చినవేంకటేంద్ర నృపతేః-చిన వేంకటపతిరాయలయొక్క, ఉగ్రైః తపోవైభవైః-తీవ్రములైన తపోవైభవములచేత, విఖ్యాతః-విఖ్యాతుడైన, శ్రీరంగరాయాభిధః-శ్రీరంగరాయలను పేరుగల, పుత్రఃసన్-పుత్రుడనై, ధరణీమ్ అవాపమ్-భూలోకమును పొందితిని, ప్రాక్-పూర్వము, నందః ఇవ-నందగోపాలుడువలె, తమ్-ఆ, శ్రీరంగరాయాభిధమ్-శ్రీరంగరాయలను పేరుగల (నన్ను), సుతం కలయ తాత్-పుత్రునిగా స్వీకరింపుము.

పూర్వము వసుదేవునికి శ్రీకృష్ణుడను పేరుతో పుత్రుడనై పుట్టినట్లే, ఇప్పుడు చినవేంకటపతి రాయల తీవ్ర తపస్సుచేత ఆయనకు శ్రీరంగరాయలను పేరుగల పుత్రుడనై జన్మించియున్నాను. పూర్వము నందగోపాలుడు శ్రీకృష్ణుని పుత్రునిగా బడసినట్లు నీవును శ్రీరంగరాయలను పేరుగల నన్ను పుత్రునిగా స్వీకరింపుము.

శార్దూలవిక్రీడితము.

38. శ్రీరంగేశ్వరదత్త రాజ్యమహిమా-శ్రీరంగనాయకులచే ఈయబడిన రాజ్యమహిమగల, శ్రీరంగ రాయాగ్రణీః-శ్రీరంగరాయశ్రేష్ఠుడు, పాదాంభోజవినమ్ర భోజమగధ క్ష్మాపార్పిత ప్రాభృతః-పాదముల యందు వినమ్రులై భోజ మగధ రాజులచే అర్పింపబడిన కానుకలు గలవాడై, సర్వేషాం పృథివీభుజామ్-అందరు రాజులయొక్క, అధిశిరః-శిరస్సులయందు, విన్యస్తపాదాంబుజః-ఉంచబడిన పాదపద్మములు కలవాడై, మహతా నయేన-గొప్ప రాజనీతిచేత, సప్తార్ణవీ మేఖలామ్-సప్తసముద్రములు మొలనూలుగాగల, పృథ్వీమ్-భూమిని, పాలయితే-పరిపాలించుచున్నాడు.

శ్రీరంగనాయకులచే ఈయబడిన రాజ్యమహిమగల శ్రీరంగరాయలకు భోజ మగధరాజులు పాదములకు మ్రొక్కి కానుకలు చెల్లించుచున్నారు. ఆతడు రాజులందరి శిరస్సులమీద పాదాంబుజములనుంచి గొప్ప రాజనీతితో సప్తసముద్రముల మధ్యగల భూమినంతటిని పరిపాలించుచున్నాడు.

శార్దూల విక్రీడితము.

39. వారాశిగాంభీర్య విశేషధుర్యః-(ఆ శ్రీరంగరాయలు) సముద్రమువలె గొప్ప గాంభీర్యము కలవాడు, ఔరాదిదుర్గైక విభాలవర్యః-ఔరు మొదలైన దుర్గములను తానొక్కడే పడగొట్టగలశ్రేష్ఠుడు, పరాష్టదిగ్రాయ మనఃప్రకామభయంకరః-ఎనిమిదిదిక్కుల యందుగల రాజుల మనస్సులలో మిక్కిలి భయము కలిగించువాడు, శార్ఙ్గధరాంతరంగః-విష్ణుమూర్తి మనస్సునందుకలవాడు.

ఆ శ్రీరంగరాయలు సముద్రమువలె గొప్ప గాంభీర్యముకలవాడు, ఔరాదిదుర్గములను తానొక్కడే పడగొట్టగల శ్రేష్ఠుడు, ఎనిమిది దిక్కుల యందుగల రాజుల మనస్సులలో మిక్కిలి భయము కలిగించువాడు, విష్ణుమూర్తి మనస్సునందు గలవాడు.

ఉపజాతివృత్తము.

40. సారవీర రమయా సముల్లసః- బలిష్ఠమైన పరాక్రమలక్ష్మితో ప్రకాశించువాడు, ఆరవీటిపుర హార నాయకః- ఆరవీడుపట్టణము అనెడు హారమునకు నాయకమణివంటివాడు, కుండలీశ్వర మహాభుజః- (శేషునిబోలిన మహాభుజములుగలవాడు, మండలీక ధరణీవరాహతామ్ శ్రయన్ - మండలీకభూమికి ఉద్ధరించుటకు) వరాహావతారత్వమును ఆశ్రయించుచున్నవాడు.

శ్రీరంగరాయలు బలిష్ఠమైన పరాక్రమలక్ష్మితో ప్రకాశించువాడు, ఆరవీడు పట్టణము అనెడు హారమునకు నాయకమణివంటివాడు, శేషునిబోలిన మహాభుజములు గలవాడు, మండలీకభూమిని ఉద్ధరించుటకు వరాహావతారత్వము నాశ్రయించుచున్నవాడు.

రథోద్ధత వృత్తము.

41. ఆత్రేయ గోత్రజానామ్- ఆత్రేయగోత్రమునందుపుట్టిన, భూభుజామ్ - రాజులలో, అగ్రసరః- శ్రేష్ఠుడు, ఉదారయశాః- గొప్పకీర్తికలవాడు, అరిభగండభేరుండః- శత్రువులను మదగజములకు గండభేరుండమైనవాడు, హరిభక్తిసుధానిధిః- హరిభక్తి అనెడి అమృతమునకు విధియైనవాడు.

శ్రీరంగరాయలు ఆత్రేయగోత్రమునందుపుట్టిన రాజులలో శ్రేష్ఠుడు, గొప్ప కీర్తికలవాడు, శత్రువులను మదగజములకు గండభేరుండమైనవాడు, హరిభక్తి అనెడి అమృతమునకు నిధియైనవాడు.

మొదటి రెండుపాదములు ఆర్యాగీతి, కడమ రెండుపాదములు అనుష్టుప్. రూపకము.

42. సోయం శ్రీరంగరాయాగ్రణీః- ఆ యీ శ్రీరంగరాయలు, నీతిజితాది భూపతితతిః- రాజనీతిచేత పూర్వరాజసమూహమును జయించినవాడు, సుధీసార్థానాం సుత్రామశాఖీ- పండితసముదాయములకు కల్పవృక్షమువంటి వాడును (అయి), భుజతేజసా- భుజపరాక్రమముచేత, కర్ణాటసింహాసనమ్- కర్ణాట సింహాసనమును, స్వ వశయన్- తన వశముచేసికొనుచు, ఆసేతోః అపిచ ఆ హిమాద్రే- సేతువునుండి హిమాలయమువరకు, విమతాన్- శత్రువులను, సంహత్య- చంపి, ముదా- సంతోషముతో, సింధుపరిఘాన్. సముద్రము అగడ్తగాగల, సర్వోర్వీమ్- సమస్తభూమిని, శాసన్ - పరిపాలించుచు, ప్రచకాస్తి-ప్రకాశించుచున్నాడు.

ఈ శ్రీరంగరాయలు రాజనీతిచేత పూర్వరాజసమూహమును జయించినవాడు, పండిత సముదాయములకు కల్పవృక్షమువంటివాడు అయి భుజపరాక్రమముచేత కర్ణాటసింహాసనమును తనవశము చేసికొనుచు ఆసేతుశీతాచలము శత్రువులనుచంపి సంతోషముతో సముద్రము అగడ్తగాగల సర్వభూమిని పరిపాలించుచు ప్రకాశించుచున్నాడు.

శార్దూలవిక్రీడితము.

43. రసర్తు బాణ చంద్రాఖ్యగణితే- 1566 వ, శకవత్సరే- శకవర్షమున, శ్రీ మత్తారుణవర్షేచ- తారణ సంవత్సరమున, మాఘాభిధానకే మాసే- మాఘమాసమున, శుక్లపక్షేచ- శుక్లపక్షమున, పుణ్యాయాం ద్వాదశ్యాంచ మహాతిథౌ- పుణ్యవంతమైన ద్వాదశియను గొప్ప తిథియందు.

శకసం. 1566 తారణసంవత్సర మాఘశుద్ధ ద్వాదశినాడు.

అనుష్టుప్

44. శ్రీ మద్దక్షిణకైలాస స్థానవిశేష సాకార నిరాకారస్వరూప బ్రహ్మ వశిష్ఠముని లూతవాతాశన హస్తి ఆటవిక భూదేవ నత్కీర కన్యకాద్వయ యాదవాది ముఖ్యప్రమథగణ సాయుజ్య పద స్థానంబైన- శ్రీమంతమగు దక్షిణకైలాసస్థానమను విశేషముకలది, సాకారుడు నిరాకారుడు అగు ఈశ్వరుడు కలది, బ్రహ్మ, వశిష్ఠముని, సాలీడు, పాము, ఏనుగు, ఆటవికుడు, బ్రాహ్మణుడు, సత్కీరుడు, ఇరువురు బోగము కన్నెలు, యాదవరాజు మొదలగు ముఖ్యప్రమథగణులకు సాయుజ్యమొసగినదియునగు స్థానము, పూర్వగిరి పశ్చిమద్వార దక్షిణపీఠ ఉత్తరవాహినింగల ఆలయమందు, శిలాప్లక్ష వృక్షాది మూలనివాసంబైన, శ్రీమాన్ శ్రీ కాలహస్తీశ్వరస్వాముల అర్చకులైన.

45. శ్రీమత్కౌశిక గోత్రాయ- కౌశిక సగోత్రునకు, ఆపస్తంబ సూత్రిణే- ఆపస్తంబసూత్రునకు, యజుశ్శాఖావతామ్ అగ్రయాయినే- యజుశ్శాఖీయులలో శ్రేష్ఠునకు, అభీష్టదాయినే - కోరినవి ఇచ్చు వానికి, మృష్టాన్నదాన సంతుష్ట శిష్టాచార ద్విజన్మనే - శిష్టాచారులైన బ్రాహ్మణులకు మృష్టాన్నములుపెట్టి సంతోషమును కలిగించువానికి, విద్వత్కవి మనోహంస విశదాంభోజ కీర్తయే - పండితకవుల మనోహంసలకు శ్వేతపద్మమువంటి కీర్తిగలవానికి, చంద్రచూడ పదాంభోజ చలద్భ్రమర చేతసే - శివుని పాదపద్మములయందు విహరించెడు తుమ్మెదయైన మనస్సు కలవానికి, కాలబాయ్య సుధీవర్యపౌత్రాయ - పండితశ్రేష్ఠుడైన కాల బాయ్యకు మనుమడైనవానికి, అమిత తేజసే - గొప్ప తేజస్సుగల, ఈశ్వరయ్య సుపుత్రాయ - ఈశ్వరయ్య కుమారునకు, సదాశివసుధీమణయే - సదాశివ పండితునకు.

కౌశిక సగోత్రుడు, ఆపస్తంబసూత్రుడు, యజుశ్శాఖాధ్యాయి, శివభక్తుడు, కాలబాయ్య మనుమడు, యీశ్వరయ్య పుత్త్రుడు అయిన సదాశివ పండితునకు.

అనుష్టుప్.

46. శ్రీకాళహస్తీశ్వరస్వామికి మధ్యాహ్నకాలమందు అభిషేకనైవేద్యము శేశి ఛత్రము సాగించే టందుకు; శుక్రవారము అమ్మవారికి సమారాధన చేసేటికొరకు; కాళహస్తిసీమలో అక్కురితి మాగాణమందు రామభట్ల చెర్వుసైతంగాను, కాసర్లగ్రామము.

47 సర్వమాన్యం - సర్వమాన్యముగా, చతుస్సీమాసహితంచ-నాలుగు హద్దులు కలదిగా, సమంతతః-అంతట, నిధినిక్షేపపాషాణ సిద్ధసాధ్యజలావృతమ్ - నిధులు నిక్షేపములు, పాషాణములు, దొరువులు, బావులు మొదలైనవాటితో కూడినది, వాపీకూప తటాకైశ్చ-వాపీకూపతటాకములతోను, కనద్ధామైశ్చ సంయుతం-ప్రకాశించుచున్న ఇండ్లతో కూడినది, సభూరుహమ్ - చెట్లతోకూడినది, అతీతాగామి సంయుక్తమ్-వర్తమాన భవిష్యత్తులతో కూడినది (అయిన), దేవభోజ్యమ్ - దేవభోజ్యము, ఆచంద్రతారకమ్ - చంద్రుడు నక్షత్రములు ఉన్నంతవరకు, క్రమాత్- క్రమముగా, పుత్రపౌత్రాదిభిః - కొడుకులు మనుమలు మొదలైన వారితోగూడ, భోజ్యమ్-అనుభవించదగినది.

అనుష్టుప్ లు.

48. ఖ్యాతేనిగాల గోత్రాబ్ధేః- ప్రసిద్ధి పొందిన ఇనిగాల గోత్రమను సముద్రమునకు, ఇందోః-చంద్రుడును, మనీషిణాంబంధోః- పండితులకు బంధువైనవాడు, దామర్లవంశకమల క్షేమంకరవివస్వతః - దామర్లవంశమను పద్మమునకు క్షేమముకలిగించు సూర్యుడును, భోగే భూలోకసుత్రామ్ణః - వైభవమునందు భూలోకదేవేంద్రుడైనవాడును, త్యాగే విబుధశాఖినః- దానమునందు కల్పవృక్షమువంటివాడును, నగరే లంఘితే - పట్టణము దాటబడగా, జేతుమ్ - జయించుటకు, లంఘితార్ణవవైరిణః - దాటబడిన శత్రుసముద్రము కలవాడును, భేరీభాంకారమాత్రేణ - నగారామ్రోయించినంతమాత్రముననే, భిన్న దుర్గారిభూపతేః - భిన్నములైన దుర్గములుగల శత్రురాజులుకలవాడును, నిజ ఖడ్గ మణీవేత్ర నిత్యనృత్య జ్జయశ్రియః - తన ఖడ్గశ్రేష్ఠమను బెత్తముపై నిత్యము నృత్యముచేయు విజయలక్ష్మికలవాడును, కన్యాన్నస్వర్ణభూదానైః- కన్యాదానము, అన్నదానము, స్వర్ణదానము, భూదానములచే, కాలక్షేపం వితన్వతః - కాలక్షేపము చేయుచున్నవాడును, పరదార పరద్రవ్య పరాఙ్ముఖ హృదః - ఇతరుల భార్యల, ద్రవ్యములయందు అపేక్షలేనివాడును, సదా - ఎల్లప్పుడును, సంగీతరస సాహిత్య సౌహిత్యే భోజభూభుజః - సంగీత సాహిత్య రసములయందలి చెలిమి యందు భోజరాజైనవాడును, శ్రీరామ చరణాంభోజభ్రమరాయిత చేతసః - శ్రీరాముని పాదపద్మముల యందు తుమ్మెదవంటిదైన మనస్సుకలవాడును, నిత్య ప్రసన్నవక్త్రస్య - ఎల్లప్పుడు ప్రసన్నమైన ముఖము కలవాడును, నిత్యలక్ష్మీక జన్మనః - ఎల్లప్పుడు ఐశ్వర్యముగల పుట్టుపు కలవాడును, పెదవేంకట భూపాల పౌత్రస్య - పెదవేంకట రాయల మనుమడును, అతియశస్వినః-గొప్పకీర్తిగల, కరిచన్నమహీపాలకుమారస్య - కరిచన్నరాయల కుమారుడును, గుణాంబుధేః - గుణసముద్రుడును (అయిన), వేంకటక్షోణీపాలస్య - వేంకటరాయలయొక్క, విజ్ఞప్తిమ్ - మనవిని, అనుపాలయన్ - ఆమోదించుచు, మనస్వినాం మాననీయః - మనస్వులలో గౌరవించదగినవాడైన, శ్రీరంగరాయ భూపాలః-శ్రీరంగరాయలు, ముదా- సంతోషముతో, సహిరణ్యపయోధారాపూర్వకమ్ - బంగారముతోగూడిన జలధారముందుగానిచ్చి, దత్తవాన్ - దానము చేసినవాడాయెను ॥శ్రీ॥

ఇనిగాల గోత్రజుడు, దామర్లవంశీయుడు, గొప్పదాత, పరాక్రమవంతుడు, సంగీత సాహిత్యము లను పోషించువాడు, శ్రీరామభక్తుడు, పెదవేంకటరాయల పౌత్రుడు, కరిచన్నభూపాలుని పుత్రుడు అగు వేంకటరాయల విజ్ఞప్తిననుసరించి శ్రీ రంగరాయలు ఈ దానము హిరణ్య పయోధారాపూర్వకముగా చేసెను.

8 అనుష్టుప్ లు.

49. భూమహేంద్రస్య-భూలోక దేవేంద్రుడును, సుధీజనకువలయ చంద్రస్య-పండితులనెడి కలువలకు చంద్రునివంటివాడును, కీర్తిధుర్యస్య - గొప్పకీర్తిగలవాడును (అయిన), వీర శ్రీరంగరాయక్షితిపతివర్యస్య-వీరుడైన శ్రీరంగరాయలను రాజేంద్రునియొక్క, శాసనమ్ ఇదమ్ - శాసనము ఇది.

ఇది వీరుడైన శ్రీరంగరాయలయొక్క శాసనము.

ఆర్యాగీతి.

50. సభాపతేః పౌత్రః-సభాపతి మనుమడు, కామకోటిసుతః-కామకోటియొక్క పుత్త్రుడు (అయిన), రామకవిః-రామకవి, వీర శ్రీరంగరాయోక్త్యా-వీరుడైన శ్రీరంగరాయల ఆజ్ఞచేత, శాసనవాఙ్మయమ్-ఈ శాసన వాఙ్మయమును, ప్రాహ-చెప్పెను.

సభాపతి మనుమడు, కామకోటియొక్క కుమారుడు అయిన రామకవి శ్రీరంగరాయల ఆజ్ఞచే ఈ శాసన వాఙ్మయమును చెప్పెను.

అనుష్టుప్.

51. శ్రీగణపయార్య పౌత్రమణిః-శ్రీగణపయ్య మనుమడును, కామయతనయః-కామయ్య కుమారుడు (అయిన), సోమనాథార్యః-సోమనాథయ్య, వీర శ్రీరంగరాయ క్ష్మాపతి దేశేన-వీరుడైన శ్రీరంగరాయలఆజ్ఞచే, శాసనమ్ అలిఖత్-ఈ శాసనమును వ్రాసెను.

శ్రీగణపయ్య మనుమడును కామయ్య కుమారుడు అయిన సోమనాథయ్య వీరుడైన శ్రీరంగరాయల ఆజ్ఞచే ఈ శాసనమును వ్రాసెను.

ఆర్యాగీతి.

52. దానపాలన యోర్మధ్యే.........యాచతే రామచంద్రః-వ్యాఖ్యానమునకు, 'శ్రీవిరూపాక్ష శాసనపువాఖ్యను' చూచుకొనునది.

---

వాఙ్మయ మహాధ్యక్ష

డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

తమ పరిశోధనా రచనలో

ఉదాహరించిన గ్రంథాలు

తెలుగు

| | | |
|---|---|---|
| 1. | అళియరామరాయలు | చిలుకూరి వీరభద్రరావు |
| 2. | ఆంధ్ర కవుల చరిత్ర | కందుకూరి వీరేశలింగం |
| 3. | కళాపూర్ణోదయం | పింగళి సూరన |
| 4. | కుమారసంభవం | నన్నెచోడ కవి |
| 5. | కృష్ణరాయవిజయం | కుమార ధూర్జటి |
| 6. | దివ్య ప్రభావివరణ సహిత ఆంధ్రభాషాభూషణం పీఠిక | వడ్లమూడి గోపాలకృష్ణయ్య |
| 7. | ద్విపద బాలభాగవతం | దోనేరు కోనేరుకవి |
| 8. | ధ్వని - లిపి - పరిణామం - లేక - ప్రాచీన వాఙ్మయంలో వ్యావహారిక భాష | వడ్లమూడి గోపాలకృష్ణయ్య |
| 9. | నరపతి విజయం (రామరాజీయం) | అందుగుల వెంకయ్య |
| 10. | నరస భూపాలీయం | రామరాజభూషణుడు (భట్టుమూర్తి) |
| 11. | పద్య బాలభాగవతం | దోనేరు కోనేరుకవి |
| 12. | రామరాజీయం (నరపతి విజయం) | అందుగుల వెంకయ్య |
| 13. | వసుచరిత్ర | రామరాజభూషణుడు |
| 14. | సంగ్రహాంధ్ర విజ్ఞానకోశం | |
| 15. | సాంబోపాఖ్యానం | రామరాజు రంగప్పరాజు |
| 16. | సుదక్షిణా పరిణయం | తెనాలి అన్నయ్య |
| 17. | హిందూదేశ కథాసంగ్రహం | కె. వి. లక్ష్మణరావు |

## కన్నడం

1. శివగణ దరగళె — హరీశ్వరుడు

## పాళి

1. దమ్మపదం

## సంస్కృతం

1. ఉత్తర రామాయణం
2. ఋగ్వేదం
3. త్రికాండ శేషనిఘంటువు
4. పద్మపురాణం
5. బ్రహ్మాండ పురాణం
6. మత్స్య పురాణం
7. మార్కండేయ పురాణం
8. మేఘసందేశం — కాళిదాసు
9. మేఘసందేశ వాఖ్య — మల్లినాథసూరి
10. వాయు పురాణం
11. శివ పురాణం
12. శ్రుతిరంజని (శ్రీగీతగోవిందవ్యాఖ్య) — తిరుమలరాయలు
13. సరస్వతీవిలాసం — ప్రతాపరుద్ర గజపతి
14. స్వరమేళ కళానిధి — రామయామాత్య తోడరమల్లు

## ENGLISH

1. Enugula Veeraswamy's Journal (Kasiyatra Charitra)
2. Brigg's Ferishta
3. Forgotten Empire — *Robert Sewell*
4. The Aravidu Dynasty of Vijayanagar — *Heeras Fadiri*

## శాసనాలు — రికార్డులు

1. అహోబిల శాసనం
2. ఎపిగ్రాఫికా ఇండియా
3. ఎపిగ్రాఫికా కర్ణాటికా
4. ఎరగుడిపాడు శాసనం
5. కర్ణాటక శాసనాలు
6. కర్నూలు పట్టణ శాసనాలు
7. కాపలూరు శాసనం
8. నందంపూడి శాసనం
9. విలపాక శాసనం
10. వెంకటపతిరాయల శాసనం
11. సదాశివరాయల శాసనం
12. సిరివేలు శాసనాలు
13. హోళల్‌కెరి తాలూకా శాసనం
14. లిథిక్ రికార్డులు

## Reference Books of this research work

*By*

*Vangmayamahadhyaksha*

**Dr. Vadlamudi Gopalakrishnaiah**

*'Kala-Prapoorna'*

TELUGU


1. Aliyaramarayalu — *Chilukuri Veerabhadra Rao*
2. Andhra Kavula Charitra — *Kandukuri Veeresalingam*
3. Kalapoornodayam — *Pingali Soorana*
4. Kumara Sambhavam — *Nannechoda Kavi*
5. Krishnaraya Vijayam — *Kumara Dhoorjati*
6. Preface of Andhra Bhashabhooshanam (Divya Prabha Vivarana Sahita) — *Vadlamudi Gopalakrishnaiah*
7. Dwipada Bala Bhagavatam — *Doneru Koneru Kavi*
8. Dhwani-Lipi-Parinamam or Pracheena Vangmayamulo Vyavaharika Bhasha — *Vadlamudi Gopalakrishnaiah*
9. Narapati Vijayam (Ramarajeeyam) — *Andugula Venkayya*
10. Narasa Bhoopaleeyam — *Ramaraja Bhooshanudu (Bhattumurti)*
11. Padya Bala Bhagavatam — *Doneru Koneru Kavi*
12. Rama Rajeeyam (Narapati Vijayam) — *Andugula Venkayya*
13. Vasucharitra — *Ramarajabhooshanudu*
14. Sangrahandra Vijnanakosam
15. Sambopakhyanam — *Ramaraju Rangapparaju*
16. Sudakshina Parinayam — *Tenali Annayya*
17. Hindudesa Kathasangraham — *K. V. Lakshmana Rao*

## KANNADA

1. Sivagana Daragale — *Harisvara*

## PALI

1. Damma Padam

## SANSKRIT

1. Uttararamayanam
2. Rigvedam
3. Trikanda Sesha Nighantuh
4. Padma Puranam
5. Brahmanda Puranam
6. Matsya Puranam
7. Markandeya Puranam
8. Meghasandesa — *Kalidasa*
9. Meghasandesa Vyakhya — *Mallinatha Suri*
10. Vayu Puranam
11. Siva Puranam
12. Sruti Ranjani (Commentary of Sri Geeta Govinda) — *Tirumalarayalu*
13. Saraswati Vilasam — *Prataparudra Gajapati*
14. Swaramela Kalanidhi — *Ramayamatya Todaramallu*

## ENGLISH

1. Enugula Veeraswamy's Journal (Kasiyatra Charitra)
2. Brigg's Ferishta
3. Forgotten Empire — *Robert Sewell*
4. The Araveedu Dynasty of Vijayanagar. — *Heeras Fadiri*

## INSCRIPTIONS—RECORDS

1. Ahobila Inscription
2. Epigraphica India
3. Epigraphica Karnatika
4. Eragudipadu Inscription
5. Karnataka Inscriptions
6. Kurnool Town Inscriptions
7. Kapaluru Inscription
8. Nandampudi Inscription
9. Vilapaka Inscription
10. Venkatapatiraya's Inscription
11. Sadasivaraya's Inscription
12. Sirivelu Inscriptions
13. Holalkeri (Taluk) Inscriptions
14. Lithic Records

# ముఖ్య సవరణలు

| పేజీ | పంక్తి | |
|---|---|---|
| XXXV | 3 | తెనాలి అన్నయ్య |
| LV | 17 | దోనేరు కోనేరుకవి |
| LXI | 29 | నరసభూపాలీయం |
| LXIX | 11 | బుక్కయరామ విభుఁడు |
| LXXVII | 9 | వీరనృసింహ |
| LXXXI | 18 | సోఁయం మేళకళా |
| CXII | 2 | శాల్మల |
| CXVII | 16-17 | (చుట్టుకొలత) 25 వేలమైళ్లకు తక్కువ |

## Our Publications with Critical Introductions :

| | | Price : Rs. P. |
|---|---|---|
| 1. | " Seetha Kalyanamu " .. .. (Telugu Yakshagana Natak) | 3-75 |
| 2. | Sringara Padamulu .. .. .. (Telugu Classical Songs & Poems) | 4-40 |
| 3. | Indumati Parinayamu .. .. .. (Telugu Kavyamu) | 4-00 |
| 4. | Radha Vamsidhara Vilasa Natak .. .. (Yakshagana Natak in Hindi) | 3-75 |
| 5. | Sree Geeta Govindamu-Geeta Sankaramu .. (Sanskrit Astapadees) | 3-75 |
| 6. | Enugula Veeraswamy's Journal .. .. (Kasiyatra Charitra in English) | 14-00 |

## Our next Publications :

1. Vaikrita Chandrika
   (Telugu grammar in Sanskrit with Telugu commentary)

2. Naradeeya Puranamu

*For copies :*

JOINT DIRECTOR
Andhra Pradesh Government Oriental Manuscripts
Library and Research Institute,
Afzal Gunj, Hyderabad-500012.

PRINTED AT THE ANDHRA PRADESH TEXT-BOOK PRESS,
MINT COMPOUND, HYDERABAD.

MANCHALA JAGANNATHA RAO
Sangeeta Vidwan
All India Radio, *Hyderabad*

Phone: 33848
Vijayanagar Colony
*Hyderabad*
*Date* 15-4-73

To

Vangmaya Mahadyaksha,
Dr. VADLAMUDI GOPALAKRISHNAYYA,
*Joint Director*,
The Oriental Manuscripts Library and
Research Institute,
*HYDERABAD.*

Dear Sir,

Received copies of *Gita Govindam*, *Gita Sankaram* (Sanskrit) and *Radha Vansidhar Vilasa Natak* (Hindi).

It is really heartening to see the printed versions of the three classic operas mentioned above, the first two in Telugu and the third in Devanagari scripts.

Originally Sri P. Sitapati the then Director contemplated to publish all the three works in Telugu script in one volume only, when he first contacted me. But it is really useful for the Hindi reading public and also appropriate that you brought out *Radha Vansidhar Vilas Natak* in Hindi and the other two in Telugu script.

I am really astonished to read your masterly and thought provoking forewords to these works and the extensive research work you have undertaken to give Raga names to all the slokas for *Gita Govindam* and *Gita Sankaram* and include certain slokas in these works comparing these works with other publications and originals.

Though I had given Ragas and Talas to astapadis suitable to render them musically, *Gita Govindam* is sung in different parts of the country in different ragas. It is really a great task to collect extensively, the different versions (Ragas and Talas) and present them in a chart by you. Even in *Gita Sankaram* you have given a comparative chart of the original ragas and the ones used by me for the benefit of readers.

I am greateful to you for your patience in comparing the original work of *Radha Vansidhar Vilasa Natak* with my manuscript and making necessary corrections in the same.

Reading public all over the country will really be indebted to you for the great work you are doing in the field of literature and fine arts, as the Joint Director, Oriental Manuscripts Library and Research Institute of Government of Andhra Pradesh.

Thanking You,

Yours sincerely,

*M. J. RAO*

మిత్రులు డాక్టర్ గోపాలకృష్ణయ్య గారికి

నమస్తే

తాము దయతో పంపిన పుస్తకాలందినవి. "శృంగార పదముల"కు మీరు కూర్చిన పీఠిక బహుముఖ విజ్ఞాన పేటిక. ఎన్నెన్ని విషయాలు వివరించారు (గేయ సాహిత్యాన్ని గూర్చినవి). పదం, పద్యం, చరణం, పాదం మొదలైన అంశాలను గూర్చిన మీ మౌలిక పరిశోధన అనితర సాధ్యం. తెలుగులో పదవాఙ్మయ వికాసాన్ని గూర్చి. ధాతు మాతువులను గూర్చి, ఆంధ్ర వాఙ్మయానికి సేవచేసిన మహారాష్ట్ర ప్రభువులను గూర్చి మీరు వివరించిన విషయాలు పరిశ్రమైక సాధ్యాలు. అంతేకాదు. అచుంబిత పరిశీలనా ఫలాలు. ఓరియంటల్ మాన్యుస్క్రిప్ట్సు లైబ్రరీ పక్షాన వెలువడుతున్న గ్రంథాలకు మీరు సమకూరుస్తున్న అవతారికలు ఆంధ్ర సాహిత్య పరిశోధకులకు కారికలు— అయితే అక్కడక్కడా అవి ఛురికలు కూడా.

ఇందుకు మిమ్మల్ని అభినందిస్తున్నాను. ఆంధ్రభారతికి మీరు సవదరిస్తున్న ఆభరణాలు క్యారట్లు తరగని సువర్ణాలు.

మీ

సి. నారాయణ రెడ్డి

15–8–1973